పూభా చ మీనే శీఘ్రే బుధః ౫౯-౨౬—14 శు వ బు ఉభా ప్ర బుధః ౪౧-౧౩—16 శు అష్ట శు ఉభా ద్వి బుధః ౨౨-౪ 18 శు దశ ఆ ఉభా తృ బుధః ౨-౩౪—19 శు ఏకా సో ఉభా చ బుధః ౪౨-౫౫—21 శు త్ర బు రేవ ప్ర బుధః ౨౪-౨౦—23 శు పూ శు రేవ ద్వి బుధః ౬-౫౭—24 బ పా శ రేవ తృ బుధః ౫౧-౪౫—26 బ తది సో రేవ చ బుధః ౪౧-౯—28 బ ష బు అశ్వి ప్ర మేషే సమష్టో బుధః ౩౬-౧౦—30 బ అష్ట శు అశ్వి ద్వి బుధః ౪౧-౧౬—ఏప్రి 1 బ దశ ఆ అశ్వి తృ బుధః ౫౯-౨౨—4 బ త్ర బు అశ్వి చ బుధః ౪౫-౧౩.

గురుచారః—మార్చి 9 శు విది శు పూభా తృ గురుః ౩౪-౧—23 శు పూ శు పూభా చ మీనే స్వక్షేగురుః ౨౧-౩౪—29 బ షష ప్రాగుదితో గురుః ౩౫-౪౯—ఏప్రి 6 బ అమా శు ఉభా ప్ర గురుః ౨౧-౪౬.

శుక్రచారః—మార్చి 10 శు త శ శశి రేవ తృ శుక్రః ౪౯-౧౩—13 శు ష మం రేవ చ శుక్ర ౨-౫౭—15 శు షష అశ్వి ప్ర మేషే సమస్థశ్శుక్రః ౪౬-౩౪—18 శు దశ ఆ అశ్వి ద్వి శుక్రః ౩౦-౨౯—21 శు త్ర బు అశ్వి తృ శుక్రః ౧౪-౪౭—23 శు పూ గు అశ్వి చ శుక్రః ౫౯-౨౫—26 బ త సో భర ప్ర శుక్రః ౪౪-౩౦—29 బ షష భర ద్వి శుక్రః—ఏప్రి 1 బ దశ ఆ భర తృ శుక్రః—4 బ త్ర బు భర చ శుక్రః ౨-౨—6 బ అమా శు కృత్తి ప్ర శుక్రః ౪౭-౫౭.

శనిచారః—మార్చి 10 శు తది శ ఉఫ తృ వక్రీ శనిః ౫-౪.

## వృషభ చక్రము

గృహారంభ గృహప్రవేశముల విషయమై వృషభ కలశచక్రములు గమనింపదగినవి. వృషభచక్రమునకు సూర్యుడున్న నక్షత్రము మొదలుకొని చంద్రనక్షత్రమువరకు అభిజిత్తును గలిపి లెక్కించి ఈ ఫలము తెలియవలయును.

| | | | |
|---|---|---|---|
| ౩ మృత్యువు | ౪ స్థైర్యం | ౪ ధనలాభం | ౩ సంపత్తు |
| ౪ దుర్గతి | ౩ భ్రమణం | ౪ ధాన్యం | ౩ పశువృద్ధి |

## కలశ చక్రము

ఇం దభిజిత్తును కలుపనక్కరలేదు. లెక్కవిధి వృషభచక్రమువలె.

| | | | |
|---|---|---|---|
| ౧ హాని | ౪ అభయం | ౪ నిధనం | ౩ లక్ష్మి |
| ౪ ప్రవాసం | ౪ ధాన్యం | ౪ గర్భస్రావం | ౩ ఆయుర్వృద్ధి |

## తిర్యఙ్ముఖ నక్షత్రములు

అశ్వి, పున, హస్త, చిత్ర, స్వాతి, అనూ, జ్యేష్ఠ, రేవతులు స్తంభప్రతిష్ఠాదులకు శుభములు.

## ఊర్ధ్వముఖ నక్షత్రములు

రోహిణి, ఆర్ద్ర, పుష్య, ఉత్తరాత్రయం, శ్రవణం, ధనిష్ఠ, శతతారలు వృక్షలతాస్థాపనాదులకు శుభములు.

## అధోముఖ నక్షత్రములు

భరణి, కృత్తిక, మఘ, విశాఖ, పూర్వాత్రయం, ఆశ్లేష, మూల—ఇవి వాపీ కూప తటాకాదులకు శుభములు.

## గౌరీపంచాంగం కాలము ౧-౭

గడియలు ౩౩. ఘంట ౧ నిమిషములు ౩౦

### పగటి ముహూర్తములు

| వారములు | ఆది | సోమ | మంగళ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|
| ౧ | ఉద్యో | అమృ | రోగం | విషం | శుభం | అమృ | విషం |
| ౨ | లాభం | విషం | ఉద్యో | అమృ | రోగం | జ్వరం | ఉద్యో |
| ౩ | విషం | ఉద్యో | జ్వరం | శుభం | కలహం | కలహం | శుభం |
| ౪ | అమృ | లాభం | లాభం | ఉద్యో | లాభం | లాభం | అమృ |
| ౫ | శుభం | జ్వరం | అమృ | రోగం | ఉద్యో | శుభం | కలహం |
| ౬ | ధనం | అమృ | ఉద్యో | శుభం | జ్వరం | ధనం | రోగం |
| ౭ | అమృ | లాభం | విషం | ధనం | లాభం | అమృ | అమృ |
| ౮ | విషం | ధనం | లాభం | అమృ | ఉద్యో | విషం | లాభం |

### రాత్రి ముహూర్తములు

| వారములు | ఆది | సోమ | మంగళ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|
| ౧ | శుభం | రోగం | జ్వరం | లాభం | ఉద్యో | రోగం | విషం |
| ౨ | అమృ | లాభం | ఉద్యో | రోగం | విషం | జ్వరం | అమృ |
| ౩ | జ్వరం | ధనం | కలహం | విషం | జ్వరం | అమృ | జ్వరం |
| ౪ | రోగం | ఉద్యో | లాభం | ఉద్యో | లాభం | కలహం | ఉద్యో |
| ౫ | కలహం | రోగం | రోగం | శుభం | అమృ | లాభం | లాభం |
| ౬ | లాభం | అమృ | లాభం | లాభం | విషం | శుభం | లాభం |
| ౭ | ఉద్యో | విషం | ఉద్యో | ధనం | కలహం | ధనం | ధనం |
| ౮ | రోగం | జ్వరం | ధనం | లాభం | జ్వరం | అమృ | లాభం |

## అమృతాది యోగములు

| | అశ్వి | భ | కృ | రో | మృ | ఆర్ద్రా | పున | పు | ఆశ్లే | మ | పుబ్బ | ఉఫ | హ | చి | స్వా | విశా | అనూ | జ్యే | మూ | పూషా | ఉషా | శ్ర | ధ | శత | పూభా | ఉభా | రే |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆది | సి | ప్ర | అసి | సి | సి | సి | సి | సి | సి | మ | సి | అ | అసి | సి | సి | ఉ | మ | మ | అ | సి | అ | అ | మ | సి | సి | అ | అ |
| సోమ | సి | సి | మ | అ | అసి | సి | సి | అ | సి | మ | సి | సి | సి | ప్రఅ | అ | మ | సి | సి | సి | ఉ | మ | అ | సి | సి | మ | సి | సి |
| మంగళ | అసి | సి | సి | అ | సి | మ | సి | సి | సి | సి | సి | అ | సి | సి | సి | మ | అసి | ఉ | అ | సి | ప్రఅ | అ | సి | మ | మ | అ | సి |
| బుధ | మ | సి | అ | సి | సి | సి | సి | సి | సి | సి | అ | అ | మ | సి | సి | సి | అసి | సి | మ | అ | అ | సి | ప్రఅ | సి | అ | సి | సి |
| గురు | అ | సి | మ | ఉ | మ | మ | అ | అసి | సి | అ | సి | మ | సి | సి | అ | సి | సి | ప్రఅ | సి | సి | సి | సి | సి | మ | సి | సి | సి |
| శుక్ర | అ | సి | సి | మ | సి | మ | సి | సి | మ | మ | సి | సి | అ | సి | సి | సి | సి | మ | అ | ప్రఅ | సి | మ | సి | సి | సి | సి | ఉ |
| శని | సి | సి | అ | అ | సి | సి | సి | సి | మ | అ | సి | ఉ | మ | మ | అ | సి | సి | సి | సి | సి | సి | సి | సి | అ | మ | మ | ప్రఅ |

అ=అమృతయోగము, సి=సిద్ధయోగము, అసి=అమృతసిద్ధయోగము, ఉ=ఉత్పాతయోగము, మ=మరణయోగము, ప్రఅ=ప్రబలారిష్టయోగము

| విషయము | తిథులు | వారములు | నక్షత్రములు | లగ్నములు | విశేషములు |
|---|---|---|---|---|---|
| గృహారంభం | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩-౧౫ | సో-బు-గు శు | అశ్వి రో మృ పున ఉత్తరాత్రయం హ చి స్వా అనూ శ్ర ధ శత రే | వృ.మి. కన్యా.ధ.కుం మీ. (సిం. వృశ్చి) | అష్టమశుద్ధి. కర్తరిమీనమిథున ధనుర్మాసములు నింద్యములు |
| గృహప్రవేశం | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩-౧౫ | సో-బు-గు శు | రో మృ ఉత్తరాత్రయం చి అనూ ధ శత రే (పుష్య) | వృ.మి. సిం. క. వృ ధ.కుం.మీ. | అష్టమశుద్ధి, కలశ చక్రశుద్ధి (వత్సశుద్ధి) |
| నిషేకము | ౨-౩-౫-౧౦ | సో-బు-గు శు (శ) | అశ్వి రో మృ పున పు ఉత్తరాత్రయ హ చి స్వా అనూ మూ శ్ర ధ శత రే | శుభయుతదృష్ట ములు. | సంధ్యాపర్వప్రదోష వ్రతశ్రాద్ధ దినములు నింద్యములు |
| గర్భాధానము | ౨-౩-౫-౭-౧౦-౧౩ | ఆ-సో-బు గు-శు | రో మృ పున పు ఉత్తరాత్రయ హ చి స్వా అనూ శ్ర ధ శ ఆర్ద్రా పూర్వాత్రయం వినా | ,, | సంధ్యాపర్వ వ్రత శ్రాద్ధదినములు నింద్యములు |
| పుంసవన సీమంతములు | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩-౧౫ | ఆ-మం-బు గు-శు | మృ పున పు హ అనూ శ్ర ధ శత రే (అశ్వి రో చి స్వా ఉత్తరాత్రయం) | మే.వృష.మి.తు. ధ.కుం.మీ | పుంసవనమునకు ౩ మాసం. సీమంతం ౪,౬,౮మాసములు |
| జాతకర్మ నామకరణములు | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩ | ఆ-సో-బు గు-శు | అశ్వి రో మృ పున పు హ చి స్వా అనూ ఉత్తరాత్రయం శ్ర ధ శత రే | శుభలగ్నములు ,, | అష్టమశుద్ధి. ,, |
| డోలారోహణము | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩-౧౫ | ఆ-సో-బు గు-శు | అశ్వి రో మృ పున పు ఉత్తరాత్రయం హ చి అనూ రే స్వా శ్ర. | ,, | ,, |
| నిష్క్రమణం | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩ | సో-బు-గు శు | అశ్వి రో మృ పున పు ఉత్తరాత్రయం హ చి స్వా అనూ శ్ర ధ రే | మే. వృష. కర్కా. తు. ధ. మీ. | ౪ మాసం శుభం ౩ మాసమున్ను శుభము |
| అన్నప్రాశనం | ౨-౩-౫-౭-౧౦-౧౩-౧౫ | సో-బు-గు శు-ఆ | అశ్వి రో మృ పున పు ఉత్తరాత్రయం హ చి స్వా అనూ శ్ర ధ శత రే | మీన. మే. వృశ్చి. వినా | దశమశుద్ధిపూర్వాహ్ణము పురుషులకు సరినెలలు, స్త్రీలకు బేసి |
| కర్ణవేధ | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩ | సో-బు-గు శు-ఆ | అశ్వి రో మృ పున పు ఉత్తరాత్రయం హ చి శ్ర ధ అనూ రే (ఆర్ద్ర) | వృ.మి. క. క. తు.ధ మీ. (మే.మ) | ౬-౭-౮ మాసములు అష్టమశుద్ధి |
| కేశఖండనం | ౨-౩-౫-౭-౧౦-౧౩-౧౫ | సో-బు-గు శు | అశ్వి మృ పున పు హ చి స్వా శ్ర ధ శత రే (జ్యేష్ఠ) | శుభలగ్నములు | ఉత్తరాయణం పూర్వాహ్ణం విషమవర్షములు అష్టమశుద్ధి |
| అక్షరాభ్యాసము | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౨-౧౩ | సో-బు-గు శు | అశ్వి పున పు హ చి స్వా అనూ శ్ర రే (ఆర్ద్ర మృ ధ శ) | మి. కన్యా. ధ. మీ. | అష్టమశుద్ధిఉత్తరాయణం ౫-వ సంవత్సరము శుభము |
| విద్యారంభం | ౨-౩-౫-౧౦-౧౧-౧౨ | బు-గు-శు | అశ్విమృఆర్ద్రపున పు ఆశ్లేపూర్వాత్రయం హ చి స్వామూశ్ర(ధశతఅనూ) | మే. మి. క.క.తు.ధ. మ. మీ. | దివాభాగము |
| ఉపనయనం | ౨-౩-౫-౧౦-౧౧ (౬-౧౨) | బు.గు.సో శు | అశ్విరోమృపున పు ఉత్తరాత్రయం హ చి స్వా అనూ శ్ర ధ శ రే | శుభలగ్నములు | అష్టమశుద్ధి మీనచైత్రము శుభం |
| వివాహం | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౨-౧౩-౧౫ | బు-గు-శు | రో మృ మ ఉత్తరాత్రయం హ స్వా అనూ మూ రే (అశ్వి శ్ర చి ధ) | శుభలగ్నములు | జామిత్రశుద్ధి. మీనచైత్రము నింద్యము |
| నవవధూప్రవేశము | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩ | సో-బు-గు శు | అశ్విరోమృపున పు మ ఉత్తరాత్రయం హ చి స్వా అనూ మూ శ్ర ధ శత రే | ,, | ద్వాదశశుద్ధి విషమవర్షమాసములు |
| నవవస్త్రాభరణ ధారణం | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩-౧౫ | బు-గు-శు | అశ్వి హ చి స్వా వి అనూ ధ రే (నర స్త్రీల, రో పున పు ఉత్తరాత్రయం) | వృ. మి. క.క. తు.ధ. మీ. | తృతీయశుద్ధి |
| వాపీకూపాదికము | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩-౧౫ | సో-బు-గు శు | అశ్విరోమృపుష్య మ ఉత్తరాత్రయం హ అనూ మూ శ్ర ధ శ రే (జ్యేష్ఠ) | కర్కా. మ.కుం.మీ. | అగ్ని,దక్షిణ, నిరృతి, వాయు, దిక్కులు గృహమధ్యంకూడదు |
| బీజావాపనం | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩-౧౫ | సో-బు-గు శు | రోపుష్య మ ఉత్తరాత్రయం హ స్వా అనూ మూ శ్ర శ రే అశ్వి మృ పున ధని | వృ. కర్కా. సిం.మ. (తు. మి. కు.) | అష్టమశుద్ధి. ౩-౬లలో శుభులు కూడదు |
| వృక్షలతాది స్థాపనం | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩-౧౫ | సో-బు-గు శు | అశ్విరోమృ పుష్య మ ఉత్తరాత్రయం హ చి వి అనూ మూ శ్ర శత రే | శుభలగ్నములు. | చతుర్థమునకు శుభదృష్టి వలయును |
| దేవతాప్రతిష్ఠ | ౨-౩-౫-౭-౮ ౧౦-౧౧-౧౨-౧౩ | ఆ-సో-బు గు-శు | అశ్విరో మృ పున పు ఉత్తరాత్రయహ చి స్వా అనూ శ్ర ధ శ రే (దేవనక్షత్ర) | వృష. వృ. సిం. మి. కన్యా. ధ. కుం.మీ. | సౌమ్యదేవతలకు ఉత్తరాయణం ఉగ్రదేవతలకు దక్షిణాయనం |
| యాత్ర | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩ | బు-గు-శు | అశ్వి మృ పున పు హ అనూ ధ శ్ర రే (రో ఉత్తరాత్రయం మూ శ) | మే. వృష. క.తు.ధ. మ.మీ. | పంచమశుద్ధి శుభశకునం |
| హలకర్మ | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩-౧౫ | ఆ-మం-బు గు-శు | అశ్వి రో మృ పున పు ఉత్తరాత్రయం హ చి స్వా వి అనూ మూ శ్ర ధ శ రే | వృ.మి.కన్యా.వృ.ధ. మీ. | కర్తరి కూడదు. |

## ఆనందాది యోగములు

| ఆ | సో | మం | బు | గు | శు | శ | |
|---|---|---|---|---|---|---|---|
| అ | మృ | ఆ | హ | అనూ | ఉ.షా | శ | ఆనందయోగము ౧౫ దినములలో కార్యసిద్ధి |
| భ | ఆ | మ | చి | జ్యే | అ | పూ | కాలదండయో. ౨౭ దినములలో కార్యసిద్ధి అపశకునం |
| కృ | పు | పు | స్వా | మూ | శ్ర | ఉ | ధూమ్రయో. ౧౫ ది. వరకు పని కాదు సౌఖ్యనష్టం |
| రో | పు | ఉ | వి | పూ | ధ | రే | ధాత్రీయో. ౧౫ ది. లో కార్యమగును నీళ్లకుండలు కనబడును |
| మృ | ఆ | హ | అనూ | ఉ.షా | శ | అ | సౌమ్యయో. ౧౬ ది. లో కార్యమగును, సర్వసౌఖ్యము |
| ఆ | మ | చి | జ్యే | అ | పూ | భ | ధ్వాంక్షయోగము కార్యహాని దుఃఖప్రాప్తి |
| పు | పు | స్వా | మూ | శ్ర | ఉ | కృ | ధ్వజయోగము ౨౭ ది.లో కార్యసిద్ధి వేశ్యాగమనము |
| పు | ఉ | వి | పూ | ధ | రే | రో | శ్రీవత్సయోగము లాభము |
| ఆ | హ | అనూ | ఉ.షా | శ | అ | మృ | వజ్రయో. కార్యనాశనం చచ్చిన జంతువులు కనిపించును |
| మ | చి | జ్యే | అ | పూ | భ | ఆ | ముద్గరయోగము కలహము దుశ్శకునము |
| పు | స్వా | మూ | శ్ర | ఉ | కృ | పు | ఛత్రయో. ౨౭ ది. లో స్త్రీలాభము కమలదర్శనము |
| ఉ | వి | పూ | ధ | రే | రో | పు | మిత్రయో. ౨౭ ది. లో తీర్థదర్శనము సన్మిత్రలాభము |
| హ | అనూ | ఉ.షా | శ | అ | మృ | ఆ | మానసయోగము కార్యలాభము |
| చి | జ్యే | అ | పూ | భ | ఆ | మ | పద్మయోగము ౧౫ దినములలో ఐశ్వర్యప్రదము |
| స్వా | మూ | శ్ర | ఉ | కృ | పు | పు | లంబయోగము కార్యవిలంబము అపశకునము |
| వి | పూ | ధ | రే | రో | పు | ఉ | ఉత్పాతయోగము ద్రవ్యనాశనం అవమానం |
| అనూ | ఉ.షా | శ | అ | మృ | ఆ | హ | మృత్యుయోగము హాని సర్పదర్శనము |
| జ్యే | అ | పూ | భ | ఆ | మ | చి | కాలయోగము అవమానము వృద్ధబ్రాహ్మణదర్శనము |
| మూ | శ్ర | ఉ | కృ | పు | పు | స్వా | సిద్ధయో. ౧౮ ది. లో. పని యగును సువాసినీదర్శనము |
| పూ.షా | ధ | రే | రో | పు | ఉ | వి | శుభయోగము ౧౮ దినములలో పనియగును |
| ఉ.షా | శ | అ | మృ | ఆ | హ | అనూ | అమృతయోగము కార్యసిద్ధి వస్త్రలాభము |
| అ | పూ | భ | ఆ | మ | చి | జ్యే | ముసలయోగము దుఃఖము |
| శ్ర | ఉ | కృ | పు | పు | స్వా | మూ | గదాయోగము చెరుపు కలుగును |
| ధ | రే | రో | పు | ఉ | వి | పూ | మాతంగయోగము అశ్వలాభము బ్రాహ్మణదర్శనము |
| శ | అ | మృ | ఆ | హ | అనూ | ఉ.షా | రాక్షసయోగము చెడ్డది మిత్రకలహము |
| పూ | భ | ఆ | మ | చి | జ్యే | అ | చరయోగము దుర్వాక్యశ్రవణము |
| ఉ | కృ | పు | పు | స్వా | మూ | శ్ర | స్థిరయోగము శుభాశుభమిశ్రమము కత్తి కనపించును |
| రే | రో | పు | ఉ | వి | పూ | ధ | వర్ధమానయోగము వివాహదర్శనము ఉత్తమము |

## వివాహమునకు ముందు చూడవలసిన పొంతనములు

### ౧ నాడీకూటము

ఏకనాడీనక్షత్రములు:—జ్యేష్ఠ, మూల, ఉ-ఫ, హస్త, ఆర్ద్ర, పున, శత, పూభా, అశ్విని.

మధ్య నాడీ నక్షత్రములు—పుష్య, మృగ, చిత్ర, అనూ, భరణి, ధనిష్ఠా, పూఫ, ఉ-భా.

### అంత్యనాడీ నక్షత్రములు

స్వాతి, కృత్తిక, ఆశ్లే, ఉషా, విశా, రోహి, మఘ, శ్రవ, రేవతి_ఇందు వధూవరుల నక్షత్రములు రెండును ఒకేనాడియందున్నచో అనిష్టము గల్గును. భిన్న నాడీగత నక్షత్రము లైనచో శుభప్రదములు.

### ౨ గణకూటము

దేవగణ నక్షత్రములు:—అనూ, పున, మృగ, శ్రవ, రేవ, స్వాతి, అశ్వి, హస్త, పుష్య.

### రాక్షసగణ నక్షత్రములు

మఘ, ఆశ్లే, ధని, జ్యేష్ఠ, మూల, శత, కృత్తి, చిత్ర, విశాఖ.

### మనుష్యగణనక్షత్రములు

పూ-ఫ, ఉ-ఫ, పూషా, ఉషా, పూభా, ఉభా, రోహి, భర, ఆర్ద్ర

### 3 యోనికూటము

అశ్వినీశతతార లశ్వములు, భరణీరేవతులు గజములు, కృత్తికా పుష్యలు మేకలు, రోహిణీ మృగశిర్షలు సర్పములు, ఆర్ద్రామూలలు శునకములు, పునర్వసూ ఆశ్రేషలు మార్జాలములు, మఘ పుబ్బ లెలుకలు, ఉత్తర ఉత్తరాభాద్రలు గోవులు, హస్తస్వాతు లెనుబోతులు, చిత్రావిశాఖలు పెద్దపులులు, అనూజ్యేష్ఠలు లేళ్ళు, పూషాశ్రవణములు కోతులు, ధనిష్ఠాపూర్వాభాద్రలు సింహములు, ఉషాభిజితులు ముంగిసలు. ఇట్లు యోచించి విరోధిజంతునక్షత్రములుగల స్త్రీపురుషులకు వివాహము చేయవలదయును. విరోధిజంతువులు: కుక్కలు లేళ్లు, పాములు ముంగిసలు, సింహగజములు, గుర్రము లెనుబోతులు గోవ్యాఘ్రములు, పిల్లులెలుకలు విరోధిజంతువులు.

ఇందు వధూవరులనక్షత్రములు రెండును ఒకేగణము నందున్నచో అత్యంతానురక్తులై యుందురు. ఒకటి దేవగణములోనిది, రెండవది మనుష్యగణములోనిది అయినయెడల సామాన్యమైన అనురాగముగల వారగుదురు. ఒకటి రాక్షసగణములోనిదై, రెండవది మనుష్యగణములోనిదైనను, దేవగణములోనిదైనను అశుభకరము.

## ఉపయుక్తవిషయములు

### 1. రజస్వలవిషయమై దుష్టతిథివారనక్షత్రములు

శుక్ల పక్షమందును, కృష్ణపక్షమందును పాడ్యమి, చవితి, నవమి ద్వాదశి, చతుర్దశులును, అమావాస్య, ఆది, మంగళ, శనివారములును, భరణి, కృత్తిక, ఆర్ద్ర, ఆశ్రేష, మఘ, పూఫ, పున, జ్యేష్ఠ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర ఈనక్షత్రములును దుష్టములు. వీటియందు ప్రథమరజస్వలయినచో శాస్త్రోక్తశాంతిచేసి తిరుగ మంచికాలమందు రజస్వలయగువరకు గర్భాధానము సేయింపఁజనదు. నక్షత్రము దుష్టమయినచో హోమవిధానముగ శాంతి చేయవలయును. నక్షత్రము మంచిదై తక్కినవి చెడ్డవైనచో సామాన్యశాంతి చేయవలయును. మరియు వ్యతీపాత, వైధృతి, పరిఘాపూర్వార్ధము, సంక్రాంతి, గ్రహణకాలము, నిద్రాసమయము ఇవియును శుభమయినవి కావు. మరియు ప్రాతఃకాలమున సౌభాగ్యవతి, పూర్వాహ్ణమందు యాత్రలు చేయునది, మధ్యాహ్నమున పుత్రవతియు ధనవతియు, సాయంకాలమున జారిణి, సంధ్యలయందు దుశ్చేష్టురాలును, అర్ధరాత్రియందు విధవయును, ఉషఃకాలమున సౌభాగ్యరహితయు నగును.

**2. జననవిషయమై దుష్టతిథివారనక్షత్రాదులు**

అశ్విని ౧ పాదము, మఖ ౧ పాదము, రేవతి ౪ పాదము ఇవి శిశుగండము. భరణి ౩ పాదము, కృత్తిక ౩ పాదము, పుష్య ౨-౩ పాదములు, మఖ ౩ పాదము, ఈ తర ౧ పాదము(కొందరు త్తరాషాఢ యందురు) హస్త ౩ పాదము, చిత్త ౧,౨ పాదములు, పూర్వాషాఢ ౩పాదము,ఇవి పురుషుడైన పితృగండము,స్త్రీయైన చో మాతృగండం.

రోహిణి ౧,౨ పాదములు తల్లికిని, మేనమామకును, ౩-౪ పాదములు కేవలం మేనమామకును గండములు. ఆశ్లేష ౨పా॥ ధనహాని. ౩పా॥తల్లి గండము. ౪ పా॥ తండ్రిగండము. ౧పా॥ దోషముకాదు. మూల ౧పా॥ తండ్రిగండము. ౨పా॥ తల్లిగండము. ౪పా॥దోషము గాదు. ౩పా॥ ధనహాని. అందును మూల ౧ పాదములో మొదటిసగము మిక్కిలి దోషమయినది. జ్యేష్ఠయొక్క నక్షత్రాద్యంతమును ౧౦ చే భాగింపవలెను. అం దేభాగమైనచో ఆ భాగముయొక్క ఫలమును తెలుసుకొనవలయును. ౧భా॥ మాతామహగం॥ ౨భా॥ మాతా మహ గం॥ ౩భా॥ మేనమామ గం॥ ౪భా॥ తల్లిగం॥ ౫భా॥ శిశుగం॥ ౬భా॥ గోత్రనాశనం. ౭భా॥ ఉభయకులనాశనం. ౮భా॥ సోదరగం॥ ౯భా॥ శ్వశుర గం॥ ౧౦భా॥ సర్వనాశనమును చేయును. ౧౧భా॥ మిక్కిలి దుష్టమయినది. విశాఖ పురుషుడైన భార్యానుజ గం॥ స్త్రీయైనచో భర్తయొక్క సోదరునకు గండము.

మీన మేషములకును, కర్కాటక సింహములకును, వృశ్చిక ధనుస్సులకును సంధి అరఘడియ ప్రబల శిశుగండము.

పంచమిషష్ఠులకును, దశమ్యేకాదశులకును, పూర్ణిమా ప్రతిపత్తులకును, అమావాస్యా ప్రతిపత్తులకును సంధి ౨ గడియలును,ఐహులు ౧౪ తిలో మొదటి ౭వ వంతుగాక తక్కిన భాగములును దుష్టము లైనవి. వ్యతీపాత, వైధృతి, పరిఘ, వజ్ర, వైధ్రులను మహాపాతలు ను, సంధ్యాకాలమును, అమావాస్య, తల్లి తండ్రి సోదరుడు వీరి నక్షత్రములునైనను గ్రహణకాలమయిననుగూడా శాంతి చేయవలయును.

పైన చెప్పబడిన నక్షత్రములయందు ఆయా పాదములయందు జననమయినచో మహాదోషము గాన హోమములు, సమారాధనము మొదలగు సంపూర్ణశాంతి చేయవలయును. చెప్పబడిన పాదములుగాక తక్కినపాదములయినను సామాన్యశాంతి చేసికొనుట యుక్తము. నక్షత్రము మంచిదై తక్కిన తిథి మొదలగునవి చెడుగైనను సామాన్య శాంతి చేసికొనవలయును.

మరియు మృగశిర ౧పా॥ విశాఖ ౪పా॥ అనూరాధ ౩పా॥ ధనిష్ఠ ౨పా॥ శతతార ౧పా॥ ఉత్తరాభాద్ర ౪పా॥ ఇవైనను సామాన్యశాంతి చేసికొనుట యుక్తము.



## రాహు, గుళిక కాలములు

సూర్యోదయము 6 ఘంటలకు అయ్యే దినములకు

| వారములు | రాహు కాలము | | గుళిక కాలము | |
|---|---|---|---|---|
| | మొదలు | వరకు | మొదలు | వరకు |
| ఆదివారము | 4-30 | 6 | 3 | 4-30 |
| సోమవారము | 7-30 | 9 | 1-30 | 3 |
| మంగళవారము | 3 | 4-30 | 12 | 1-30 |
| బుధవారము | 12 | 1-30 | 10-30 | 12 |
| గురువారము | 1-30 | 3 | 9 | 10-30 |
| శుక్రవారము | 10-30 | 12 | 7-30 | 9 |
| శనివారము | 9 | 10-30 | 6 | 7-30 |

## శుభకర్మలయందు మహాదోషములు

దుష్టతిథి వార నక్షత్ర యోగ కరణములు (విష్కం, అతిగం, శూల, గండ, వ్యాఘా, వజ్ర, వ్యతీ, పరి, వైధృ, దుష్టయోగములు. విష్టి, శకుని, చతు, నాగ, కింస్తు దుష్టకరణములు.) సంక్రాంతి, అయనదినములు, పాపాక్రాంత పాపదృష్టలగ్నములు, అష్టమ కుజుడు, షష్ఠ శుక్రుడు, పాపగ్రహాకర్తరి, జన్మలగ్న చంద్రలగ్నములకు అష్టమ లగ్నము, షష్ఠాష్టద్వాదశముల చంద్రుడు, సగ్రహచంద్రుడు, వేధ క్రాంతులు, గ్రహణనక్షత్రము, వర్జ్య దుర్ముహూర్తములు, తిథినక్షత్ర లగ్నసంధులు, మహాపాతలు—ఇవి విడువదగినవి.

## మృతివిషయమై చెడునక్షత్రములు మొదలగునవి

౧-౨-౬-౭-౧౧-౧౨-౧౩-౧౪ ఈ తిథులు; ఆది మంగళ శుక్ర శనివారములు; కృత్తిక రోహిణి మృగశిర్ష పున మఖ ఉఫ చిత్త విశా ఉషా ధని శత పూభా ఉభా రేవతి ఈ నక్షత్రములును దోషములు. వీటియందు మృతి సంభవించినచో గృహమునకు దోషము. నక్షత్రము చెడుగయినచో అధికదోషము నక్షత్రము మంచిదై మిగిలినవి చెడుగైనచో స్వల్పదోషము.

ఆనందకరమగు ఉగాది శుభసమయమున మా పోషకులకు,
కాతాదార్లకు, హితైషులకు ఎల్లరకును మా అభినందనములు.

# Time marches on

అనివారితమై సాగిపోవు జీవయాత్రలో మానవుడు పరిపూర్ణత పొందుటకు నిరంతరము యత్నించుచున్నాడు. ఇక, కాలగతి కనికర మెరుగనిదై ప్రతివిషయమును 'వన్నె తరిగిన' వాటిచే మిగుల్చుచున్నది. నిశ్చయముగ ఈ విషయమైనను కాలగతిని తిరుగుచెందని వస్త్రములను తయారుచేసి సరఫరా చేయుటయే మా లక్ష్యము.



SRI KRISHNA WEAVING MILLS BANGALORE CITY

## Krishna Fabrics

*manufactured by*

FAS-478

**SRI KRISHNA WEAVING MILLS, SUBRAMANYAPURA, BANGALORE CITY.**

SOLE DEALERS: YADALAM BROTHERS LTD., BANGALORE CITY...



ఈ దు రు గా లి

చిత్రకారుడు : శ్రీ దేవీప్రసాద్ రాయచౌదరి

విరోధిసంవత్సరమునకు వీడ్కోలు; వికృతి సంవత్సరమున కిక స్వాగతము. నూత్నవత్సరము క్రొత్తకోరికలతో చిగురెత్తుననుట తథ్యము. కాని పండి రాలిన ఆకులును, ఎండి రాలిన ఆకులును ఎన్నో కలవు — ఆంధ్రజాతికి చిరకాలానుగతాభీష్టమింకను సిద్ధించకపోవుట విరోధిసంవత్సరమున కొక కళంకము. కాని ఆంధ్రజాతికి అభ్యుదయకరమైన ఆంధ్రోద్యమము కాలావరోధముల కతీతమైనది. కాంగ్రెసుకు కూడా అది అతీతమైనది. ఇంతమాత్రమున ఆంధ్రుల సంకల్పబల మల్పమై క్షీణింపజాలదు. మీదు మిక్కిలి అది ఇనుమడించగలదు. పట్టువీడని యుత్సాహాతిశయముతో లక్ష్యమును సాధించుట పురుషలక్షణము. ఆశాభంగమున కవకాశ మావంతయు లేదు. "విడచిరే యత్న మమృతంబు వొడముదనుక— నిశ్చితార్థంబు విడువరు నిపుణమతులు"—ఆంధ్రులు శిరసావహింపదగిన సుభాషిత మిది.

కాలపరిస్థితులు గతసంవత్సరముకంటెను రాగల సంవత్సరములో క్లిష్టముగా నుండునని రాజకీయవేత్తలు కొందరు భవిష్యత్తును గుణించుచున్నారు. నేటి నాగరికరాజ్యములన్నియు ఐక్యరాజ్యసమితియందు చేరి వ్యవహరించుచున్నవే గాని అది నేతిబీరకాయవలె ఐక్యరాజ్యసమితి యగుటకు మారుగా అనైక్యరాజ్యసమితిగా పరిణమించుచున్నది. అమెరికా, ఇంగ్లండు, ఫ్రాన్సు, కెనడా మున్నగురాజ్యము లొక పశ్చిమ రాజ్యకూటముగా ఏర్పడినవి. రష్యా, రుమేనియా, బల్గేరియా మున్నగురాజ్యములు ప్రాచ్యరాజ్యకూటముగా నేర్పడినవి. ఈ రెండు భిన్నకూటములును పరస్పరసహకార సాహచర్యములు లేక పరస్పర విముఖత్వమునే ప్రతి వ్యవహారమునందును చాటుచున్నవి. అంతేకాదు. అణుశక్తిఉత్పత్తిలోను, తత్సంబంధమారణాస్త్రనిర్మాణములోను అమెరికాప్రభుత్వము నానాటికి శ్రుతిమించి రాగమున బడుచున్నది. సర్వసంహారకమైన ఆటంబాంబులే కాక, లోకవిలయసాధనములైన హైడ్రోజన్ ఆటంబాంబులనుకూడ నిర్మించుటకు ఎన్నికోట్ల డాలరుల నైనను వెచ్చించెదమని అమెరికా ప్రెసిడెంటగు ట్రూమన్ బాహాటముగా ప్రకటించెను. ఇట్టి బాంబులను తయారుచేయుట తగదని యీన్‌స్టైనువంటి జగదేకశాస్త్రవేత్తలు "జాగ్రత! జాగ్రత" యని హెచ్చరించుచునే యున్నారు. ఈ ఆటంబాంబుల నిర్మాణమునకు అదరి బెదరి, అమెరికాప్రతాపమును జూచి, రష్యా లొంగి వంగి సలాములు చేయదని, రష్యా మాజీ విదేశాంగమంత్రి మోలటావ్ స్పష్టముగా వెల్లడించెను. ఆటంబాంబుల విద్యలో రష్యాకూడ ఆరితేరుచున్నది. మానవవిజ్ఞానము వికృతరూపము దాల్చినది. ఈఆయుధసాధనములు సమరరంగమునకైనను సవ్యముగా ప్రయోగార్హములనుట సందేహాస్పదము.

సామ్యవాదవ్యాప్తిని అరికట్టుటకు అమెరికా సంకల్పించి, కమ్యూనిస్టువిజృంభణను కసిమసంగవలెనని తన కర్తవ్యమును చాటుచునేయున్నది. కాని, మరియొకవైపున చైనావంటి పెద్దరాజ్యము కమ్యూనిస్టురాజ్యముగా వెలసినది. రష్యను ప్రాబల్యము చైనాను దాటి ఇండో - చైనాలోనికి విస్తరించుటకై ప్రయత్నించుచున్నది. చైనాలోని కమ్యూనిస్టుసేనలు టిబెట్టులోనికి ప్రవేశింపగలవు. ఇది భారతదేశమునకు పొరుగురాజ్యము.

ఇండోచైనాకు సమీపమందున్న మలయాలో కమ్యూనిస్టు తండముల ఉద్ధృతిని అణచివేయుటకై బ్రిటిష్‌వారు అచటకు విమానదళములను ఘూర్కాపటాలములను చేర్చుచున్నారు. మలయాకు సమీపస్థమైన బర్మారాజ్యము కమ్యూనిస్టుల గూడువలె తయారైనది. ఈశాన్యదిశనుండియు, తూర్పువైపునుండియు కమ్యూనిస్టుదాడుల నీడలు భారతదేశములోనికి వ్యాపించుచున్నవి.

భారతదేశమునకిప్పుడు తూర్పువైపునుండి కమ్యూనిస్టు ప్రమాదముకంటె పాకిస్తానుప్రజాపీడన

మధికబాధాకరమైనది. తూర్పుపాకిస్తాన్ అగు తూర్పు బెంగాలునం దొకప్పుడు నవఖాళీదురంతము లతి ఘోరముగా జరిగెను. ఆ దురంతములే ఆనాడు మహాత్మునకు అగ్నిపరీక్షయయ్యెను—ఆ యగ్ని యింకను చల్లారలేదు. నేటి నెహ్రూప్రభుత్వమునకును ఇది విషమపరీక్షగా పరిణమించుచున్నది. ఒక వైపున కాశ్మీరమువిషయములో భారతప్రభుత్వము పాకిస్తానుప్రభుత్వముతో సామ్యవ్యవహారపరిష్కారమునకై విశ్వప్రయత్నము చేయుచున్నది. పాకిస్తాను ప్రభుత్వము, ఇదేసమయములో మరొకవైపున తూర్పు బెంగాలులోని హిందువులను మందునకైన గానరాకుండ నూడ్చివేయుట చూడగా, ఇది భారతప్రభుత్వముయొక్క సహనభావపరీక్షగా గోచరించుచున్నది. కయ్యమునకు కవ్వించుటవలె కన్పించుచున్నది. కాశ్మీర్ సమస్యాపరిష్కార యజ్ఞభంగమున కిదియొక రాక్షసకృత్యముగా తోచుచున్నది. కాని యీతరుణమున రణావేశము తరణోపాయము కాదని నెహ్రూ ప్రభుత్వము గ్రహించి, ఆగ్రహమును నిగ్రహించి వ్యవహరించుచుండుట దివ్యమైన, నవ్యమైన రాజనీతి. ఆ విషయము నిస్సంశయము—ఆవేశముల కవకాశ మిచ్చుట అవివేకము—ఆత్మవినాశకరము—

మన నూతన రాజ్యాంగచట్టము, గత జనవరి 26-వ తేదీనాడు అఖండవైభవోత్సవములతో అవతరించినది. భారతదేశపు కట్టకడపటి గవర్నరు జనరలుగా శ్రీ రాజగోపాలాచారిగారు విరమించిరి. భారతదేశపు మొట్టమొదటి ప్రెసిడెంటుగా శ్రీ రాజేంద్రప్రసాదుగా రధికారము వహించిరి. రాజ్యాంగపరిషత్సారథి యీపదవి నధిష్ఠించుట శ్రేష్ఠము—శ్రేయస్కరము. కాని, నూతనరాజ్యాంగచట్ట మింకను పురాతనశాసనసభ్యవర్గములతోనే వర్తించుచున్నది. వివిధరాష్ట్రప్రభుత్వముల శాసనసభ్యవర్గము లింకను మారలేదు. కేంద్రప్రభుత్వపు శాసనసభ్యవర్గమునకును క్రొత్త ఎన్నికలు జరుగవలసియున్నవి. కాంగ్రెసుపక్ష మీ ఎన్నికలయందు తన పార్టీబలమును ఇతర పార్టీలతో పోల్చుకొని కొల్చుకొనవలసియున్నది. వయస్కులైన ప్రతివానికిని క్రొత్తరాజ్యాంగము వోటు నిచ్చు హక్కును కల్పించుటవల్ల వోటర్లసంఖ్య సముద్రమువలె విస్తరించినది. ఈ ప్రజాసముదాయసముద్రము సక్రమమైన సుశిక్షితమైన జాతీయాశయతరంగితమైనప్పుడే, జలాశయమువంటి జనాశయము దేశమును సుభిక్షమొనర్పగలదు—లేనియెడల, కాంగ్రెసు నౌక తుపానులో జిక్కిన ఫక్కి నుండగలదు. రానున్న ఎన్నికలకై కాంగ్రెసునౌకను కట్టుదిట్టము చేయవలెననియు, దానిని ప్రజాశయగామిగా చేయవలెననియు కాంగ్రెసునాయకులు కృతనిశ్చయు లైరి. నూతన రాజ్యాంగము కాంగ్రెసుమహాసంస్థ కొక నూతన పరీక్షాఘట్టము.

నేటి కాంగ్రెసుప్రభుత్వము నకు ప్రారంభదశలో కృతార్థ్యవస్థ ప్రాప్తించినది. భారతదేశమును ఆసేతుశీతనగపర్యంతము ఏకైక కేంద్రాధికారములోనికి తీసికొనివచ్చుటకై తొల్దొల్త సర్దారుపటేలు పాటుపడవలసివచ్చెను. సంస్థానముల నన్నింటిని సంపుటీకరించుట మహారాజసూయయాగమువలె ముగిసినది. పటేల్ ప్రజ్ఞావిశేషముల కిది ప్రత్యక్షప్రమాణము. హైద్రాబాదుసంస్థానమునం దింకను ప్రజాప్రతినిధివర్గ మెన్నుకొనబడవలసియున్నది. తెలంగాణాసమస్య తేలవలసియున్నది. నూత్నరాజ్యాంగానుసరణముగా భారతదేశమంతటను జరుగగల ఎన్నికలతోబాటు హైదరాబాదు సంస్థానపు ఎన్నికలుకూడ జరుగగలవని నిర్ణయింపబడెను. ఈ ముహూర్త నిర్ణయమునకు ఈ సంస్థాన విశిష్టక్లిష్ట పరిస్థితులు హేతుభూతము కావచ్చును. సంస్థానము ఇప్పటికిని పాకిస్తానుకుతంత్రముల కాటపట్టగుటవల్ల భారతప్రభుత్వమున కింకను ప్రక్కలో బల్లెమువలె ప్రవర్తించుచున్నది.

సంస్థానముల సమస్యకంటెను దేశస్వయంసమృద్ధిసమస్య అత్యంతశీఘ్రపరిష్కారమున కెదురు చూచుచున్నది. ఆర్థికముగా భారతదేశము సుభిక్షమై స్వయంసమర్థముగా లేదనుటఅమంగళకరముగానున్నది. ఆహారపదార్థములు భారతదేశమునకు చాలినంతగా పండింపబడుటలేదు. ఇతరదేశములనుండి ధాన్యములను అమితద్రవ్యవ్యయముతో దిగుమతి చేసికొనవలసి వచ్చుచున్నది. ఆహారధాన్యముల కొరతను వారించుటకును పంటను పెంపుచేయుటకును ప్రభుత్వము ప్రబలప్రయత్నము చేయుచున్నది. భారతదేశము అన్నమునకే గాక, వస్త్రమునకుగూడ తెను

గానకే యున్నది. ఇదివరలో పాకిస్తానునుండి సమృద్ధిగా దిగుమతియగుచుండిన ప్రత్తి ఇప్పుడు సప్లయి కాక నిలిచిపోయినది. అందువలన ఆహారధాన్యోత్పత్తితో బాటు ప్రత్తినికూడ అధికముగా ఉత్పత్తిచేసి దేశములోని బట్టల మిల్లులకు సమృద్ధిగా సప్లయిచేయవలసియున్నది.

అమెరికానుండి విరివిగా యంత్రసామగ్రులను దిగుమతిచేసికొనుటకై డాలరుద్రవ్యనిధిని వృద్ధిచేసికొనుట కనుకూలముగా, భారతప్రభుత్వము మన వర్తక వ్యాపారములను నిగ్రహింపవలసియున్నది. జనపనార సంచులను ఈ దేశము అమెరికాకు ఎక్కువగా ఎగుమతి చేయుచున్నది. అందుమూలముగా డాలరుద్రవ్యమును సేకరింపగలుగుచున్నది. జనపనారసంచులను తయారుచేయుటకై కావలసిన జనపనార యింతకాలమునుండియు తూర్పుపాకిస్తాను (తూర్పు బెంగాలు) సప్లయి చేయుచుండెను. కాని, యిప్పుడు తూర్పు పాకిస్తానునుండి జనపనార సప్లయి కాకపోవుటవల్ల మన నారమిల్లులు నారసంచులను అమెరికావంటి డాలరు రాజ్యమునకు యథావిధిగా ఎగుమతిచేయజాలని స్థితి ఏర్పడెను. ఈ దుస్థితిని తొలగించుటకై జనపనారను కూడ భారతదేశమునందే కావలసిన పరిమితివరకు ఉత్పత్తిచేయుటకై యీపంటను వృద్ధిచేయవలసి వచ్చినది.

ఈవ్యాపార విచ్ఛిత్తి పాకిస్తానుకైనను శ్రేయస్కరము కాదు. ఆర్థికముగా పాకిస్తాను తాను భ్రష్టమగుటయే గాక, భారత దేశమునుకూడ చిక్కులపాలు చేయవలెనని యత్నించుచున్నట్లుగా అనుమానించవలసియున్నది. కాని, నెహ్రూప్రభుత్వము నిబ్బరముతో తన నిర్మాణాత్మక పథకముల కేవిఘ్నములిక విఘాతములను కల్పింపకుండ కర్తవ్యమును నిరూపించుచున్నది. పాకిస్తానుపై కత్తి కట్టుటయే కర్తవ్యమనుట కేవలము తత్తరపాటు. మీదు మిక్కిలి పొరబాటు. ఈ తరుణమున కార్యవాదికే విజయముగాని ఖడ్గవాదికి కాదని నెహ్రూప్రభుత్వ మెరుంగును.

ఈ ప్రభుత్వసమస్య లీవికృతిసంవత్సరమునందు విస్తృతములుగాక, విషమములు గాక, నిగ్రహింపబడుటకు తగిన పథకములు ప్రవీణులచే నిర్ణయింపబడుననుట నిశ్చయము. నెహ్రూపండితుని అధ్యక్షతను పథకనిర్ణయసంఘ మొకటి ప్రతిష్ఠింపబడినది. దేశాభ్యుదయపథకములు సర్వసమగ్రస్వరూపములో చిత్రింపబడుటకు, కేంద్రప్రభుత్వమును రాష్ట్రప్రభుత్వములును కలిసి సమ్మతిలో వ్యవహరింపగల్గుట యవసరము.

మద్రాసురాష్ట్రప్రభుత్వము ఆంధ్రాభ్యుదయమునకై సహకరింపగల్గుటకు సవ్యమైన దేశాభ్యుదయ పథకములనైనను సాధింపవచ్చును. పట్టుదలయున్నయెడల "తివిరియిసుమున తైలంబుతీయవచ్చు." ఆంధ్రుల స్వయంకృషి సమష్టిలాభైశ్వర్యములను సాధించుటకు కేంద్రీకరింపబడవలెను. వర్గభేదములు, కులకక్షలు, స్వార్థపరత్వము, సంకుచితతత్వము పురోభివృద్ధికి వేరుపురుగులవంటివి. స్వార్థత్యాగులకే సకలార్థసిద్ధి. ఆంధ్రాభ్యుదయదీక్షాకంకణులకు వికృతియైనను అపకృతి చేయజాలదు.

గత విరోధిసంవత్సరము పెక్కురీతుల ఆంధ్రుల విరోధియైన దనుట తథ్యము—కళాప్రపూర్ణుని శతావధాని శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారిని మన సాన్నిధ్యమున లేకుండజేసినది. తన పొట్టబెట్టుకొని తానుకూడ కాలగర్భమున నంతర్ధానమైనది.

సర్వతోముఖమైన ఆంధ్రప్రతిభ పునరుత్తేజము నందుటకై ఆంధ్రజాతి తన ఆత్మబలమును కేంద్రీకరింపవలసి యున్నది. భారతావనికి వన్నెదెచ్చి వెన్నెముకయై నిలువవలసియున్నది. భారతజ్యోతిని లోకశాంతికరదీపికగా వెలిగించి మానవకోటికి మార్గమును చూపగల సుకృతాత్ముల కిది నిలయమై వెలయుగాక!

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

## ప్రప్రథమ భారతరిపబ్లిక్ అధ్యక్షుడు



శ్రీ బాబూ రాజేంద్రప్రసాదు

# ఆంధ్రులు - సంస్కృతి

★

శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ

ఆంధ్రులు – సంస్కృతి యన్నా, ఆంధ్రసంస్కృతి అన్నా మనమందరము భారతీయులము కదా, మనది భారతీయ సంస్కృతే కాని, ఆంధ్రసంస్కృతి అంటూ వేరే ఉన్నదా? ఆంధ్రసంస్కృతి, కన్నడసంస్కృతి, మహారాష్ట్రసంస్కృతి అని ఇన్ని సంస్కృతు లుంటవా? ఉన్నవా? అని చాలామందికి సంశయం కలగడం సహజం. అదీన్ని గాక సంస్కృతి, నాగరికత అనే పదాలను మనం తరచు వాడుతూవుంటాం మన సంభాషణలలో, మన వ్రాతలలో సంస్కృతి, నాగరికత ఒకటేనా అన్న అనుమానం కూడా కలుగవచ్చును. అందువల్ల నాగరికత అంటే ఏమిటో, సంస్కృతి అంటే ఏమిటో తెలుసుకొని ఆంధ్రసంస్కృతి అనే దొకటి ఉందో లేదో తరువాత విచారింతాము.

నాగరికతకు, సంస్కృతికి హస్తిమశకాంతరం; దానికి దీనికి ఎక్కడా పోలిక లేదు. నాగరికత అనేది సివిలిజేషన్ అన్న పదానికి మారుగా వాడుతున్నాం. నగరములో ఉద్భవించినది, నగరానికి సంబంధించినది నాగరికత. గ్రీకువారిది, వారిదే కాదు, ఒకవిధంగా పాశ్చాత్యులందరిదీ నాగరికతే. నగరవాసము నాధారముగా తీసుకొని యేర్పరచిన వ్యవస్థ నాగరికత. ఎక్కువగా ఇది బాహిరమయినది. సంస్కృతి అన్నది దీనికి భిన్నమయినది. ఇది కేవలము ఆంతరిక ప్రధానమయిన సంస్కారము. భారతీయులదంతా సంస్కృతి, ఆంతరిక, ఆత్మసంస్కారమునకు సంబంధించిన వ్యవస్థ. ఇది అరణ్యములలో ఆశ్రమపదములలో ఉదయించినది. తపోనిరతులైన మహామునుల ఆత్మసాధనలో రూపొందిన దివ్యకుసుమం సంస్కృతి. భారతీయవ్యవస్థ అంతా సంస్కృతిపునాదిమీద, ఆత్మసంస్కారముల ఆధారమున నిర్మితమయినదే.

'కల్చర్' అనే ఇంగ్లీషుపదానికి మనము తెనుగులో 'సంస్కృతి' అంటున్నాము. 'కల్చర్' అన్నమాట 'కృషి' అన్న సంస్కృతధాతువునుండి వచ్చినదే. కృషి యన వ్యవసాయము. మొక్కలు నాటుట, సైరు చేయుట, ధాన్యము పండించుట మాత్రమే వ్యవసాయం కాదు; మనిషి తన యభ్యుదయంకోసం, అభ్యున్నతి కోసం బాహిరముగా చేసే ప్రయత్నం, ఆంతరికంగా చేసే వ్యాసంగం అంతా కృషే. కాని మనిషి ఆధ్యాత్మికజీవనానికి, అనగా బుద్ధికి, మతానికి, నీతికి సంబంధించిన కృషినే సంస్కృతి అంటాము; అందువల్లనే ఇది ఆంతరికమయిన వ్యాసంగము. ఇంకా స్పష్టంగా గట్టిగా చెప్పాలనంటే, తన ఆంతరిక, స్వతంత్ర ఆత్మప్రజ్ఞా ప్రకటనానికి మనిషి చేసే గాఢప్రయత్నమే సంస్కృతి. ఇదొకవిధమయిన సంస్కారము. వ్యక్తికిలాగే జాతికికూడా ఈ సంస్కారముంటుంది. జాతికి గల ఈ సంస్కారం ఆచారములలోను, నడవడికలోను, వాడుకచేసే వస్తువులలోను, భాషలోను, సాహిత్యములోను, కళాశిల్పరచనలలోను వ్యక్తమవుతుంది. వ్యక్తికిలాగే జాతికి సంస్కృతి తరతరాలుగా, పరంపరగా వచ్చే వారసత్వంగ ఉంటది. జాతిజాతికి సంస్కృతి భేదిస్తుంది. ఏజాతిసంస్కృతి ఆ జాతిదే. మనిషికి వ్యక్తిత్వములాగే ఒకొక్కజాతికి గల ఈ సంస్కృతిలోని స్వాతంత్ర్యమే ఆ జాతివిశిష్టత; అదే దాని వ్యక్తిత్వము. ఈ సంస్కారవాసన ఏ జాతికయినా అప్పటికప్పుడు పుట్టుకువచ్చేది కాదు; ఇది చిరకాలానుగతమైన విద్యావిషయక వ్యాసంగములవల్ల, ఇరుగు, పొరుగు, అన్యజాతులతో కలిగిన సంసర్గములవల్ల, సంప్రదాయానుగుణమయిన ఆచారప్రవర్తనాదికములవల్ల, సాంఘికాదర్శలక్ష్యములవల్ల, మతవిషయక నీతినియమనిష్ఠా ప్రబోధములవల్ల ప్రవర్ధమానమవుతూవచ్చే సంస్కారము. అందువల్లనే ప్రాచ్య, పాశ్చాత్యదేశీయుల సంస్కృతిలో విభేదము. ప్రాచ్యదేశీయులలో కూడా ఏ జాతి సంస్కృతి ఆ జాతిదే. చైనాసంస్కృతికీ, అఫ్ఘానుజాతి సంస్కృతికీ, భారతీయసంస్కృతికీ అనంతమయిన భేద మున్నది.

భారతదేశము భౌగోళికముగా చూస్తే ఒక చిన్న ఖండమే. అది మహారాష్ట్ర, వంగ, కర్ణాట, ఉత్కల, ఆంధ్ర తమిళాది అనేక జాతులకు నెలవు. ఎన్నెన్నో విదేశాలనుండి జాతులు వచ్చి ఇక్కడ స్థిరపడిపోయినవి. ఒకజాతికీ మరొకజాతికీ ఆచారములలో భేదము, వ్యవహారములలో భేదము, సంస్కారములలో భేదము, మతవిషయక పర్యవేక్షణలో భేదము—అంతా భేదమే. అయినప్పటికీ ధర్మమును కొలబద్దగా పెట్టి, ఎవరి వ్యక్తిత్వము వారు నిలుపుకొనేటందుకును, అర్థ, కామములు సాధించేటందుకును అనువుగా కొంత స్వాతంత్ర్య మిచ్చి ఒక సాంఘికవ్యవస్థను మన పూర్వులు రూపొందించినారు. ఇది ప్రధానములయిన కొన్ని సంస్కృతిసూత్రములమీద నిర్మించిన వ్యవస్థ. అందువలన భారతదేశములో నివసించే జాతుల కన్నిటికీ ప్రధాన భారతీయసంస్కృతిసూత్రములు—అన్నిటినీ బంధించేవి, అన్నిటికీ ప్రాతిపదికలయినవి ఒక్కటే. అయినప్పటికీ ఏజాతి కాజాతి ఆ సంస్కృతిపొలములలోనే, ఆ పరిధిలోనే మెలగుతూ తన విశిష్టతను, తన వ్యక్తిత్వమును ప్రకటించుకొంటూవచ్చినది. ఈ భారతజాతుల సంస్కృతి స్థూలముగా ఒక్కటే అయినప్పటికీ ఆయాజాతులు సాధించిన విశిష్టతలోనే వాటి ప్రత్యేక సంస్కృతి ఉన్నది. బ్రాహ్మణ్యమంతా ఒక్కటేఅయినా, చతుర్వర్ణాశ్రమంతా ఒక్కటేఅయినా, ఆచారములలోను, వ్యవహారములలోను, ఇంకా అనేకవిషయాలలో ఒక కులానికి మరొక కులానికి గల సంస్కారము వేరే. ఏ కులము విశిష్టత దానిదే. ఈవిధంగానే భారత

దేశంలోని జాతులన్నిటి సంస్కృతికి ప్రాతిపదికలైన భాసిల్లే ప్రధానాంశాలు ఒక్కటే అయినప్పటికీ ఒక్కొక్కజాతి తన సంస్కారాన్ని తన సంస్కృతిని ఒక్కొక్కతీరున సరిదిద్దుకుంటూవచ్చింది. దీనికి ఒక ఉదాహరణ మిస్తే బాగా బోధపడుతుంది. భారతదేశంలో నేడు వాడుకలోవున్న లిపులన్నీ అశోకచక్రవర్తినాడు దేశమంతటా వాడుకలోఉండిన బ్రాహ్మీలిపినుంచి వచ్చినవే. ఉత్తరాన నేపాళదేశంమొదలు దక్షిణాన కావేరిదాకా బ్రాహ్మీలిపి వాడుకలో ఉండేది అశోకచక్రవర్తికాలంలో. నేడు వాడుకలో ఉన్న బంగాళీలిపికానీ, ఓఢ్రలిపికానీ, అరవలిపికానీ, మహారాష్ట్రలిపికానీ, గుజరాతీలిపికానీ, మన తెనుగులిపికానీ అన్నీ కాలక్రమాన మార్పుపొందుతూవచ్చిన బ్రాహ్మీలిపిఅక్షరాలే. ఒకటే రకం అక్షరాలు ఇన్ని వేరువేరువిధాల ఎందుకు మార్పుపొందాలి? ఇందులోనే ఆయా భారతీయజాతుల ప్రత్యేకత, విశిష్టత ఉంది. ఏ జాతి కాజాతి భారతీయసంస్కృతిప్రధానాంశాలను మూలధనంగా తీసుకొని తన సంస్కారానికి, సంప్రదాయానికి, అభిరుచికి, వాతావరణానికి, పరిస్థితులకు తగినట్లు కృషిచేసి వింతవింత ఛాయలు సంతరించి ఆ సంస్కృతికి మెరుగులు దిద్దుతూపోయినది. ఆయాజాతులు దిద్దిన తీర్పుతీరులవల్లా, అందచందములవల్లా ప్రవృద్ధమై మేల్మి వహించింది సాముదాయకభారతీయసంస్కృతి. అఖండభారతీయ సంస్కృతిసౌధాన్ని ఏజాతి కాజాతే తన శక్తిననుసరించి, తన బుద్ధిపాటవాన్ననుసరించి, తన సంస్కారాన్ననుసరించి, సాంప్రదాయిక విజ్ఞానాన్ననుసరించి కృషిచేసి కైసేసింది. భిన్నభిన్న జాతులన్నీ కలిసి ఏకైకభారతజాతిగా రూపొందినట్లే ఏకైక అవ్య భారతీయసంస్కృతి భిన్నభిన్నజాతుల హస్తలాఘవంవల్ల భిన్నభిన్నములైన తీర్పుతీరువలుపొంది అందచందాలు వెలార్చింది. భిన్నత్వంలో ఏకత్వము, ఏకత్వంలో భిన్నత్వం—ఇదే భారతజాతిలోని ఘనత.

సంస్కృతి రాజకీయత కాదు. రాజకీయత ఒకవిధమైన పద్ధతికి కృషి. దానిఫలితం ఒకవిధానం. అది సంఘంలోని ప్రతివ్యక్తికీ ఏవిధమయిన ఆటంకాలూ, ఉపద్రవాలూ లేకుండా సుఖజీవనంచేసి శ్రేయస్సు పొందడానికీ, విద్యావ్యాసంగంచేసి ఆత్మవికాసంపొందటానికు, తనదేశానికి అభ్యున్నతి సాధించి తరించడానికి అవకాశాలు, రక్షణ కల్పించుటకేర్పడిన పార్థివవ్యవస్థ. అది ఒకసాధనమే కాని పరమార్గం కాదు. మన పూర్వులీవిషయం చక్కగా గుర్తించినారుగనుకనే వారు సంస్కృతికే ప్రాధాన్యం ఇచ్చినారు. మన పూర్వపు రాజ్యాలన్నీ సంస్కృతిరాజ్యాలు. అందువల్లనే మొన్న మొన్నటి వరకు, అనగా దేశం పద్దెనిమిది, పందొమ్మిది శతాబ్దులలో అరాజకంపాలు కానంతవరకు మనకు సంస్కృతిచరిత్రే కాని రాజకీయ చరిత్ర లేదు; రాజకీయాలూ లేవు. ఉన్న రాజకీయాలల్లా రాజులకూ రాజులకూ గల విరోధాలూ, సంగ్రామాలే. మన చరిత్రలో రాజకీయ ప్రాధాన్యం బ్రిటిషుదాస్యంనుంచి విమోచనపొందడానికి ప్రయత్నం జరిగిననాటినుంచే వచ్చింది. అప్పటినుంచే రాజకీయరంగం ప్రజలదయినది.

ఏయుగంనాటి సంస్కృతి—ఏజాతిలో నయినాసరే—ఆ యుగంనాటి కళలలో ద్యోతకమవుతుంది. ఒకజాతి ఉన్నతిని, ప్రజ్ఞను, ప్రతిభను గొలవడానికి అవే సాధనాలు. "ఒకజాతికళలో అనగా లలితకళలు—శిల్పం, చిత్రలేఖనం, గద్యపద్యసాహిత్యం—వీటిలో ఆ జాతిజనుల నీతినియమాలు ప్రతిబింబిస్తూ ఉంటవి. ఆ జాతి జనులలోని గుణావగుణాలు, పుణ్యపాపాలు తెలుసుకోడానికి ఆజాతి కళలోని పరిశుద్ధతాపరిశుద్ధత లొక్కటే చక్కని సాధనం. ఉన్నతస్థాయిదైన కళ సంస్కారానికీ, పురోగతికీ తోడ్పడుతుంది; దుష్టమైన, నింద్యమైన కళ—అది శిల్పంకానీ, చిత్రలేఖనంకానీ, సాహిత్యంకానీ—నిజమైన సభ్యతకే ఘాత తెస్తుంది" అని ఎడ్వర్డ్ స్ట్రాంగ్ అనే భావుకుడు వచించాడు. విశ్వశ్రేయానికి తోడ్పడడమే సంస్కృతిలక్ష్యము. జీవితం అన్నిరంగాలలోను మానవత్వం పెంపొందించి వ్యక్తిని ఉత్తమమానవునిగా పరిదిద్దేదే సంస్కృతి.

ఈపై నుడివిన ప్రమాణాలనుబట్టిచూస్తే మన కళలు ఉత్తమమయినవని చెప్పడానికి సంశయం లేదు. మన శిల్పం, మన చిత్రలేఖనం, మన సాహిత్యం, మన సంగీతం అన్నీ ఉదాత్తవిషయాలతోను, వస్తువులతోను కూడినవే.

మన బౌద్ధశిల్పం ఒక నూతనసంప్రదాయం మలచుకొని భారతీయశిల్పకళకే గణ్యత తెచ్చింది. ఆంధ్రశాతవాహనులు వేసిన పునాదులమీదనే దక్షిణదేశపు చిత్రకళ పెంపెసలార విశిష్టత గడించింది. జైన, బౌద్ధచిత్రాలన్నీ ఉదాత్తకావ్యవస్తుసహితములై రంగులలోను రచనలోను విశిష్టత గడించినవి. మన దేశపు చరిత్రకు సంబంధించిన అన్నియుగాలనాటి వర్ణచిత్రములు మనదేశంలో కానరాకపోయినప్పటికీ తంజావూరు నాయకరాజులనాటి చిత్రాలు చూస్తే శాతవాహనయుగంలో ఆరంభమైన చిత్రకళాసంప్రదాయం మధ్య భగ్నంకాలేదన్న విషయం ధ్రువపడుతుంది. సంగీతంలో ఆంధ్రులది కడుప్రాచీనకాలంనుంచీ అందెవేసిన చేయి. వింధ్యకు దక్షిణదేశంలోని జాతులవారందరు కర్ణాటకసంగీతాన్ని, పోషించి అభ్యసించి పెంపొందించినప్పటికీ సంస్కృతాంధ్రవాఙ్మయములు తరచిచూస్తే సంగీతానికి ఆంధ్రులు ప్రత్యేకంగా చేసినసేవ కలదనే విషయం గోచరిస్తుంది. సంగీతమును నృత్యమును కాకతీయులకాలం నుంచి ఆంధ్రులు ప్రత్యేకం ఆదరించి దానిలో కృషిచేసి విజయనగరాధీశులకు ఒప్పగింపగా వారు దానికి క్రొత్త తీర్పుతీరువ దిద్ది పోషించారు. ఈ సంప్రదాయాన్నే తంజావూరు, మధుర నాయక రాజులు దక్షిణాదికి తీసుకుపోయి అక్కడ పైకిపెట్టారు. ఆంధ్రులు చేపట్టినదానిలో విశిష్టత చూపని కళలేదు; ఉన్నతికి గొనిరాని విద్య లేదు. ఒక్కొక్క కళలో ఆంధ్రులు చూపిన ప్రత్యేకతను తెలుపవలెనంటే, భారతీయసంస్కృతికి ఆయారంగములలో వారు సమర్పించిన కానుకలను వివరించవలెనంటే గ్రంథ మతివిస్తరమవుతుంది. ఈ ప్రత్యేకతనుగురించి తెలుసుకోడానికిముందు మన సంస్కృతికి లక్ష్యాలుగా ఉన్న శిల్పాలు మొదలైనవాటిని ఒక్కచోటికి సేకరించి భద్రపరచాలి.

ఆంధ్రదేశంఅంతటా జైనవిగ్రహాలూ, బౌద్ధవిగ్రహాలూ శిల్పాలూ చెల్లాచెదరుగా పడిఉన్నవి. వాటి అతీ గతీ విచారించేవారు

లేరు. మనజాతి పొందిన అభ్యున్నతిని తెలుసుకోడానికి ఇప్పుడు లభించే సాధనా లవే. వాటిలోనే మన పూర్వులు సాధించిన కళాభ్యున్నతి వ్యక్తమవుతుంది. మన మిగిలిన వాటి అందచందాలు గుర్తింపలేనంతటి దరిద్రస్థితికి వచ్చినాము. చిరకాలంగా పరదాస్యంలో ఉండడంవల్ల మనకు అందం గ్రహించే శక్తి నన్నగిల్లింది. ఇటువంటి కళారచనలమీద ఎవరికీ శ్రద్ధ కనిపించదు. పదిపదిహేనేండ్లక్రిందటున్న శిల్పశిలాఫలకాలూ విగ్రహాలూ ఎన్నో నేడు కనిపించటంలేదు. మిగిలివున్నవాటికైనా ముక్కు చెవులు కాళ్లు— అన్నీ విరిగి ముక్కలవుతున్నవి. మన జాతి గొప్పది. మన శిల్పం గొప్పది అని డంబములు కొట్టడమే నేర్చుకొన్నాంగాని మన పూర్వపు కళారచనలను ప్రాణపదంగా కాపాడడం నేర్చుకోలేక పోయినాం. ఉన్న అమరావతీశిల్పచిత్రనిక్షేపం అత్యుత్కృష్టమయినది-పరదేశాల పాలయినది. నాగార్జునకొండశిల్పచిత్రాలకు కూడా కాళ్లువచ్చి నడనడ నడిచిపోతున్నవి. నాగార్జునకొండలోని శిల్పాలు ఉంచడానికైనా తగిన మ్యూజియం లేదు. ఇప్పుడు ప్రస్తుతం నాగార్జునకొండలోనిదానిని మ్యూజియము అనడానికి వీలు లేదు. దేశంలో అక్కడా అక్కడా పడివున్న విగ్రహాలను, శిల్పాలను ఉంచడానికి కేంద్రవస్తుప్రదర్శనశాల (*Central Museum*) అసలే లేదు.

ఇక వర్ణచిత్రాలవిషయం విచారిస్తే, ప్రస్తుతం మనకు మిగిలివున్న పూర్వపు వర్ణచిత్రాలు బహుకొద్ది. వీటిలో కొన్ని దేవాలయాలలోను, తంజావూరులోను ఉన్నవి. మరికొన్ని పూర్వపు సంస్థానాలు పరిపాలించిన రాజవంశాలవారి యిండ్లలోను, ఇతర మంత్రివంశములవారి యిండ్లలోను ఉన్నవి. లేపాక్షిలోని వర్ణచిత్రాలను సముద్ధరించడానికి కాని, వాటికి ప్రతులు వ్రాయించి ప్రదర్శించి ప్రజలలో కళాప్రచారం కావించడానికి కాని పూనుకొనే మహాత్ముడే లేడు. ఎక్కడెక్కడినుంచయినా విడివిడి వర్ణచిత్రాలను సంపాదింపదలచినా వాటిని భద్రపరిచి ప్రదర్శించడానికి వెనుక చెప్పినదే కారణం—మనకు సెంట్రలుమ్యూజియమే లేదు. ఈ సందర్భంలో కీర్తిశేషులైన శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు భారతిద్వారా చిత్రలేఖనానికి చేసిన సేవ నిరుపమానమయినది: స్మరించడం ముఖ్యం. వారు ఎన్నో పూర్వపు వర్ణచిత్రాలను సేకరించి భారతిలో ప్రకటించి ఆంధ్రుల దృష్టికి తెచ్చారు. ఇప్పటికీ భారతి వారి అడుగుజాడలలో నడుస్తూవుండడం ముదావహం.

ఇక సంగీతంవిషయం చూస్తే త్యాగరాజు మావాడు. క్షేత్రయ్య మావాడుఅని ప్రగల్భాలు కొట్టడంతప్ప! పూర్వపు సంగీతవాఙ్మయం— ఆంధ్రు లుత్పాదించినది ప్రకటించడానికి తగినంత ప్రయత్నమే లేదు. తాళ్లపాకంవారి కీర్తనలు, క్షేత్రయపదాలు, త్యాగరాజస్వామికీర్తనలు ప్రకటితమయినవన్న విషయం నాకు తెలుసు. కాని ఇంకా ప్రకటితములు కాని, ప్రకటింపబడవలసిన పూర్వపు సంగీతగ్రంథాలు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారంలోను, తంజావూరు సేలస్ లైబ్రరీలోను ఎన్నో ఉన్నవి. వాటినన్నిటినీ ప్రకటింపవలసిన ఆవశ్యకత ఎంతయినా ఉంది. వాఙ్మయంమాట అటుంచగా అసలు కర్ణాటకసంగీతంమీద ఆంధ్రులకు శ్రద్ధే పోయింది. విజయవాడ, మద్రాసురేడియోలు వచ్చినతరువాత ఆంధ్రులలో కర్ణాటసంగీతాభ్యాసానికి కొంత ప్రోత్సాహం కలిగింది. ఇప్పుడిప్పుడే సంగీతసభలు చాలా పట్టణాలలో ఏర్పడి కర్ణాటకసంగీతానికి కొంత దోహద మిస్తున్నవి.

ఆయామహాక్షేత్రాలలోని దేవాలయాలలో అవి నిర్మించిన నాటి సాంఘిక, కళాపరిస్థితులను తెలుసుకోవటంకు ఉపకరించే బొమ్మ లెన్నో ఉన్నవి. కొన్ని దేవాలయాలమీద శివకథలు, మరి కొన్నిటిమీద విష్ణుకథలు కాకుండా ఆనాటి జంత్రవాద్యములు, నాట్యములు మొదలైన బొమ్మలుకూడా చిత్రింపబడినవి. వీటి అన్నిటికీ ఛాయాచిత్రాలెత్తి వాటినివరించి ప్రత్యేకకృషి చేసి వివరములతో ప్రకటించడం అవసరం.

ఈవిధంగా చేయవలసినపని ఎంతో ఉంది. మన ప్రాచీన సంస్కృతి ఎట్టిదో, ఏయేపద్ధతులలో పరిఢవిల్లినదో, ఎట్టెట్టి మార్పులు పొందిందో తెలుసుకొంటేనే కాని నూతన సృష్టికి బలం చేకూరదు. అది ఉన్నది తెలుసుకొన్నప్పుడుకదా మనకు లేనిదీ, కొత్తదీ సృష్టించుకోవడం. ఏది సృష్టించినా అది మన సంప్రదాయబలంమీద, సంస్కారబలంమీద ఆధారపడి ఉంటుంది. సంప్రదాయం విడిచిన కృషి నేలవిడిచిన సాము. దేశంలో వికసిస్తూవున్న ప్రజ్ఞను ప్రతిభను దేశీయం లక్ష్యంచేసుకొని కళావంతులకు, కళారచనలకు ప్రోత్సాహం, చేయూత ఇవ్వడానికయినా కొంత కళాప్రచారం, సంస్కృతి ప్రబోధం జరగాలి! ఇందుకు ప్రత్యేకం అఖిలాంధ్రదేశానికి సంబంధించిన సంస్థాపించడం ఆవశ్యకం. సంస్థ నిర్మించినంతమాత్రాన కార్యం లేదు. అది ప్రయోజనకారి కావాలి; కొంత పనిచేయాలి. అటువంటి సంస్కృతిసంస్థను ఎంత త్వరలో స్థాపిస్తే, కేంద్రవస్తుప్రదర్శనశాలను ఎంతత్వరలో నిర్మిస్తే దేశాని కంత మేలు. రాజకీయాలు కావు—కళలే, సంస్కృతే దేశానికి ఘనత కూర్చేవి; కీర్తి గడించేవి. దేశం సంస్కృతిమూలకంగానే బాగుపడాలి.

---

## ప్రప్రథమ ఆంధ్ర ఆస్థానకవి



కీ. శే. కింకవీంద్ర ఘటాపంచానన, కళాప్రపూర్ణ, శతావధాని బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు. [నిర్యాణము: 'విరోధి' శివరాత్రినాడు]


కళారాధకులైన సినిమా ప్రేక్షకులకు
వాహినీ వారి
నూతన సంవత్సర అభివందనములు
ఆంధ్రదేశమంతటా అన్నికేంద్రములలోనూ
గుణసుందరి
కథ...
12, వారములుగా
విజయ యాత్ర చేయుచున్న సందర్భమున
ఇంత అపూర్వమైన విజయ గౌరవాన్ని సమకూర్చిన
ప్రేక్షకలోకానికి — ఇవే వాహినీ వారు సమర్పించు
కృతజ్ఞతాభినందనలు...
ఇవే వాహినీ వారి అభివందనములు

## గర్భ నిరోధిని

శరీరారోగ్యమునకు భంగం లేకుండ కొంత కాలమువరకు గర్భం రాకుండ అపుటకు ఔషధం రూ. 10 లు. చాలా కాలంవరకు రాకుండ చేయుటకు రు 25 లు. వి. పి. చార్జీ రు 1-0-0

## పుంస్త్వ వర్ధని తైలం

వరములు బలహీనత యింది సంతోష సౌఖ్యములకు దూరమై దుఃఖించువారల పాలిట వర ప్రసాదిని మా నపుంసక తైలం. 1 సీసా రు. 10 లు. వి. పి. చార్జీ రు 1-0-0 మరియు నేపాళ దేశపు కస్తూరి, అంబర్ హేమం కలిపి ప్రత్యేకంగా తయారుచేయ బడి జగత్ప్రఖ్యాతి వహించిన తైలము గలదు. సీసా 1 కి రు 25 లు. వి. పి. చార్జీ రు 1. అర్ధ స్లిప్పు లాను ముందుగా పైకం పంపుచూ జవాబుకు కవరు పంపేది.

డాక్టర్ రత్నం సన్సు,

మలక్పేట బిల్డింగ్స్, హైదరాబాద్, దక్కన్

---

కొత్త సంవత్సరము

మీకు ఆనంద, ఐశ్వర్య ప్రదముగుగాక !

REDBIRD

## “రెడ్ బర్డ్”

బ్రాండు

కన్ఫెక్షనరీ

నాణ్యతకు ప్రసిద్ధి చెందినది.

ఏజన్సీ షరతులకు వ్రాయండి:

**శ్రీనివాస్ కన్ఫెక్షనరీ,**

42, భాష్యకార్లు నాయుడు వీధి,

కొండితోపు, మద్రాసు 1.

---

Telephone: 3608

# SMITH CORONA

Telegrams: "LIGHTOUCH"



No finer Standard Typewriter

On the strength of trouble-free performance and ease in operation hundreds of users are eagerly awaiting the latest models of **SMITH-CORONAS**

We are anxious to supply these as fast as we can get them but short supply position and import restrictions are still in the way. * * *

In the meanwhile our expert mechanical staff can keep your old typewriters going. Superior quality Typewriter & Duplicator accessories are always carried in stock. Expert advice on office labour-saving devices gladly given.



No finer Portable Typewriter

## THE TYPEWRITER & OFFICE APPLIANCES (INDIA) CO. LTD.,

(Established in 1927) (Registered in 1933)

17, ARMENIAN STREET : G. T. MADRAS-1.



# The First PRESIDENT of REPUBLICAN INDIA

## wrote *this Page* in our Visitor's Book




గత మూడుదశాబ్దములలో రాజకీయ ముగ కలిగిన పురోభివృద్ధిలో బహు పెద్దభాగము ఆయనది. రాజ్యాంగ నిర్మాణమునను హెచ్చుపాలు ఆయనదే. ఆయనదే ప్రధమాధ్యక్షుడు

* * *

అమోఘమైన ఆయన యాశీస్సులు ఫలించినవి. ఏమన, గత రెండు దశాబ్దములలో మేము ప్రశస్తముగ అభివృద్ధిపొంది నేడు ఈ పరిశ్రమలో ప్రప్రధములమై యున్నాము. అమూల్యమైన మీ ఆదరణాభిమానములకు మేము కృతజ్ఞులము. సర్వదా మీ సేవలో ఇకపైనిని పురోగమింప నిరంతరము కృషిచేయుచుండగలమని విన్నవించుచున్నాము.

**INDIA**
**BHARAT**

*The National Products with a Rational Reputation*

**The India Electric Works Ltd.,**
"Chatnath Buildings",
MOUNT ROAD MADRAS-2

గొప్పవాళ్లు కూడ మెచ్చుకొనునది




# శ్రీ అంబాళ్

## ఆఫీసర్ నశ్యం

**శ్రీ అంబాళ్ అండ్ కంపెని,**
టప్పాల్ పెట్టె నం. 3., మదరాస్.

PSMCo

# ఉగాదిపూట

శ్రీమంత మగు కల్పభూమీరుహామురీతి
గన్నబిడ్డల బ్రోవ గన్నతల్లి
భువనసంసృష్టికి బూర్వమే వేదవి
జ్ఞానమ్ము గాంచిన సదమలాత్మ
వేదాంతవీథుల విహరింప నుపనిష
త్తులు బోటులై కొల్వ తెలగు మాత
సర్వసిద్ధులు గల్గు సౌభాగ్యవతి జగ
జ్జ్యోతినై వెలిగెడి సుకృతచరిత

సర్వనాశకలయకాలచక్రనిహతి
గాంచి యెఱుగని యమృతయోగప్రసిద్ధ
భాగ్యశాలిని నిత్యయా భరతమాత
పాదముల వ్రాలిపోదు నుగాదిపూట.

అమరేంద్రద్రష్టలచేత స్తుత్యు డగు న
య్యంభోజపత్త్రాక్షు డ
య్యమరేంద్రద్రష్టలు చూడ దా వలచి మ
ర్త్యత్వమ్ము గైకొంచు నే
యమకుం బుట్టి దశావతారముల వి
ఖ్యాతాత్ముడై పొల్చె నా
యమ మద్భారతమాతృదేవతను భ
క్త్యావిష్టతన్ గొల్చెదన్.

వ్యాసవాల్మీకిదుర్వాసోవసిష్ఠాది
బ్రహ్మర్షిసత్తపోభాగ్య మంది
పరమదత్తాత్రేయపాతంజలికణాద
యోగీంద్రచంద్రసద్యోగము గని
మేధాతిథిన్యాయపాథోధిచంద్రగౌ
తమదేవసద్ధర్మధన్యత గని
శ్రీరామభీష్మపార్థివ భార్గవాదివీ
రవరేణ్యశౌర్యవైభవము గాంచి

కడుపుచల్లని తల్లిగా ఖ్యాతి మించి
కాళిదాసాదికవులను గాంచి యెసగు
భరతమాతకు హర్షసంభరితహృదిని
గరములు మొగుడ్చు భక్తి నుగాదిపూట.

శ్రీ బులుసు వేంకటేశ్వర్లు

# 'వికృతి'కి నమస్కృతి

★

శ్రీ పెనుమర్తి కామేశ్వరరావు

నవనవవసంతమధురసంధ్యాప్రశాంత - వేళ కిసలయముల దిను పికమ! పాడు
మాంధ్రుల పురావిభవకీర్తిచంద్రికామ - హోన్నతైశ్వర్యదీప్తి, త్యాగోన్నతాప్తి!

ఆంధ్రులు రాజ్యపాలకు లనంతయశస్వులు, కీర్తిచంద్రికా
సాంద్రులు, భోజనప్రియులు, సాదరు లంచితధర్మకార్యని
స్తంద్రు లుదారు లంబరవిశాలయశోధరు, లార్తరక్షణో
పేంద్రులు, సాహసుల్, రణవిభీషణకౌశలు, లుత్తమాశయుల్!

కృష్ణవేణీప్రేమగీతాల రవళిలో తరగ లయ్యె మన స్వతంత్రవాంఛ,
పెన్నానదీసముత్పన్నసంగీతాన స్వరములయ్యె మన స్వభావశక్తి,
గోదావరీపూతపాథస్సులైనవి స్వారాష్ట్రపాలనాశంసనములు,
తుంగభద్రానదీసంగీతభంగిమపాట లయ్యె మన విపర్యయములు,
నేటి కదియేమొ స్వాతంత్ర్యనిధులమైతి - మనగ, రాష్ట్రమ్ము లభియించు నదను పోయె—
ఓవికృతి! పేరుమాత్రమె యొప్పు నీకు - మాకు నైకమత్య మొసంగి సాకు మింక!

సర్వసంపన్న మాంధ్రరాష్ట్రము లభించ - వత్సరాల నిరీక్షణ ఫలితమొంద
ఐకమత్యాన మెలగు డోయాంధ్రులార! - రాజ్యపాలకులార! తంత్రజ్ఞులార!

వీరులు తెల్గువా రుదధివేల్లితరాజ్యరమావినోదు లా
ధీరులు, దేశమాతయను దేశము దా విని త్యాగబుద్ధితో
బోరొనరించి స్వేచ్ఛయును పొందుటలో ఘనకీర్తి గొన్న ని
ర్భీరులు, దివ్యదీప్తిసముపేతులు, ఖ్యాతులు భారతావనిన్!

మాకు 'విరోధి' చూపె నొక మార్గము! రాష్ట్రము పొందు కాంక్షయుం
బ్రాకెను పూలతీవయయి, పందిరికెక్కెను, విం దొనర్చె న
స్తోకముదమ్ము గూర్చె! ఇదె చూచుచు నుండ విరోధి వంచనా
లోకనదృష్టి దాని మొదలుం దెగగోసె దయావిహీనతన్!

ఎన్నడు లేని ఐక్యత సుమించినవేళ మహాంధ్రజాతి కీ
ఖన్నత- రాష్ట్ర మేర్పడగ కేంద్రప్రభుత్వము సమ్మతింపలే
దన్న విషాదవార్త విని, ఆంధ్రులు విన్నదనమ్ముతోడ నే
మున్నది లే రిపబ్లికుమహోత్సవమం దని నిశ్వసించిరే!

ఓ వికృతివత్సరంబ! నీ వవిరోధి - ప్రకృతి రూపఱచేసెడి పటిమ గలిగి
ఆంధ్రుల భవిష్యదర్థమ్ము నందగించి - విందొనర్పు మానందనిష్యంది వగుచు!

---

# దేశీయ ఆర్థికాభ్యుదయం

★

శ్రీ శ్రీకృష్ణ

భారతరాజ్యాంగపరిణామధోరణిని అనుసరించే ఇప్పటివరకూ దేశఆర్థికాభ్యుదయంకూడా నడిచింది. మాంటెగ్ ఫర్డ్ రాజ్యాంగసంస్కరణల ఆచరణకు పూర్వం, దేశాభ్యుదయవికాసాలకు దోహదమిచ్చే వివిధరంగాలలోనూ అవిచ్ఛిన్నమైన నిరంకుశాధికారంతోనే పరిపాలనావిధానం సాగుతూవచ్చింది. దేశపురోభివృద్ధికి ఏవిధానమైతే తీవ్రప్రతిబంధకంగా పరిణమిస్తుందో, ఆ విధానాన్నే బ్రిటిష్‌ప్రభుత్వం అనుసరించింది. ఏ విధానాన్ని అవలంబించడంలోనైనా భారతీయులనుకూడా సంప్రతిస్తుంటామనే వాగ్దానంచేసి బ్రిటిష్‌వారు మాంటెగ్ ఫర్డ్ సంస్కరణలను అమలుపరచడంతో, దేశఆర్థికరంగంలో రెండవయుగం ప్రారంభమైన దని చెప్పవచ్చు. అంటే, అప్పటినుంచీ బ్రిటిష్‌వారు స్వీయప్రయోజనాలకు ఏమాత్రం ప్రమాదమూ సంభవించకుండా చూసుకుంటూ, భారతదేశఆర్థికాభివృద్ధికికూడా గుడ్డిలో మెల్లగా కృషిచేస్తూవచ్చారన్నమాట. 1935 ఇండియాప్రభుత్వచట్టంలో వాణిజ్యరక్షణనిమిత్తం నిర్వచించిన ప్రత్యేకమినహాయింపులే ఇందుకు ప్రబలనిదర్శనాలు.

1947, ఆగస్టు 15-వ స్వతంత్రభారత అవతరణతో, చిరకాలంనుంచీ వస్తున్న పాతప్రతిబంధకాలన్నీ ఒక్క దెబ్బతో తుడిచిపెట్టుకుపోయినవి. అది భారతదేశం తన ఇంటికి తానే యాజమాన్యం వహించిన చరిత్రాత్మకదినం. సర్వస్వతంత్రప్రతిపత్తి లభ్యమైన అచిరకాలంలోనే, బ్రిటిష్‌వారు లోగడ సృష్టించిన వాణిజ్యమినహాయింపులన్నిటినీ భారతదేశం పటాపంచలు చేసివేసింది. పైన చెప్పిన విషయమంతా పూర్వచరిత్ర. అది ఒక పీడకల.

దేశఆర్థికాభివృద్ధి అతి జటిలమైన సమస్య. ఆర్థికరంగంలో ఏ పని చేయాలన్నా, ఏ కార్యక్రమానికి ఉపక్రమించాలన్నా, ముందుగానే జాగ్రత్తగా అందుకు అనువైన పథకాలను వేసుకోవలసివుంటుంది; కావలసిన అంగబలాన్నీ, సాధనసంపదనూ సమకూర్చుకోవలసివుంటుంది. తత్సంబంధమైన వివిధశాఖల, వివిధవర్గాల హృదయపూర్వకసహకారాన్ని సాధించవలసివుంటుంది. ఏ దేశంలో ఐనప్పటికీ, ఆర్థికాభ్యున్నతికి కృషి ఆ దేశద్రవ్యసంబంధమైన, పారిశ్రామికసంబంధమైన విధానాల నిర్వహణపై ముఖ్యంగా ఆధారపడివుంటుంది. సర్వసాధారణంగా ఏ ఆర్థికవిధానానికైనప్పటికీ, పరమలక్ష్యం ప్రజల పురోభివృద్ధిని సాధించడమే; వారి జీవనప్రమాణాన్ని వృద్ధిచేయడమే; ప్రజలకు ఎక్కువవిశ్రాంతి లభ్యమయ్యేట్లు చేసి, జాతీయాదాయాన్ని పెంపొందచేయడమే. ప్రభుత్వం ఆచరణలో పెట్టే ఏ ఆర్థికవిధానమైనా ఎంతవరకు సఫలీకృతమైనదో పరీక్షించడానికి, సామాన్యపౌరుడి ఆర్థికస్థితిగతులు ఏమైనా బాగుపడినవా అన్నదే కొండగుర్తు. అందుచేత ఏ ఆర్థికవిధానసాఫల్యంపైనైనా, అంతిమతీర్పు చెప్పవలసినవారు. ప్రజాబాహుళ్యమేగాని, సమాజంలో ఉన్నతస్థానం ఆక్రమించే ఏకొన్నివర్గాలవారో మాత్రం కాదు.

## భారతప్రభుత్వ విధానం

భారతప్రభుత్వం అనుసరిస్తున్న ఆర్థికవిధానాన్ని పరిశీలించిచూద్దాము. ఏదోవిధంగా ఎన్నికలకు ప్రజలలో సుముఖవాతావరణాన్ని సృష్టించుకుందామనే ఆత్రంతో కాంగ్రెస్‌పాలకులు ఆర్థికసమస్యలను, తమ పాతసిద్ధాంతాలనూ కలగాపులగం చేసి గంభీరోపన్యాసాలు ఇవ్వడం ప్రారంభించారు. ఉప్పుపన్నువిషయంలో మనవా రవలంబించిన విధానమే దీనికి ఉత్తమదృష్టాంతం. సామాన్యపౌరుడికి సహాయపడాలనే ఉదాత్తలక్ష్యంతో ఉప్పుపన్నును రద్దుచేయడంఫలితంగా, భారతదేశం సాలీనా 9 కోట్ల రూపాయల ఆదాయాన్ని నష్టపడవలసివచ్చింది. ఈ పన్ను రద్దుచేయకపూర్వం ఢిల్లీలో ఉప్పు మణుగు ఒకటికి ధర నాలుగురూపాయలు వుండేది. ఇప్పుడు అది 20 రూపాయలవరకూ పెరిగింది. నిత్యావసరమైన ఉప్పు కొనుక్కోవడం సామాన్యపౌరుడి శక్తిని మించిపోయింది!

1938-39, 1949-50 సంవత్సరాలమధ్య -- అంటే ఈ 11 ఏళ్లలోనూ—రకరకాల పన్నులద్వారా కేంద్ర, రాష్ట్రప్రభుత్వాల మొత్తం ఆదాయం 352 కోట్ల 17 లక్షల రూపాయలు ఎక్కువైంది. ఒకవిధంగా చూస్తే ఇది సరియయిన అంచనా కాదనే చెప్పవలసివుంటుంది. ఎందుచేతనంటే, ఇది వివిధపురపాలకసంస్థలు, జిల్లా బోర్డులు స్థానికంగా ఇతరత్రా విధించేపన్నులు చేర్చకుండా వేసిన అంచనా. దేశంలో కేంద్ర, రాష్ట్రప్రభుత్వాలు వసూలుచేస్తున్న పన్నుమొత్తం ఇంత విపరీతంగా పెరిగినప్పటికీ, 1938-39 తర్వాత

ప్రజల సగటుఆదాయంకూడా మూడురెట్లు పెరిగిందా అన్నది ప్రధానమైన ప్రశ్న.

కొత్తపెట్టుబడులు పెట్టకుండా పెట్టుబడిదారులు ఈనాడు ఎందుకు మూకీభావం వహిస్తున్నారో, ప్రజలలో డబ్బు నిలవజేసుకోవాలనే ఉత్సాహం ఎందుకు లేదో వివరిస్తూ పత్రికలలో ఎంతో తర్జనభర్జన జరుగుతున్నది. ఇంత విపరీతమైన పన్నులభారంకింద కృంగిపోతున్న ప్రజలు, ఎంత ఉత్సాహం వున్నప్పటికీ, నిలవజేసుకోవడం అసంభవమనేవిషయాన్ని గ్రహించడం అవసరం.

1949-50 లో వివిధరాష్ట్రప్రభుత్వాలూ, కేంద్రప్రభుత్వమూ కలసి స్టెర్లింగ్ నిల్వల విడుదలమొత్తాలు, అంతర్జాతీయద్రవ్యనిధి ఇచ్చిన దీర్ఘకాలికఋణం, స్వల్పకాలికఋణం, రిజర్వుఫండు అని పిలిచే రొక్కంనిల్వలలో హరించిపోయిన మొత్తాలు గాక, 486 కోట్ల 64 లక్షల రూపాయలను ఖర్చు పరిపాలనానిర్వహణంకోసమే వ్యయపరిచినవి. ఇంత బ్రహ్మాండమైన మొత్తాన్ని వ్యయపరిచారుకదా, సామాన్యపౌరుడికి ఈ ఖర్చంతా ఏమాత్రమైనా లాభించిందా? జీవనవ్యయమూల్యం యథాప్రకారం తారస్థాయిలోనే వున్నది. దేశంలో నిరుద్యోగం ప్రబలిపోతున్నది కాని, తగ్గే సూచన లేమీ కనుపించడం లేదు. పెట్టుబడిమార్కెట్ పరిస్థితి ఇప్పటికీ అతినిరుత్సాహసూచకంగానే వున్నది.

ఇంత చేసినా ప్రభుత్వం ఒక్కఋణాన్నైనా ప్రజలవద్ద సవ్యంగా సంపాదించలేకపోయింది. ప్రభుత్వం ప్రజలలో ఏపాటి విశ్వాసాన్ని, ఉత్సాహాన్ని సృష్టించుకోగలిగిందో దీన్నిబట్టే గ్రహించవచ్చు. ప్రస్తుతపరిస్థితిని ఒక్కముక్కలో వర్ణించాలంటే, సామాన్యమానవుని జీవితం ఆనాటికానాడు అతిదుస్తరంగానూ, దుర్భరంగానూ పరిణమించిందని చెప్పాలి. ప్రభుత్వం ఏదేవో మహోన్నతపథకాలను తయారుచేయడం, పర్యవసానంగా శూన్యఫలితాలు సంప్రాప్తించడం జరుగుతున్నదంటే, దీనికి అనేక కారణాలు వున్నవి. వీటిలో ముఖ్యమైనదీ, మొదటిదీ, నిర్ణీతమైన పథకంప్రకారం గాక అడ్డగోలవ్యవహారంగా అభివృద్ధి సాధించాలని పూనుకోవడమే.

## పథకసలహాసంఘం

1946, సెప్టెంబరు 2 వ తేదీన అధికారస్వీకారంచేసిన అనతికాలంలోనే, భారతప్రధాని నెహ్రూ 'అడ్వయిజరీ ప్లానింగ్ బోర్డు'ను ఒకదాన్ని స్థాపించాడు. ఈ "పథకసలహాసంఘం" ప్రభుత్వాదాయదృష్ట్యా దేశాభ్యుదయపథకాలకు ప్రాధాన్యక్రమాన్ని నిర్ణయిస్తూ, ఒక నివేదికను సమర్పించింది.

బ్రిటనులో ప్రభుత్వం ఏదైనా ఒక కమిటీని నియమించదలిస్తే, కార్యాచరణకు ఉపక్రమణికగామాత్రమే దాన్ని నియమిస్తుంది. ఇక్కడ మనదేశంలో కమిటీనియామకం కేవలం కార్యాచరణకు ప్రత్యామ్నాయంగా తయారవుతుంది. అందరూ అనుకున్నట్లుగానే, ఈ పథకసలహాసంఘనివేదికమీద గడ్డిపోచంత పనికూడా జరిగినపాపాన పోలేదు. ఇది ఇలా వుండగా గృహనిర్మాణపరికరాలసాధనకోసం, అందుకు కావలసిన ద్రవ్యసేకరణకోసం తీవ్రమైన పోటాపోటీ ప్రారంభమైంది. సిమెంటు ఎంత దొరుకుతుందీ, ఎంత దొరకదూ అనే విచక్షణైనా లేకుండా, ఇళ్లు, ఆఫీసుభవనాలు, ఆనకట్టలు, ఫ్యాక్టరీభవనాలు, వంతెనలు, జాతీయశాస్త్ర పరిశోధనాలయాలు, చిత్రవస్తుప్రదర్శనశాలలు, అవీ, ఇవీ ఏమిటీ అన్నిటి నిర్మాణానికి పెద్దపెద్ద స్కీములు వేశారు! వాటిని మంజూరుచేసుకున్నారు!! ఈధోరణిలో నాలుగుసంవత్సరాలపాటు అందరూ ఉరుకులు, పరుగులు పెట్టినతర్వాత, ప్రధాని నెహ్రూ, శరవేగంతో ప్లానులైతే తయారుచేస్తున్నాముగాని, వాటిని అమలుజరపడానికి ప్రభుత్వానికి తగినంత డబ్బు లేదనే విషయాన్ని హఠాత్తుగా ప్రభుత్వం కనిపెట్టినట్లు ప్రకటించాడు. ఈవిధంగా ప్రకటించడం మన దేశంలోగనుక సరిపోయిందిగాని, మరే ప్రజాస్వామ్యదేశంలోనైనా జరిగితే, అధికారంలో వున్న రాజకీయపక్షం రాజ్యపరిపాలనాధికారానికి తిలోదకాలు ఇవ్వవలసిన పరిస్థితి ఏర్పడేదే.

డబ్బు, దస్కం చూసుకోకుండా, ఏప్రభుత్వమైనా విపరీతంగా పథకాలు వేయడం చాలా గర్హించవలసినవిషయం. ఎంతెంతో ధనం వ్యయపరచి తయారుచేసిన ఈపథకాలన్నీ చివరకు ఎందుకూ కొరమాలిన చిత్తుకాగితాలకింద మారిపోయినవి!

## ప్రాజెక్టులకు డిజైన్లు

ఈ విషయాన్ని విశదంచేయడానికి ఒక్క దామోదర్‌లోయ ప్రాజెక్టునిర్మాణంలో జరిగిన రభస చాలు. చిన్న 'డాము'లకు 'డిజైన్లు' తయారుచేయించడానికి ప్రభుత్వం 10 కోట్ల రూపాయలు వ్యయపరిచింది. ఫ్రెంచినిపుణులు ఈ 'డిజైన్ల'ను పరిశీలించి, ఎందుకూ పనికిరానివిగా ఎంచి బుట్టదాఖలు చేయించారు. వీటిస్థానే కొత్త డిజైను తయారుచేయడానికి వీరు 4 కోట్ల రూపాయలు ఖర్చు పెట్టించారు. స్విట్జర్లెండునుంచి మరికొందరు నిపుణులు వచ్చి, ఈ కొత్తడిజైన్లు పనికిరావుపొమ్మన్నారు. 11 లక్షల రూపాయలు ఖర్చుపెడితే సరికొత్త 'డిజైన్లు' తయారుచేసిపెడతా మన్నారు. ఇది ఇలా వుండగా, అమెరికన్ నిపుణులను పిలిపించారు. స్విస్ నిపుణులు తయారుచేసిన పథకాలను తప్పకుండా వీరూ త్రోసి రాజంటారు.

ప్రజల ధనాన్ని బ్రిటిష్‌వారు ఈవిధంగా దుర్వ్యయం చేసి వున్నట్లయితే పార్లమెంటులో తప్పకుండా విరామతీర్మానాల పరంపరతో పోరాడేంత తర్జనభర్జన జరిగివుండేదే. ఈనాడు 14 లక్షల రూపాయలు వృథాఅయిపోయినవంటే మనవారికి ఒక లెక్కాపత్రంగా లేదు!

కొత్తగా అధికారంలోకి వచ్చినప్పుడు కాంగ్రెస్ మంత్రులు బాధ్యతారహితమైన ప్రసంగాలు చేయడం పరిపాటిఅయిపోయింది.

ఈ దుష్క్రియలవల్లా, దీర్ఘోపన్యాసాలవల్లా సాధారణ పౌరుడికి ఈషణ్మాత్రమైనా మేలు చేకూరలేదు సరికదా, ధనాఢ్యులను పెట్టుబడి పెట్టకుండా కూడా బహుజయప్రదంగా కాంగ్రెస్ మంత్రులు పాడలగొట్టగలిగారు. పెట్టుబడిదారులు కాంగ్రెస్ ప్రముఖులు చేసిన ఈ సవాలును ఎదుర్కొని, అతిస్వల్ప వ్యవధిలోనే ప్రభుత్వాన్ని లొంగదీశారంటే ఆశ్చర్యమేమీ లేదు!

ఇంతకూ పెట్టుబడిదారులు కొత్తపెట్టుబడులు పెట్టడానికి ఎందుకు జంకుతున్నారు? పెట్టుబడిదారులు తప్పు అంతా ప్రభుత్వానిదే అంటున్నారు. పరిశ్రమలను స్వాధీనపరుచుకునే విషయంలో ప్రభుత్వం అనుసరిస్తున్న అస్పష్టవిధానం, విపరీతమైన పన్నుల విధింపు ప్రస్తుతఅయోమయపరిస్థితికి కారణమనికూడా వీరు ఆరోపిస్తున్నారు. పెట్టుబడిఅభ్యాసమే లేని రైతువద్ద ధనం విస్తారంగా చేరి మూలుగుతున్నదనికూడా వీరి ఆరోపణలలో మరొకటి.

ఈ ఆరోపణలలో వున్న నిజానిజాలను జాగ్రత్తగా పరిశీలించడం అవసరం.

ప్రభుత్వానికి చెల్లించే భూమిశిస్తు నిలకడగా వున్నందువల్లా, వ్యవసాయఫలసాయాలధరలు బాగా పెరిగినందువల్లా, రైతులాభించినట్లు కనబడేమాట వాస్తవమే. ఐతే రైతు తనకు కావలసిన పరికరాలను పదార్థాలను విపరీతమైన ధరలకు కొనవలసివస్తున్నదనే విషయాన్ని ఎవరు కాదనగలరు? రైతుజీవితవ్యయం, ఉత్పత్తిధరలు బాగా పెరిగినవనే విషయాన్ని దృష్టిలో వుంచుకోవాలి. పెట్టుబడిపెట్టే అభ్యాసం రైతుకు లేదని విమర్శించినప్పుడు, డబ్బు నిల్వచేసే అభ్యాసంకూడా అతడికి లేదని గమనించాలి. రైతు ఏమాత్రం బాగుపడ్డదీ నేటి గ్రామీణఋణభారమే స్పష్టపరుస్తుంది. గ్రామసీమలలో ప్రజల ఋణభారం మాత్రం తగ్గలేదని ప్రస్తుతసంఖ్యావివరాలు తెలియజేస్తున్నవి. ఒక వైపు ఋణభారంతో కృంగి కృశించిపోయే రైతువద్ద అధికధరల ఫలితంగా ధనం నిలవుండి మూలుగుతున్న దనడం అసందర్భమైన వాదన.

### పెట్టుబడిదారుల ధోరణి

తాము పట్టిన కుందేటికి మూడేకాళ్లని వాదించే పెట్టుబడిదారులు రెండు విషయాలను విస్మరిస్తున్నారు. యుద్ధసమయంలో విపరీతలాభాలకు అలవాటుపడినవారు ఇప్పుడు యుద్ధాపూర్వ లాభాలతో సంతృప్తిచెందలేకపోతున్నారు. వీరి దురాశఫలితంగానే, దేశంలో విరివిగా దొంగవ్యాపారం సాగడం, విపరీతంగా ధరలు పెరగడం, సరుకునాణ్యత భ్రష్టమైపోవడం సంభవిస్తున్నది. సాధారణమైన లాభాలను ఆశించి కొత్తవ్యాపారంలో పెట్టుబడి పెట్టడానికి వీరు నిరాకరిస్తున్నారు.

కొత్తకంపెనీలు స్థాపించడంలో జరుగుతున్న అక్రమాలవల్లా కంపెనీ మేనేజిమెంటునిర్వహణంలో సాగుతున్న అవకతవకలవల్లా కూడా పెట్టుబడిదారుల ఉత్సాహం, విశ్వాసం చెదిరిపోయినవి. ఈ కారణాలన్నిటిచేతా, ధనాఢ్యులు తాము నిల్వచేసిన ధనాన్ని బయటికి తీసి పెట్టుబడి పెట్టడానికి అయిష్టత చూపుతున్నారు. ఏదైనా అవాంతరం సంభవించి, మన దేశం కమ్యూనిజంపాల బడితే అందుకు పూర్తిగా వాణిజ్యవర్గాలనే నిందించవలసివుంటుందిగాని ప్రభుత్వాన్ని ఏమీ అనడానికి అవకాశం వుండదు.

ఐతే ప్రభుత్వశ్రామికవ్యవహారాన్నిగురించికూడా ఒక విషయం చెప్పవలసివస్తుంది. ఎక్కడ ఏ కార్మికతగాదా ఏర్పడినా, కార్మికనాయకులను పిలిపించి వారి కోర్కెలేవో చెప్పవలసిందని మాత్రమే ప్రభుత్వం అడుగుతున్నది. ఇదేవిధంగా పెట్టుబడిదార్ల ముఠానాయకులనుకూడా పిలిపించి ప్రశ్నించడం, వారిచేత ఒప్పించడం జరగడంలేదు. ఎప్పటికప్పుడు ప్రభుత్వం పెట్టుబడిదార్లను సంతృప్తిపరుస్తూ, వారికే సమస్తసౌకర్యాలనూ కట్టబెట్టడం, అన్ని సౌకర్యాలనూ పొందుతూకూడా, ఆ పెట్టుబడిదార్లు ప్రభుత్వంతో సహకరించకపోవడం సంభవిస్తున్నది.

పరిశ్రమలను ప్రభుత్వం స్వాధీనపరుచుకోవడమంటే, దేశీయ పెట్టుబడిదారులు, భారతదేశంలో వున్న విదేశీయుల ఆస్తిపాస్తులను స్వాధీనంచేసుకోవడమనే అర్థంమాత్రమే చెబుతున్నారు. ఇంపీరియల్ బ్యాంకును జాతీయంచేయాలని ఒక వైపు కోరుతూ, ఈ పెట్టుబడిదారులు పౌరవిమానయానాన్ని జాతీయంచేయకూడదని మరొకవైపు తీవ్రంగా ప్రతిఘటిస్తున్నారు.

### పారిశ్రామికవిధానం

ఇవన్నీ ఇలా వుండగా భారతప్రభుత్వపారిశ్రామికవిధానం ఏవిధంగా సాగుతున్నదో పరిశీలిద్దాము. వ్యవసాయికపారిశ్రామికరంగాలలో దేశాన్ని స్వయంసమృద్ధం చేద్దామని భారతప్రభుత్వం లక్ష్యంగా పెట్టుకొన్నది.

పారిశ్రామికరంగానికి సంబంధించినంతవరకు ఈ లక్ష్యం సిద్ధించాలంటే, పరిశ్రమలకు తగిన రక్షణవిధానాన్ని ఏర్పాటు చేయడం ఒక మార్గం. పారిశ్రామికరక్షణవిధానంలోని ఉద్దేశ్యం, ఉత్పత్తిని పెంచడమే గాక, ఉత్పత్తివ్యయాన్ని తగ్గించడమూ, సరుకు నాణ్యత హెచ్చించడమూకూడా అయివుండాలి. విదేశాలనుంచి దిగుమతులను నిషేధించినంతమాత్రాన ఈ ఆశయం నెరవేరదు. వ్యాపారరంగంలో తగినంత పోటీ వున్నప్పుడే, సరుకునాణ్యత ఎక్కువ కావడానికీ, ఉత్పత్తివ్యయం తగ్గడానికీ అవకాశమూ, ఉత్సాహమూ ఏర్పడతవి. అనంతశయనంఅయ్యంగార్ లాటి కాంగ్రెస్ పెద్దలు, ఈ విషయాలు క్షుణ్ణంగా అవగాహనచేసుకోలేక పోతే, విమర్శించడం మానివేస్తే బాగుంటుంది. దేశంలోకి దిగు

మతులు రాకూడదని నిషేధించాలని సూచించేముందు, అనంతశయనంగారు ఇండియాలో తయారైన ఒక కుట్టుపనియంత్రాన్ని కొని వారి భార్యకు ఇచ్చి, దానిమీద ఆమెఅభిప్రాయ మేమిటో అడిగి తెలుసుకోవడం యుక్తం.

పరిశ్రమలకు ప్రభుత్వం రక్షణలు ప్రసాదించినఫలితంగా, దేశంలో ధనం బహుకొద్దిమందిచేతులలోనే కేంద్రీకృతమవుతున్న మాట నిజం. ఇప్పటికీ ఇదేధోరణి సాగిపోతున్నది. భారతదేశం క్రమక్రమంగా పారిశ్రామికాభివృద్ధిని పొందుతున్నకొద్దీ అనాడు కారల్ మార్క్సు ప్రవచనం అక్షరాలా నిజమవుతున్నట్లు కనబడుతున్నది.

దేశఆర్థికవ్యవస్థలో కొద్దిమంది కోటీశ్వరులు ఉపరిభాగాన్ని, కోటానుకోట్లుగా వున్న శ్రామికజీవులు అధోభాగాన్ని ఆక్రమించి వున్నారు.

భారతదేశపారిశ్రామికవిధానాన్ని వ్యక్తీకరిస్తూ, కేంద్రప్రభుత్వంవారు కొన్ని కీలకపరిశ్రమలను తామే నిర్వహించదలచినట్లు ప్రకటించడం జరిగింది. ఈవిధానాన్ని అనుసరించి కొన్ని పరిశ్రమలవిషయంలో నివేదికలు తయారుచేయడానికి విదేశనిపుణులను ఆహ్వానించారు. భారీవిద్యుద్యంత్రనిర్మాణం, ఉక్కుఉత్పత్తియంత్రాగారం, ఫాకోనిర్మాణకేంద్రం మొదలైన పరిశ్రమల స్థాపనవిషయంలో నివేదికలుకూడా ప్రభుత్వానికి అందినవి. మరికొన్ని నివేదికలు త్వరలోనే అందబోతున్నవి. వీటన్నిటిపైనా అనేకలక్షల ధనాన్ని వ్యయపరిచి నివేదికలు సేకరించినతర్వాత, ఈపరిశ్రమల స్థాపనకు కావలసిన ధనం తమవద్ద లేదని ప్రభుత్వం తెలుసుకొన్నది! ధనాభావం కేంద్రమంత్రుల అనేకఆశయాలకు తీరని ఆశాభంగం కలిగించింది!! "డబ్బు లెక్కేమిటి? ముష్టి డబ్బు—ఎంత కావాలంటే అంత నిమిషంలో పుట్టించలేమా?" అనే ధీమాతో ఈ మంత్రులు మొదట వ్యవహరించారు. మొదట దేన్ని అయితే తృణీకారభావంతో చూశారో, ఆ ధనమే ఇప్పుడు ఎదురుతిరిగింది. తలపెట్టిన ప్రతిపనికీ అడ్డుతగులుతూ ధనాభావం ఇప్పుడు కక్షసాధిస్తున్నది!

## అధ్వాన్నస్థితికి కారణ మేమిటి ?

స్వాతంత్ర్యం వచ్చిన ఈ స్వల్పకాలంలోనే దేశఆర్థికపరిస్థితి ఇంత అధ్వాన్నంగా పరిణమించడానికి కారణ మేమిటి? ఈ దుస్థితి ఏర్పడడానికి ప్రథమబాధ్యత కొంతవరకు భారతప్రజాబాహుళ్యానిదే నని చెప్పవచ్చు. ప్రజాబాహుళ్యంలో చాలామంది "ఇది మనదేశం. దీన్ని బాగుచేసి వృద్ధిలోకి తీసుకురావడంలో మనకు కూడా కొంత బాధ్యత వున్నది" అనే భావాన్ని నేటికీ పూర్తిగా అవగాహన చేసుకున్నట్లు కనబడదు. వ్యాపారస్థుడు సర్వకాలపర్యావస్థలలోనూ, తన లాభాలను గురించిమాత్రమే ఆలోచించడమూ, కార్మికుడు తన జీతపురాళ్ళనుగురించే ఆలోచించడమూతప్ప, మరొక ధ్యాసే లేదు. వీరిలో ఏఒక్కరికూడా దేశం ముందు బాగుపడాలి, దేశంతోపాటు తామూ బాగుపడాలి అనే ధోరణిన ఆలోచించినపాపాన పోవడం లేదు. అధికలాభాల కాంక్ష ఒక వాణిజ్యవర్గాలకుమాత్రమే పరిమితమై లేదు. భారత ప్రభుత్వఅధికారవర్గాలలోకూడా ఇది విచ్చలవిడిగా తయారైంది. నెలకు నాల్గువందల రూపాయల జీతం తీసుకోవలసినవారు ఈనాడు 16 వందలవరకూ, అంతకు ఎక్కువగానూ తీసుకుంటున్నారు. ఉన్నతోద్యోగుల ఈ విపరీతవేతనాలను సగానికి సగం తగ్గించి ఇచ్చినా, ప్రభుత్వాన్ని ఇంతకురెట్టింపు సామర్థ్యంతో నడపగలిగినవారు దొరుకుతారు.

నేటి ఆర్థికదుస్థితికి ప్రజలతోపాటు ప్రభుత్వంకూడా సమాన బాధ్యతను నెత్తిన వేసుకొనకతప్పదు. పద్దెనిమిదిమాసాలక్రితం ప్రధాని నెహ్రూ కాశ్మీర్ సమస్యనుగురించి మద్రాసులో ఉపన్యసిస్తూ, భారతదేశపరిస్థితి ప్రత్యక్షంగా ఏవిధమైన యుద్ధంలోనూ చిక్కుకొని లేకపోయినప్పటికీ, ఇంచుమించు యుద్ధం చేస్తున్నట్టుగానే వున్నదని వర్ణించాడు. కాశ్మీర్ వ్రణం దేశాన్ని ఇంకా తినివేస్తూనేవున్నది.

## పథకాలకై లక్షలవ్యయం

ప్రజలవద్ద పన్నులద్వారా వసూలుచేస్తున్న ధనాన్ని నిర్దాక్షిణ్యంగా విదేశాలలో వున్న మన రాయబారకార్యాలయాలకనీ, అధికాహారోత్పత్తికార్యక్రమాలకనీ, లేబర్ ఎక్స్ఛేంజీలకనీ, విదేశాలలో మన ప్రతినిధివర్గాల ప్రయాణాలకనీ, మూలవిద్యావిధానప్రచారానికనీ, నదీప్రాజెక్టుల అభివృద్ధిపథకాలకనీ, నేషనల్ మ్యూజియముకనీ వ్యయపరుస్తూనేవున్నారు. ధనవ్యయం విపరీతంగా అవుతున్న పద్దులలో ఇవి ఉదాహరణపూర్వకంగా చెబుతున్న కొన్నిమాత్రమే. ప్రతిమంత్రిధోరణిలోనూ ప్రజల డబ్బును ఏవిధంగా ఖర్చుచేద్దామా అనే తాపత్రయంమాత్రమే కనబడుతున్నది. ఈవిధంగా జరుగుతున్న దుర్వ్యయవిధానంలో భారతప్రభుత్వఆర్థికశాఖ స్వతంత్రప్రతిపత్తిని కోల్పోయి మిగతాశాఖలన్నిటికీ తాబేదారై జోహుకుములను శిరసావహించవలసిన దుస్థితి ఏర్పడింది. దీన్ని భరించలేక ఆర్థికమంత్రి డా॥ జాన్ మత్తయి, మిగతామంత్రుల దుర్వ్యయపారధోరణిని ఏవిధంగానైనా అరికట్టవలసిందని ఉపప్రధాని సర్దార్ పటేలును ప్రాధేయపడవలసివచ్చింది.

## మూడు ఉదాహరణలు

వివిధకేంద్రశాఖల దుబారావ్యవహారం ఎంతవరకు వెళ్లిందీ కొన్ని దృష్టాంతాలద్వారా తెలుసుకుందాము.

భారతీయేతరులు, భారతదేశంలో నివసించనివారు అయిన విదేశీవిద్యార్థులు మన దేశంలో విద్యాభ్యాసం చేయడానికి కేంద్ర

విద్యాశాఖస్కాలర్‌షిప్పులక్రింద సాలుకు మూడులక్షలరూపాయ
లను వ్యయపరుస్తున్నది. ప్రతివిదేశీవిద్యార్థికీ నెలకు రెండువందల
రూపాయల ఉచితవేతనాన్నీ, ఇతరసౌకర్యాలనూ ఏర్పాటుచేస్తు
న్నారు. మన దేశంలో ప్రతిభారతీయుడికీ విద్యాభిక్ష పెట్టగలిగా
మనేనా, ఈవిధంగా విదేశీయుల విద్యవిషయంలో ఇంత ఔదార్యం
చూపడం? ఆయాదేశాలవారు తమ దేశీయవిద్యార్థులకు స్థానం ఇవ్వ
డానికి కళాశాలలలో చేరి చదువుతున్న భారతీయవిద్యార్థులను బయ
టికి గెంటివేశారనే విషయాన్ని మనవారు విస్మరించినట్లున్నది.
పైగా, సాధారణభారతీయవిద్యార్థి భరించజాలనంతటి ఘరానా
ప్రతిపత్తిని ఈ దేశవిద్యార్థులకు ఇచ్చి పోషించడం!

ఇక పోతే, మన విదేశాంగశాఖవిషయం. వివిధదేశాలలో
వున్న మన రాయబారకార్యాలయాలమీద సాలుకు మూడుకోట్ల
రూపాయలకు పైగా ఖర్చవుతున్నది. ఇంత బ్రహ్మాండమైన వ్యయా
నికి ప్రతిఫల మేమిటీ అంటే, ఈనాడు విదేశాలలో భారతదేశానికి
'నా' అని చెప్పుకోదగిన మిత్రదేశం ఒకటీ లేకపోవడమే! ఈవిష
యంలో ఎవరేమన్నా గెలుపు పాకిస్థాన్‌దే నని ఒప్పుకోనితీరాలి.

మరో ఉదాహరణ నదీప్రాజెక్టుల నిర్మాణఉబలాటానికి
సంబంధించినది. ప్రపంచంమొత్తంమీద అతి ఐశ్వర్యవంతమైనదేశ
మని చెప్పుకొనే అమెరికా ఒక్క నదిమీద ప్రాజెక్టును నిర్మించ
డమా, మానడమా అనే సమస్యను నిర్ధారణచేసుకోడానికి దాదాపు
పదిహేనుసంవత్సరాలు బహుజాగ్రతగా ఆలోచించింది. భారత
దేశంమాత్రం స్వాతంత్ర్యాన్ని స్థాపించుకొన్న ఈస్వల్పవ్యవధిలో
మొత్తం 144 ప్రాజెక్టులను సంకల్పించి, వీటి పరిశీలనార్థం కోటి
రూపాయలవరకూ ఖర్చుపెట్టగలిగింది! ఇవన్నీ ఇలా వుండగా
పార్లమెంటరీవ్యవహారాల సక్రమనిర్వహణకోసం కేంద్రమంత్రి
వర్గంలో ప్రత్యేకశాఖ ఒకటి అవసరమని కొందరు వాదిస్తున్నారు.
"పత్తిగింజలు తింటావా బసవన్నా?" అంటే "ఓ! అలాగే" అని
తలలూపే సభ్యులు అసంఖ్యాకంగా వున్న భారతపార్లమెంటులో
ఏచిన్నబిల్లును శాసనంగా తయారుచేయడానికైనా పార్లమెంటుకు
రోజులతరబడి పడుతున్నది. సెలెక్టుకమిటీ ముందు క్లాజుక్లాజునూ
శ్రద్ధగా పరిశీలించినప్పటికీ శాసననిర్మాణంలో జాప్యం అనివార్య
మవుతున్నది. పార్లమెంటుకాంగ్రెస్‌పార్టీ చీఫ్‌విప్ సామర్థ్యం
అంత చక్కగా వున్నదన్నమాట!

భారతదేశం ప్రస్తుతం ఎదుర్కొంటున్న ఆర్థికదుస్థితికి పార్ల
మెంటుసభ్యులుకూడా ప్రభుత్వంతోపాటు సమానబాధ్యతలు భరిం
చక తప్పదు.

సామర్థ్యంతో కట్టుదిట్టంగా పనిచేసే ప్రతిపక్షం
లేనప్పుడు, ప్రభుత్వాన్ని సక్రమమైన మార్గాన నడిపే బాధ్యత
పార్లమెంటుసభ్యులమీద ఎంతైనా వున్నది. పార్లమెంటుసభ్యు
లలో అధికభాగం ఏసమస్యనూ అర్థంచేసుకోని, అర్థంచేసుకోడానికి
ప్రయత్నించనివారై వున్నారు. ఏవిషయాన్నీ ప్రతిఘటించకుండా
స్థాయిసంఘసభ్యత్వాలు, మంత్రివర్గంలో చేరే అవకాశాలు, విదేశా
లలో భారతప్రతినిధివర్గాలలో పర్యటనచేసే అవకాశాలు సభ్యుల
కళ్ల ఎదుట ఆశలుకొల్పుతుంటవి.

ఈ ఆశాపాశంలో చిక్కుకొని కీర. కాంగ్రెసేతరమంత్రు
లకు ఎప్పుడు ఉద్వాసన చెప్పి, వారి స్థానాలను ఆక్రమిద్దామా అని
అయినదానికీ, కానిదానికీ వారిపై దాడులకు ఉద్యమిస్తు
న్నారు.

## నిరుద్యోగప్రాబల్యం

భారతప్రభుత్వానికి నిర్దిష్టమైన పారిశ్రామికవిధానమైతే
వున్నదిగాని, దేశఆర్థికాభివృద్ధి చేకూరుతున్నదని చెప్పడానికి
మాత్రం తగినంత ఆధారమేమీ లేదు. ఆర్థికాభివృద్ధి లభ్యమవుతున్న
దని గ్రహించడానికి దేశంలో తగినంతమందికి ఉద్యోగం దొర
కడం ఒక్కటే ప్రధానమైన గుర్తు. ఇటీవల కొన్ని నెలలుగా
దేశంలో నిరుద్యోగుల సంఖ్య పెరిగిపోతున్నదికాని తగ్గడం
లేదు.

భారతప్రభుత్వానికి నిర్దిష్టమైన ఆర్థికవిధానంకూడా లేక
పోలేదు. కాని, దాని ఆచరణమాత్రమే లోపిస్తున్నది. ఏ పార్టీకి
చెందని ఆర్థికమంత్రి డా॥ జాన్‌మత్తయి ఏదైనా నిర్ణయాలను ఆదే
శిస్తే వాటిని ఇతరశాఖలు శిరసావహించడం లేదు. పైపెచ్చు, ఆర్థిక
మంత్రిపైన ఇతరశాఖలవారి ఫిర్యాదులే ఎక్కువవుతున్నవి.
భారతదేశం శక్తికి మించి వ్యయపరుస్తున్నదనీ, రక్షణ, కాందిశీక
పునరావాసవ్యయం, ఆహారధాన్యాల కొనుగోలుసమస్యలు దేశాన్ని
ఆర్థికంగా పీల్చిపిప్పిచేస్తున్నవనీ డా॥ మత్తయి అనేకసార్లు
హెచ్చరిక చేసేవున్నారు.

ఇండియాపాకిస్థాన్‌సంబంధాలలో సామరస్యం ఏర్పడి,
రక్షణవ్యయాన్ని తగ్గించుకోడానికి వీలయేవరకూ, కాందిశీకులం
దరికీ పునరావాససౌకర్యాలు చేకూరి దేశం ఆహారవిషయంలో
స్వయంసమృద్ధమయేవరకూ, నిత్యపరిపాలనానిర్వహణకయే ఖర్చును
బాగా తగ్గించివేయడం అవసరమని ఆర్థికమంత్రి నెత్తిన నోరు
పెట్టుకొని చెబుతున్నారు. అయితే ఆయనరోదనమంతా అరణ్యరోద
నంగా పరిణమించింది.

అపరిమితంగా ఆహారధాన్యాలు దిగుమతిచేసుకుంటున్న
కారణంగా విదేశాలతో మన దేశఎగుమతిదిగుమతుల వ్యాపారం
నుకసాన్‌వ్యాపారంగా పరిణమించింది. ఈ నష్టాన్ని, లోటును
భర్తీచేయవలసిన బాధ్యత అంతా ఆర్థికమంత్రిమీద పడింది. అందు
చేత దిగుమతులమొత్తాన్ని విరగకొయ్యవలసివచ్చింది. వ్యాపార
సుంకాల పన్నును తగ్గిస్తే ప్రభుత్వానికి ఆదాయం తగ్గిపోయి
బడ్జెట్‌ను సరిపెట్టడం కష్టమవుతుంది. అందుచేత రక్షణ,
కాందిశీకపునరావాస, ఆహారశాఖల వ్యయాన్ని తగ్గించినంతవరకూ

ప్రభుత్వఆదాయవ్యయాలను సరిపెట్టుకోవలెనంటే, ఇతరశాఖల ఖర్చులు తగ్గించుకోక తప్పదన్నమాట.

ఐతే, ఈ తప్పిదాలను సమకూర్చడమే ప్రభుత్వానికి సాధ్యపడటం లేదు. ఇంతేకాకుండా కేంద్రప్రభుత్వం పెద్దపెద్ద మొత్తాలను రాష్ట్రప్రభుత్వాలకు సంబంధించిన ఆర్థికవ్యవహారాలక్రిందకూడా ఖర్చుపెట్టడం జరుగుతున్నది. వీటన్నిటి ఫలితంగా కేంద్రప్రభుత్వ నిర్దిష్టకార్యక్రమాలను తీవ్రధనాభావం ఎదుర్కొంటున్నది.

### శ్రామికవర్గసహకారావశ్యకత

దేశం ఆర్థికంగా కోలుకోవాలంటే పారిశ్రామికాభివృద్ధే శరణ్యం. పారిశ్రామికాభివృద్ధి యజమానులూ, శ్రామికులూ హృదయపూర్వకసహకారంమీద ఆధారపడివుంటుంది. శ్రామికవర్గాలూ, యజమానులూకూడా ప్రభుత్వంపై ఎవరి కోర్కెలకోసం వారు తీవ్రమైన వత్తిడిని కలిగిస్తున్నారు. యజమానులు పన్నులభారం తగ్గిస్తేగాని ప్రభుత్వంతో సహకరించడం సంభవం గాదని వదరుపెడుతున్నారు. శ్రామికులు పనిచేయవలసిన బాధ్యత లేకుండా తమ జీతాలు తమకు ముట్టజెప్పాలంటారు. శ్రామికులచేత యజమానులు స్వార్థచింతతో వెట్టిచాకిరీ చేయించుకోకుండా నివారించే కట్టుదిట్టాలను, కార్యక్రమాలను ఎవరూ అడ్డుపడకూడదు; అడ్డుపడే హక్కు ఎవరికీ లేదు. ఐతే శ్రామికులు దేశక్షేమంమాట అలా వుంచినప్పటికీ, స్వీయక్షేమాన్ని కాంక్షించిఅయినా, అధికోత్పత్తికి సహాయపడాలి. అధికోత్పత్తి సాధించినప్పుడే, అందులో తమ వాటా అడగడానికి వారికి హక్కువుంటుంది. శ్రామికవర్గాల అభ్యున్నతికోసం ప్రభుత్వకార్యకలాపాలు ఆశాజనకంగానే వున్నప్పటికీ, వాటిని సాధించి సఫలీకృతంచేయడంలో అనేక అవరోధాలను ఎదుర్కొనవలసివస్తున్నది.

ఉత్పత్తి అధికంచేయవలసిందనీ, డబ్బునిలవచేసుకోవలసిందనీ నాయకులు పదేపదే ప్రబోధం చేస్తున్నారు. ఈ ప్రబోధాన్ని చూసి సామాన్యపౌరుడు ఆశ్చర్యచకితుడవుతున్నాడు. తాను డబ్బు ఎందుకు నిలవచేసుకోవాలి? ఎవరి లాభంకోసం తాను అధికోత్పత్తికి సహాయపడాలి? అని ప్రశ్నిస్తున్నాడు. దేశాన్ని విపరీతదుర్వ్యయానికి పాల్పడజేసిన కేంద్రరాష్ట్రమంత్రుల వాంఛలు తీర్చ సహాయపడే నిమిత్తమై డబ్బు నిలవజేయడానికి అతడు ఇష్టపడటం లేదు. కాంగ్రెసువ్యాపారస్థుల జేబులు నింపేనిమిత్తమై అధికోత్పత్తికి సహాయపడడానికి కూడా సుముఖుడుగా లేడు.

దేశాన్ని సక్రమమైన ఆర్థికాభ్యుదయపథంలో నడిపించవలసిన తహతహ ప్రభుత్వానికి ఏమాత్రం వున్నా, ముందు ప్రభుత్వం తన ఇంటిని తాను సవ్యమైనదారిలో పెట్టుకొని, పనిచేయడానికి పూనుకోవాలి. దుబారాఖర్చు లేవీ చేయడం లేదని ప్రభుత్వం సామాన్యపౌరుడికి నచ్చచెప్పడం అవసరం. దేశపరిపాలనను సామర్థ్యంతోనూ సాదుభుతోనూ నడుపుతున్నామనే విశ్వాసాన్ని ప్రజలలో కలిగించాలి. ప్రభుత్వంచుట్టూ అసంఖ్యాకంగా చేరి దేశాన్ని పీల్చిపిప్పిచేస్తున్న చీడపురుగులకు నిర్దాక్షిణ్యంగా స్వస్తిచెప్పాలి. అప్పుడే దేశానికి మోక్షం.

ప్రస్తుతం కేంద్రప్రభుత్వానికీ, రాష్ట్రప్రభుత్వాలకూ మధ్యేగాక, కేంద్రప్రభుత్వంలోని వివిధశాఖల మధ్యకూడా పరస్పర సహకారభావం వ్యగ్రమైపోయింది.

ఈ సహకారభావాన్ని సాధించాలంటే, మహత్తరమైన కృషి అవసరం. ఈ క్లిష్టపరిస్థితినుంచి బయటపడవలెనంటే, భారత ప్రధానామాత్యుడు పండిట్ నెహ్రూ ఏ ప్రత్యేకశాఖపైనా ఆధ్యక్ష్యం వహించక, సహకారసాధనకే తన సర్వశక్తిసామర్థ్యాలనూ వినియోగించి పనిచేయాలి. ఐతే ఆయన ఇందుకు పూనుకుంటాడా? పూనుకుంటాడని ఆశించడానికి సూచన లేమాత్రం కనపించవు.



# శ్రేయోరాజ్యము-మనరాజ్యాంగశాసనము

## (Welfare State and our Constitution)

★

శ్రీ వేమల జగన్నాథం

౧౯౪౭ ఆగస్టు ౧౫ వ తేదీ మన చరిత్రలో ఎంత ప్రధానమో, ౧౯౫౦ జనవరి ౨౬ వ తేదీకూడ ఇంచుమించు అంత ప్రధానమైనదే. మొదటి తేదీని రాజకీయస్వాతంత్ర్య సముపార్జనోత్సవము జరిపితిమి. రెండవ తేదీని స్వాతంత్ర్యరాజ్యరథమును ఉత్తమమార్గమున నడిపించగల రాజ్యాంగశాసనము నమలులోనికి తీసికొనివచ్చితిమి. స్వాతంత్ర్య సమరము కష్టభూయిష్ఠమైన కార్యము. కాని, స్వాతంత్ర్యసంరక్షణ మును, దానిని ప్రజల శ్రేయస్సునకు వినియోగించునట్లు చేయుటయు దానికంటె కఠినతరబాధ్యతతో నిండిన మహత్కార్యము. మన రాజ్యాంగశాసనములోని పరిపాలనాసౌధమునుగూర్చియు, దాని నిర్మాణనైపుణ్యమునుగూర్చియు, విన్యాసవిశేషములనుగూర్చియు పెక్కుండ్రు పెక్కు వ్యాసములు రచించియున్నారు. కాని ఒక సందేహము చాలమందిమనస్సు నావేశించియున్నది. అది ఏమనగా ఈ రాజ్యాంగశాసనముద్వారా మన రాజ్యమును అభ్యుదయదేశము లనుసరించు శ్రేయోరాజ్యముగా మార్చుట కెట్టి అవకాశము లున్నవి? ఈవిషయము విపులముగా పరిశీలించుటకు పూర్వము శ్రేయో రాజ్యముయొక్క ముఖ్యలక్షణలక్ష్యములను పరిశీలించుట అవసరము.

పందొమ్మిదవ శతాబ్దముయొక్క పూర్వార్ధభాగములో పాశ్చాత్యరాజ్యశాస్త్రవేత్తలు రాజ్యకార్యకలాపములనుగూర్చి విశేషముగా చర్చించి ఈ నిర్ణయమునకు వచ్చిరి: "రాజ్యము కేవలరక్షక కార్యములమాత్రమే నిర్వహించుచు ఇతరవిషయములలో వ్యక్తి స్వాతంత్ర్యమును పరిపూర్ణముగ గుర్తించవలెను." దీనికే తటస్థసిద్ధాంత (*Laissezfaire theory*) మనియు, ఈ సిద్ధాంత మనుసరించు రాజ్యములకు కేవలరక్షకరాజ్యము (*Police Stats*) లనియు వ్యవహారము కలదు.

పందొమ్మిదవ శతాబ్దములో ఉత్తరార్ధభాగమువరకు సాంఘిక సంబంధములలోను, వ్యవహారములలోను రాజ్యము రక్షణకార్య నిర్వహణమునకు ఇతరవిషయములలో తటస్థముగ నుండవలె నను సిద్ధాంతము ఇంగ్లాండు మున్నగు అభ్యుదయరాజ్యములందుసైతము అమలులో నుండెను. కాని ఈ సిద్ధాంతము ననుసరించుటవలన ఆపదలు చాల సంభవించెను. దేశములో దరిద్రము, అనారోగ్యము, నిరక్షరాస్యత, అసంతుష్టి హెచ్చి దేశసౌభాగ్యమునకు ముప్పు వాటిల్లు పరిస్థితులు ఏర్పడెను. కలిమిగలవారే కొద్దిమందియో ఈ తటస్థవిధానమువలన బాగుపడిరిగాని ప్రజాబాహుళ్యము నిస్తేజులై జీవితసమరములో తమ యావచ్ఛక్తిని వెచ్చించి నిర్ధనులై దుఃఖావృతమైన జీవితమునకు పాలయిరి. ఈ విపత్కరపరిస్థితులకు రాజ్యముయొక్క మాకీభావము, తటస్థవిధానమును కారణములని రాజకీయశాస్త్రవేత్తలు నిశితవిమర్శలు చేయసాగిరి. పూర్వపు రాజ్యకార్యకలాపవాదములు పునరాలోచన చేయబూనుకొనిరి. ఈ పునరాలోచనాఫలితముగ కేవలరక్షకరాజ్యభావము పోయి శ్రేయో రాజ్యభావము (*Welfare State*) వృద్ధిపొందెను.

శ్రేయోరాజ్యములో రాజ్యము తన తటస్థభావమును వీడి కార్యోన్ముఖమగును. ప్రజానీకముయొక్క సౌభాగ్యాభివృద్ధికై ఆటంకములు తొలగించుట, ప్రత్యేకసదుపాయములు అవసరమైన అవకాశములు కల్పించుట మున్నగుబాధ్యతలు రాజ్యము వహించును. శత్రువులనుండి దేశమును రక్షించుటమాత్రమేగాక, అంతకంటెను ప్రబల శత్రువులగు దారిద్ర్యము, రోగము, నిరక్షరాస్యత, నిరుద్యోగము మున్నగువాటినుండికూడ సామాన్యపౌరగణమును రక్షించెదనని రాజ్యము హామీ యిచ్చును. పారిశ్రామికముగా అభివృద్ధిపొందిన ఆధునిక నాగరకదేశములలో పైన ఉదహరించిన సంఘశత్రువులను రూపుమాపినగాని వ్యక్తిజీవితము సౌఖ్యదాయకము గాజాలదనియు, సాంఘికజీవితము భద్రము గాజాలదనియు నేటి జనసమ్మతసత్యము. ఈ కారణమువల్లనే అభ్యుదయరాజ్యము లన్నిటియందును "సాంఘిక భద్రతాశాసనములు" (*Social security Legislation*) సంహితలై వెలయుచున్నవి. ఈశాసనములయొక్క ముఖ్యలక్షణ మేమనిన, "పుట్టినదిమొదలు గిట్టువరకును పౌరుని శ్రేయస్సు వృద్ధిచేయు బాధ్యత రాజ్యము వహించుట." ఉదాహరణకు కొన్ని శాసనములను

మాత్రమే పేర్కొనెదను:- (౧) శిశువు గర్భస్థమైనదిమొదలు జన్మించి ఒకటిరెండు సంవత్సరముల ప్రాయము వచ్చువరకు చూచు బాధ్యతలు *Maternity and child welfare* శాసనముల క్రిందికి వచ్చును. (౨) మూడవ సంవత్సరము మొదలు ఏడవ సంవత్సరము వరకు నర్సరీవిద్యావిధానము (*Nursery Education*), క్రీడావిద్యావిధానము (*Kindergarten System of Education*) ద్వారా విద్యగరపు శాసనముక్రిందికి వచ్చును. (౩) ఏడవ సంవత్సరము మొదలు పదునైదు, లేక పదునారవ సంవత్సరప్రాయము వచ్చువరకు ప్రతిబాలునకును ఉచితనిర్బంధవిద్యావిధానముద్వారా విద్యనందునట్లుగా చేయబడవలెను. (౪) అవిమ్మట ఉద్యోగస్వత్వము (*Recognition of right to work*) గుర్తింపబడవలెను. వ్యక్తి దోషముల్లగాక సాంఘికదోషములవలన నిరుద్యోగులైన పౌరులకు నిరుద్యోగవేతన (*Unemployment relief*) మొసంగబడవలెను. దైహిక, మానసిక దౌర్బల్యకారణమువలన ఉద్యోగార్హత లేని పౌరులకు ప్రత్యేకరక్షణాలయములలో నుంచి వారి జీవితములు వ్యర్థము గాకుండ, బిచ్చగాండ్రవలె విడిచిపెట్టబడి సంఘజీవితము అసహ్యము చేయకుండ చూచు బాధ్యత రాజ్యము వహించును. (౫) ఉద్యోగమునుండి విరమించినపిమ్మట కుటుంబమునకు భారమైయుండకుండునట్లు వృద్ధులకు వార్ధక వేతన మొసంగి మరణాంతమును వారు సుఖించునట్లు చూచు బాధ్యత రాజ్యము వహించును. మరణానంతరము సైతము బీదవారి అంత్యక్రియలకు రాజ్యము ధనసహాయ మొసంగును. మరియు, గర్భస్థమైనది మొదలు మరణాంతమును అనారోగ్యపరిస్థితు లేర్పడినగాని, దానివలన ఉద్యోగభృతి గోలుపోయిన పరిస్థితులు తటస్థించినగాని ప్రత్యేక సదుపాయములును, రక్షణయు నొసంగి పౌరులు శాంతిభద్రతలతో, సుఖస్థితిలో జీవితము గడుపునట్లు చూచు బాధ్యత ప్రభుత్వముపైనున్నది. మరియు ప్రజలు ఆరోగ్యవంతులుగా నుండునట్లు చేయుటకు మంచినీటిసదుపాయములు, వైద్యసహాయము, పార్కులు, క్రీడాస్థలములు, వాసయోగ్యమగు పరిసరప్రాంతములు గల పల్లెలను పట్టణములను పెంపొందించుటయు రాజ్యముయొక్క బాధ్యత. సారాంశ మేమన, ప్రతిపౌరునికిని అశన, వసన, నివాసయోగ్యమగు పరిస్థితులు కల్పించుట రాజ్యములో ప్రభుత్వముయొక్క ప్రప్రథమ బాధ్యత.

ఇటువంటి బాధ్యతను గుర్తించు శ్రేయోరాజ్యముగా మనదేశమును తయారుచేయుటకు మన రాజ్యాంగశాసనమందెట్టి అవకాశము లున్నవి? ఏమైన అవరోధము లున్నవా? అవరోధము లున్నచో వాటిని తొలగించి అవకాశములు సద్వినియోగముచేయుట ఎంతవరకు సాధ్యపడును? అను విషయములు చర్చించుట అవసరము. ఈసందర్భములో మన రాజ్యాంగశాసననిర్మాతల ఉద్దేశములు, శాసనములోని ఉపోద్ఘాతభాగము, మూడు, నాలుగు, పదునొకండవ భాగములలోని నిబంధనలు, సప్తమఅనుబంధము (*7th Schedule*) లోని అధికారవిషయవిభజనరీతిని క్షుణ్ణముగా పరిశీలించుట అవసరము.

మన రాజ్యాంగనిర్మాతల ఉద్దేశ్యములు, ఊహలు ఉన్నతతారాపథమువైపు చూస్తూవున్నాయంటే అతిశయోక్తి కాదు. వారి ఆశీస్సులు, ఆశయాలు, అభిలాషలుకూడ ఈ రాజ్యాంగాన్ని శ్రేయోరాజ్యము చేయుదమనియేనని నిరాఘాటముగ చెప్పవచ్చును. ఉదాహరణకు, మన తొలి అధ్యక్షులైన రాజేంద్రప్రసాదుగారు "మన స్వాతంత్ర్యఫలాలను జనసామాన్యానికి అందచేయాలి" అని నొక్కినొక్కి వక్కాణించినారు. మన రాజ్యాంగశాసన రచనా సంఘాధ్యక్షులగు శ్రీ అంబేద్కరుగారు "౧౯౫౦ జనవరి ౨౬వ నాటికి రాజకీయరంగంలో మనకు సమానత్వం సిద్ధిస్తుంది. కాని ఆర్థిక, సాంఘికరంగాలలో మాత్రం ఇంకా అసమానత్వం ఉంటుంది. సాధ్యమైనంత త్వరలో ఈవైరుధ్యాన్ని మనం పరిహరించాలి" అన్నారు. అదేసందర్భంలో వారింకా ఇలా కూడా అన్నారు: "ఆర్థిక, సాంఘికరంగాలలోకూడా మనం త్వరితంగా సమానత్వం నెలకొల్పవలసియున్నది. లేనిచో రాజకీయంగా మనం ప్రతిష్ఠించిన ప్రజాస్వామ్యానికి ప్రమాదం ఏర్పడుతుంది."

ఆర్థిక, సాంఘికసమానత్వం అనే పదాలను కొంచెం వివరించి వాటికి అర్థంచెప్పుట అవసరము. ముఖ్యంగా ఆర్థికసమానత్వంఅంటే అందరికి ఒకేతరహా ఆదాయము లుండవలెననిగాని, సమానమట్టపు సంపద లుండవలెననిగాని అర్థము కాదని గుర్తింపవలెను. కోటాను కోట్ల కుచేలుర నడుమ విరగబడి తిరుగుచు ఈ కుచేలురను తమ వశవర్తులను చేసికొని వారిని తమ సుఖభోగములకొరకు వినియోగించు కొందరే కుబేరులు వర్ధిల్లు నేటి విధానములోని నిశితనిబిడఅసమత్వ వైషమ్యములు తొలగింపవలెనను ఉద్యమములో ఆర్థికసమత్వసిద్ధాంతము పుట్టి పెరిగెను. నేటి అసమతల గాఢతీవ్రతను తొలగించి నిష్పాక్షికముగ ప్రతివ్యక్తియు చేయు ఉద్యోగఅర్హత ననుసరించి వేతన మొసగుట, ఆ ఉద్యోగమువలన సమకూరు వేతనములు సైతము హిమగిరిశిఖరములవలె పెరుగకుండ చూచుచు, వారసత్వశాసన సంపుటియును, పన్నులవిధానమును మార్చి ధనికులకు దరిద్రులకు మధ్యనుండు అంతరాయము స్వల్పాతిస్వల్పము చేయుటయే ఆర్థికసమత్వసిద్ధాంతముయొక్క ముఖ్యాశయము. సాంఘికసమత్వమునకు కూడ ఇటువంటి అర్థమే చెప్పవలెను. ప్రకృతిసిద్ధమగు బుద్ధ్యాదివిషయము లందు అసమతలను తొలగించుటకు ఎవరికిని శక్యము గాదు. గాని, సాంఘికసంస్థల నిర్మాణములోని లోపమువలన పెరిగిన జాతి, మత, వర్ణవిభేదములవలన తరతరములనుండి కరుడుగట్టిన అన్యాయమగు అసమతలను తొలగించుటయే సాంఘికసమత్వవాదముయొక్క ఉద్దేశము. రాజ్యాంగశాసనములోని అస్పృశ్యతా నివారణానిబంధన యీ ఉద్దేశ్యఫలమున కుదాహరణముగ చెప్పవచ్చును.

ఇక రాజ్యాంగశాసనములోని ఉపోద్ఘాతభాగమును పరిశీలింతము. దానిలో నిట్లు రచింపబడెను: "స్వతంత్రభారతప్రజలకు సామాజిక, ఆర్థిక, రాజనైతికమను న్యాయము,......సమానప్రతిపత్తియు, సమానావకాశములును కలిగించుటకు......తీర్మానించి ఈశాసనము నంగీకరించితిమి" అనగా నిఖిలార్థసాధకమగు జీవనము ప్రతిమానవునికిని అందుబాటులో నుండునట్లు చేయుట శాసన ముద్దేశింపబడినది.

ఉపోద్ఘాతములో నుద్ఘాటింపబడిన ఈ యుద్దేశ్యము లెంతవరకు సుసాధ్యమైనా గ్రహించుటకు పౌరుల ప్రధానస్వత్వములను (*Fundamental rights*) వర్ణించు మూడవ భాగమును, రాజ్యనీతి నిర్దేశకసిద్ధాంతములను (*Directive principles of state policy*) పేర్కొను నాల్గవభాగమును, అధికారవిషయవిభజన గావించు పదునొకండవభాగమును విపులముగ పరిశీలింపవలెను.

ప్రధానస్వత్వముల అధ్యాయములోని (రాజ్యాంగశాసనములో మూడవభాగము) వివిధ నిబంధనలు పరిశీలించినచో నవి న్యాయస్థానములలో సమత్వమును, సాంఘికసమత్వమును, వ్యక్తిస్వాతంత్ర్యమును గుర్తించునని విశదమగును. పైన వివరించినట్టి ఆర్థికసమత్వమును గుర్తింపలేదని కొందరి తీవ్రవిమర్శ. ఈసందర్భములో మనము గమనింపదగిన విషయ మేమనగా, ఈ అధ్యాయములో గుర్తించిన ప్రధానస్వత్వములుగూడ శ్రేయోరాజ్యమునం దత్యావశ్యకము. వ్యక్తిస్వాతంత్ర్యమును, సాంఘికసమత్వమును ప్రజాస్వామ్యప్రభుత్వమునకు సుస్థిరపునాదులవంటివి. ఆర్థికసమానత్వము వాటిపై నిర్మింపవలసిన సౌధమువంటిది. కనుక ఈ అధ్యాయములోని స్వత్వములు ప్రధానము గావని తీసివేయలేము.

మరియొక విషయ మేమనగా, అభ్యుదయరాజ్యములని పరిగణింపబడు కొన్ని దేశములలోని రాజ్యాంగశాసనములలో ప్రధానస్వత్వములని పరిగణింపబడు కొన్ని విషయము లితరశాసనముల ద్వారా మనదేశములోగూడ నమలులో నున్నవి. ఉదాహరణకు, దినమున కెనిమిదిగంటలు మాత్రమే కార్మికులు పనిచేయవలెనను నియమము, కనిష్ఠభృతి (*Minimum wage*), అనారోగ్యభీమా (*Sickness Insurance*), మాతాశిశుశ్రేయోదాయకశాసనము (*Maternity and Child Welfare Legislation*) మున్నగునవి యన్నియు ప్రత్యేకశాసనములద్వారా మనదేశములో నమలునం దున్నవి. వీటిని ప్రధానస్వత్వాధ్యాయములో పేర్కొనకపోవుటకు కారణము వాటిని తీసివేయు నుద్దేశముగాని, వాటిలో కొంత చేయు నుద్దేశముగాని గాదు. వాటినిగురించి ఇతరఅధ్యాయములలో పేర్కొనబడెను. మరియు, మనము ఆర్థికముగా ఇతరదేశములకంటె చాల వెనుకబడియున్నాము. పారిశ్రామికముగా బడుగులమై యున్నాము. ఇతరదేశములవారు శ్రామికతరగతికి కల్పించిన అన్ని సౌఖ్యములు, సదుపాయములు, స్వత్వములు మనము కల్పింపలేని దుస్థితిలో నున్నమాట వాస్తవము. ఈ నగ్నసత్యమును విస్మరించి ఇతరదేశములవారొసగిన ఆర్థికసమత్వమునకు సంబంధించిన ప్రధానస్వత్వములు గుర్తించలేదంటే 'అన్నప్రాశననాడే ఆవకాయఅన్నము పెట్టరే లెందుచేత' అని అడిగినట్లుండును. అది పెద్దలకు రుచికరముగదా యని పిల్లలకు పెట్టినచో ఫలితము లేట తెల్లము. అభ్యుదయదేశములు నేడనుభవించు సుస్థితికి మనము శాంతియుతముగా ప్రయత్నించినచో సుస్థిరముగా చేరుట కీ రాజ్యాంగశాసనము పూర్తిగా సహాయపడు ననుటకు సందేహములేదు.

నాలుగవ అధ్యాయములో రాజ్యనీతినిర్దేశకసిద్ధాంతములు (*Directive principles of state policy*) కొన్ని పేర్కొనబడినవి. ఈఅధ్యాయము అమెరికా, కెనడా, ఆస్ట్రేలియా మొదలగు దేశముల రాజ్యాంగశాసనములలో కాన్పించదు. ఈ అధ్యాయము రచించుటలో మన రచయితలు ముఖ్యముగా ఐర్లండుదేశపు రాజ్యశాసనమును అనుసరించిరి కాని అక్కడక్కడ విలక్షణములు లేకపోలేదు. ఈ అధ్యాయములో ఆర్థికసమతకు సంబంధించిన విషయములుమాత్రము పరిశీలించెదము.

౩౯ వ నిబంధన (*Article*) ప్రకారము స్త్రీపురుషు లెల్లరు క్రమజీవనోపాధికి అనువైన హక్కు కలిగియుండవలెను. జాతీయసంపత్తిని (అనగా దానిపై స్వామ్యమును, అధికారమును) లోకకల్యాణమును దృష్టిలో నుంచికొని పంచిపెట్టవలెను; ఆస్తిపాస్తులు లేకగాని కోటానకోట్ల కుచేలురవస్థ ఏకొద్దిమందియో కుబేరులుగ తయారయి జాతీయసంపద ఆ రెండవతరగతివారి స్వలాభములకు వినియోగింపబడకుండ జనసామాన్యముయొక్క శ్రేయోభివృద్ధికి వినియోగింపబడునట్లు చూడవలెను. ఒకే ఉద్యోగముగాని పనిగాని చేయు స్త్రీపురుషులు సమానవేతనమున కర్హులు. అనగా, ఇప్పు డున్న స్త్రీలయెడ న్యూనతాభావము పోవలెనని శాసనకర్తల ఉద్దేశ్యము. యుక్తవయస్సు రాని బాలబాలికలను, పౌరులను వారి వయస్సునకు మీరిన పనులలోగాని, వారి శక్తికి మించిన శ్రమలోగాని ప్రవేశపెట్టరాదు. బాలబాలికలను విద్యాభ్యాసంగమునుండి మళ్లించి వారి ఆరోగ్యసౌభాగ్యములను నాశనము చేయరాదు. ఆకలిమంటచేత అంగీకరించినను, పేదకూలీలకు అత్యధికశ్రమ గల కార్యముల నిచ్చి అల్పమగు వేతనము లొసగి వారి ద్రవ్యము వితరులు తమ సౌఖ్యముకొరకు వినియోగించుకొనరాదు. పేదలను, బాలబాలికలను అవినీతికార్యముల కుపయోగింపరాదు.

సోవియట్ రష్యా మున్నగు రాజ్యము లొసగిన ప్రధానస్వత్వములకు సంబంధించిన సూత్రములు ౪౧ మొదలు ౪౭ వరకు ఉన్న నిబంధనలలో నంగీకరింపబడెను. మన ఆర్థికస్తోమతలో వీలయినంత వరకు ప్రతిమానవునకు ఉద్యోగస్వత్వమును, అది సాధ్యము కానపక్షమున నిరుద్యోగ వేతనసహాయమును, వార్ధక వేతనమును, అనారోగ్య, అసహాయపరిస్థితులలో వేతనసహాయమును కల్పించు బాధ్యత రాజ్యము వహింపవలెను. కర్షక, కార్మికాదిశ్రామికుల కెల్లరకు పౌర

జీవితమున కనువగు పనుపాయము లోపగు కనిష్ఠభృతియు, విశ్రాంతి సమయములందు మనోవికాసమున కనువగునట్లు కాలము వినియోగించుటకు వలయు వైజ్ఞానికపనుపాయములను రాజ్యము కల్పింపవలెను. పదునాల్గు సంవత్సరములలోపు ప్రాయముగల ప్రతిబాలునకు నిర్బంధోచితవిద్యను నేటినుండి ఒక దశాబ్దములో నొసంగుటకు వీలగు పరిస్థితులను రాజ్యము సృష్టింపవలెను. ఆర్థికముగా వెనుకబడియున్న నిమ్నజాత్యుద్ధరణకొరకు అవసరమగు వైజ్ఞానిక, ధనసహాయము చేసి ఇతరతరములనుండి అస్పృశ్యులకు, అటవికులకు జరుగుచున్న అన్యాయము తొలగించుటకు రాజ్యము పూనుకొనవలెను. ప్రజలు బలకరమును, ఆరోగ్యదాయకమును అగు ఆహారము సేవించి పుష్టియు, తుష్టియు కలిగియుండునట్లు ప్రభుత్వము చూడవలెను.

ఇటువంటి గురుతరబాధ్యతలను, శ్రేయస్కరకార్యములను ఉద్దేశించిన మన రాజ్యాంగశాసనము మన రాజ్యాంగమును శ్రేయోరాజ్యముగ మార్చుట కద్యంతర మేమియు నుండదని పలువుర మతము. కాని ఈవిషయములో చాలమందికి సందేహము కలదు. కారణ మేమనగా, ఈ నాల్గవ అధ్యాయములో వివరింపబడిన నిబంధనలు తమ లక్ష్యములను వర్ణించు సిద్ధాంతములుమాత్రమేగాని తక్షణ మాచరింపవలసిన నిర్బంధప్రణాళికమాత్రము గాదు. అందుచే ప్రభుత్వ ముపేక్షాభావము వహించుచేమో యని విమర్శకుల భయము. ప్రభుత్వ మీ సిద్ధాంతముల నుల్లంఘించినను, లేక ఉదాసీనభావము వహించినను మనము చేయగల దేమియు లేదు. మూడవ అధ్యాయములోని ప్రధానస్వత్వముల నుల్లంఘించిన ప్రభుత్వాధికారులను కోర్టునకు రప్పించి, వా రట్లు చేయుటకు కారణములను చెప్పుమని నిర్బంధించి, వారి కారణములు అసమంజసమని కోర్టువారికి తోచినచో పౌరుల స్వత్వములను రక్షించి అధికారులను మందలించి శిక్షింపవచ్చును. నాల్గవ అధ్యాయములోని సిద్ధాంతముల విషయములో నట్టి చర్యకు తావు లేదు. అందుచే, నీ అధ్యాయములోని సిద్ధాంతములు గగనకుసుమము లగునేమో అని కొందరి సందేహము. చందమామను చేతికిమ్మని కోరె పసిపాపను ఊరడించుటకై అద్దములో చందమామను చూపి తీసికొమనును తల్లి వలె శాసనకర్త లీఅధ్యాయములోని సిద్ధాంతము లుద్దేశించిరని కొందరతివాదుల తీవ్రవిమర్శ. ఈ విమర్శన సత్యమగునో కాదో జోస్యమును చెప్పుట యుక్తము గాదు. ఇది కాలచక్రములో దినదినావిష్కరణము గావలసిన విషయములు. భయసందేహములకు అవకాశ మున్న మాట తథ్యము. కాని భవిష్యత్ ప్రభుత్వము లీలక్ష్యములను, సిద్ధాంతములను ఆచరణలో నుంచి, దేశ సౌభాగ్యమును దినదినప్రవర్ధమానము గావించి ప్రజల శ్రేయస్సునకును, లోకకల్యాణమునకును పాటుపడుటకు రాజ్యాంగశాసనమం దెన్నియో అవకాశము లున్నవని గుర్తింపవలెను. ఈవిషయము రాజ్యాధికారవిభజనభాగమును, దానికి సంబంధించిన సప్తమానుబంధమును (Seventh Schedule) పరిశీలించిన తేటతెల్లమగును.

సంయుక్తరాజ్యములో (Federal State) రాజ్యాధికారవిభజన యొక ప్రత్యేకవిశేషము. సంయుక్తప్రభుత్వము (Federal union govt.) కొన్ని విషయములపైనను, రాష్ట్రప్రభుత్వములు (State governments) కొన్ని విషయములపైనను అన్యసంబంధరహితమగు అధికారము కలిగియుండును. మొదటిరకపు విషయములు సప్తమానుబంధములో ప్రథమకక్షలోను (1 list), రెండవ రకముల విషయములు ద్వితీయకక్షలోను (11 list) చేర్చబడినవి. రాష్ట్రాధికారక్షేత్రములోని విషయములపై సామాన్యపరిస్థితులలో సంయుక్తప్రభుత్వమునకు శాసనాధికారము లేదు. సంయుక్తప్రభుత్వాధికారక్షేత్రములోని విషయములపై రాష్ట్రప్రభుత్వములకు శాసనాధికార మెట్టిపరిస్థితులలోను లేదు. అనగా, ఈవిషయములలో రెండును సాధారణపరిస్థితులలో అన్యోన్యసంపర్కరహితముగ నుండవలెను. రాజ్యాంగశాసనమునకు వ్యతిరేకముగా ఒకరి అధికారముపై నింకొకరు జోక్యము కలుగజేసికొనినచో అది అక్రమమని ఖండించుచు సుప్రీముకోర్టునకు పిటీషను పెట్టుకొన్నచో అది దానిని విచారణచేసి క్రమాక్రమములు నిర్ణయించి చెప్పును. ఆ కోర్టునిర్ణయము నిరుపక్షములును అంగీకరించితీరవలెను. ఇక మూడవరకపు విషయము లున్నవి. వాటిని సమావర్తసూచి (Concurrent list) లోని విషయములని చెప్పవచ్చును. ఈ సమావర్తసూచిలోని విషయము లొకవిశేషము గలిగియున్నవి. అది ఏమనగా, ఈవిషయములపై సంయుక్త, రాష్ట్రప్రభుత్వము లుభయులును శాసనాధికారము కలిగియుందురు. రాష్ట్రశాసనసభవారును, కేంద్రశాసనసభవారును గూడ ఈవిషయములపై శాసనములు చేయవచ్చును. అయితే, కేంద్ర రాష్ట్రశాసనములు పరస్పరవిరుద్ధముగా నుండరాదు. అట్లు విరుద్ధముగా నున్నచో విశేషవిస్తృతాధికారము గల కేంద్రశాసనము మనుటలో నుండును. సంకుచితాధికారము గల రాష్ట్రశాసనము దానికి లోబడియుండును.

ఈ అధికారవిభజనము, దానికి సంబంధించిన అనుబంధమును గూర్చి ఇంత విపులముగా చెప్పుటకు కారణ మేమనగా, శ్రేయోరాజ్యమునకు సంబంధించిన విషయము లీ అనుబంధములోని మూడు కక్షలలోను చేర్చబడినవి. ఉదాహరణగా నీక్రిందివిషయములు చెప్పవచ్చును: మూడవ లిస్టులో, అనగా సమావర్తసూచి లో (౨౦) వ క్లాజులో ఆర్థికసాంఘికవిధానరచనము (Economic and social planning), (౨౩) సామాజికభద్రత (Social security), సామాజికపు భీమా (Social Insurance), ఉద్యోగ, నిరుద్యోగవిషయములు (Employment and Unemployment) (౨౪) శ్రామికుల శ్రేయస్సును (Welfare of Labour) (౨౮) ధర్మదాయములు, ధర్మసంస్థల విషయము (Charities and charitable Institutions), సప్తమానుబంధములో రెండవ లిస్టులో, అనగా రాష్ట్రాధికారమునకు సంబంధించిన లిస్టులో—

(౮) ప్రజారోగ్యము (*Public Health and Sanitation*); వైద్యశాలలు (*Hospitals and Dispensaries*).

(౯) ఉద్యోగానర్హులయొక్కయు, పంగ్వంధాదుల దుర్బలులయొక్కయు క్షేమమరయుట (*Relief of the Disabled and Unemployable* )

(౧౦) విద్యయు (*Education*)—ఈమున్నగు విషయములపై నన్నింటను రాష్ట్రప్రభుత్వములు శాసనాధికారము గలిగియున్నవి. ఈరెంటింటిలోను ఉదాహరింపక విడిచిపెట్టిన విషయము లున్నచో వాటిమీద సంయుక్తప్రభుత్వమునకు శాసనాధికారము గలదు. అట్టి శేషవిషయములపై అధికారమును అవశిష్టాధికార (*Residuary Power*) మందురు. మరియు, మూడింట రెండువంతుల కౌన్సిలుఆఫ్‌స్టేట్సు మెంబర్లు జాతీయశ్రేయస్సున కవసరమని తీర్మానించినచో సంయుక్తప్రభుత్వము రాష్ట్రప్రభుత్వములకు సంబంధించిన విషయములపైగూడ శాసనములు గావింపవచ్చును. అట్టి శాసనము లొక సంవత్సరమువరకు అమలులో నుండును. ఆపిదప తిరిగి ఎన్ని పర్యాయములు తీర్మానము గావించినచో అన్ని సంవత్సరములవరకు ఆశాసనము లమలులో నుండును. అంతర్జాతీయసంస్థలతో చేసికొనిన ఒడంబడికల షరతుల నమలుపరచుట కావశ్యకమైనచోగూడ సంయుక్తప్రభుత్వము రాష్ట్రప్రభుత్వమునకు చెందు విషయములపై శాసనములు గావింపవచ్చును.

సారాంశ మేమనగా, శ్రేయోదాయక మగు విషయములపై విశేషజాగరూకతతో విపులముగా పరిశీలించి కేంద్రరాష్ట్రప్రభుత్వములకు స్పర్ధ లేకుండునట్లును, అఖిలభారతవ్యాప్తి కల్గి, పరస్పరవిరుద్ధములు లేకుండ సమగ్రశ్రేయోదాయకశాసనములు రచించుటకు వీలగు నట్టి అవకాశములు రాజ్యాంగశాసనములో కల్పింపబడెను. ప్రజల శ్రేయస్సును వృద్ధిచేయుటకు కంకణము కట్టుకొన్న ప్రభుత్వములైనచో ప్రజాసేవ చేయుటకు రాష్ట్రకేంద్రప్రభుత్వములు చేదోడు వాదోడుగా పనిచేయుట కవకాశములు మెండుగ గలవు. ఈవిషయములోగూడ మన రాజ్యాంగశాసనము చాలవరకు సంయుక్తకేంద్రప్రభుత్వమువైపే మొగ్గియున్నది. కాని, రాష్ట్రప్రభుత్వములు ప్రజలకు సన్నిహితములు గనుకను, గురుతరబాధ్యతగల దేశరక్షణాది ఇతరకార్యకలాపములు తక్కువగనుకను, రాష్ట్రప్రభుత్వములే ఈవిషయములలో ముందంజ వేయవలెను. సమవర్తసూచిలోని శ్రేయస్కర విషయము లన్నింటిపైనను తామే ప్రథమతాంబూలము నైకొనుటకు కుతూహలులైయుండి కేంద్రప్రభుత్వమునకు మార్గదర్శకులై రాష్ట్రప్రభుత్వములు పనిచేయవలెను. శ్రేయోరాజ్యప్రవర్ధనమున కీమార్గ ముత్తమము. అఖిలజాతీయప్రభుత్వము నూతనమార్గముల నన్వేషించుచు కష్టనష్టములకు లోనైపోవుటకంటె, వివిధరాష్ట్రప్రభుత్వములు తమతమ బుద్ధిశక్తి ననుసరించి ఉత్తమమార్గాన్వేషణకు కృషి సల్పినచో కేంద్రప్రభుత్వము నిరాఘాటముగ రహదారిని వల్లెనపై బండివడికవలె ముందునకు సాగిపోవచ్చును. అనగా, అన్వేషణ, ప్రయోగబాధ్యతలను రాష్ట్రప్రభుత్వములు వహించి ఏయేవిషయములలో ఏయేతీరపోలుగా మనము మన రాజ్యమును శ్రేయోరాజ్యముగా చేయగలమో ఆవిషయములకు సంబంధించిన పరిణతసూత్రములను కేంద్రమున కందింపవలెను. అప్పుడు అఖిలజాతీయవ్యాప్తిగల శాసనము లా సూత్రప్రకారము రచించి అఖిలభారతప్రజానీకము సుఖపడునట్లు సంయుక్తప్రభుత్వము చేయబూనుకొనవలెను.

మన రాజ్యాంగశాసనము కడు విపులమైనది. అమెరికా సంయుక్తరాష్ట్రముల శాసనమువలె సంకుచితమైనది గాదు. అమెరికారాష్ట్రమును కేవలరక్షకరాజ్యమునుండి శ్రేయోరాజ్యముగా మార్చుటకు ఎన్నియో క్లిష్టమగు ఉపాయములు పన్నవలసివచ్చెను. వారి రాజ్యాంగశాసన మీవిషయములందు సుస్పష్టముగా లేకపోవుటచే సుప్రీముకోర్టువారి వ్యాఖ్యానపు సుడిగాలిలో నలిగినలిగి అతి కష్టముమీద శతకోటిఉపాయములద్వారా అమెరికా శ్రేయోరాజ్యముగా మారెను. మన రాజ్యాంగశాసనరచయిత లీ అనుభవమును పురస్కరించుకొని, ఆ యగచాట్లను తప్పించి శ్రేయోరాజ్యపథము సులభముచేయుటకు దానికి సంబంధించిన విషయములు చాలవరకు ఉభయత్రాధికారముగల సమవర్తసూచికాపట్టికలో చేర్కొనిరి. అది యొక మహోపకారకార్యము. భవిష్యత్‌సంయుక్తరాజ్యములలో సమవర్తసూచియే కడు ప్రాధాన్యము వహించును.

ఈ శ్రేయోరాజ్యమున కనువగు ఆర్థికసూత్రమునుగూర్చి చర్చించుట అవసరము. కాని గ్రంథవిస్తరభీతిచే దానివిచరించి విపులముగా ప్రస్తావించుటలేదు. ఈ విషయములో రాష్ట్రకేంద్రప్రభుత్వముల మధ్య స్పర్థ, ఆ అపహానమునకు అవకాశము లెక్కువ. కెనడా ఆస్ట్రేలియా దేశముల చరిత్ర లీవిషయమును స్పష్టముచేయుచున్నవి. హెచ్చుఆదాయము వచ్చు పన్నులన్నియు కేంద్రప్రభుత్వముయొక్క ఆధిపత్యముక్రిందనే యున్నవి. కొన్నిరకపు పన్నుల నుండి వచ్చు ఆదాయము రాష్ట్రములకు పంచిపెట్టును. ఈ పంపకము నిర్ణీతసూత్రముల ననుసరించి యుండవలెను. స్వల్పమైనను, అధికమైనను కేంద్రమునుండి రాష్ట్రములకు వచ్చు ఆదాయము [illegible] ఐదుసంవత్సరములలోపునైనను మారదను సునిశ్చితధైర్యము రాష్ట్రముల కుండవలెను. లేనిచో భవిష్యత్ కార్యక్రమనిర్ణయము దుస్సాధ్యమగును. ఈవిషయములలో కేంద్రప్రభుత్వ మేర్పరుపబోవు ఫైనాన్సుకమీషను (*Finance Commission*) దీర్ఘదృష్టితో నిష్పాక్షికబుద్ధితో పనిచేయవలెను; ఇరుపక్షములవారికిని అన్యాయము జరుగకుండ చూడవలెను. కేంద్రప్రభుత్వమునకు తరుచు ఖర్చుతక్కువగను, ఆదాయ మెక్కువగను ఉండును. దీనికి కారణము కేంద్రప్రభుత్వము నిర్వహింపవలసిన కార్యముల తత్వము. రక్షణకార్యముల ఖర్చును, ప్రభుత్వపుసిబ్బందిఖర్చును మినహాయించినచో, అధికవ్యయకరమగు కార్యములు కేంద్రప్రభుత్వమున కత్యల్పము. రాష్ట్ర

ములలో? అట్లుగాక, ఆదాయ మల్పము; వ్యయ మధికము. దీనికి కారణము — విద్య, ఆరోగ్యము మున్నగు ప్రజోపయోగకార్యములు, సాంఘికభద్రతా కార్యములు (*Social security affairs*), ఇతర శ్రేయోదాయక కార్యములు నిర్వహించు బాధ్యత రాష్ట్రప్రభుత్వములపై నున్నదని పైన వివరించితిమి. ఈ కార్యము లన్నియు ఎంత అధికముగా ధనము వ్యయపరిచిన అంత ఎక్కువగా ప్రజలకు సుఖసంతృప్తి కలుగజేయును. అనగా రాష్ట్రప్రభుత్వములకు ఆదాయ మల్పము; బాధ్యత యధికము. అయితే, అధికముగా ఆదాయము వచ్చు పన్నులు రాష్ట్రప్రభుత్వముల క్రిందకు రావని ప్రశ్నింప వచ్చును. దీనికి కారణమేమనగా, వివిధరాష్ట్రప్రభుత్వములు వేర్వేరు రకముల పన్నులు విధించి, తమతమ సిబ్బందులను నియమించి పన్నులు వసూలుచేయుట కష్టము. కేంద్రప్రభుత్వ మాకార్యభారమును వహించినచో దేశము మొత్తముపై పన్నుల నేకరీతిగా విధించి, సులభముగాను, అల్పవ్యయముతో వాటిని వసూలు చేయగలదు. కేంద్రప్రభుత్వ మీపన్నులపై వచ్చు తన అధికాదాయమును రాష్ట్రప్రభుత్వములకు పంచిపెట్టు విషయములో అతి మెలకువతో, నిష్పాక్షికబుద్ధితో ప్రవర్తింపవలెను. ఫైనాన్సు కమీషను యొక్క నిర్ణయముల నంగీకరించి, నష్టమైనను, కష్టమైనను, ఆ నిర్ణయమునకు అన్ని పక్షములవారు కట్టుబడియుండవలె నను సంప్రదాయము ప్రోత్సహించి పెంపొందింపవలెను.

ఏది ఎటులున్నను, రాష్ట్రకేంద్ర ప్రభుత్వములు తగవులాడక ప్రజలశ్రేయస్సునే మనస్సులో నుంచుకొని పనిచేయవలెను. ప్రభుత్వ మొక యంత్రము. దానిని మన మెట్లు నడిపిన అట్లు నడచును. రాష్ట్రప్రభుత్వమంత్రులైనను, కేంద్రప్రభుత్వమంత్రులైనను ప్రజలయొక్క ధర్మకర్తలు. ప్రజల ఏజెంట్లు. పరిపాలనాసౌకర్యార్థమై రాష్ట్రకేంద్రప్రభుత్వముల ఏర్పాటును, అధికారవిభజనయు గావించబడెను గాని మారు ఉద్దేశ్యము లేదు. ఆయాప్రభుత్వముల కర్తవ్యము, ఉచితమగు కార్యములు, అధికారములు మన రాజ్యాంగశాసనము నిర్ణయించి పంచిపెట్టెను. ఆప్రకారము వారు ఏకాభిప్రాయముతో, ప్రజలశ్రేయస్సును వృద్ధిచేయవలె నను ఏకైకలక్ష్యమును పురస్కరించుకొని ఉభయప్రభుత్వాధికారులును పనిచేయవలెను. శాసనములో వ్రాసిన మాటలకంటె ప్రభుత్వము నిర్వహించు నాయకులయొక్క శక్తిపై, ధైర్యముపై, ధర్మబుద్ధిపై జయాపజయములును, సత్సంప్రదాయరచనయును ఆధారపడియుండును.

---

# ఎవ ర ది?

శ్రీ గొట్టుముక్కల రామకృష్ణశాస్త్రి

ఎవ రది శాంతిసారథము నించుకయున్ దలమెత్తనీక యీ
భువి ప్రతికూలవాతమున ముంచుచు ప్రాణుల నిత్యసౌఖ్యపుం
జవులకు దూరదూరముగ నల్పి ప్రపంచపు రాజ్యమందు రే
పవలును మాసిపోవని తుపానుల రేపుచు నున్నవా రహో!

ఎవ రది సత్యధర్మసముపేత సుభోచితవిశ్వసీమలో
నవిగళదుష్టశక్తులకు నాయువు పోసి చిరానుబద్ధమౌ
నవనహాకారసంపదల నాశమొనర్చి అనంతవేదనా
వ్యవసితమార్గమందు నడువన్ జనులన్ పురికొల్పువా రహో!

ఎవ రది సర్వమానవసుశేముషియుగ్మమునందు మైకముం
దవులగజేసి మానసమునన్ మిటిమిటిన విప్లవాగ్నులన్
రవులగబెట్టి యొక్కట తిరంబుగ నుండగనీక శాశ్వతో
త్సవముల పొంతకు న్నడచు దారుల మూయుచునున్నవా రహో!




కటకంజిల్లాలోని ఉదయగిరిపర్వతముపై నున్న ప్రాచీనవిహారవిశేషాలు

చిత్రకారుడు : శ్రీ పి. వి. రామారావు



# నిర్వేదం

(భావచిత్రణ)

శ్రీ పిల్లలమఱ్ఱి హనుమంతరావు

ఏమీ! పాతాళపు భయదగాంభీర్యం!
అయ్యో! పాషాణపు కఠిన కార్కశ్యం!!
ఇదిగో! కోపఘూర్ణితాగ్నిగుండం !!
అమ్మో! విషపూరితాశనిపాతం!!!

క్రుంగిపోయె క్రుంగిపోయె
హృదయమే కుమిలిపోయె!

ప్రిదిలిపోయె ప్రిదిలిపోయె
హృదయమే వ్రక్కలాయె!

దగ్ధమాయె దగ్ధమాయె
హృదయమే భస్మమాయె!

పాతాళపు లోతుల్లో
పాషాణపు గతుకుల్లో
అగ్నిగుండపు అర్చుల్లో
అశనిపాతపు అరుపుల్లో

గుభేలున పడి
నలుగుడుపడి
చెవి చిల్లులడి
తల తగులడి
ఆశ కొడిగట్టింది!
దశదిశలూ శూన్యాన్నే
నిశ్వసించాయి!

గాఢధ్వాంతాన్నే
ఆవలించాయి!

విషాగ్నికీలల్నే
పుక్కిలించాయి!

అంతరిక్షాన పక్షిరుతాల
వెకిలినవ్వులు
పిక్కటిల్లాయి!

అంతరంగాన అగ్నివర్షం
వేయిముఖాల
కక్కుతోంది!

అంబుధిలోపల
బడబాగ్ని ఉవ్వెత్తుగా
చెలరేగింది!

కాననంలో కార్చిచ్చు
కరాళజిహ్వల
జాచింది!

అంధకారబంధురవీథుల్లో—
దారుణమారణతిమిరాల్లో—
భీకరతాడితవీచుల్లో—

దీపం కంపంతో కదలాడింది:
పాపం భయంతో ప్రాకాడింది:

శబ్దం బెదరుతో నడయాడింది!

రసన రసవిహీనమై
బెండుబారింది!

గళం గరళయుతమై
మడిపోయింది!

మేధ తిమ్మిరెక్కి—
మొద్దుబారింది!

విషానలకీలల వెడలగ్రక్కే— నేత్రాలు
వెంటబడ్డాయి—
కోడెత్రాచుతలల కోరలు జాచే
శబ్దాలు కూలద్రోస్తున్నాయి
క్రూరకఠోరకరాళదంష్ట్రిలు
పటపట కొరుకుతున్నాయి!

కొరవినబడిన మానవకంకాళాలు
హుమ్మని కబళింప మన్నాయి!

ప్రపంచమంతా విక్రమించి
హరించింది కీర్తిబాలను!!

శ్మశానవాటికలో భస్మజాలం
బెదరిస్తోంది భవిష్యత్తును!!!



# సలిలసదనము

శ్రీ తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి

[సలిలసదనమునకు సంబంధించిన యిటుకరాతి పెద్దదిమ్మె కర్నూలుకడ తుంగభద్రానదీమధ్యమున గానవచ్చును.]

[౧]

"మరదలా, మరదలా, మైమరచి నిష్ఠతో
చూచుచున్నావటే జోగులాంబామూర్తి!
రాజలక్ష్మి, నీకు మోజు పుట్టినదటే
పెండ్లి కాకుండనే పిల్లపాపలమీద!"

"వదినా, యెప్పుడు వచ్చితి వమ్మా!
బంధువు లందరు బాగున్నారా?
నవనీతముపై గవిసెడివారిని
గాంచుచు, నిను నే గనుగొన నైతిని."

"ప్రొద్దుపోయిన దలంపురము చేరెడునరికి—
అత్తమామలును మీయన్నయ్యయును నేను
శివరాత్రికిని ముందె శ్రీశైలమును జేర
పయన మగుదుము రేపు ప్రత్యూషసమయాన."

"ఒకపరి త్రిపురాంతకమును జూచితి,
ఈ యలంపురము మా యావాసమె.
తూరుపువడమరద్వారము లగు నీ
క్షేత్రయుగ్మమున సేవలు చేసితి.
శ్రీశైలేశ్వరు సేవించు మహా
భాగ్యము నేటికి పట్టదు వదినా!"

"రావచ్చు మా వెంట రాజలక్ష్మి, నీవు
అమ్మయును, కొనిపోదు మక్రమమ్ముగ నిమ్ము."

"అమ్మ కీనడుమ ఆరోగ్యము చెడె,
మరి యూపై నీమరది యేమనునో?"

"పెండ్లియాడితి వెపుడు పిల్ల! మా కెవ్వరికి
కబురంపనైతివే గద్వాల మారమా?
అయిన బంధుప్రీతి ఆనాటి కానాడు
తొలగుచున్నది కదే తెలుగుదేశమ్ములో!"

"కాదది వదినా, కారణ: మెప్పుడు
బందుగు లన్నను పరమప్రీతియె.
చిత్రసంఘటనచే సమకూరెను
నాకల్యాణము, నమ్మము వదినా!"

"చెప్పవే చెప్పవే చిత్రవృత్తాంతంబు:
మామరది యెవ్వరో మరదలా!— సిగ్గటే?"

"శరభానాయుడు మరది నీకు— మా
యింటికి రాకయె యిచటనో దిగితివి."

"ఆశ్చర్యమే! పెండ్లియాడినావా తుదకు
నీలశరభానాయనే! అదృష్టము సుమ్మ
మంచి మగడే దొరకె మరదలా, మరదలా!
అంగీకరింపలే దతని నీ వెన్నాళ్లో!"

*　　*　　*

"నిజమే ఆయననిందుమానసము
బహుకాలము నే బాధపెట్టితిని."

"మేమందరముకూడ మిగుల వగచితి మపుడు.
నీ వెన్నిమారులో నిరసించితివికదా
శరభప్ప, నెట్లతడు సమ్మతించినవాడో !
వినవలతు మీ పెండ్లివృత్తాంత మంతయును.

"ఆలయమ్ము విడి అవలకు బోదము
చనుదెంచును జనసమూహ మిచటికి."

"తుంగభద్రాతటద్రుమశీతలచ్ఛాయ
వివరింపదగును నీ వింత సంఘటనమ్ము,
ఆలకించిన పిదప నరుదెంతు నీతోడ,
నీమగని, నీజనని నే విలోకింపవలె."

[౨]

"గండముతప్పినగాని పట్టదట
యోగ మన్న నుడి యుక్తమె వదినా!
అంతటి యాపద యలమిన పిదపనె
తిరిగెను నా తలతిక్క నిజమ్ముగ.

కన్నతల్లి నను గారాబముతో
పెంచుటచేతనె పెంకె నైతి సుమి.
నాయన పోవుట నా దురదృష్టమె!
దర్పము, స్వాతంత్ర్యమ్ము పెరిగినవి.
తల్లిమాటయెడ తగిన లక్ష్యమును
నిలుపలేదుసుమి నే నెన్నండును.

బందుగు లొకపరి కందనూలులో
వేడుకజూడగ వెడల నుండగా
అయితిని పయనం, బమ్మ యెంతయును
వలదువల దనుచు వారించెను నను.

పట్టు పట్టితిని, బందుగు లమ్మకు
నచ్చజెప్పి రెటో నను గనిపెట్టగ.
ఆప్రయాణమే అతిభీకరమై
పరిణమించె నొక పట్టున వదినా!

ప్రయాణమున మాకు నెట్టిప్రయాసమ్ము కలుగలేదు
అక్రమముగ జేరినార మందరమును కందనూలు.

రకరకాల సంబరాల సుకముగానె గడపినాము
నగరమ్మున మొదటినాడు నలుమూలలు తిరగవేసి.

మానివాన మాపురమున మారుమూల సత్రములో
మరుదినాన లభియించెను మాకు యువతియొకతె తోడు.

ఎడముచేసి మావారల నెన్నెన్నో నాకు జూపె
సంతలోన సంబరాలు సందెవేళ నా జవ్వని.

రంగుకొయ్యగుర్రముపై రంగులరాట్నమ్ములోన
కూరుచుండి తిరిగినాము కొంతతడవు గిరగిరగిర.

కానిడబ్బుతోడ నాడు కాశీరామేశ్వరాల
అద్దమ్ముల పెట్టెలోన అనేకమ్ము చూచినాను.

తోలుబొమ్మలాట జూడ రాలే మేమాత్ర మనుచు
బడలికచే మావారలు పండుకొనిరి రాత్రివేళ.

మెత్తని జముకాణముతో క్రొత్తచెలిమికత్తె వచ్చి
అవలకు గొనిపోయి నన్ను, అన్నది మృదుమధురముగా:

'పోవుదమా యిపుడు, తోలుబొమ్మలాట, బాగుండును.
రాజమ్మా, తక్షణమే రావలె, మొదలిడుదు రేమొ!

'స్వగ్రామమునకు రేపే చనవున్నా, వచటలేని
వింత లెన్నొ కల విచ్చట, వీక్షింతువు నేటిరాత్రి.

'కట్టుకొనుము మంచిచీరె, కదలిరమ్ము వేగముగా,
తిరుగ నిన్ను భద్రముగా దిగబెట్టుదు సత్రములో'.

పగటివేళ గాఢనిద్ర పట్టియున్న కారణమున
పీకతోడ నేను బయలువెడలితి నా యువతితోడ.

తొలుత నచటినుండి మేము తోలుబొమ్మలాటకు జని
కూరుచుండి చూచినాము కొంతతడవు కుతుకముతో.

'ఇది చాలును లెమ్ము, లెమ్ము, ఇంకొక చోద్యంబు కలదు
దరిసింతమురమ్మని నను త్వరపెట్టందొడగె నామె.

ఇంతలోన తెరమీదను గంతులతో కేతిగాడు
కానబడుటచేత నేను కదలనైతి నచటినుండి.

మాటలలో చేష్టలలో మనకు సిగ్గువేయుచుండు,
కాని, వాని హాస్యములో కలదు కొంత చమత్కృతియె.

పడజాలక యామెపోరు బలవంతముమీద లేచి,
ఆమె పోవు మార్గమునే అనుసరింపదొడగినాను.

తుంగభద్రకల్లోలినితో హంద్రీస్రోతస్విని
సంగమించు ప్రదేశమునకు చనినా మారాత్రివేళ.

మింటిమీఁద స్వల్పముగా మినుకుమినుకు మనుచు నున్న
తారక లే నాలుగైదో, తమ మెల్లఁగ నాక్రమించె.

కాని యచటి తీరమునకు కట్టివేసియున్న కొన్ని
నావలలో దీపమ్ములు నక్షత్రములట్టు లుండె.

చెంగటనే యున్న పెద్దయంగడిలో పండ్లు, తీపి
కారపుతినుబండమ్ముల గనుఁగొనంగ నోరూరెను.

గ్రహియించెనో యేమొ చెలిమికత్తె పండ్లు లడ్డువములు
వెలిచి నోటి కందిచ్చెను వలదని నే వారించిన.

ఆరగించి రెండుమూఁడు, హంద్రీసలిలమ్ము గ్రోలి
'చనవలయును సత్రమునకు సత్వరముగ' నంటి నేను.

'నడచిపోవ కష్టమగును, పడవమీఁద జనవచ్చును,
పుట్టి కాదు నీట మునిఁగి పోవు ననెడి భయము చెంద.'

అని యూయమ నీవు చరచినంతనె నిస్సంశయముగ
ఆమె ననుసరించుచు నే నందొక పడ వెక్కినాను.

అదియే తొలిపారసా టని ఆవల గ్రహియించినాను,
మాంద్య మ్మానమయమ్మున మానసమ్ము నావరించె.

ఇంచుక దూరమ్ము పోవ నెదురుగ గానంబడియెను
తుంగభద్రగర్భంబున రంగుల యద్దాలమేడ.

గొందిపల్లినుండి నాఁడు కందనూలు పుట్టిమీఁద
మేము ప్రయాణించువేళ మేడను గమనింపలేదు.

సమీపించె నింతలోనె సదనము మా పడవ: జరిగె
నా. రెండవ పారసా టాభూరిదుర్ముహూర్తమందు.

ఏమిదియని నే నడుగగ 'ఇది బొమ్మలమేడ, మనము
అరగడియే కాకపూర్వ మన్ని చూచి పోవగలము'

అని నా సావాసగత్తె ఆనతిచ్చి కళాసులకు
ఆపి పడవ, పీక నన్ను సోపానము లెక్కించెను.

[3]

సోపానము లన్ని యెక్కి చుట్టు పిట్టగోడ దాటి
అంగణమ్ములోని కేగ అత్తరువాసనలు వలచె.

అచట నున్న బూబు మమ్ము నాహ్వానము చేసి, లోని
కడుగుల తడి యొత్తుకొనగ అందిచ్చెను తుండ్లు రెండు.

అవల నచటి ఆసందుల నాసీనల జేసి మమ్ము
నఖశిఖపర్యంతముగా నన్ను పరీక్షించి యనియె:

'అచ్ఛా! ఇది పల్లెటూరి అందకత్తె, రథమువంటి
నిండుతనువు పుష్టిదాని నేర్పున గొనివచ్చినావు'

అవు నవు నని చెలిమికత్తె ఆమె కేదో సంజ్ఞచేసి
గోడలపై చిత్తరువులు చూడుమనుచు నన్ను లేపె.

దుర్గమ్ముల ముట్టడులును, దుష్టజంతుసంహారము,
ప్రకృతిరమ్యదృశ్యమ్ముల పటములు వీక్షించినాను.

అరుగుదెంచి ఆ బీబీ ఆసవపాత్రమ్ము నాకు
అందిచ్చెను, దిగ్భ్రమతో ఆస్వాదించినాను దాని.

వెడలిపోవ దలచులోన బడలిక వారించు ననుచు
ఏదో మధురపదార్థమ్ము నిచ్చె వీడియమ్ముతోడ.

విడెము చేసినంత నాకు వింతమాంద్య మావహిల్లె
దాహమనగ, నామె పాత్ర త్రావంగా నందిచ్చెను.

అవల నామె తెచ్చి చీర - అత్తరువాసనలతోడ
గమగమ లాడెడు దానిని - కట్టుకొందువా యనియెను.

తెలిసికొనక సందర్భము, వల దని, చెలికత్తె గాంచి
పోవుదమా అన్నట్టులు భ్రూసంజ్ఞలు చేసినాను.

'దాను' తెచ్చి బీబీ నాతనువునిండ చీరెనిండ
రైకనిండ రాచిపోయె రకరకాల అత్తరువులు.

చెలిమికత్తెతోడ 'ఇల్లు చేరుద మిక' నన నేను
నవ్వుచు నా కుటిలురాలు నాప్రక్కన గూరుచుండి—

'నీ యదృష్ట మీరాతిరి నిండుగ పండిన దోసీ!
చెప్పినట్లు చేతువేని సిరి నిను వరియింపగలదు.

కాంచినారు మన నవాబు క్రంతలలోనుండి, నీదు
నంగసౌష్ఠవమ్ము వారి నాకర్షణచేసిన దే.
ఉష్ణజలస్నాన మాది యువతిచేత జేయింతురు
నీ నిర్మలదేహమునకు నిర్బంధము చేయలేదు.
చల్లనిరే యిచట గడపి తెల్లవారునరికి నీవు
సత్రములో నిద్రించెడి స్వజనమ్మును చేరవచ్చు.
పాత్రురాల వైతివేని ప్రభువునను గ్రహమునకే,
నీ యదృష్టరేఖ బట్టి నిక్కామే జరుగునేమొ!'

అను వాక్కులు దిగ్భ్రమతో నాలకించుచున్న నాకు
చెప్పరాని భయావేశ ముప్పతిల్లె నాక్షణమున.

'తొలుత దెలుపకుండ దీని దోలుకు వచ్చితివి, కాన
విషయమ్ములు గ్రహింపగ విశ్రాంతి నొసంగవలయు'
అనుచు బూబు లోని కరిగె. అటునిటు జూచితిని నేను-
కానబడిరి క్రంతనుండి కావలివా రొక కొందరు.

కొనివచ్చిన పడవ క్రింద గోచరింపలేదు, నదీ
జలము మహీరసముపోలె బిలబిల బ్రవహించుచుండె.

చెలికత్తె కొంతవడికి చిరునగవున నరుగుదెంచి
'ఏమి, వత్తు వొక్కొ, నవా బెదురుచూచుచున్నవాడు.

చేయగలుగుదేని వారి చిత్తరంజనంబు, పంచు
నీ నా భాగ్యమ్ము'లనుచు నిలుచుండెను నామ్రోలనె.

ఆపదలో బుద్ధిబలం బభిభూతం బగును, కాని
పక్షమ్మున మెరపుదీగభాతిని వెల్గు తలాలున.

ఉదయించిన దాక్షణమున నొక్కయూహ మల్లనల్ల
తెచ్చికొనుచు లేనినగవు దిటము పూని యిట్టు లంటి :

'హుజూర్ వారి ఖుషీకోస ముడుకునీళ్ళ తానమాడి
క్రొత్త సన్నచీరె కట్టి వత్తు ననుచు విన్నవించు'
అనుచు నేను పలుకు మాట లాలకించి చెలికత్తె
కుటిలురాలు వేవేగమె కుతుకమ్మున లోని కేగె.

చిత్తమ్మున భక్తితోడ శివుని దలచి, మునివ్రేళ్లను
తివాసీలమీద నడచి తెరచి తలుపు, మరల మూసి-

సవ్వడి లేకుండ దాటి సత్వరమే అంగణమ్ము
సోపానశ్రేణివంక జూచి దిగితి భద్రముగా.

పండుకొన్నవారు గాన భటులు నన్ను జూడలేదు
కుంటెనకత్తియలు నన్ను వెంటాడను లే దప్పుడు.
కలిసివచ్చె నన్నికూడ; కావున నిశ్శబ్దముగా
ఈదబొచ్చినాను నీట ఇష్టదైవతమ్ము దలచి."

[౪]

"నిజముగా మరదలా, నిండుగండమె తప్పె!
సాహసమ్మున నీకు జయము సమకూరినది.
ఏమాయె నామీద? ఎటు లిల్లు చేరితివి?
ఎట్లు శరభానాయనే పెండ్లియాడితివి?"

"నా కీతలో నేర్పు నీకు విదితమె కదా?
నదిలోన ఎవ్వరైన నా వెన్క దిగిరేమొ
అని సావధానముగ నయిదారు వారముల్
వెనుదిరిగి చూచుచున్, వేగ వాహినిలోన
కొంతదూరము పోయి, కూలమ్ము జేరితిని.
అచ్చోటినుండి నా కారంగుటద్దాల
మేడ కనబడలేదు - మిన్ను మన్నేకమై
నీలిబురఖా దాల్చు చాలుమాత్రమె తోచె.

కట్టుచీరెను పిడిచి గట్టువెంటనె వేగ
ఒడ లెరుంగక నడచి నడచి చేరితి నెట్లొ
ఈ అలంపురమునే. —ఏమున్న దామీద?
నేరుగా జని బావగారి యింటికి తలుపు
తట్టినా, నాతండు ద్వారమ్ము దెరచుచును
ఆకస్మికమ్ముగా నంత రాతిరివేళ
వీక్షించి నను, మహావిభ్రాంతుడై నిల్చె.

అతని పాదాలపై ఆర్తినై వాలితిని !
నను లేవనెత్తుచున్ కనుల నీరము తుడిచి
మృదువుగా గొనిపోయి సదనమ్ములోపలికి
సలిపినా డుచితోపచారముల్ బావయ్య.

మూనాళ్ళు జ్వరములో మునిగి తేలితి నేను—
ఆరోగ్యము లభింపదాయె వారముదాక.
ఆత డడుగకపోయినప్పటికి స్వయముగా
వివరించితిని నేనె వృత్తాంత మంతయును.
విని, జాలిపడినాడు, వెక్కసంపడలేదు.
దైవతమ్మె సుమ్ము భావమ్ములో బావ !
అవల శీఘ్రమ్ముగా నయ్యె కల్యాణమ్ము."

"గండముదప్పిన నిండుయోగ మట,
నీపక్షంబున నిక్కంబాయెను.

ఆవాసమునకు పోవుద మింతట,
మరదల, లే, నీమగని జూడవలె,
అంగీకారం బమ్మ యొసంగుము,
భార్యాభర్తలు బయలుదేరవలె.

శ్రీశైలేశ్వరు సేవించినచో
శ్రీశివరాత్రిని సేమము లొదవును!"

# భారతరాజ్యాంగము- మామూలుమనిషిస్థాయి

శ్రీ చంద్రంగి రాజేశ్వరరావు

"దూరదృష్టితో సంగతిసందర్భములను గ్రహించి తమ హక్కులను సద్వినియోగము చేసి బాధ్యతలను సక్రమముగ నిర్వర్తించినపుడే మామూలుమనిషిస్థాయి ఉన్నతమై ప్రతిపత్తి వృద్ధియగును. ఉద్రేకపూరితులై ముందువెనుక లాలోచింపక అవకాశమునకై వేచియున్న, నీతినియమములు లేని స్వార్థపరులగువారివలలో చిక్కుకొనుచో ముక్తి లేకపోవుటయే కాక పరిస్థితి అన్నివిధముల అధ్వాన్నమగును."

ఏ దేశమందైనను జనాభాలో మూడుముప్పాతికవరకు మామూలు మనుష్యులే. ఆయా దేశములందలి కాలమానపరిస్థితుల ననుసరించి, వారి గుణగణములనుబట్టి మామూలుమనిషియొక్క స్థాయి, ప్రతిపత్తి మారుచుండును. మామూలుమనిషి ప్రతిదేశమునకు భారమితివంటివాడు. అందుచేత ఎవరు ఏమహత్కార్యము సాధించినను మామూలుమనిషి పురోభివృద్ధికని చెప్పుట పరిపాటి. అటులనే భారత రాజ్యాంగమందు రాజ్యాధికారము ప్రజలదే యను నిర్వచనము లేక పోయినను పీఠికయందుమాత్రము ప్రజలే దేశమును సర్వస్వతంత్ర ప్రజాస్వామికముగ ప్రకటించి రాజ్యాంగమును స్వీకరించుచున్నట్లు చెప్పబడినది.

ఈ రాజ్యాంగమందు మామూలుమనిషిస్థాయిని నిర్ధారణచేయుటకుముందు దీనియొక్క పుట్టుపూర్వోత్తరముల నొకింత పరిశీలించుట అవసరము. రాజ్యాంగపరిషత్తు క్రమేపి సర్వస్వతంత్రముగ వ్యవహరించుచువచ్చినను అది ఆ సంస్థ బ్రిటిషువారి సృష్టి యని, వారు నిష్క్రమించుచు వేసివెళ్ళిన పథకప్రకారము నడచినదని జ్ఞప్తియం దుంచుకొనవలెను. సభ్యుల సంఖ్య మూడువందలకు మించినను, వారల కన్ని సౌకర్యములు అందుబాటులో నున్నను, అందులో పదవవంతుమందికూడ కార్యకలాపములందు శ్రద్ధవహింపలేదు. సభకు కావలసిన కనీససంఖ్యకంటె హాజరుగా నున్నవారి సంఖ్య తక్కువగా నుండుటచే అప్పుడప్పుడు వాయిదాపడుచు వచ్చినది. ప్రథమ సమావేశమందు నెహ్రూపండితుడు ముఖ్యమగు మూలసూత్రములను నిర్వచించుచు తీర్మానమును ప్రవేశపెట్టి ఏకగ్రీవముగా ఆమోదింప జేయుటచే దరిమిలాను అందుల కనుగుణముగ కొన్ని ముఖ్యమగు ఉపసంఘము లేర్పడి, విభిన్నవిషయములను పరిశీలించి తమ నివేదికలను సమర్పించిరి. తదుపరి, విభిన్న నివేదికలను, సిఫార్సులను సమన్వయపరచి రాజ్యాంగమునకు చిత్తుముసాయిదా తయారుచేసిరి.

డాక్టరు అంబేద్కరు అధ్యక్షతను ఏడుగురు సభ్యులు గల సంఘము ముసాయిదాను తయారుచేసినది. ఇందులో ఒక్క మున్షీ తప్ప తదితరు లెవ్వరు కాంగ్రెసుగోత్రీకులు కారు. ఈయనకైనను 1930-వ సంవత్సరమునకు పూర్వము కాంగ్రెసుతో సంపర్కము లేదు. మధ్యలో అఖండహిందూస్థాననినాదమును లేవదీసి కాంగ్రెసును వీడిన వ్యక్తి. దరిమిలాను కాంగ్రెసు అధికారము చేపట్టగనే తిరిగి వచ్చిరి. అధ్యక్షుడగు అంబేద్కరు సమర్థుడేకాని, సహనము లేదు. బ్రిటిషువారి ప్రాపు ఉన్నంతకాలము కాంగ్రెసును నిర్దాక్షిణ్యముగ నిందించుటయే పరమావధిగ పెట్టుకొన్నవాడు. లోకోత్తరపురుషుడు, భారతజాతికి జనకుడు అగు గాంధిమహాత్మునియెడ పూజ్యభావము సంగతి అటుంచి వ్యక్తిగతమైన గౌరవముకూడ లేనటువంటి అసాధారణ వింతమనిషి. మిక్కిలి యీయనకు భారతసంస్కృతి, సంప్రదాయములయెడ తీవ్రమైన నిరసనభావము.

శ్రీ గోపాలస్వామిఅయ్యంగారు, కొంతకాలమువరకే సభ్యత్వము వహించిన సర్ బ్రజేంద్రలాల్ మిత్తరు, న్యాపతి మాధవరావు త్రయము బ్రిటిషుహయాములో ఉన్నతపదవుల నధిష్ఠించి పరిపాలనాదక్షులని, రాజనీతితత్పరులని ఖ్యాతిగడించిరి. శ్రీ అల్లాడికృష్ణస్వామి అఖండమేధావి. అంతర్జాతీయన్యాయశాస్త్రము, రాజతంత్రము, ధర్మసూత్రములు వీరికి కరతలామలకము, కాని యీయనకు స్థిరమగు స్వకీయాభిప్రాయము లున్నట్లు కనిపించదు. ఎవరిపక్షమున ఉన్నపుడు వారిపక్షమున కడుసమర్థతతో పనిచేయు కార్యవాది. మదరాసురాష్ట్రప్రభుత్వమును ఎన్నిపార్టీలు చేపట్టినను, ఎంతటి

మార్పులు వచ్చినను నిరాఘాటముగా పదునారుసంవత్సరములపాటు అడ్వకేటుజనరలుగా ఈయన పనిచేయగలుగుటయే యిందుకు తార్కాణము. సర్ మహమ్మదుసాదుల్లా ముస్లిములీగు ప్రతినిధి. దేశవిభజనానంతరము కోరలు పెరికిన త్రాచువలె మసలవలసివచ్చినది. దుర్గాప్రసాదఖైతాను వణిక్ప్రముఖుడు; విద్యాసంస్థలలో భాగస్వామి. ఈయన పరమపదింపగనే శ్రీ టి. టి. కృష్ణమాచారి ఆఖాళీని భర్తీచేసిరి. వీరు వర్తకమందు రెండుచేతులతోను సంపాదించుచు వచ్చినను దేశపరిస్థితుల నెప్పటికప్పుడు విశదముగ అవగాహనచేసుకొనుచువచ్చిన ప్రజ్ఞావంతుడు. కేంద్రశాసనసభాసభ్యత్వము కను మాప్రమేరలో నుండగా చటుక్కున కాంగ్రెసులో చేరిన ధీమంతుడు. ఇతరసభ్యులవలె న్యాయవాది, లేక న్యాయశాస్త్రమందు ఉత్తీర్ణుడు కాకపోయినను వారి కేవిధముగను తీసిపోడు. వీరికి ప్రధానసలహాదారు సర్ బి. యన్. రావు అను ఆరితేరిన ఐ. సి. యస్. ఉద్యోగి. పరిపాలకుడుగను, మధ్యవర్తిగను, న్యాయమూర్తిగను, రాజతంత్రప్రవీణుడుగను పేరుపొందిన ముసద్దీ. అందుచేత రాజ్యాంగనిర్మాణమందు మామూలుమనిషి కెట్టి లోక్యము లేదని తేటతెల్లమైనది.

ఈసంఘము తయారుచేసిన ముసాయిదా కొన్ని సవరణలతో అంగీకరింపబడినది. చివరకు రాజ్యాంగము దీర్ఘమైనది. ఇందు 395 సూత్రములు, 8 షెడ్యూల్సు కలవు. అచ్చునందు 250 పుటలున్నది. దీర్ఘమగు చట్టములు ప్రజల నైతికదౌర్బల్యమును సూచించుననుట సత్యదూరము కాదు. వ్రాతమూలకముగ రాజ్యాంగచట్టము లేని బ్రిటిషువారు అత్యంతనైతికబలసంపన్ను లనుట నిర్వివాదాంశము. అమెరికాసంయుక్తరాష్ట్రముల రాజ్యాంగము 10 పుటలు; కనడాది 38 పుటలు; సింహళముది 30 పుటలు; స్విట్జర్లాండుది 25 పుటలు; ఇటలీది 157 సూత్రములు; దక్షిణాఫ్రికాది 123 సూత్రములు; ఆస్ట్రేలియాది 128 సూత్రములు మాత్రమే. ఇట్టి రాజ్యాంగ మేర్పడుటకు ప్రధానసభ్యులగు న్యాయవాదులే కారణమనువారు కలరు. రాజ్యాంగమును లోపరహితముగను, వివరముగను, నిర్దుష్టముగను నిర్వచించుటయే వీరు దృష్టియం దుంచుకొనిరనుటలో సందేహములేదు. కాని దీని స్వరూపస్వభావములను అవగాహనచేసుకొనుట మామూలుమనిషికి సాధ్యము కాదు. ఇందలి సూత్రములను వ్యాఖ్యానించుటలో భేదాభిప్రాయముల కెంతో సావకాశము కలదు. తత్రాపి న్యాయస్థానములకు పని ఎక్కువగును. ప్రజల వంతు సందిగ్ధస్థితి, ధనవ్యయము

భారతదేశము లౌకికరాజ్యమని ప్రధానమంత్రి మొదలు గ్రామాధికారివరకు ఎలుగెత్తి చాటుచున్నను లౌకిక మను పదము రాజ్యాంగమందు మచ్చునకైనను లేదు. ఇందులకు తగుకారణము లేకపోలేదు. ఈపదమునకు ఆదినుండియు నిరీశ్వరవాదముతో సన్నిహితత్వము కలదు. అందుచేత లౌకికరాజ్యాంగ మనగా ఆధ్యాత్మిక, నైతికబలము లేని రాజతంత్రజ్ఞుల పాలన కారాదు. చట్టములుకూడ విధ్యుక్తకర్మమునకు వ్యతిరేకముగ నుండజాలవు. ఇందుమూలముగా సాంఘికజీవనమునకు, జాతీయసంస్కృతికి, ఆధ్యాత్మికవైభవమునకు స్వస్తిచెప్ప నక్కరలేదు. రాజ్యాంగమునకు లౌకిక, భౌతికవాదములను బలవంతముగ కట్టబెట్టుచో కీడు మూడును. శ్రీ యమ్. ఆర్. జయకరు చెప్పినట్లు ప్రస్తుతము మతప్రాబల్యముగల ప్రభుత్వమును స్థాపించు అభిప్రాయ మెవ్వరకు లేనప్పుడు ప్రతివిషయమందును పరమలౌకికదృక్పథమునకై ప్రాకులాడుట కూడని పని. అందుమూలముగ అధికసంఖ్యాకులు తమ స్వకీయాభిప్రాయములను, ఆదర్శములను కప్పిపుచ్చి అల్పసంఖ్యాకులను అడుగడుగున తృప్తిపరచవలసిన బాధ్యత యుండరాదు. ఏ దేశమందైనను ఒక మతమునకు, లేక సంస్కృతికి చెందిన ప్రజ అధికసంఖ్యాకులుగ నుండుచో ఆ దేశము యొక్క సాంఘిక జీవనము, సంస్థలు, వాటి నడవడి అందుల కనుగుణముగ నుండుట సహజము. అన్ని మతములను సమానస్థాయికి తీసుకొని వచ్చుట ప్రభుత్వముయొక్క బాధ్యత కాజాలదు. లౌకిక ప్రభుత్వమనగా ఏయొక్క మతము నెడ పక్షపాతము వహింపనిదని చెప్పుట సక్రమమగు నిర్వచనము. లౌకికప్రభుత్వవిధానము సంఘముకంటె వ్యక్తులకు ప్రాముఖ్యము నివ్వవలెననెడు సూత్రమును గౌరవించునదై యుండవలెను.

వయోజను లందరకు వోటింగుహక్కు నిచ్చుట మూలముగా మామూలుప్రజలందరు పౌరులైనారు. అజ్ఞానులగు వయోజనులందరకు వోటింగుహక్కును హఠాత్తుగా నిచ్చుటవలన ఒక ప్రముఖ ఫ్రెంచిరాజనీతివేత్త చెప్పినట్లు కేవల అరాజకము, లేక నియంతృత్వము ఏర్పడు నావకాశము లేకపోలేదు. రాజ్యాంగ పీఠికయందు సాంఘిక, ఆర్థిక, రాజకీయన్యాయము; ఆలోచన, ప్రకటన, అభిప్రాయ, నమ్మిక, ప్రార్థనాస్వాతంత్ర్యము; సమానప్రతిపత్తి, అవకాశము; సౌభ్రాతృత్వము, వ్యక్తికి విలువయు హోదా; జాతియైక్యత అందరకు అందుబాటులో నుండగలదని హామీ యివ్వబడినది. ఇందలి పదజాలము 1789 వ సంవత్సరమునాటి చారిత్రాత్మకమగు ఫ్రెంచిప్రకటనను జ్ఞప్తికి తెచ్చుచున్నది. ముందుకు సాగి వివరములను పరిశీలించుచో నేటి రాజ్యాంగము 1935-వ సంవత్సరపు ఇండియాచట్టమునకు కొన్నిమార్పులు గల నకలు అని స్పష్టము కాగలదు. ఫెడరల్ స్వరూపము కలదైనను ముఖ్యలక్షణములన్నియు యూనిటరీవిధానమును బలపరచునవై యున్నవి. ఒకవిధముగా అమెరికను ఫెడరలుపద్ధతి, ఫ్రెంచికేంద్రీకరణవిధానము మేళవింపబడినవి. ఇందలి ఫెడరల్ విధానము అమెరికా, ఆస్ట్రేలియాలలోవలెగాక కనడాకు సన్నిహితమైనది. బ్రిటిషుకాబినెటువిధానముతో సమన్వయముచేయుటచే ఫెడరల్ విధానము కడు బలహీనమైనదని చెప్పవలయును. ఒకవిధముగా దక్షిణాఫ్రికాయూనియను రాజ్యాంగముతో పరితూగు నని తోచుచున్నది. ఎటుల చూచినను భారతసంస్కృతి, సంప్రదాయముల కనుగుణముగ రాజ్యాంగము లేదనుట నిర్వివాదాంశము. పరాయిదేశముల అనుభవములను స్వీక

రించుట తప్పని, హాసస్థనుండబోకముగ నుండవలెనని ఎవ్వరు చెప్పక పోయినను మనదేశపు వాతావరణమునకు, ప్రజల నైజమునకు అనువగు విషయములను మాత్రమే స్వీకరించవలెను. కాని రాజ్యాంగ మంతయు వివిధదేశములనుండి ఎరువుతెచ్చుకొన్న ఆదర్శములతో కూడిన కట్ల బొంత అనుచో ఏముక్క కాముక్క విడిపోగలదు. మామూలుప్రజ లెంతవరకు జీర్ణించుకొనగల్గుదురో అంతవరకుమాత్రమే రాజ్యాంగము విజయవంత మగును.

రాజ్యాంగమందు పౌరులకు గల ప్రాథమికహక్కులకు ప్రముఖస్థానమీయబడినది. ఈ హక్కులను విశదీకరించుచో ప్రత్యేక వ్యాసమగును. వాక్స్వాతంత్ర్యము, శాంతియుతముగ సమకూడుట, ఎచ్చటనైనను సంచరించుట లేక స్థిరపడుట, ఇష్టమువచ్చిన వృత్తిని అవలంబించుట, ఆస్తిని సంపాదించుట ఆదిగా గల హక్కులన్నియు సామాన్యమానవుని నిత్యజీవనమునకు, పురోభివృద్ధికి, శాంతిసౌఖ్యములకు అత్యవసరమని చెప్పిన చాలును. ఇవి పౌరులకు అమూల్యమగు ఆస్తి అనుటలో అతిశయోక్తి లేదు. వీటిని పరిపూర్ణముగా గ్రహించి సక్రమముగ వినియోగించినపుడే అందరును యథార్థమగు స్వాతంత్ర్యమును, సౌఖ్యమును అనుభవింపగల్గుదురు. కాని యీహక్కులన్నియు హద్దులమధ్య కొన్ని నియమములకు, నిబంధనలకు లోబడియున్నవి. అందుచేత నిజముగా అవసరమగునపుడు నిరుపయోగమగునను వాదము కూడ కలదు. ఇందుకు సంబంధించిన కట్టుబాట్లు గులాబీపువ్వు ననుసరించియుండు ముండ్లవంటివి. అసాధారణపరిస్థితు లేర్పడినపు డీహక్కులన్నియు కుదించబడును. ఇట్టి ఏర్పాటు ప్రతిరాజ్యాంగ మందును కలదు. వ్యక్తిగతమగు హక్కులనైనను త్రోసిపుచ్చి సంఘముయొక్క శ్రేయస్సును, భద్రతను కాపాడవలయు ననుటయే యిందులకు సమాధానము. ప్రమాదకరమగు పరిస్థితులందే వీటి ప్రాముఖ్యత హెచ్చు. వీటిని రాజ్యాంగమందు పొందుపరచుటచే పరిపాలకులకు, న్యాయాధిపతులకు, న్యాయవాదులకు, పౌరులకు ఏతద్విషయములన్నియు జ్ఞప్తియందుండి పరిపాలన జనసామాన్యమున కనువగు రీతిని నడచిపోవును.

తరువాత మూలసూత్రములు ప్రధానమైనవి. వీటిని న్యాయస్థానముల ద్వారా అమలుపరచుటకు సావకాశము లేకపోయినను, రాజతంత్రమున కివి పునాదులవంటివి. ప్రభుత్వము ప్రజలయొక్క సర్వతోముఖమగు పురోభివృద్ధికి పాటుపడవలెననియున్నది. స్త్రీపురుషుల సమానత్వము, జీవనభృతి, ఏకైకపౌరధర్మము, నిర్బంధప్రాథమికవిద్య, మద్యనిషేధము, గ్రామపంచాయతీల ఏర్పాటు, కార్యనిర్వాహక న్యాయశాఖల విభజన, ప్రపంచశాంతికై పాటుపడుట ఆదిగాగల ఆదర్శములన్నిటికి మూలసూత్రములందు స్థానము కలదు. అయిర్లండు, ఇటలీరాజ్యాంగములందు కుటుంబముల రక్షణకు, అభివృద్ధికి దోహదమిచ్చు చక్కటి ఏర్పాట్లు కలవు. మామూలుమనుష్యులకు ముఖ్యసంస్థయైన కుటుంబమునుగురించి మన రాజ్యాంగమం దెట్టి ప్రమేయము లేకుండుట శోచనీయము. మూలసూత్రములు కేవలము ఆదర్శములుగ ఆకాశవీథుల నుండునో, లేక ఆచరణలోనికి వచ్చునో చూడవలసియున్నది.

కేంద్రప్రభుత్వము సకలవిషయముల బలీయమైనది. అందుచే రాష్ట్రముల అధికారము సన్నగిల్లినది. నేటి అసాధారణపరిస్థితులే యిట్టి పరిణామమునకు త్రోవ తీసినవి. మన చరిత్రయందుకూడ స్వర్ణయుగమందు బలీయమగు కేంద్రప్రభుత్వము లున్నట్లు ఋజువగుచున్నది. ఇందులకు మౌర్య, గుప్త, ఆంధ్ర, మొగలుసామ్రాజ్యములే తార్కాణము. కాని వికేంద్రీకరణ ముఖ్యమైనపుడు మామూలు మనిషిస్థాయి దిగజారును. న్యాయస్థానములకు గల ప్రతిపత్తి, హోదా, అధికారములు ఉండుటచే పరిపాలన సవ్యముగనే సాగునని ఆశింపవచ్చును. ప్రజావిశ్వాసమును కోల్పోయిన ప్రతినిధులను మధ్యలో పదభ్రష్టులుగ చేయుటకు తగు ఏర్పాటు లేదు. ప్రధాన సమస్యలపై ప్రత్యక్షముగ ప్రజాభిప్రాయమును ప్రకటించి అమలుపరచు సదుపాయ మసలే లేదు. ఇట్టి ఏర్పాట్లు భారతదేశమువంటి పెద్ద దేశములందు ఆచరణసాధ్యము, వాంఛనీయము కావని వాదించు వారు కలరు. రాజ్యాంగమును సవరించుటకు గల నిబంధనలు కష్టతరముగను, క్లిష్టముగను ఉన్నవి. స్వల్పసవరణలు మెజారిటీవోటుతో సాధ్యమైనను ప్రధానమగు సవరణలకు హాజరైన సభ్యులసంఖ్యలో మూడింట రెండువంతులు మొత్తము సభ్యులలో సగమునకుపైగా అంగీకరింపవలెను. ఇందుకు తోడు కొన్ని సవరణలకు అందుకు సంబంధించిన రాష్ట్రముల అనుమతికూడ అవసరమై యున్నది. రాబోవు పార్లమెంటుయొక్క అధికారము నిటుల కుశలము చేయుట వాంఛనీయమో, కాదో యిప్పుడు నిర్ణయించుట కష్టము. కట్టుదిట్టము లెక్కువైనపుడు మార్పుచేయగోరువారు శాస్త్రబద్ధముగ వర్తించుటకు సావకాశ ముండదు. కాలానుగుణముగ మార్పు జరుగుటకు సావకాశము లేనపుడే విప్లవము వచ్చును.

మామూలుమనిషికి కావలసినది కడుపునిండ తిండి, కట్టుటకు బట్ట, వ్యక్తిగతమగు స్వాతంత్ర్యము. ఎంత చక్కటి రాజ్యాంగమైనను పై మూడుకోర్కెలను తృప్తిపరచనపుడు నిష్ప్రయోజన మగును. రాజ్యాంగసూత్రములు చదువుటకు, వ్యాఖ్యానించుటకు, వినుటకు సొంపుగ నున్నంతమాత్రమున పని జరుగదు. వోటువల్ల కడుపునిండదు. సమ్మెలు తీర్మానములు చిక్కులను విడదీయజాలవు. కొలదిమందికిమాత్రమే శాంతిసౌఖ్యములను, భద్రతారక్షణలను చేకూర్చు పథకము చిరస్థాయిగ నుండజాలదు. స్వాతంత్ర్య మనగా కేవలము రాజకీయములకు సంబంధించినది కాదు. ఆర్థిక, సాంఘిక, నైతికసమస్యలు తృప్తికరముగ పరిష్కరింపబడినపుడే స్వాతంత్ర్యము సార్థకమగును. ప్రజాస్వామిక మనగా ప్రజలచే, ప్రజల నిమిత్తమై నడుపబడు ప్రజాప్రభుత్వమని నిర్వచనము కలదు. కాని ఎన్నికలు కాగానే ప్రజల బాధ్యత పూర్తి అగును. తరువాత ఎన్నుకొనబడిన ప్రతినిధులు తమ బాధ్యతలను, విధ్యుక్తధర్మములను తరుచు మరచిపోవుట తటస్థించును. అందుచేత ఏదేశమందైనను నిజ

ముగా ప్రభుత్వమును నడిపినది కొలదిమంది వ్యక్తులుమాత్రమే. వారు అధికారమును దుర్వినియోగము చేసినంతకాలము ప్రమాద ముండదు.

ప్రజాస్వామిక మనగా మధ్యతరగతిపరిపాలన యని శ్రీ హార్డ్లీ చెప్పియున్నాడు. మధ్యతరగతి సుఖీకముగ నున్నంత కాలము ప్రభుత్వము సుస్థిరముగను, శాంతియుతముగను సాగి పోవును. ప్రస్తుతక్లిష్టపరిస్థితులవల్ల మధ్యతరగతి కృశించి క్రుంగి పోవుచున్నది. స్వార్థపరులును దూరదృష్టిలేని భాగ్యవంతులు, కలహ పాటు నొంది ఉద్రేకపూరితులై యున్న పీడలు పీడిని చేరమొకపైపు నుండి నలిపి వేయుచున్నారు. తత్ఫల మధ్యతరగతియే అంతమగు పరిస్థితు లేర్పడినవి. స్వాతంత్ర్యసంపాదనకై సాటిలేని త్యాగము చేసి, జాతీయపునర్నిర్మాణమునకు, సంఘసంస్కరణకు, సంస్కృతిరక్షణకు నిరంతరకృషి నొనర్చుచు, ఉన్నతాదర్శములతో, కష్టనష్టము లను లెక్కసేయక, ప్రతిఫలాపేక్ష లేకుండ జాతీయసౌధమును నిర్మించినవారి స్థితి యిట్లగుట శోచనీయము, దుర్భరము. ఇందుమూలముగా దేశక్షేమమునకు, జాతీయాభివృద్ధికి ప్రమాద మేర్పడవచ్చును. వేరే తరణోపాయము లేక నిస్సహాయతచే నిస్పృహ చెంది అవకాశ వాదము ననుసరించి వీరు విప్లవకారులుగ మారి పీడలను భాగ్య వంతులపైకి రెచ్చగొట్టెదరు. సంఖ్యాధిక్యము గల పీడల భుజబలమునకు మధ్యతరగతివారి బుద్ధిబలము తోడైనపుడు అల్పసంఖ్యాకులగు భాగ్య వంతులకు నిలువ నీడ యుండదు. సామ్యవాదము శాస్త్రప్రాయమైన దగుటచే దీనిని ప్రచారము చేయువారు మధ్యతరగతికి చెందిన సంస్కారము గల విద్యాధికులుగాని కార్మికులు కాదని కౌట్స్కీ వెలిబుచ్చిన అభిప్రాయముతో లెనిన్ కూడ ఏకీభవించెను. అందు చేత నిరుద్యోగము, నిస్పృహ, అజ్ఞానము, దారిద్ర్యము తాండవించు ప్రదేశములందు కమ్యూనిజము సత్వరముగ వ్యాపించును. ఇందులకు చైనా తార్కాణము. జాతీయసంస్కృతిసంప్రదాయముల కనుగుణ ముగ వర్తించుటకు తగిన సత్యశీలము, ధైర్యస్థైర్యములు, ఓర్పు, సహ నము, నమ్రత, దూరదృష్టి, సమదర్శిత్వము గల మధ్యతరగతివారి కత్యమే నేటి క్లిష్టపరిస్థితులను చక్కజేయగలదు. ఉదాసీనత, కాల యాపన ప్రమాదమునకు దారితీయును.

భారతరాజ్యాంగము 'సర్వజనాః సుఖినో భవన్తు' అను సనా తనాదర్శమును సాధించుటకై పనిచేయవలె నన్న ప్రజలందరు చిత్త శుద్ధితో సురుచిరమగు శాసనములను నెరవేర్చవలెను. నాయకు లనగా ఎక్కడినుండియో దిగివచ్చువారు కారు. సామాన్యమనుజుల జీవిత మును, ఆశయములను, ఆదర్శములను ప్రతిబింబింపజేయగలవారే యథార్థమగు నాయకులు. ప్రజ లట్లు పరిపక్వవారి నెన్నుకొనుచో సర్వతోముఖమగు పురోభివృద్ధి తథ్యము. లేనిచో సర్వాంగసుందర మగు ఫ్రెంచిరిపబ్లికు, జర్మనీలో ప్రథమప్రపంచయుద్ధానంతరము ఏర్పడిన వైమరురిపబ్లికు రాజ్యాంగములు పొందిన పరిణామమే భారత రాజ్యాంగమునకు కలుగవచ్చును. సామాన్యమనుజులు తమకు గల అవకాశములను, తెలివితేటలను ఉచితజ్ఞతతో సద్వినియోగము చేసి నపుడే సిద్ధము చేకూరును. అట్టి సదవకాశము చట్టరీత్యా, [illegible] జరుగనున్న క్రొత్త ఎన్నికలద్వారా త్వరలో రానున్నది. దూరదృష్టితో సంగతిసందర్భములను గ్రహించి తమ హక్కులను సద్వినియోగము చేసి శాసనములను సక్రమముగ నిర్వ ర్తించినపుడే సామాన్యమనుజుల స్థాయి ఉన్నతమయి ప్రతిపత్తి వృద్ధి యగును. ఉద్రేకపూరితులై ముందువెనుక లాలోచింపక అవకాశ ములకై వేచియున్న, నీతినియమములు లేని స్వార్థపరులగువారి వలలో చిక్కుకొనుచో ముక్తి లేకపోవుటయేకాక పరిస్థితి అన్ని విధముల అధ్వాన్నమగును. ఈవిషయమై వివరముగ జోస్యము చెప్పుట సాహసము.



# పాతివ్రత్యం

శ్రీ శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి

★

[కవికుల గురుదేవులు, ఆంధ్ర ఆస్థానకవి, శతావధాని బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి గారు మహాశివరాత్రి పర్వదినమున శివసాయుజ్యం పొందినారు. వారు ఆఖరుక్షణంవరకు కలం వదల్లేదు. వారు స్వయంగా–స్వంతదస్తూరీతో వ్రాసిన ఈ దీర్ఘవ్యాసము బహుశః వారి కడపటిరచన కావచ్చును. మరొక పదిరోజులకు భౌతికదేహం చాలించెదమనగా వారీ వ్యాసమును ‘భారతి’కి పంపిరి. ఈ కడపటిరచనను ఏరికోరి ఉగాదిసంచికలో ప్రకటించుచున్నాము. ఈ అవకాశము మాకు లభించినందుకును, ఈ రూపమున ఆంధ్రపాఠకలోకానికి వారి తుదిరచనను అందజేయగలిగినందుకును సంతసించుచున్నాము. సంపాదకుడు]

★

ఆయీపాతివ్రత్యవ్రతాన్ని గూర్చి యే వ్రతమాహాత్మ్యములోనూ ప్రత్యేకించి శ్రావణమంగళవారపు నోమూ, బొమ్మలనోమూ అయీనోములనుగూర్చి వ్రాసినట్లు లేదుగాని వుండడం ప్రతిగ్రంథంలోనూ అంతో యింతో వుండితీరుతుంది. అక్షరజ్ఞానం లేని సంసారా వచ్చేదకాలకు తెలిసినన్ని అయీవిషయానికి సంబంధించిన ధర్మ పన్నాలు మహావిద్వాంసులకుగాని, మహాకవులకుగాని, పౌరాణికులకుగాని, ఐతిహాసికులకుగాని తెలియునే తెలిసివుండవన్నా అంత సాహసం కాదు. అందులోనూ భార్యకు కొత్త అక్షరజ్ఞానం కలదిగా వుండే సందర్భంలో భర్తగారి ముఖం రుసరుస లాడడం వర్ణించవలసివస్తే దేదీప్యాంతరాన్నంచేనా చిరుమతికావలసిందేకాని లోగడ నిలవ వున్న సరుకు పనికిరాదు.

అసలు హెడ్డింగుకు అర్థం కుదరదు. బహువ్రీహి సమాసంగా వుభయులూ రాకపడితే, ‘పతిరేవ వ్రతం యస్యాస్సా’ అని విగ్రహవాక్యం చెప్పి, "పిడుక్కీ బియ్యానికీ వొకటే మంత్రం"గా చెప్పుకుతినడం మొదలిడడానికి పూర్వపు అమాయక లోకం సహించినా కొంచెం కళ్లు తెరిచిన యీకాలపు సాధ్వులు "న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి" అన్న ధర్మసూత్రానికి వ్యాఖ్యానం చేసి విజ్ఞుల మెప్పును పొందగలరు.

"ధర్మసూత్రస్థమైన స్వాతంత్ర్యపదానికి వొక కరోటకుడు శారీరకకృత్యాలకుకూడా భర్తగారి సెల వుండితీరాలి. అలా సెలవుచీటి పొందనియెడల నీవు పరానికే కాదు, యిహానికిన్నీ చెడతావు" అంటూ యేవో తెలిసీ తెలియని వ్యాఖ్యానాలు చేస్తూ చెప్పుకుతినడానికి వొక యిల్లాలు కొన్నాళ్లు సహించి గ్రామములో "ఆలనా పాలనా" లేకపోవడంచేత యెవరితో మొఱ పెట్టుకుందామన్నా, "అమ్మాయీ! నీవు భార్యవు; అతడు భర్త (వొకనిచే భరించ తగినది భార్య; భరించేవాడు భర్త)." యింతే గాని ప్రయోజనం లేక మనువచనాన్ని (ఆపత్కాలే నాస్తి మర్యాదా) వుల్లంఘించి యెక్కడనో కొంత నైచ్యాన్ని అనుభవించి తుదకు యీమాదిరివాళ్లకు శరణ్యంగా వుండే రంగూను చేరుకొని (మధ్యకాలపు చరిత్ర తిన్నగా తెలియదు వదులుతూ వున్నాను.) సుమారు యిరవైయేళ్ళ వయస్సుకొడుకుతోనూ, పదహారుయేళ్ల వయస్సు కూతురుతోనూ స్వగ్రామానికి చూచేవాళ్లకి కన్నులపండువుగా ప్రత్యక్షం అయింది. భర్త యెవరో మాత్రం తెలియదు. గ్రామం యావత్తూ బీరకాయపీచు, పినతల్లివంకవాళ్లూ పెదతల్లివంక వాళ్లూ మేనత్తవాళ్లూ మేనమామవాళ్లూ—వక రేమిటి! పూర్వభర్త (చనిపోవుటచే) కనపడలేదుగాని భర్త సోదరులు కూడా కనపడడమే కాదు బంధుమర్యాదలతో ఆదరించారు కూడాను. యెవరో వకరూ యిద్దరూ అయితే ఛీ గీ అని బంధుజాతం బెదిరించేదేమో! యీ సందర్భం అట్టిదిగా లేదు.

"సర్వంజగన్నాథం"గా, లేదా "శతాంధాః కూపం ప్రవిశంతి"గా వుండడంచేత కిక్కురుమన్నవాళ్లే లేరు. వొకరిని చూచి వొకరు వేలంవెర్రిగా చుట్టుపట్ల గ్రామాల్లో వుండే బంధుజాతంకూడా మాతినవస్త్రి ప్రదానాదులతో విందులు చేసింది. అయీసందర్భం

పూర్వకాలంలోనే జరిగితే యేంజరిగేదో! పూర్వకాలం కాదే అనుకుందాం, యిప్పటి (పాపిష్టి) కాలమే అయినా, మాంసం తింటే తింటాంగాని బోమికలు మెడకట్టుకు తిరుగుతామా?

యింకా వినండి. ఆమెకొడుక్కి ఆమెప్రథమభర్త మేనమామ కొడుకు నాలుగైదుమాసాల గర్భవతిని శ్రీమతిని తనకుమార్తె నిచ్చి పెండ్లికూడా చేసినాడు. యీపెండ్లి కొంత కళంకంవల్ల బంధుజాలం ఆదరించి ఆకన్యను స్వీకరించదని తండ్రి బుద్ధిమంతుడుగనుక యీ విధంగా ఆమెకు గృహిణీత్వాన్ని సంపాదించివుంటాడు. తక్కిన వాళ్ల కర్మం యేమి కాలింది! కొత్తసంసారాల్లద్వారాగా దీన్ని సమర్థించడానికేనా అవకాశం వుంటుందని నాకు తోచదు. మొట్ట మొదట కొన్నాళ్లు పెళ్లికొడుకు తండ్రి తెరచాటుగా వున్నాడు గాని తరవాత ఆయన కూడా బహిరంగంగానే వున్నట్లు వినడం. అయీ సందర్భం యే కలకత్తావంటి, బొంబాయివంటి, లేదా కాశీవంటి పట్నవాసాలలోనో అయితే అడిగేవాడూ వుండేడు. జవా బిచ్చేవాడో? అంతకుముందే వుండేడు. సిద్ధపల్లెటూళ్లో జరిగిందంటే, యెవ్వరూ విశ్వసింపరు. యెన్ని సమర్థించాలి?

ఆయీయిల్లాలికి భర్త జీవించివుండగా (మధ్య కాలపు చరిత్రలో యేమేమి కళంకా లున్నాయో వాట్లను తలపవద్దు) రోక పెళ్లి; ఆపెళ్లి జాత్యంతరుడితో కాక (స్వశాఖవానితో కాకపోయినా) బ్రాహ్మడితోటే కావడం ఆమె చేసికొన్న పూర్వ జన్మ పుణ్యం. దాక్షిణాత్యుడు; పెద్ద ఉద్యోగం చేసి పెన్షను పుచ్చుకొనుచున్నాడట. ఈమెకాక అసలుపెళ్లి పెండ్లాముకూడా వున్నట్లు తెలిసింది. ముప్పైశిఖలేనా వొకచోట యిముడుతాయి గాని మూడుకొప్పులు యిముడ వంటారు పెద్దలు. యీ సవతుల పరస్పరమైత్రి ఆ పెద్దల అమతానికి విరుద్ధం.

"నహ్యేకంలత్వ్యం యోగారంభం ప్రయోజయతి" కొంచెంసేపు ఆపుతాను. వార్ధక్యం ముదిరింది. వ్రాయడానికి మొదలుపెట్టింది యే నాలుగుపేజీలతోనో తెములుతుం దనుకొన్నాను. యిష్టదేవతా నమస్కారం చేశాను. హెడ్డింగు చిత్రించాను. వలలోనుంచి పింగళ లోకి, దానిలోనుంచి కాళయుక్తిలోకి "విసరుబొజ్జా, తోపా" కథలాగా నడుస్తూవుంది. యిది తేలేటట్టు లేదు. యిది మన పర్యవసానం చూచేటట్టు కనపడుతూవుంది గాని దీని పర్యవసానం మనం చూచేటట్టు లేదు. శాంతం పాపం.

"విాదలుంగనివారల కేది సుఖము". మొట్టమొదట శ్రీకారం చుట్టేటప్పటికే అంతరంగంలో గ్రంథం యావత్తూ లిఖింపబడి వుండాలి. దీని వైఖరిని పరిశీలిస్తే అట్టి స్థితిలో లేదు. కనక యేవో రెండు మూడు పేరాలు వ్రాసి విరమిస్తాను.

పాతివ్రత్యమునుగూర్చి వ్రాయడం సులువే గాని, ఆ సూత్రములను అమలుజరపడం కష్టసాధ్యం. యేనాటికోట్ల ద్రవ్యనష్టితో అంగీకరించి, యెందఱు పరమనిమధరోగ్యులమీదనో పన్నులు బనాయించి క్రమచేస్తూవున్న పద్ధతినికూడా (మద్యనిషేధం) అది బతికి బట్టకట్టడం పుస్తకాపేక్షగా కనపడుతూవుంది. చూడండి—"శతపుటాభ్రకం, సహస్రపుటాభ్రకం" ఆయీమందు యెన్నో పసర్లతో నూతి తయారు చేస్తారు. అగ్నిపుటంలో ఆ పసర్ల నామరూపాలు పూర్తిగానైతే నశిస్తాయిగాని ఆ పసర్ల గుణాలు చెక్కు చెదరకుండా నిల్చి మనలని వుద్ధరిస్తూనే వుంటాయి. ప్రస్తుతం కూడా ఆ రాబడిబడ్జెట్టులో పూర్చడానికి యేర్పడిన సాధుబాధ తాత్కాలంగా పీడిస్తూవుంటుంది. పిరు అనుకున్న ఘనకార్యం యింకో ఉద్యోగిహయాములోనో, పేఅోక అధికారిపరిపాలనలోనో అంత రిస్తుంది. త్రాగుబోతులు చిరజీవులై లోకాన్ని వుద్ధరిస్తూనే వుంటారు. యేనాడో భారతకాలానికి పూర్వం యే శకంలోనో—

"భూసురు లాదిగ గల జన-సీసుర సేవించిరేని యిది మొదలుగ బా-పాసక్తి బతితు లగుదురు- చేసితి మరియాద దీనికేకొనుడు."

అని శుక్రాచార్యులశాసనం. యేంలాభం? యే కొన్నాళ్లో అమలుజరిగినా, మళ్లా—

మతు లెన్ని చెప్పినా మామసక్కనే—థాతా యథా పూర్వం.

"ఎందఱు దేవతల్ చనిరి యెందఱు తాపసు లట్టె భ్రష్టులై
రెందఱు రాజు లేగిరి మ ఱెందఱు యోగులు శోకులైరి. ...."

"మనసా! హరిపాదము లాశ్రయింపుమా?"

"తాళ్లపన్ను తాగేవాళ్లే యిచ్చుకుంటారు."

అనే లోకోక్తి ప్రస్తుతం తల్లకిందులై యెందటో నిరప రాధులను పీడించడం యెన్నివిధాల పరిశీలించినా శోచనీయంగానే కనపడుతుంది. మహమ్మదీయప్రభుత్వం విధించిన జుట్టుపన్నుకన్నా యీ అస్మదీయమదీయప్రభుత్వం విధించిన యీ పన్ను శోచనీయం. అయితే ప్రభుత్వం అంటూ చేతికి రాకనే పోవాలిగాని అది చేతికి వస్తే నిరాక్షేపణగా నిర్వహించడం కలలోవార్త. ఊరికేనే అన్నారూ అభియుక్తులు "రాజ్యాంతే నరకం ధ్రువమ్"—ప్రభుత్వ నిర్వహణంలో కొంత సుఖమూ వుంటుంది, కొంత కష్టమూ వుంటుంది. "రాజ్యం స్వహస్తన్యస్తదండ మివాతపత్రమ్"

పాతివ్రత్యాన్నిగూర్చి నాలుగుమాటలు వ్రాసి విరమించా లనుకుంటే అవాంతరాలు వచ్చి అడ్డుతగిలి—"మొదలిడిన కార్య మది తుదముట్టదయ్యె." ముసలాళ్లని ౭౦ యేళ్లు రావడంతోటే తోసిరా జనడానికి కారణం— "వృద్ధుల బుద్ధులు పంచలింపవే!"

ప్రకృతి మనుపరామః. యెంతటి తపశ్శాలికీ లేని మర్యాద మన గ్రంథాలలో—పతివ్రతలకు యిచ్చి వున్నారు. కౌశికుడు తపస్సిద్ధి అయినపిమ్మటకూడా పతివ్రతమీద కళ్లెఱ్ఱజేసి—

"నీమగ వంత యెక్కువొ? మనీషులు భూసురు లంత తక్కువే?"

పూర్వకాలంలోనే జరిగితే యేంజరిగేదో! పూర్వకాలం కాదే అనుకుందాం, యిప్పటి (పాపిష్టి) కాలమే అయినా, మాంసం తింటే తింటాంగాని బోధికలు మెడకట్టుకు తిరుగుతామా?

యింకా వినండి. ఆమెకొడుక్కి ఆమెప్రథమభర్తయేనమామ కొడుకు నాలుగైదుమాసాల గర్భవతిని శ్రీమతిని తనకుమార్తె నిచ్చి పెండ్లికూడా చేసినాడు. యీపెండ్లి కొంత కళంకంవల్ల బంధుజాలం ఆదరించి ఆకన్యను స్వీకరించదని తండ్రి బుద్ధిమంతుడుగనుక యీ విధంగా ఆమెకు గృహిణీత్వాన్ని సంపాదించివుంటాడు. తక్కిన వాళ్ల కష్టం యేమి కాలింది! కొత్తసంసార్కాలవ్వారాగా దీన్ని సమర్థించడానికేనా అవకాశం వుంటుందని నాకు తోచదు. మొట్ట మొదట కొన్నాళ్లు పెళ్లికొడుకు తండ్రి తెరచాటుగా వున్నాడు గాని తరవాత ఆయన కూడా బహిరంగంగానే వున్నట్లు వినడం. అయీ సందర్భం యే కలకత్తావంటి, బొంబాయివంటి, లేదా కాశీవంటి పట్నవాసాలలోనో అయితే అడిగేవాడూ వుండేడు. జవా బిచ్చేవాడో? అంతకుముందే వుండేడు. సద్ధపల్లెటూళ్లో జరిగిందంటే, యెవ్వరూ విశ్వసించరు. యెన్ని సమర్థించాలి?

అయీయిల్లాలికి భర్త జీవించియుండగా (మధ్య కాలపు చరిత్రలో యేమేమి కళంకా లున్నాయో వాట్లను తలపవద్దు) వొక పెళ్లి; ఆపెళ్లి జాత్యంతరుడితో కాక (స్వశాఖవానితో కాక పోయినా) బ్రాహ్మడి తోటే కావడం ఆమె చేసికొన్న పూర్వ జన్మ పుణ్యం. దాంపత్యుడు; పెద్ద ఉద్యోగం చేసి పెంషను పుచ్చుకొనుచున్నాడట. ఈమెకాక అసలుపెళ్లి పెండ్లాముకూడా వున్నట్టు తెలిసింది. ముప్పైయిళ్లేనా వొకచోట యిముడుతాయి గాని మూడుకొప్పులు యిముడ వంటారు పెద్దలు. యీ సవతుల పరస్పరమైత్రి ఆ పెద్దల అనుభవానికి విరుద్ధం.

"నహ్యేకంలక్ష్యం యోగారంభం ప్రయోజయతి" కొంచెంసేపు ఆపుతాను. వార్ధక్యం ముదిరింది. వ్రాయడానికి మొదలుపెట్టింది యే నాలుగు పేజీలతోనో తెములుతుం దనుకొన్నాను. యిష్టదేవతా నమస్కారం చేశాను. హెడ్డింగు చిత్రించాను. నలలోన్నుంచి పింగళలోకి, దానిలోన్నుంచి కాళయుక్తిలోకి "విసరుబోజ్జా, తోపా" కథలాగా నడుస్తూవుంది. యిది తేలేటట్టు లేదు. యిది మన వర్ణన పానం చూచేటట్టు కనపడుతూవుంది గాని దీని పర్యవసానం మనం చూచేటట్టు లేదు. శాంతం పాపం.

"విూరెలుంగనివారల కేది సుఖము". మొట్టమొదట శ్రీకారం చుట్టేటప్పటికే అంతరంగంలో గ్రంథం యావత్తూ లిఖింపబడి వుండాలి. దీని వైఖరిని పరిశీలిస్తే అట్టి స్థితిలో లేదు. కనక యేవో రెండు మూడు పేరాలు వ్రాసి విరమిస్తాను.

పాతివ్రత్యమునుగూర్చి వ్రాయడం సులువే గాని, ఆ సూత్రములను అమలుజరపడం కష్టసాధ్యం. యేనాఁటికోట్ల ద్రవ్యనష్టికో అంగీకరించి, యెందఱు పరమనిమధరోగ్యులమీదనో పన్నులు బనాయించి క్రమచేస్తూవున్న పద్ధతినికూడా (మద్యనిషేధం) అది బతికి బట్టకట్టడం పుస్తకాపేక్షగా కనపడుతూవుంది. చూడండి—

"శతపుటాభ్రకం, సహస్రపుటాభ్రకం" అయీమందు యెన్నో వసర్ళతో నూతి తయారు చేస్తారు. అగ్నిపుటంలో ఆ పసర్ల నామరూపాలు పూర్తిగానైతే నశిస్తాయిగాని ఆ పసర్ల గుణాలు చెక్కు చెదరకుండా నిల్చి మనలని వుద్ధరిస్తూనే వుంటాయి. ప్రస్తుతం కూడా ఆ రాబడిబడ్జెట్టులో పూరించడానికి యేర్పఱిచిన సాధుశాధ కాక్షంగా పీడిస్తూవుంటుంది. వీరు అనుకున్న ఘనకార్యం యింకో ఉద్యోగిహయాములోనో, వేఱొక అధికారిపరిపాలనలోనో అంత రిస్తుంది. త్రాగుబోతులు చిరజీవులై లోకాన్ని వుద్ధరిస్తూనే వుంటారు. యేనాడో భారతకాలానికి పూర్వం యే కతంలోనో—

"భూసురు లాదిగ గల జను-లీసుర సేవించిరేని యిది మొదలుగ బా-
పాసక్తి బతికు లగుదురు- చేసితి మరియాద దీనికే నొనుడు."

అని శుక్రాచార్యులశాసనం. యేంలాభం? యే కొన్నాళ్లో అమలుజరిగినా, మళ్లా—

మరు లెన్ని చెప్పినా మామకృనే—యథా యథా పూర్వం.

"ఎందఱు దేవతల్ చనిరి యెందఱు తాపసు లట్టె భ్రష్టులై
రెందఱు రాజు లేగిరి మ ఱెందఱు యోగులు కోసులైరి....."

"మనసా! హరిపాదము లాశ్రయింపుమా?"

"తాళ్లపన్ను తాగేవాళ్లే యిమ్మంటారు."

అనే లోకోక్తి ప్రస్తుతం తల్లకిందులై యెండలో నిరప రాధులను పీడించడం యెన్ని విధాల పరిశీలించినా శోచనీయంగానే కనపడుతుంది. మహమ్మదీయప్రభుత్వం విధించిన జుట్టుపన్నుకన్నా యీ అస్మదీయమదీయప్రభుత్వం విధించిన యీ పన్ను శోచనీయం. అయితే ప్రభుత్వం అంటూ చేతికి రాకనే పోవాలిగాని అది చేతికి వస్తే నిరాక్షేపణగా నిర్వహించడం కలలోవార్త. ఊరికే నే అన్నారూ అభియుక్తులు "రాజ్యాంతే నరకం ధ్రువమ్"—ప్రభుత్వ నిర్వహణంలో కొంత సుఖమూ వుంటుంది, కొంత కష్టమూ వుంటుంది. "రాజ్యం స్వహస్తగృతదండమివాతపత్రమ్"

పాతివ్రత్యాన్నిగూర్చి నాలుగుమాటలు వ్రాసి విరమించా లనుకుంటే అవాంతరాలు వచ్చి అడ్డుతగిలి—"మొదలిడిన కార్య మది కుదమట్టదయ్యె." ముసలాళ్లని ౭౦౧ యేళ్లు రావడంతోటే తోసేరా జనడానికి కారణం— "వృద్ధుల బుద్ధులు పంచలింపవే?"

ప్రకృతి ననుసరామః. యెంతటి తపశ్శాలికి లేని మర్యాద మన గ్రంథాలలో—పతివ్రతలకు యిచ్చి ఉన్నారు. కాశిపుడు తపస్సిద్ధి అయినవిమ్మటకూడా పతివ్రతమీద కళ్లెఱ్ఱజేసి—

"నీమగ డంత యెక్కుడె? మనీషులు భూసురు లంత తక్కువే?"

ళి శాస్త్రిగారి పాండిత్యగౌరవం యేం తెలుస్తుంది! కనక పలచ పలచగా "సుగంధం పిరిరః." చేశారని వినడం. సుగంధం జరక్క పోయినా అంతదాకా లేనా వచ్చివుంటుంది. ఆలోటు పిమ్మట "అడుగో పులి, అంటే యిదుగో తోకగాడ్లు" వుంటారు కాదూ, వాళ్లు పూర్తిచేసి లోకానికి అందించివుంటారు. జర్మనీవారికి మన అథర్వణవేదపు రహస్యాలు వ్యాఖ్యానంచేసి, అంత గొప్పతనం కలిగించింది యీశాస్త్రులుగారే అని మనవాళ్లు చెప్పుకోవడం.

క్రియలో మాట. యీశాస్త్రిగారి దేహం యెక్కడ త్యజింపబడిందో తెలియదు—మొదటి ప్రపంచయుద్ధం నాటికి యీయన (౧౯౧౪ సం) బతివున్నై జర్మనీలో కేజరుకు శస్త్రాస్త్రరహస్యాలు బోధిస్తూవున్నారనే మనలో అనేకుల . విశ్వాసం. ఆయుద్ధం నాటికి ౭౫ యేళ్లైనా వుంటే పద్ధతిని యిప్పటికి గ్రహాయుర్దాయ పరిమితి (౧౨౦) కూడా అతిక్రమించవలసివస్తుంది గనక వీరు కొలదివత్సరాలనాడు స్వర్గస్థులైనారని భావించవలసిందే. సుభాషచంద్రుని విషయం మాత్రం యింకా కొన్నాళ్లు మాటోట్లకు ఆకాజనకంగావుంటుంది. మళ్లా యీమధ్య పత్రికలో చదివినజ్ఞాపకం. నిజమైనా కాకపోయినా ప్రియమైన—శుభసూచకమైన వాక్యమంటే అందఱూ "రేడియో"వద్ది జకి మూసుతారు.

"లోకము పగయును పరుసని
వాకున జుట్టమును మధురవాక్యముకలిమిన్,
కాకేమి తిన్న దిట్టెనె!
కోకిల తన్నేమి ధనముకొమ్మని పెనే." (కవికర్ణ)

పతివ్రతల భర్తలను కవులు పరమదౌర్భాగ్యంగానే చిత్రించడం శోచనీయమని వ్రాస్తూ మజిలీ కొంతయెక్కువదూరం ప్రయాణం చేశాం. అల్లుడు ఆకేవుద్యోగానికి యేపరీక్షా ప్యాసు కావక్కరలేదు. ఆ పెంపెన్ను తప్పకుండా వుండేచాలు. నవగ్రహాలు కాక (అవి ఆకాశంమీదగదా వుంటాయి) భూమిమీద యింకో గ్రహం వుందంటూ వక కవి యీవిధంగా చమత్కరించాడు—

"తృతీయైకాదశే వృష్టిః కన్యారాశిస్థితః పరం
సదా వక్రగతిశ్చైతి జామాతా దశమో గ్రహః"

శ్లోకమైతే చాలా చిన్నదేగాని వ్యాఖ్యానించవలసివస్తే చాలా పెరుగుతుంది. రాసులు పన్నెండు. అందులో మూడోరాశి మిథునం. పదకొండోది కుంభం. గ్రహాలకి (శన్యాదులకు) క్వాచిత్కంగా వక్రగతి కలగడం వుందిగాని యీగ్రహానికి యెప్పుడూ వక్రగతే. యిదేవిధంగా సమన్వయించుకోవాలి. అందులోనూ కొత్తక్కడి వక్రగతి మరీ శోచనీయంగా వుంటుంది. యింకోకవి చాలా పెద్దశ్లోకమే వ్రాశాడు. వ్రాయడానికేం, అత్తా ఒకయింటి కోడలే; మామా ఒకయింటి అల్లుడేకదా. తత్తథాస్తామ్.

కవులు పతివ్రతలయోగ్యతకు వన్నెకలిగించడానికే నా పరమ కవిచిత్తులని, ఖా—కే—న గార్లని భర్తలను కల్పించడం! లోకంలో కొందరైనా ఆత్తివాళ్లు గాలిస్తే చిక్కుతారా, అనే సారాంశాన్ని విచారించి దీన్ని ముగిస్తాను.

"తిజ్ఞామూర్తిపదాంకితో నభురుతే కింనామ దుశ్చేష్టితమ్"

అన్నాడు కొక మహాకవి. ఆ పదం యెవడికిపెట్టినా, వాడు దుశ్చేష్టలు చేసితీరతాడంటే చాలామందికి యిబ్బందిగా వుంటుంది. కాని, ఆకవి బ్రహ్మచారిగానే జీవితం యీడుస్తూ గడపవలచాడో యేమో! పూర్వకాలపు పతివ్రతలను మించిన పతివ్రతలనుమించిన పతివ్రతలు యీకాలంలో వున్నారు. సుమారు అయిదారేళ్ల నాడు కొక పతివ్రతనుగూర్చి కృష్ణాపత్రికలో కొంతెం వ్రాసివున్నాను. ఆమె శ్రీ॥ శ్రీ॥ శ్రీపురాణపండ మల్లయ్యశాస్త్రులుగారి పౌత్రి) రాజేశ్వరమ్మగారు. బెజవాడ కనకదుర్గ యీమెతో మన పిచ్చి మాట్లాడుతుందనియ్యేదే నావిశ్వాసం. యీమెనివాసం పిఠాపురాన్నుంచి చంటిపిల్లలతో అనమం మాసానికి కొకసారైనా వచ్చి దుర్గతో కష్టసుఖాలు ముచ్చటించుకొని ఆమె యేర్పాటు ప్రకారం ప్రదక్షిణాలు (కొండలూ వేలూను) చేసివెళ్లడం పలువురు యెరుగుదురు. భర్త యింగ్లీషులో బి. ఏ. దాకా చదివిన్నీ మతిభ్రమణంచేత పరీక్షాకాలానికి హాజరు కాలేదు. సంస్కృతాంధ్రభాషలు రెంటిలోనూ నిరాఘాటంగా కవిత్వం చెపుతాడు. ఆయీవిద్వత్కవిని గూర్చి భార్య రాజేశ్వరమ్మ సకలపాట్లూ పడింది. ప్రయోజనం లేదని డాక్టర్లు చెప్పినా యిప్పటికింకా విరమించక వైద్యాలకు ఆయన్ని వెంటపెట్టుకొని పల్లెలకూ పట్నాలకూ తిరుగుతూనేవుంది. స్నానంచేయడమేకాని తల దువ్వుకోవడం యెరుగదు. చాలాసార్లు శరీరంఆపాదమస్తకం నీరు చూపింది. ఆయాసంకూడా ఆరంభించింది. తుదకి ఆ వ్యాధులకి యేంలోచించో ఆయీసాధ్వీమణిని వాటంతట అవే పరిత్యజించి తప్పుకున్నాయి. తోస్తేతప్ప అన్నం తినడు. రైలుప్రయాణం చేసేటప్పుడు తోచిన స్టేషనులో దిగి చక్కాపోతాడు. యిప్పటికి సుమారు కొన్నిమాసాలనాడు బెజవాడనుంచి పిఠాపురానికి ప్రయాణంచేస్తూ మధ్య యేస్టేషనులోనో దిగి యిప్పటికి అరా పరా లేదు. అక్కడ కనపడ్డాడు యిక్కడ కనపడ్డాడు అనే గాలి వార్తలనుబట్టి అక్కడా యిక్కడా వెదుకుతూ శ్రమపడుతూ వుంది. లోగడ యీలా యెక్కడికోవెళ్లినా మళ్లా నెలరోజుల లోపుగా రావడం వుండేది. యీసారి ఆలా జరగలేదు. మునుపు కృష్ణాగోదావరుల మధ్యనే సంచరించడం. యీసారి పెన్నకూడా అతిక్రమించినట్లు నీలివార్తలు. పూర్వకాలపు పతివ్రతలలో ఆ యీమాదిరి భర్తనుగూర్చి యిట్టిపాట్లుపడే పతివ్రతలు వుంటే వున్నారేమోగాని యీవిడాకులచట్టపు ప్యాసుటైన దావరికోజుల్లో యీలాంటి భర్తక్షేమానికై యత్నించడం అంటూ వుంటుందా? అయినా రాజేశ్వరమ్మగారి తల యెన్నిసార్లు పగిలి దానంతట అదే హత్తుకుందో భగవంతుడికే తెలియాలి. భర్త కొడితే ఆదెబ్బ ప్రమాదకరమైన దైనప్పటికీ దానికి చికిత్సచేసుకోవడం పతివ్రతకు యుక్తం

కాదని ఆమె అభిప్రాయం కాబోలు. ఆమె నియమాలు చాలా అసిధారావ్రతాలుగా వుంటాయి. వాట్లని తూ—చా తప్పకుండా ఆమె నెఱవేర్చుకుంటుంది. వాట్లని వివరించవలసివస్తే చాలా పెరుగుతుంది వ్యాసం. ఒక్కటిమాత్రం మచ్చు చూపుతాను. ఆమె తిఱుమ వుపవాసాలేగాని భోజనం చేయడమంటూ లేనే లేదు. మైదాపిండో, కొబ్బరికోరో తిని క్షున్నివృత్తి చేసుకోవడమే. యెప్పుడేనా తినవలసివస్తే—స్వయంపాకం. యితరులు వండినదైతే అది యెంతచేతి సహాయంతో వచనం చేసిందిగా వుంటుందని ఆమె స్వీకరించదు. సోమవారం మౌనవ్రతపు రోజు. దీనికేం, యిది లోకంలో చాలామందికి వున్నదే. కాని భర్త పిచ్చివాడు కావడంచేత రైలుప్రయాణంలో పరీక్షార్థం వచ్చే కలెక్టరుకు టిక్కట్లు చూపడు. ఆమెకు మౌనవ్రతం. చలికి వుష్ణం బలకరం. యెవ్వరైనా యెఱిగినవాళ్లు వుండి వున్న యథార్థాన్ని తెల్పడం చేస్తేతప్ప లేకపోతే చిక్కేగదా. అయితే తగినంతస్థితిగతు లున్న సంసారమయితే ఆయా చిక్కులలో చాలా భాగం తొలగి పోతాయి కాని మిక్కిలి బీదసంసారం. భూమిమీద వచ్చే శిస్తు—

"...రయితుడిచ్చు యెసంగు ఫలంబదెంత హొమ్మన్న మ వీరి కొక్క చెల యొపునో! యొపదో సంశయంబగు."

యీస్థితిలో ముగ్గురు ఆడపిల్లలు. కుటుంబగౌరవానికి లోపం లేకుండా యిద్దరికి కట్నాలబాధ లేకుండా పెండ్లి అయింది. యింకొక పిల్ల చాలా చిన్నది. తొందర లేదు. భగతు. భర్తకొఱకు దేశం తిరగడం తప్పదు. యెవరినీ యాచించదు. తాతగారు (కీ. శే.) వల్లయ్య శాస్తుల్లుగారు. తండ్రి భద్రయ్యశాస్తుల్లుగారు. (కీ. శే.) యీయన కూడా గౌరవంగా జీవయాత్ర గడిపినవారే. అభిమానం వదలి మన రాజేశ్వరమ్మ యాచన కెలా అంగీకరిస్తుంది? అడిగితే గిడిగితే కవకమర్థమ్మని (అదేనా తనకుటుంబగౌరవానికి లోపం రాని ఫక్కీని) అడుగుతుందేమో కాని తనతరుపున అడగడమంటూ లేదు. యెన్ని చిక్కులో పడి ఆపిచ్చిభర్తచేత (క్వాచిత్కంగా) దెబ్బలు తింటూ పాతివ్రత్యాన్ని నెఱవేర్చుకుంటూవున్న రాజేశ్వరమ్మ కారణంచేతనే అనుకుంటా అమధ్య మన దేశం పరిహద్దుకు వచ్చి కూడా యుద్ధపుటలజడి మనలను కొండకోనలలో జమకట్టించక యే కాకినాడలోనో యే వైజాగులోనో కొంచెం మచ్చుకు యే వుద్యా లుబాంబులో వదిలి అంతతో సద్దుమణిగిపోయిందని నా విశ్వాసం. యిక్కడ పెనిమిటి కలవాడే అయినా అదృష్టలోపంచేత దుర్దశకులోను కలసివచ్చింది. రామలింగం పాండురంగమాహాత్మ్యంలో ఆ పతివ్రతకు కల్పించిన భర్త యే తరగతిలోనూ చేరడు. కాని యెక్కడో చూచి మరికొంత మేటరు తనకనుకూలమైనది చేర్చివున్నాడని నా తలపు. గ్రంథకర్త అభూతకల్పన చేయనేలేదనికూడా లోగడ రెండేళ్లనాడు కొలనరాజ్యాన్ని పొందినవాళ్లనిబట్టి చెప్పవచ్చు. కుష్ఠరోగపరీడితుడు భర్తకు వేశ్యయందు దనురాగం కలగడం, దాన్ని తీర్చడానికై భార్య ఆ వేశ్యని ఆశ్రయించి ఒప్పించడం—యీ మాదిరికథాకల్పనలతో పాతివ్రత్యమహాత్మ్యాన్ని పోషించడంకూడా ఒక్కొక్కప్పుడు నిజంగా జరిగితే జరిగిందేమో కాని అట్టి విశేషాలకు యీకాలం తగినది కాదు.

నేటికాలంలో పాతివ్రత్యమంటే? భర్త యొక్క క్షేమాన్ని కోరి సంసారంలో లోటుపాట్లు కనిపెట్టి వర్తించడం. యీమాత్రం యోగ్యతాలుగా వుండే స్త్రీమతికి భర్త వున్నవాడే వాడుడు ధన్యుడుగానే కొనియాడవచ్చునని యేమైనా.

ప్రతిసంగతికీ మనోవాక్కాయములకు సంబంధం వుండడమూ, యీ త్రికరణాలలోనూ మనస్సునే గౌరవించడమూ అందఱూ యెఱిగినదే. యీ మానసికగౌరవాన్ని అంగీకరించే పక్షములో నిజమైన పాతివ్రత్యానికి లక్ష్యమే దొరకదేమో అని నా భయం. అందుచేత దీనికిమాత్రం మానసంమీద విస్తారభారం పెట్టకూడదు. ఒక వుదాహరణం. కొన్ని జాతక చక్రాలు (స్త్రీలవీ, పురుషులవీకూడా) చూస్తే గ్రహసంపత్తి కోహాన్ని సూచిస్తుందిగాని ఆదంపతుల ప్రవర్తన చాలా విరుద్ధంగానే వుంటుంది. జాతకమందు సూచింపబడే కళంకు స్వప్నాదులవల్ల (అదిశబ్దంవల్ల అపవాదాలు లోనైనవి గ్రహింపవలసివుంటుంది) నివర్తిస్తుంది. అందుచేత యీ విషయంలో బాహ్యానికే ప్రాధాన్యం. మానసికాన్ని క్షమించవలసిందే.

పురుషార్థాలు నాలుగు. వీటిలో నాలుగోది ముక్తి. దీన్ని సంపాదించుకోవడానికి భార్యసహాయం భర్తకుగాని, భర్తసహాయం భార్యకుగాని వుండవక్కరలేదు. "యెవరికి వారే యమునాతీరే" మిగిలిన ధర్మార్థకామత్రితయానికిన్నీ ఒకరి సహాయం ఒకరికి వుండితీరాలి. యే పుణ్యకార్యాన్ని గృహస్థు చేయదలచినా "ధర్మపత్నీసమేతోఽహం" అనేకదా సంకల్పం. మన పెద్దలు సర్వవిధాలా శ్రేయంగా పరిణామకాలానికి తయారయే సంసారాన్ని స్వర్గంగా సమర్థించారు. ముఖ్యంగా యీ సమర్థనం నాటికి నేం పాళ్లు భార్యమీద ఆధారపడివుంటుంది. దిక్కుమాలిన విడాకులచట్టం వుంటేమాత్రం భారతనారీమణి దానికి ఆలాయపడుతుందా? అయితే భర్తల దుర్వ్యవర్తనవల్ల వొక్కొక్కప్పుడు యేలాటి చండాలానికేనా సిద్ధపడడం అనివార్యం కావచ్చు. ఆ చండాలం యిదివఱలో యేదోవిధంగా సాగుతూనే వుంది. యిప్పుడు మనం చేయడం ఆమాదిరివాళ్లకుకూడా సంఘంలో చోటు నిచ్చి ఆదరించడం.

యీ యుగంలో యెవళ్లనిగాని యెవళ్లూ—నీవు అపాంక్తేయుడవు అనగూడదు. అంటే, అది తగినంత కారణసామగ్రి కలదే అయినా లీగలుగా అపరాధమే అవుతుంది. అందుచేత మతానికి సంబంధించిన పీఠాధికార్లకూడా లోగడ మాదిరి దోషదూషితులకు శ్రీముఖాలు జారీచేయడం విరమించారు. పూర్వకాలంలో నేరం చేసినవాళ్లు న్యాయాధికారివల్ల తమ తప్పులకు తాము ధారాళంగా ఒప్పుకొని ఆయా నేరాలకు ధర్మశాస్త్ర

కాదని ఆమెఅభిప్రాయం కాబోలు. ఆమెనియమాలు చాలా అవిధారా వ్రతాలుగా వుంటాయి. వాట్లని తూచా తప్పకుండా ఆమె నెఱవేర్చుకుంటుంది. వాట్లని వివరించవలసివస్తే చాలా పెరుగుతుంది వ్యాసం. వొక్కటిమాత్రం మచ్చు చూపుతాను. ఆమెకు తెలియు వుపవాసాలేగాని భోజనం చేయడమంటూ లేనేలేదు. మైదాపిండో, కొబ్బరికోరో తిని క్షున్నివృత్తి చేసుకోవడమే. యెప్పుడేనా తినవలసివస్తే—స్వయంపాకం. యితరులు వండినద్దైతే అది యెంతచేతి సహాయంతో వచనంచేసిందిగా వుంటుందని ఆమె స్వీకరించదు. సోమవారం మౌనవ్రతపు రోజు. దీనికేం, యిది లోకంలో చాలామందికి వున్నదే. కాని భర్త యిచ్చినాడు కావడంచేత రైలుప్రయాణంలో పరీక్షార్థం వచ్చే కలెక్టర్లకు టిక్కెట్లు చూపదు. ఆమెకు మౌనవ్రతం. చలికి వుష్ణం బంకరం. యెవళ్లేనా యెఱిగినవాళ్లు వుండి వున్న యథార్థాన్ని తెల్పకు చేస్తేతప్ప లేకపోతే చిక్కేగదా. అయితే తగినంతస్థితిగతు లున్న సంసారమయితే అయా చిక్కులలో చాలా భాగం తొలగి పోతాయి కాని మిక్కిలి దీనసంసారం. భూమిమీద వచ్చే శిక్ష—

"...రయితు దెచ్చి యొసంగు ఫలంబదెంత హెచ్చున్నను మీర లొక్క నెల యోపునో! యోపదో సంశయంబగు."

యీస్థితిలో ముగ్గురు ఆడపిల్లలు. కుటుంబగౌరవానికి లోపం లేకుండా యిద్దరికి కట్నాలబాధ లేకుండా పెండ్లిఅయింది. యింకొక పిల్ల చాలా చిన్నది. తొందరలేదు. ధనం. భర్తకొఱకు దేశం తిరగడం తప్పదు. యెవరినీ యాచించదు. తాతగారు (కీ. శే.) వల్లయ్యశాస్త్రులుగారు. తండ్రి భద్రయ్యశాస్త్రులుగారు. (కీ. శే.) యీయన కూడా గౌరవంగా జీవయాత్ర గడిపినవారే. అభిమానం వదలి మన రాజేశ్వరమ్మ యాచన కెలా అంగీకరిస్తుంది? అడిగితే గిడిగితే కవకమర్గమ్మని (అదేనా తనకుటుంబగౌరవానికి లోపం రాని ఫక్కీని) అడుగుతుందేమోకాని తదితరులను అడగడమంటూ లేదు. యెన్ని చిక్కులోపడి ఆపిచ్చిభర్తచేత (క్వాచిత్కంగా) దెబ్బలు తింటూ పాతివ్రత్యాన్ని నెఱవేర్చుకుంటూవున్న రాజేశ్వరమ్మ కారణంచేతనే అనుకుంటా అమధ్య మన దేశం పరిహద్దుకు వచ్చి కూడా యుద్ధపుటలజడి మనలను కొండకిందులలో జమకట్టించక యే కాకినాడలోనో యే వైజాగులోనో కొంచెం మచ్చుకు యే వుడ్డాలు బాంబులో వదలి అంతతో సద్దుబాటయిందని నా విశ్వాసం. యిక్కడ పెనిమిటి కలవాడే అయినా అదృష్టలోపంచేత దుర్దశకు లోగ కలసివచ్చింది. రామలింగం పాండురంగమాహాత్మ్యంలో ఆ పతివ్రతకు కల్పించిన భర్త యే తరగతిలోనూ చేరడు. కాని యెక్కడో చూచి మతిపోయేంత మేటరు తదనుగుణమైనది చెప్పివున్నాడని నా తలపు. గ్రంథకర్త అభూతకల్పన చేయనేలేదనికూడా లోగడ రెండేళ్లనాడు కాలధర్మాన్ని పొందినవాణ్ణిబట్టి చెప్పవచ్చు. క్షయరోగ పరిణతుడు భర్తకు వేశ్యయం దనురాగం కలగడం, దాన్ని తీర్చడానికై భార్యే ఆ వేశ్యని ఆశ్రయించి వొప్పించడం—యీ మాదిరికథాకల్పనలతో పాతివ్రత్యమహాత్మ్యాన్ని పోషించడంకూడా వొక్కొక్కప్పుడు నిజంగా జరిగితే జరిగిందేమోకాని అట్టి విశేషలకు యీకాలం తగినది కాదు.

నేటికాలంలో పాతివ్రత్యమంటే? భర్తయొక్క క్షేమాన్ని కోరి సంసారంలో లోటుపాట్లు కనిపెట్టి వర్తించడం. యీమాత్రం యోగ్యురాలుగా వుండే స్త్రీమతికి భర్త వున్నవాడే వాడుకు ధన్యుడుగానే కొనియాడబడవచ్చుననియ్యేనే.

ప్రతిసంగతికీ మనోవాక్కాయములకు సంబంధం వుండడమూ, యీ త్రికరణాలలోనూ మనస్సునే గౌరవించడమూ అందఱూ యెఱిగినదే. యీ మానసికగౌరవాన్ని అంగీకరించే పక్షములో నిజమైన పాతివ్రత్యానికి లక్ష్యమే దొరకదేమో అని నా భయం. అందుచేత దీనికిమాత్రం మానసంమీద విస్తారభారం పెట్టకూడదు. వొక వుదాహరణం. కొన్ని జాతక చక్రాలు (స్త్రీలవీ, పురుషులవీకూడా) చూస్తే గ్రహసంపత్తికోసాన్నే సూచిస్తుంది గాని ఆదంపతుల ప్రవర్తన చాలా నిర్దుష్టంగానే వుంటుంది. జాతకమందు సూచింపబడే కళంకు స్వప్నాదులవల్ల (అదెట్లుంటేన్ల అపవాదాలు లోనైనవి గ్రహింపవలసివుంటుంది) నివర్తిస్తుంది. అందుచేత యీ విషయంలో బాహ్యానికే ప్రాధాన్యం. మానసికాన్ని క్షమించవలసిందే.

పురుషార్థాలు నాలుగు. వీటిలో నాలుగోది ముక్తి. దీన్ని సంపాదించుకోవడానికి భార్యసహాయం భర్తకుగాని, భర్తసహాయం భార్యకుగాని వుండనక్కరలేదు. "యెవరికి వారే యమునాతీరే" మిగిలిన ధర్మార్థకామత్రితయానికిన్నీ వొకరి సహాయం వొకరికి వుండితీరాలి. యే పుణ్యకార్యాన్ని గృహస్థు చేయవలసివచ్చినా "ధర్మపత్నీసమేతోఽహం" అనేకదా సంకల్పం. మన పెద్దలు సర్వవిధాలా హేయంగా పరిణామకాలానికి తయారయే సంసారాన్ని స్వర్గంగా సమర్థించారు. ముఖ్యంగా యీ సమర్థనం నూటికి ౯౦ పాళ్లు భార్యమీద ఆధారపడివుంటుంది. దిక్కుమాలిన విడాకులచట్టం వుంచేమాత్రం భారతనారీమణి దానికి ఆలోచపడుతుందా? అయితే భర్తల దుర్వ్యవర్తనవల్ల వొక్కొక్కప్పుడు యేలాటి చండాలానికేనా సిద్ధపడడం అనివార్యం కావచ్చు. ఆ చండాలం యిదివఱలో యేదోవిధంగా సాగుతూనే వుంది. యిప్పుడు మనం చేయడం ఆమాదిరివాళ్లకుకూడా సంఘంలో చోటు నిచ్చి ఆదరించడం.

యీ యుగంలో యెవళ్లనిగాని యెట్లా—నీవు అపాంక్తేయుడవు అనగూడదు. అంటే, అది తగినంత కారణసామగ్రి కలదే అయినా లీగలుగా అపరాధమే అవుతుంది. అందుచేత మతానికి సంబంధించిన పీఠాధికార్లుకూడా లోగడ మాదిరి దోషమూషికులకు శ్రీముఖాలు జారీచేయడం విరమించారు. పూర్వకాలంలో నేరం చేసినవాళ్లు న్యాయాధికారికో తమ తప్పులను తాము దారాళంగా వొప్పుకొని ఆయా నేరాలకు ధర్మశాస్త్ర

ఎన్నాళ్ళైనదో దన మదకరీంద్రయుడిగ్గి
కేలూరతమునగి యెక్కించికొనియె."

అవును, మదకరీంద్రం పల్లకీవంటిది కాదుగదా! యేమో కి కెంచి చేలెంచనున్నాడు. అందులోనూ యిది సామాన్యప్రకరీంద్రంకూడా కాదు. పెద్దన బ్రాహ్మడు. కొనుపడితే తప్పేమి—

"అయ్యవారా దెబుగనే ఉయ్యేల - అమ్మవారా దెబుగనే ఉయ్యేల" యీగౌరవం మామూలుసంసారులకుకూడా (అగజాంత ఐశ్వర్యం) కలుగుట ముదావహం. మన రాజులు క్రమంగా తగ్గి ప్రజారాజ్యం వచ్చినందుకు, సమయోచితంగా, ఆ ప్రజాప్రభుత్వమే ఆభారాన్ని వహించవలసి వచ్చిందని యెవరో ప్రభుత్వం తెలిసికొన్నట్టు స్పష్టపడింది. అయితే యీఘట్టంలో యింకా కొన్ని వాక్యాలు వ్రాయవలసివున్నప్పటికీ తొందరగా ముందుకు వెళ్లడం ఆలోటును పూర్తే బుద్ధిమంతులు పలువురుకలరని తెల్పుటకే. "అస్వర్గ్యం స్వర్గతాస్" "సుకవితా యద్యస్తి రాజ్యేనకిమ్" యేదో వొకదానిలోన్నుంచి వొకదానిలోకి వెడుతూన్నాను.

పాతివ్రత్యాన్నిగూర్చి కొంచెమే వ్రాశాను. పనిపడితే దాని స్వరూపం తెల్పడానికి యింత మాత్రం చాలు ననుకుంటాను. ఒక పతివ్రతను ఉదాహరణంగా చూపిస్తున్నాను. అయితే ఆమెకు వ్యాధి అంటే భయంలేదు. వేసేల, మరణమంటే అంతకుముందే లేదు. "సమత్వ తొచ ఐశ్వర్యం"అన్న గీతాశ్లోకానికి ఆ రాజేశ్వరమ్మగారే ప్రత్యక్షోదాహరణం. గతజన్మంలో అసిధారావ్రతంగా చేసిన తపస్సులో యేదో స్వల్పలోపం వచ్చి ఆలోపాన్ని అనుభవం ద్వారా (ప్రారబ్ధం భోగతో నశ్యేత్) తీర్చుకోవడానికి యిట్లు జన్మించినట్లు నా వూహ. యెంతో ఐశ్వర్యం అనుభవించడానికి అనువగు కారణసామగ్రి వుండికూడ్ని దైవదుర్విపాకంవల్ల బీదతనాన్ని అనుభవిస్తూవున్నప్పటికీ ఆమెమాటలలోగాని రచనలోగాని, ఆ సూచన లేశమూ కనపడదు. యీమె బంధుజాలం యావత్తూ కొంత స్థితిగతులు కలవారే. అయినా పిల్లల శుభశోభనాలకు వారివారి సహాయ సంపత్తిని కోరినట్టులేదు. "ఒక దాపరికి తీసిపోనివిధంగా" ఆయా కార్యాలు నెఱవేర్చుకుంటుంది. కనకదుర్గ పర్వనిధాలా యీమెను కనిపెడుతుందని కొందరి నమ్మిక.

"కద్దన్నవారికి కద్దు, కద్దని మొఱలిడిన పెద్దల బుద్ధులు నే నెఱుగ మాసే" (త్యాగరాజు)

స్వస్తి

---

# వసంతం

శ్రీ రెంటాల గోపాలకృష్ణమూర్తి

వచ్చిందీ! వచ్చిందీ!
వసంతఋతువూ వచ్చిందీ!
పచ్చపచ్చగా బయటికొచ్చినా
చిగుళ్లు కలిగిన చెట్లశోభతో—
విరియగ పూచీ; మై మరపించీ
మత్తెక్కించే మల్లెపూలతో॥ వచ్చిందీ॥

మామిడికొమ్మల మధ్య "ఉయ్యాలా"
ఊగే కోయిల కమ్మని కంఠం—
హాయిగ పాడే మధురగీతముల
విహరించేటీ వినోదకాలం॥ వచ్చిందీ॥

ఏటిపొడుగునా రైతుల కష్టం
తోటి ఫలించిన రాసులధాన్యం—
పూజలు సలిపే క్రొత్తభూమిలో
సాగును చేసే "ఉగాది" పండుగ॥ వచ్చిందీ॥

నూతనవస్త్రం, నూతనవస్త్రం
వ్యాపారస్థుల సంరంభం—
వేపపువ్వుతో పచ్చడిచేసే
బంధుగు లందరు విందులు గుడిచే
ఉగాదిపండుగ వచ్చిందీ!
వసంతఋతువూ వచ్చిందీ!

# గురుస్మృతి

శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి

శిష్యు జేరి సరిగె వేంకట - కవిచంద్రు డిహానుభూతి కడమూచి మహా
శివరాత్రివేళ శివశివ - కవితాసతి శిష్యబంధుగణ మడలంగన్.

తిక్కన తెల్గుపోకడలు, తియ్యని నన్నయభట్టు కూర్పులున్
జక్కఁగ మేళవించి రససంభృతనూతనసాహితీప్రభా
భాక్కమనీయరీతుల ప్రవర్తిలి మోదము నించు నే సుధీ
వాక్కున సమ్మహాకవిని పాపపు మృత్యువు మ్రింగె నక్కటా!

అమృతంబు జాల్వాఱినట్టుల గమ్మని నుడులతో గవనమ్ము నడుపు నేర్పు
పదులు నూఱులు వేలు పద్యముల్ గుదిగూర్చి యేకధాటిగ గురియించు ప్రజ్ఞ
వివిధాంశములు వేనవే లవలీలగా ధరియింపజాలు మేధాబలంబు
ప్రతిపక్ష కుకవివాగ్బంధంబు త్రుటిలోన గావింపగల చమత్కారశక్తి
యమర నాశ్చర్యకరవిధానావధాన - కళ వెలార్చిన ప్రోడ వేంకటకవీంద్రు
డస్తమించెను; తత్కళ యంతరించె - నాంధ్రవాఙ్మయమును తమం బావరించె.

తను దలంచినమాత్ర ఘనకవితాశక్తి చేకూర్చి కరుణించె శిష్యకోటి
గైసేసె భారతీకంఠంబు బహుకావ్యమంజులకుసుమదామములచేత
ఊరేగె నేన్గుటంబారిపై విమతులు మోడ్పుగరమ్ముల ముందు నడువ
నమ్రులై పెదపెద్ద నరనాథు లర్పించు సత్కృతుల్ గొనియె రాజస మెలర్ప
చివరకు ప్రభుత్వకవిపదశ్రీ వహించె - నెనుబదేడులు మనె లోప మెఱుగకుండ
మాఱగొనియెను కైవల్యసుఖముగూడ - సుకృతి యెవ రింక వేంకటసుకవికంటె?

చిరవిరహాభార మెడలగ - దిరుపతికవితోడ గలసి దేవేంద్రసభన్
సురగురుసరిపీఠంబున - నిరవుకొనెన్ గురుడు వేంకటేశ్వరు డహహో!

భౌతికమూర్తితోడి యెడబాటుకు కుందెద మంతెగాని మా
చేతములందు భద్రముగ జిహ్వాతులై యలరారు మీకు మా
కేతటితేన్ వియోగ మది యెట్లు ఘటిల్లగ నేర్చు? నింతకున్
ధాతకుచేసిన మ్మొక్కడ ధాత్రికి వెల్లడియయ్యె సద్గురూ!

[కథానిక] ['శ్రీపతి']

# ఆశయసిద్ధి

"నేను ఇహ ఇక్కడ ఒక్క క్షణంకూడా ఉండలేను బావా! నువ్వు ఎంత మంచివాడివైనా నీకు ఈఇంట్లో రెండో స్థానమే కదా! మీ అన్నదమ్ములు అందర్లోకీ కాస్త చదువుకున్నవాడివి, నలుగురికీ చెప్ప గలవాడివి నువ్వే; అయినా ఈ కొంపలో నీ మాట వినే వాళ్లు ఒక్కరన్నా ఉన్నారూ?"

"అవును; నువ్వుతప్ప ఇంకెవ్వరూ లేరు" అని మనోహరం అనూరాధమాటకు అడ్డంవచ్చాడు.

తన మాటకు అడ్డంవచ్చాడని అనూరాధ ఏమీ బాధపళ్లేదు. ఉన్నయథార్థం చెప్పాకూడా అదంతా పచ్చిఅబద్ధమైనట్లు యద్దేవగా అన్నందుకు మాత్రం మనోహరంమీద పట్టరాని కోపం వచ్చింది. అయినా కొంచెం తమాయించుకొని "ఈ కొంపలో కాపరం చేస్తూ నేనుమాత్రం నీమాట ఎలా వినగల్ను? మాట విని ఏం చేస్తాను? కావటానికి మేనత్తగారిల్లే. మీరూ, మీ నాన్నగారూ కావాలని మరీ సంబంధం కలుపుకున్న మాట నిజమే. బావ మంచివాడనీ, బియ్యే ప్యాసైనాడనీ, ఏపట్నంలోనో ఉద్యోగం చేస్తుంటే సుఖపడగల్ననీ నేనూ ఆశపడ్డాను. ఎవ రెట్లా ఉన్నా అత్త ఉందిగదా, నాకీయింట్లో కొర తేముంటుందిలే అనుకున్నాను. తీరా కాపరానికివస్తే పెత్తనానికి పెద్దకోడలూ, అపేక్షలకు ఆఖరుకోడలూ తయారై, నా స్థితి ఎటూ కానిదైంది. ఊళ్లో అందరూ అనుకోవడం అత్త ఇంటి అధికారం నాకు దఖలుపరిచిందనీ, మీనాన్న పెత్తనం నీకిచ్చి ఇనప్పెట్టెతాళం చేతులు నీ మెళ్లో కట్టాడనీ. యథార్థస్థితి నీ మనస్సుకైనా తెలుసు. నాకు ఏం కావాలన్నా నేను నీకు చెప్పడం, నువ్వు మీఅమ్మకు చెప్పడం, మీఅమ్మ మీనాన్నకు చెప్పడం, మీనాన్న మీఅన్నకు చెప్పడం, మీఅన్న మీవొదిన్ని అడిగి చేస్తే చేయడం లేకపోతే లేదు. ఎన్నాళ్లీ అసమర్థపు బతుకు? మీరూ, మీరూ అంతా ఒకటే. ఎటొచ్చీ అయినదాన్ని నేను ఒక్కర్తెనే పరాయిదాన్ని అయినాను. నువ్వు ఎక్కడన్నా ఉద్యోగంఅయినా చూచుకో. లేదూ, మాఇంటికైనా పోదాం. మా తమ్ముడికి ఇంటిగొడవ పట్టలేదు. మాఅక్క పెళ్లి చేసుకోను పొమ్మంది. అంత పెత్తనం నువ్వే చేయొచ్చు. మానాయనకూడా ఒక్కడూ తంటాలుపడలేకుండా ఉన్నాడు" అని, అనూరాధ దాదాపు తన కథను పూర్తి చేసింది.

"అయితే నన్ను ఇల్లరికం రమ్మంటూ వన్న మాట! భేషుగ్గా ఉంది నీ సలహా. ఇంత బ్రతుకూ బ్రతికి ఇంటివెనకాల చావమంటున్నావ్? నేనుండీ, మీమేనత్త ఉండీ నీకు ఏలోటూ లేకుండా జరుపు కొస్తుంటేనే నీకు ఇక్కడ ఉండేందుకు అంత కష్టంగా ఉందే, మేనమామఇంటికి ఇల్లరికంవెళ్లితే నాకు ఎలా ఉంటుందో కాస్త విచారించు. అయినా మీతమ్ముడు ఎర్రజెండాలముఠాలో చేరాడట. ఎప్పుడో, ఎక్కణ్ణుంచో హఠాత్తుగా ఊడిపడి 'నువ్వెవరు, తేరసొమ్ము తిందామని వచ్చావ్? మా తాతా, మా నాన్నా కష్టపడి సంపాదిస్తే అనుభవిద్దామని తయారైనావేం' అని నాలుగుదులుపులు దులిపితే, నెత్తిన గుడ్డేసుకొని కాళ్లకు బుద్ధిచెప్పాలి! మీ అక్కకూడా వాడిపక్షమే టగా? వాళ్లిద్దర్నీ కాదని మీఅమ్మా, నాయనా మనిద్దరికీ తప్పే తలకెత్తుతారేం? నీకు ఇక్కడ ఉండటం ఇంత కష్టమైతే నువ్వు మహారాజుగా మీవాళ్లింటికి పోయి, అక్కాతమ్ముళ్లతో నువ్వూ ఒక ఎర్రజెండా ఎగరెయ్. నేనుమాత్రం రాను."

మనోహరం ఇంత నిర్మొహమాటంగా చెప్తాడనీ, తన మాటను కాదంటాడనీ అనూరాధ కలలో అయినా అనుకోలేదు. తనూ చదువుకున్నది. తనేంచెప్పినా మనోహరం ఇంతవరకూ కాదన్లేదు. అతడూ చదువుకున్నందుకు "పెళ్లాంమాట వినడమేమిటి?" అనేతరహా మనిషీ కాలేదు. కాని, ఆరోజురాత్రి అలా తననేగాక తన తమ్ముణ్ణి, అక్కనూ కూడా ఎర్రజెండాలవాళ్లని చులకనచేసి మాట్లాడ్డం అనూరాధకు ఏమీ అర్థం కాలేదు. ఎంత చదువుకున్నా స్వభావం మారటం అరుదుగనుక మనోహరానికి వదినెగా రేమైనా మందు పెట్టిందేమో అని అనుమానపడింది. అనుమానం కలగ్గానే నివృత్తి చేసుకోవా లనుకుంది. వస్తాయించడం స్త్రీలక్షణం గాదు. అంపి.లో అసూయ కల్గిం తరువాత వాళ్లకు మామూలుఇంగితజ్ఞానంకూడా ఉండదు. వాళ్లు నిద్దరపోరు; ఇతరుల్ని నిద్దరపోనీరు.

మనోహరానికి తమలపాకులతో డీమలు తుంచి, ఈనెలు తీసి, చిలకలు చుట్టి నోటికి అందిస్తూ ప్రక్కనే కూర్చొన్న అనూరాధ హఠాత్తుగా లేచి పక్కన ఉన్న ముక్కాలిపీటను దగ్గిరగా లాక్కొని దానిమీద కూర్చుంది. అప్పట్నించి తమలపాకుల ఈనెలు తీసి, మడిచి మంచంమీద పెడ్తూ వచ్చింది. మనోహరం అసలువిషయం గ్రహించకపోయినా తత్వం ఫిరాయించిందని తెలుసుకొని "అంత హడావిడిగా లేచేసరికి ఇప్పటికిప్పుడే మీపూరు ప్రయాణం కడ్తున్నా వనుకున్నాను మళ్లీ అక్కడ చతికిలబడ్డావేం" అన్నాడు.

"అవున్లే. నే నంతమాత్రం గ్రహించలే దనుకున్నావా బావా? వదినెసంగతి నాకు తెలీదూ? ఊరిపెత్తనం అంతా చేసే మీఅన్నయ్యే ఆమె ముందుకువస్తే 'ఏమిటిసెలవు?' అని రాజుగారిముందు సేవకుడల్లే ఉంటాడు. మీలాంటివాళ్లు ఆమె కొక లెఖ్ఖా, జమా! పాపం, నేను ఎప్పుడు వెళ్తానా అని గంటలు లెక్కపెడుతున్నారుకామోలు! నే నట్లా పోయేదాన్ని కాదు. ఇంత చదువుకున్నందుకు ఆమాత్రంఆలోచన లేకపోలేదులే...

"బావా, మళ్లీ చెప్తున్నా విను. మీ అన్న సంసారం రోజురోజుకూ పెద్దదవుతున్నది. మున్నాటరవై రోజులూ వాళ్లత్తింటివైపువాళ్లు ఎవళ్లో ఒకళ్లు ఇక్కడ మేస్తూనే ఉన్నారు. ఇంటికి ఎంత చేరవేస్తున్నారో వాళ్లకూడా తెలియదు. నీతమ్ము డున్నా డంటే మిమ్మల్నందర్నీ మించినవాడు. మాతమ్ముడికంటేకూడా నాలుగాకులు ఎక్కువే చదివాడు. ఒకరిమీద ఇంకొకళ్ల అధికార మేమిటి అంటాడు. ఎవరెంత కష్టపడితే వాళ్లకంత ప్రతిఫలం ముట్టటం న్యాయం అంటాడు. ఎవడి అవసరాలకు తగ్గట్టు వాళ్లకు అన్నీ చెందడం ధర్మం అంటాడు. ఒకరి ఎక్కువా, ఇంకొకరి తక్కువా లేదంటాడు. అతనెప్పుడో తనభాగం తను పంచుకుపోయి స్వతంత్రంగా ఉంటాడు. మాతమ్ముడు ఇంకా అందాకా రాలేదు. ఇక మీరున్నారు—" అంటూ అనూరాధ కొంచెం ఉద్రేకంతో, కొత్తధోరణిలో ఉపన్యాసం సాగించబోతున్నది...

"అనూరాధా! నన్నుగురించి నువ్వు చెప్పక్కర్లేదు. నాసంగతి నాకు తెలుసు. నీసంగతీ నాకు తెలుసు. మావాళ్లిద్దరిసంగతీ నాకు తెలియదనుకోకు. మాతమ్ముడితత్వం నీకు బాగా వచ్చినట్లుంది. వాడు అంత పెద్దకబుర్లూ చెప్తాడు. కూలివాడికి నాలుగు అణాలు ఎక్కువ ఇమ్మంటే ఎందుకివ్వా లంటాడు. రైతులు ఎవరన్నా బకాయిపెడితే వాడికి శివం ఎత్తుతుంది. అడుక్కునేవాళ్లకు ఇంత అన్నం పడేస్తే "వాళ్లని ఇలాగే పాడుచేస్తున్నారు. దేశంలో సోమరితనాన్ని ప్రోత్సహిస్తున్నారు. వాళ్ల నిట్లా పోషించే వాళ్లల్లోని విప్లవశక్తిని, విప్లవజ్వాలలను చల్లారుస్తున్నారు" అంటాడు. తనుమాత్రం ముప్పూటా వేళతప్పకుండా సుష్టుగా భోంచేస్తాడు. ఇది ఏం సిద్ధాంతమో, ఏం న్యాయమో నాకు తెలీదు. అసలు అందరూ ఒక్కటే అనిగదా వాడి వాదన! అందరూ సమంగా అనుభవించాలనేగదా వాడి సిద్ధాంతం! అంతా సమిష్టిగా ఉండాలనేగదా వాడు అందరికీ చెప్తుంటాడు! మరి వాడి విషయం వచ్చేసరికి ఈ జాయింటు కుటుంబాన్ని విచ్ఛిన్నంచేయా లంటాడు. అసలు ఆ ఎర్రజెండా ముఠాలే అంత. ఇలాంటివ్యక్తులు కుటుంబాలకు వేరుపురుగు లైనట్లుగా వాళ్ల ముఠా సంఘానికి వేరుపురుగైంది. వాళ్లు నీకు ఆదర్శమైతే మనిద్దరం కాపరమే

చేయలేం" అని మనోహరం ఎంతకాలంగానో అణచుకుంటున్న భావాలను ఒక్కసారి వెళ్లగక్కాడు.

"అనూ, నువ్వు తొందరపడకు. వాడి భాగం ఎలాగో వాడికి పంచియిస్తాం. లేకపోతే అసలుకే ముప్పు వస్తుంది. ఆతరవాత నేనూ, మాఅన్నా వ్యవహారాలు సరిచేసుకుంటాం. ఏదీ ఒక్కరోజులో జరగదు. రష్యాలో విప్లవంకూడా పరిపక్వమై ఫలించడానికి రెండు దశాబ్దాలు పట్టింది. అది జరిగి నాలుగుదశాబ్దాలవుతున్నా ఆ ఫలితాలు అందరికీ అనుభవానికి రాలేదు. వాడు నీకు చేస్తున్న బోధల్ని నేను వింటూనే ఉన్నాను. మావొదినే ఇదంతా చూస్తూనే ఉంది. నువ్వు చదువుకున్నదానివి కదా, అసలువిషయం నీకే గ్రహింపుకు వస్తుందని నేను ఇంతకాలం ఉపేక్షించి ఊరుకున్నాను. మావొదినె వాడి ట్రాప్‌లో పడుతుందేమో అని భయంగానే ఉంది. మాఅన్న మనస్సు కూడా ఈ మధ్య కొద్దిగా మారినట్లు కన్పిస్తుంది. మనం తొందరపడ్డంవల్ల ప్రయోజనం ఏమీ లేదు. సహనంతో ఎంతైనా సాధించవచ్చు. నిలకడమీద నీకే అనుభవానికి వస్తుంది—మనమార్గమే సన్మార్గ మని. భాగంపెట్టమని మాఅన్నను అడగడానికి "ఎర్రజెండా ముఠాతో చేరిపోతా"నని చెప్పక్కర్లేదు. యథార్థం చూస్తే వాళ్లంతా ఏంచెప్తున్నారో అదంతా మనం చేస్తున్నాం. వాళ్లకూ మనకూ ఉన్న తేడా ఒక్కటే. మనం చేస్తున్నది పైకి చెప్పడం లేదు; వాళ్లు పైకి చెప్పేది చేయడం లేదు. నువ్వు అన్నీ చదివినదానివి. నిజానికి మన జాయింటుకుటుంబానికి మించిన సామాజికవ్యవస్థ ఏముంది అనూ? ఎవరిభాగం వాళ్లు పంచుకొని ఏకాపరానికి ఆకాపరం వేరైపోతే అభానికీ శుభానికీ ఒకళ్లకొకరు ఆదుకోవడం సాధ్యమా? ఎవరితోనూ నిమిత్తంలేని బ్రతుకు ఏంబ్రతుకు? ఎందుకా బ్రతుకు?"

* * *

అనూరాధ చిన్నప్పట్నుంచీ అతిగారాబంగా పెరిగింది. తమ్ముడు మురళీధర్ ఒక్కడే మొగపిల్లాడైనా సీతయ్యా, లక్ష్మమ్మా అనూరాధంటే ప్రాణాలువిడుస్తూ ఉండేవాళ్లు. పుట్టినప్పుడే అనూరాధకు సంబంధం కుదిరింది. మేనరికం తప్పదని అందరూ తీర్మానించుకున్నారు. సీతయ్యఅప్పగారు బాగా ఉన్నవాళ్లు. పెద్దకొడుకు రామమోహన్‌కు తండ్రివైపు సంబంధం చేసుకున్నారు. రెండోవాడికి తన తమ్ముడికూతుర్ని చేసుకోవాలని సీతయ్యఅప్పగారు ఎప్పుడో నిశ్చయించుకుంది. పెద్దపిల్ల సరళకూ, మనోహరానికీ ఈడు గాదని అనూరాధనే చేసుకోవాలని అనుకుంది. పైగా సరళకంటే అనూరాధే అందంగా ఉంటుంది. మంచి చురుకైన పిల్ల. తనకొడుకులు ముగ్గుర్లోనూ మనోహరం అందగాడు, చదువుకుంటున్నవాడు. కాబట్టి అనూరాధనే చేసుకోవాలని రాఘవమ్మగారు అనుకుంది. మనోహరానికీ అనూరాధను చేసుకోవాలనే ఉంది. అయితే చదువుకున్న పిల్ల కావాలని అతని పట్టుదల. అందుకని సీతయ్య ఊళ్లోనే బడి ఉంది కనుక ఉన్నంతవరకూ అనూరాధను చదివించాడు. మనోహరం బియ్యే ప్యాసయ్యేసరికి అనూరాధ స్కూలుఫైనలు పూర్తిచేసింది. ఆసంవత్సరం వేసంగిలోనే వివాహం అయింది. అయినా అనూరాధను ఇంకా చదివించాలనీ, తను 'లా' చదవాలనీ, పట్నంలో కాపరం పెట్టాలనీ మనోహరం ఎంతో ఉబలాటపడ్డాడు. వాళ్ల నాన్నకూ కొడుకును ప్లీడరీ చదివించాలని ఉండేది. కాని అనూరాధను కాలేజీచదువుకు పంపించాలని లేదు. మనోహరంఅన్న రామమోహనుకుమాత్రం పట్నంలో వేరే కాపరం పెట్టి తమ్ముణ్నీ మరదల్నీ చదివించడం ఇష్టంలేదు. అందుకు రెండు కారణా లున్నాయి. ఒకటి పట్నంలో కాపరం అంటే నెలకో రెండు వచ్చనోట్లు కావాలి. ఇద్దరి చదువులకూ ఇంకో రెండు కావాలి. ఇలా ఏడాదికి అధమం నాలుగువేలన్నా కావాలి. వేర్లుబడితే మనోహరానికి అంత వరుమానంవచ్చే ఆస్తి రాదు. జాయింటు ఆస్తిలోనుంచి ఒక్కడికోసరం ఇంత ఖర్చు పెట్టడం న్యాయం గాదని రామమోహనుఅభిప్రాయం. అయినా తమ్ముణ్ణే చదివించేవాడే—ఇంకో భయం లేకపోతే. ఒకసారి వేరే కాపరం పెడితే, అందులోనూ పట్నంలో, ఇక మళ్లీ అందరితోనూ కలిసి కాపరం చేయడానికి ఏఆడదీ ఒప్పుకోదని రామమోహనుసిద్ధాంతం. ఎంత చదువుకున్నవాళ్ళయినా తమదాకా వచ్చేసరికి అన్నింటికీ స్వస్తిచెప్తారు. మనోహరం వేరేకాపరం పెట్టడమే సంభవిస్తే తన తాతముత్తాతలనుంచీ వస్తున్న ఈజాయింటు కుటుంబం మూడుముక్కలైపోతుందని పెద్దవాడి భయం.

ఆఖరువాడప్పుడే "భాగం, నాభాగం" అంటున్నాడు. పంచకపోతే ముఠాలో చేరతానని బెదిరిస్తున్నాడు. వాడికి వీధిబడిచదువు తప్ప ఇంకోచదువు లేకపోయినా "ప్రపంచమహానాయకులు, విప్లవమూర్తులు" అంటూ ఏమేమో చెప్తాడు. ఏవిషయంవచ్చినా వారు ఇట్లా చెప్పారంటాడు. ఈ ఏడాదీ వాణ్ణి అదుపులో ఉంచుకురావడం బ్రహ్మాండమైంది. మనోహరం పట్నంలో వేరే కాపురంపెట్టితే ఇక వీణ్ణి పట్టిఉంచడం బ్రహ్మదేవుడికి కూడా సాధ్యంకాదు.

ఇవన్నీ ఆలోచించే మనోహరం ప్లీడరీ చదవడానికి రామమోహను ఒప్పుకోలేదు. పైగా చదువుకని పట్నంపోయిన మునసబుగారి కొడుకు అక్కడి అల్లరిమూకతో చేరి సమ్మెలనీ, ముఠాలనీ చదువుకు స్వస్తి చెప్పి ఎవరికీ కన్పించకుండా ఇప్పటికి రెండేళ్లుగా తప్పించుకు తిరుగుతున్నాడు. కొడుకు ముఠాలో చేరిపోయినాడని తండ్రికి మున్సబుగిరీ ఊడింది. సగం ఆస్తిని గవర్నమెంటువాళ్లు జప్తుచేశారు. మనోహరం పెళ్లాంతోసహా చదువుకు పట్నం పోతాననేసరికి రామమోహనుకు ఇదంతా కళ్లకు కట్టినట్లయింది. సంసారంగుట్టు నిలుపుకోడానికి తాను ఎంతైనా చేస్తాడు. తన తమ్ముళ్లూ అలాగే చేయాలని అతని వాదం.

మనోహరం అన్నగారి మాటను కాదన్లేక చదువుకు స్వస్తిచెప్పాడు. అందరితోపాటు ఇంటిపట్టునే ఉండిపోయినాడు. కాలక్షేపానికి పదిమంది పిల్లల్ని పోగుచేసి హిందీ, ఇంగ్లీషు చెప్తూఉండేవాడు. పిల్లలు ఇచ్చే డబ్బుతో తనక్కావాల్సిన పుస్తకాలు, పేపర్లు తెప్పించుకుంటూఉండేవాడు. ఆవిధంగా తన అవసరాలకు జాయింటుఆస్తిలోనుంచి కానీ ఖర్చు చేసేవాడు గాదు. అందుచేత ఆఖరివాడి మీదకంటె రామమోహనుకు మనోహరంమీదనే ఎక్కువగౌరవం; అభిమానం. అయితే ఆఖరువాడంటె అమితభయం. అప్పట్లో అతను అనుకోవడం కుటుంబానికి తన తమ్ముడు మురళివల్లనే ముప్పందని. చదువుకున్న వాళ్లని నమ్మరాదని, వాళ్లు ఏక్షణంలో ఏం చేస్తారో వాళ్లకే తెలియదనీ ఇతని నమ్మకం. మనోహరం భార్యాభర్త లిద్దరూ చదువుకున్న వాళ్లవడమే ఇతని ఈ భయానికి కారణంకూడా. తనపై సర్వాధికారం చెలాయిస్తూ, ఆవిధంగా కుటుంబాన్ని అంతా ఏలుతున్నతన భార్య సత్యవతమ్మే తన కుటుంబ విచ్ఛిత్తికీ, తన పతనానికీ దారితీస్తుందని, కారణభూతం అవుతుందని అతను కలలోకూడా అనుకోలేదు. తరువాత జరిగిన సంఘటనలను విన్నవారందరూ "పాపం! రామమోహను" "స్వతంత్రాలోచన లేకపోతే ఎంత తెలివిగలవాళ్లయినా ఇంతే" "పెళ్లాంమాట విని సుఖపడ్డవాళ్లీ లోకంలో ఎందరున్నారు?" అని విపరీతంగా సానుభూతి చూపించారు. ఒక్క సానుభూతిసభలు చేయలేదన్నమాటేగాని మిగిలిన కర్మకాండంతా జరిపించారు. ఒక్క అనూరాధమాత్రం పైకి మనోహరంతో పాటు విచారాన్ని అభినయించినా, సత్యవతమ్మ ఇల్లు వదలిపోయినందుకూ, రామమోహను 'సన్యసించి'నందుకూ లోలోపల చాలా సంతోషించింది. ఎవరికివాళ్లు వేరే ఉండి పోయినట్లయితే సంసారం ఇలా అల్లరిపాలై ఈ అపవాదంతా తన తమ్ముడిమీద పడేది కాదని ఎప్పుడూ-ఇప్పటికికూడా-మనోహరంతో వాదిస్తూ ఉంది. పూర్వాచారాలవల్ల లాభనష్టాలు రెండూ సమంగా ఉన్నవని, మనుషులు మంచివాళ్లయితే సంప్రదాయాలవల్ల సత్ఫలితాలను పొందుతారని మనోహరం తీర్మానించుకున్నాడు. అదే అనూరాధకు అనుక్షణం బోధిస్తూవచ్చాడు. సంఘాన్నిగాక, సంఘాన్ని ఆవరించిన పరిస్థితులను సంస్కరించడమే సరియైన మార్గం అనుకున్నాడు. అంతవరకే అతను తన తమ్ముడితోనూ, తన భావమరిదితోనూ ఏకీభవించాడు. వాళ్లపద్ధతులూ, వారి వ్యవహారాలూమాత్రం అతనికి నచ్చలేదు. తన చదువు తనకూ, తనభార్యకూ ఆమాత్రం విచక్షణాజ్ఞానం ఇచ్చినందుకు చాలా తృప్తిపడ్డాడు. చదువుకోకపోతే తనూ తన తమ్ముడిమాదిరే అయ్యేవాణ్ణనీ, తన 'రాధ' తన వొదినగారల్లెనే అయ్యేదనీ అతను అనుకున్నాడు. రామమోహనుకూడా చివరిచివరికి అతనితో ఏకీభవించాడు. అందుకనే తన పిల్లల్నందర్నీ అయిదోఏట బళ్ళో వేసి, ఇంటిదగ్గర మేష్టర్ని పెట్టి చదువు చెప్పిస్తున్నాడు. అరచేతిలో వైకుంఠం చూపిస్తే అజ్ఞానులు మోసపోయినంతగా చదువుకున్నవాళ్ళు శాస్త్రలోకజ్ఞానం కలవాళ్లూ మోసపోరని అతనికొక నమ్మకం కుదిరింది. తనకూ ఆకుటుంబవ్యామోహం అంత గాఢంగా లేకపోతే తనూ తన పెళ్లాంమాటలు విని ఏమైపోయేవాణ్ణో అని తలుచుకొని భయపడే

వాడు. తన పిల్లల్నయినా బాగుచేసుకోవాలన్న పట్టుదలే అతన్నింకా అలా ప్రాణంతో నిలబెడుతూ ఉంది. లేకపోతే తన కుటుంబానికి జరిగిన అగౌరవానికీ, అందులో తనకు గల బాధ్యతకు ఏ నుయ్యో గొయ్యో చూచుకోవాల్సింది.

* * * * *

సత్యవతమ్మసంగతి తెలిసినవాళ్ళుకాని, సత్యవతమ్మను చిన్నప్పణ్ణుంచీ ఎరిగిఉన్నవాళ్లుగాని ఆమె ఈ విధంగా నిక్షేపంలాంటి సంసారంలో నిప్పుపెట్టి చక్కా వెళ్తుందని ఎవ్వరూ అనుకోలేదు. నలుగురుబిడ్డల తల్లి అన్నమాటేగాని పాతికేళ్లయినా నిండలేదు. పదహారేళ్ళకే కాపరానికి రావడం, ఏటా కాన్పుఅవడంవల్ల తనకు ఎంత ఇష్టం లేకపోయినా ఇరవైరెండేళ్ళకే ఈ నలుగుర్నీ కన్నది. తోడికోడళ్ళు ఇద్దరికీ ఇంతవరకూ సంతానం లేదు. అందుచేతనే వాళ్లు 'మొగుడూ పెళ్లాం' అంత సరదాగా, కులాసాగా ఉంటున్నారని సత్యవతమ్మ అనుకుంటూఉండేది. బయటి ప్రపంచంసంగతి తెలియనంతవరకూ ఇంత పెద్ద కుటుంబానికి తనదేగదా పెత్తనం అని ఎంతో సంతోషిస్తూఉండేది. అంతకు మించి ఆడదానికి కావాల్సిందిమాత్రం ఏముంది అనుకునేది. తన మొగుడు తన మాటను కాదనడు. తన ఇంట్లో తన మాటకు ఎదుర్లేదు. తనూ, తన పిల్లలూ సుఖంగా ఉన్నారు. అదే తృప్తి. ఆడదాని జీవితపరమావధి అదేగదా అని అనుకుంటూ ఉండేది.

ఆరోజు తను వెళ్ళను అని ఎంత మొత్తుకొన్నా వినకుండా, రామమోహను తనను తనమరిదివెంట బెజవాడ పంపించటమే వచ్చింది. పెద్దపిల్లాణ్ణి వెంట బెట్టుకువెళ్ళినా, తోడికోడలు పుట్టింటికి వెళ్ళకుండా ఉన్నా సత్యవతమ్మకు ఈబుద్ధి పుట్టేదిగాదు. అంతకు ముందు అనూరాధతమ్ముడు ఎన్నిసార్లు వాళ్లింటికి రాలేదు? ఎన్నిసార్లు ఈఎర్రజెండాల కబుర్లు చెప్పలేదు? తన మరిదిమాత్రం అవకాశం దొరికినప్పుడల్లా నూరి పొయ్యడం లేదూ? అయినా సత్యవతమ్మ అగ్నిహోత్రంలా అలా ఉండలేదూ! ఒకరోజు సినిమా చూడ్డానికని వెళ్తే నాలుగురోజులు ఉండిపోవాల్సివస్తుందనీ, అక్కడ తన మరిదీ, తన తోడికోడలూ, రెండోతోడికోడలు తమ్ముడూకలిసి కుట్రపన్ని ఇంత అఘాయిత్యం చేస్తారనీ ఏమాత్రం అనుమానం ఉన్నా సత్యవతమ్మ ఊరుకదిలి వెళ్లేదికాదు. ఆమాత్రం అనుమానం రామమోహనుకుఉన్నా అతను పంపించేవాడూ కాదు. అథవా, ఆసినిమా చూపించాలని అనుకున్నా తనే స్వయంగా వెళ్లేవాడు. అయినా కేవలం తన భాగం పంచుకొని తన ఇష్టం వచ్చినట్లు ఊరేగడానికి మురళీధర్ ఇంత కుట్ర పన్నుతాడని ఎవరుమాత్రం ఏమనుకోగలరు? ఎర్రజెండాలవాళ్లు ఎంతకైనా తగుదురని సత్యవతమ్మ వినకపోలేదు. కాని తన విషయంలో స్వంతమరిది ఇలా చేస్తాడని అనుకోలేదు. ముందుముందు సత్యవతమ్మకు పశ్చాత్తాపంఅనేది ఏమైనా వస్తే అప్పుడివన్నీ ఇలా తలపోసుకొని, విలపించవచ్చు. అసలు ఆ ముఠాలో చేరిపోయిన చదువురానివాళ్లెవ్వరూ పశ్చాత్తాపపడినట్లు ఇంతవరకూ విన్లేదు.

సత్యవతమ్మలో ఇలాంటి 'విప్లవాత్మకమైన' పరివర్తనం రావడానికి యథార్థం విచారిస్తే కారణాలేమీ కన్పించవు. అనూరాధ మొగుడు బియ్యే ప్యాసైనాడనీ, తన మొగుడు అంత చదువుకున్నవాడు కాదనీ అనూరాధపై ఆమెకు కొంచెం అసూయ ఉంటూఉండేది. తనూ చిన్నప్పుడు చదువుకొనివుంటే తనకూ చదువుకున్న మొగుడు వచ్చిఉండేవాడనీ, అప్పుడు తనూ, తన మొగుడూకూడా అనూరాధ-మనోహరంలాగా ఉండేవాళ్ళంగదా అని అప్పుడప్పుడు బాధపడుతూఉండేది. దానికి తగ్గట్టు మనోహరం ఎక్కడికి వెళ్లినా అనూరాధను వెంటబెట్టుకువెళ్ళేవాడు. ఇది సత్యవతమ్మకు పుండుమీద కారం రాసినట్లు ఉండేది. అందుకనే వాళ్లకు మొహంమీద కొట్టినట్లుండాలని రామమోహన్ను బెజవాడకు ప్రయాణం చేసింది. ఆఖరుక్షణంలో పని అడ్డంవచ్చి అతను వెళ్లకపోవడం, సత్యవతమ్మ మరిదివెంట పోవలసిరావడం తటస్థించింది. ఆ ఆశాభంగంతో, అవమానంతో బెజవాడ వచ్చింది. మురళీధర్ తన వొదినగారి మానసికస్థితిని చక్కగా ఉపయోగించుకున్నాడు. అనూరాధతమ్ముడు ఈ అవకాశాన్ని పూర్తిగా వినియోగించుకున్నాడు. సత్యవతమ్మకూడా అనూ

రాధపై ఉండే అసూయకొద్దీ అనూరాధతమ్ముణ్ణి చేర దీసింది. ఎవరిమటుకు వాళ్ళు తమ స్వంతలాభంకోసరం వ్యవహరిస్తూవచ్చారు. చివరికి వీరి అందరి గమ్య స్థానమూ ఒక్కటే అయింది!

ఆరోజు సత్యవతమ్మ, మరిదీ ఆరుగంటలసినిమా చూచి హోటలుకు వెళ్ళి భోజనంచేసేసరికి ఇంటికి తిరిగిరావడానికి ఉన్న ఒక్కరైలుబైమూ తప్పింది. ఆరాత్రి అపూళ్లో ఉండకతప్పిందిగాదు. మురళీధర్ ముందుగానే అన్నీ అనుకొన్నాడు కాబట్టి ఒదినగార్ని వెంటబెట్టుకొని ముఠాకేంద్రానికి వెళ్లాడు. అక్కడున్న జనాభాను చూచేసరికి సత్యవతమ్మ విభ్రాంతపోయింది. ముందు అనూరాధ అప్పగార్ని చూసింది. క్షణంసేపు నమ్మలేకపోయింది. అంతమంది మగాళ్ల మధ్య ఎందుకు ఇలా ఉందా అనుకుంది. ఇంతలోకే అనూరాధ తమ్ముడూ వచ్చాడు. కుశలప్రశ్న లడిగి పెద్దప్పగార్ని ఆడవాళ్ళ హాలుకు తీసుకువెళ్లాడు. అక్కడ మురళీధర్ భార్య ప్రత్యక్షమైంది. వీళ్లంతా ఒకేరోజున ఒకేచోట ఇలా ఎందుకు చేరారా అనుకుంది. అంతా తన మాదిరి గానే వచ్చారనుకుంది విషయం తెలియకముందు. ఇంత మంది ఎరిగిఉన్నవాళ్ల పరిచంచేసరికి సత్యవతమ్మకు అక్కడ ఏదీ కొత్తగా కన్పించలేదు. అయితే ఆడ వాళ్లూ, మొగవాళ్లూ అనే భేదం లేకుండా, కొత్తా పాతా అనే వ్యత్యాసం లేకుండా, అంతా అయినవాళ్లల్లే ప్రవర్తించడం మాత్రం విచిత్రంగా కన్పించింది. మధ్య మధ్య అనూరాధఅప్పా, మురళీధర్ భార్యా మరెవరి తోనో వాగ్వాదాలు చేయడం, పెద్దపెద్ద కబుర్లు చెప్ప డం, చివరికి వాళ్లు వీళ్ళమాటనే ఔననిపోవడం చూచి ఆశ్చర్యపడింది. తన తెలివితేటలముందు మురళీధర్ భార్య తెలివితేట లెంత అనుకుంది. అనూరాధఅప్పకు తనకు తెల్సినంతవరకూ—అంటే ఏడాదికిందటివరకూ అక్షరజ్ఞానమైనా లేదు. ఇప్పుడో? పత్రికలు, పుస్తకాలు గబగబ చదివేస్తుంది. ఎంతవాడిముందరైనా బెదురూ బెదురూ లేకుండా—వెనకటిరోజుల్లో కాంగ్రెస్‌వాళ్ళ మాదిరిగా—ఉపన్యాసాలు దంచేస్తుంది. ఇంచుమించు ఆ శిబిరంలో ఉన్న ఆడవాళ్ళందరికీ నాయకురాలల్లే పని చేస్తున్నది. ఇంతలో సరళ ఇంత గొప్పది ఎట్లా అయిందా అనుకుంది. తనైతే నాలుగుమాసాల్లో అంతకంటే గొప్పదాన్ని కాగల్ననుకుంది. అక్కడున్నంతసేపూ సత్యవతమ్మకు ఇంటిమాటే జ్ఞాపకానికి రాలేదు. ఆ విషయం ఆలోచించడానికి వ్యవధే చిక్కలేదు. ఇది వర్లో తను ఈ ముఠాలనుగురించి విన్నసంగతులకూ తాను కళ్లారా ఇక్కడ చూస్తున్నదానికీ ఎంతవరకూ సరిపోతుందా అని లోలోపల విచారించుకుంటూఉంది. ఆడాళ్లూ, మగాళ్లూ కలిసిమెలిసి అంతా సమానంగా ఉండటంమించి తను విన్న 'బూతు' ఏమీ ఇక్కడ కన్పించిందిగాదు. చాలామంది ఆడవాళ్లు తమ భర్తల తోనూ, చాలామంది మగాళ్ళు తమ భార్యలతోనూ ఉండటం చూచింది. అందువల్ల అనుమానాలకు ఎక్కడా ఏమీ ఆధారం కన్పించలేదు.

ఆ రాత్రి గోష్ఠి పూర్తిఅయి తెల్లవారి ఎవరు ఏపనిచెయ్యాల్సిందీ నిర్ణయించుకునేసరికి రాత్రి ఒంటిగం టయింది. అంతా కలిసి అక్కడే పడుకున్నారు. మురళీ ధర్ తనకు మళ్ళీ కన్పించకపోవడంవల్ల సత్యవతమ్మ అనూరాధఅప్పా, తమ్ముళ్ళతో ఉండిపోవాల్సివచ్చింది. అనూరాధఅప్పను అడిగి సత్యవతమ్మ తన అనుమానా లన్నీ తీర్చుకొని అసలువిషయం తెలుసుకోవా లనుకుంది.

అనూరాధఅప్పకూడా అలాంటి అవకాశం కొరకే ఎదురుచూస్తూఉంది. ముఠాలో సత్యవతమ్మను చేర్చగలిగితే ఆమెనాయకత్వం స్థిరపడిపోతుంది. ఇంకా అలాంటివాళ్లను ఆకర్షించడానికి వీలవుతుంది. సావధా నంగా, బాగా అర్థమయ్యేటట్లు తన ముఠాఆదర్శాలు ఏమిటో, వాటిని సాధించడానికి ముఠాపెద్దలు నిర్దేశించిన కార్యక్రమం ఏమిటో పూసగుచ్చినట్లు సత్యవతమ్మకు చెప్పింది. ముఠామెంబర్లకు నీతి లేదని ప్రచారం చేసింది ముఠాఆదర్శాలంటే గిట్టనివాళ్లని అనూరాధ అప్ప చెప్పిన విషయం నిజమే అని సత్యవతమ్మ నమ్మింది. ఉభయులూ ఇష్టపడితేనే పెళ్ళిళ్లుగాని, లేక పోతే ఎవరి జీవితం వాళ్లదే అనీ, ఇందులో బలా త్కారం అనేది ఏమీ లేదనీ, ముఠారూల్సు అనేవి అసలే లేవనీ సత్యవతమ్మకు బుజువైంది. మంచివాళ్ళు ముఠాలో చేరిపోతారేమో అనే భయంకొద్దీ కొందరు

స్వార్థపరులూ, ఆడవాళ్ళపై తమ అధికారాన్ని స్థిరపరుచుకోవాలని తాపత్రయపడే మగాళ్లూ ఈ దుష్ప్రచారం చేశారని అనూరాధతమ్ముడు చెప్పింది అక్షరాలా నిజం అనుకుంది. తన మరిదీ, భార్యా నిక్షేపంలా ఉంటున్నారు. అంతకంటే సత్యవతమ్మకు ఋజువేం కావాలి? ఈ లోకజ్ఞానం అంతా తెల్సుకొనిపోతే అనూరాధ ఎంత చదివినా తనతో సమానం కాదనుకుంది. ఈవిధంగా ఆలోచిస్తూ ఆరాత్రంతా గడిపింది.

కాని తెల్లవారేసరికి ఇల్లూ, పిల్లలూ, రామమోహనూ గుర్తుకువచ్చారు. మరిదికోసరం వెదికింది. అనూరాధఅక్కను అడిగింది. రైలుకు ఎవరో గొప్ప నాయకుడు వస్తాడని మురళి స్టేషనుకు వెళ్లినట్లు తెలిసింది. తనంతట తానే వెళ్దామనుకుంది. ధైర్యం చేయలేకపోయింది. పైగా తనదగ్గరున్న డబ్బుకూడా రాత్రి మరిది కిచ్చింది- దాచమని. మురళీధర్ కన్పిస్తేగాని సత్యవతమ్మ ముందు కార్యక్రమం నిర్ణయించుకోలేకపోయింది.

మురళీధర్ శిబిరానికి తిరిగివచ్చేసరికి మధ్యాహ్నం భోజనాలవేళయింది. సాయంత్రం గాంధీ ఇర్విన్ పార్కులో బ్రహ్మాండమైన బహిరంగసభ ఉందనీ, అది చూచుకొని రాత్రికి ఇంటికి వెళ్దామనీ వదినగార్ని ఒప్పించాడు. ఆబహిరంగసభే సత్యవతమ్మను పూర్తిగా మార్చివేసింది. అప్పటికప్పుడే తీర్మానించుకుంది మర్నాడు ప్రారంభమయ్యే శిక్షణాతరగతుల్లో చేరాలని. రామమోహనుకు చెప్పి ఒప్పించగలననుకుంది. తనపిల్లల్నిగూడా తనతోనే ఉంచుకోవచ్చుననుకుంది. ఆవిధంగా ఎంతమందో సంసారాలతో వచ్చేసి శిబిరంలో ఉంటున్నారు. రామమోహను ఒప్పుకుంటే అతనూ తనవెంట వచ్చివేయవచ్చు. ఈ నాలుగుమాసాలైన తరువాత ఇంటికివెళ్లి చైతన్యంగల జీవితాన్ని గడపవచ్చునని ఆశపడింది. ఆసాయంత్రం జరిగిన బహిరంగసభలో అనూరాధఅక్కకూడా గొప్ప ఉపన్యాసం చేసింది. మాటమాటకీ అక్కడ చేరినవాళ్ళంతా చప్పట్లు కొట్టారు. అనూరాధఅక్క సామాన్యులకు తెలియని విషయాలు ఏవీ చెప్పలేదు. సంఘంలో హెచ్చుతగ్గులు ఉండకూడదనేసరికి అంతా బ్రహ్మాండంగా చప్పట్లు కొట్టారు. కష్టపడి అహర్నిశలూ పొలంలోపనిచేసే కూలీలకు మాత్రమే పొలంమీద హక్కుండా లన్నది. (వినండి వినండి అని కేకలు మిన్నుముట్టినయ్.) "పురుషులకు బానిసలుగా ఉండటానికి స్త్రీలు పుట్టలేదు. దేవుడిదృష్టిలో మిగతవాళ్లంతో ఆడవాళ్లూ అంతే. కేవలం వంటింట్లో, పడకగదుల్లో కాలం వెళ్లబోసుకొనడానికే దేవుడు ఆడవాళ్లను సృష్టించలేదు. కొందరు సనాతనులు ఈవాదం సరికాదంటారు. వర్ణాశ్రమధర్మాలమాదిరే స్త్రీలనూ, పురుషులనూ ఒక్కొక్క పనికని సృష్టించాడంటారు. నిజంగా దేవుడు అంతపక్షపాతం చూపేవాడైతే మనకు ఆదేవుడు వద్దనేవద్దు. మన దేశానికి ఇరుగుపొరుగుగా ఉన్నది ఒక బ్రహ్మాండమైన దేశం. అక్కడ ఎలాంటి తేడాలూ లేవు. పురుషులతో స్త్రీలూ అంతే. ఇంట్లోనే ఉండి పిల్లల్ని పోషించుకోవాల్సిన అవసరం స్త్రీలకు లేదు. కనటంవరకే స్త్రీలవంతు. ప్రభుత్వం పిల్లల పోషణకు అవసరమైన అన్నిఏర్పాట్లూ చేస్తుంది. ఎవరివృత్తిని వారు నిర్వహించుకుపోవడానికి ఏమీ అడ్డంకు లుండవు. తినటానికి తిండి లేకపోవడమే వ్యభిచారం, రంకుతనం, దొంగతనాలకు కారణం అని అన్నిదేశాలకంటె ముందు ఆ దేశమే గ్రహించి, లేమి అనేది లేకుండా చేయడానికి ప్రయత్నించింది. దేశంలో 'లేమి' అనేది లేకుండా చేసింది ఆ దేశపు ప్రభుత్వం. మనంకూడా ఆమాదిరి ప్రభుత్వాన్ని స్థాపించడానికి ప్రయత్నించాలి. మేము ప్రయత్నిస్తున్నాం. మీరూ మాతో చేరాలి. ఇదిగో ఇటు చూడండి! వీరు సత్యవతమ్మగారు. గంపంత సంసారాన్ని వదలిపెట్టి ఈ లక్ష్యాన్ని సాధించడానికి కంకణం కట్టుకున్నారు. ఈనాడే మన ముఠాలో చేరారు. ఆంధ్రనారీలోకానికి అంతటికీ ఆమెగారు ఆదర్శప్రాయంగా ప్రవర్తించారు." ఈవిధంగా అనూరాధఅక్క ముందరికాళ్ళకు బంధాలు వేసేసరికి సత్యవతమ్మ కట్టుబడిపోయింది. అంతమందిలోనూ తాను అలా చేయలేదని చెప్పుకోవడం గౌరవహీనం అని మాట్లాడకుండా కూర్చుంది. అథవా ధైర్యంచేసి

చెప్పినా అక్కడున్నవాళ్లు తనమాట వినేటట్లు కన్పించలేదు. విన్నా హర్షించేవాళ్లు ఒక్కరూ ఉన్నట్లులేదు.

అనూరాధతమ్ముడు మహిళాశాఖలో చేరిన ఆంధ్రనారీమణిసౌందర్యాన్నీ, పాతివ్రత్యాన్నీ, దేశభక్తినీ ప్రశంసిస్తూ ఉపన్యసించగా సత్యవతమ్మ పూర్తిగా చిత్తయిపోయింది. ఈ యవస్థలో ఆమెకు తన ఇంటి సంగతిగాని, రైలుటైముగాని గుర్తుకు రానేలేదు. సత్యవతమ్మ ఆ స్థితిలోనే ఆ రాత్రంతా శిబిరంలో గడిపింది.

* * * *

తెల్లవారేసరికి రామమోహనూ, మనోహరం బెజవాడ వచ్చి మామూలుగా తమతమ్ముడు బసచేసే చోటుకు వెళ్ళి ఆచూకీతీసి సరాసరి శిబిరానికి వెళ్లారు. దార్లో రామమోహనూ, మనోహరం ఒకరితో ఒకరు మాట్లాడుకోనేలేదు. ఘటిల్లిన ఘోరప్రమాదాన్ని ఇద్దరూ గ్రహించినట్లే ఉన్నారు. శిబిరంవాకిటిగుమ్మం దగ్గిర మురళీధర్ దంపతులు కావలికాస్తున్నట్లు ఇద్దరూ చెరోఅరుగుమీదా కూర్చున్నారు. రామమోహన్ అలాగే కుంగిపోయాడు. నోటివెంట మాట రాలేదు. మనోహరమే చొరవచేసుకొని ముందు మరదల్ని పరామర్శచేశాడు. "పుట్టింటినించి ఇక్కడికి ఎప్పుడొచ్చావు?" అని అడిగాడు. ముతామీటింగు ఉందనీ, అందుకోసరం నాల్గురోజులక్రితం బెజవాడ వచ్చాననీ, ఇంటిదగ్గర అంతా కులాసా అనీ చెప్పింది.

ముతామీటింగు అంటే ఎలా ఉంటుందో మనోహరం ఊహించగలిగాడు. "అది కేవలం వసంతోత్సవమే" అని గ్రహించాడు. వెంటనే "ఒరేయ్ మురళీ, వదినె ఏదిరా? ఇంటిదగ్గర్నుంచి బయల్దేరి మూనాళ్లయింది. ఏ కబురూ తెలియజేయకుండా నువ్వు ఇలా సీగోడవలో పడిపోతే ఇంటిదగ్గర పిల్లలంతా ఏమైపోతారనుకున్నావురా? ఇప్పుడెక్కడుంది మీ వొదినె?" అని తమ్ముణ్ణే ప్రశ్నించాడు. మురళీధర్ భార్య అందుకొని "ఇక్కడే ఉన్నారు. కాని మీరామెను చూడ్డానికి వీలుగాదు. ఇంటిదగ్గర పిల్లలసంగతి ఇహ బావగారే చూచుకోవాలి. అది వారికి కుదరదంటే వాళ్ళని తీసుకువచ్చి ఇక్కడే వదలవచ్చు. వారికి ఇష్టమైతే అందరూ ఇక్కడే ఉండవచ్చు" అంది.

మనోహరం ఉగ్రుడైనాడు. కాని కార్యసాధనముఖ్యమని "అది తాపీగా తేల్చుకుందాం. ఒక్కసారి వొదిన్ని రమ్మను. చూచిపోతాం. రానంటే బలవంతం ఏమీ లేదు." అని మళ్లీ మురళిని ప్రాధేయపడి అడిగాడు. "ఒరేయ్ మనోహరం, అదుగో మీ బావమరిది. ఆ ప్రక్కన ఉంది మీవొదినేనట్లనే ఉంది. వాణ్ణి పిలు. అదీ ఇలా వస్తుందేమో!" అని ఎంతో ఆశగా రామమోహను అన్నాడు. తన బావమరిదివల్ల మేలుకంటే కీడే ఎక్కువ జరుగుతుందని మనోహరానికి తెలుసు. అయినా కేకవేస్తే ఇద్దరూ ఇటు తిరిగిచూస్తారుగదా అని పిల్చాడు. వాళ్ళిటు తిరిగిచూచి కాస్సేపు నిలబడి "తొందరపన్లో ఉన్నాం. నాలుగురోజులదాకా తీరదు. తరువాత వచ్చి కన్పిస్తాను" అని అనూరాధతమ్ముడు సమాధానం చెప్పాడు. సత్యవతమ్మ ఆమాటైనా చెప్పలేదు. చూచి నవ్వుకుంటూ వెళ్ళిపోయింది. ఇంక లాభం లేదని అన్నదమ్ములిద్దరూ ఇంటిదారి పట్టారు.

* * * *

"ఏంబావా, అక్క ఏమైంది? ఎక్కడుంది? కన్పించనేలేదా? బావగారు అలా దిగులుపడిపోయినారేం? ఏం జరిగింది? చెప్పు బావా" అని అనూరాధ మనోహరాన్ని వేధించింది. "నాకేంతెల్సు? మీ తమ్ముణ్ణే అడుగు. ఇప్పుడు వాడే ఆవిడకి గార్డియన్. నువ్వు సాధించలేక తమ్ముణ్ణే ఇలా ప్రయోగించావేం" అని మనోహరం ఉండబట్టలేక అనేశాడు. "అదేమిటి బావా, అలా అంటావు? మాతమ్ముడు నాతో మాట్లాడటం మానేసే ఏడాదయింది. ఇక్కడికి వచ్చినా మీ తమ్ముడూ, మీవొదినే వాడి వ్యవహారం అంతా చూచి వంపేస్తూఉండేవాళ్లు. పైగా వాళ్లిద్దరూ కలిసి నన్ను నానామాటలూ అనేవాళ్లు. మధ్య నే నేం చేశాను?" అని పాపం, అనూరాధ బిక్కమొహం వేసింది.

అనూరాధశోక్యం ఏమీ లేదిందులో అని మనోహరానికి తెలుసును. అయితే తన అన్నబాధ చూచి సహించలేకపోయినాడు. రామమోహనుబాధకు అనూరాధతమ్ముడే కారణంగనుక అనూరాధను సాక్షిస్తే కాస్తమనశ్శాంతి కలుగుతుందని భ్రమ. రామమోహను తప్పంతా తనదే అని లోపలలోపల కుమిలిపోతున్నాడు. తను అలా, తన తమ్ముడిసంగతి తెలిసి ఉండికూడా, సత్యవతమ్మను పంపించడం తప్పనుకున్నాడు. ఆ ముఠాగాలి సోకితేచాలు, ఇక ఆపడం ఎవరికీ సాధ్యంగాదు. ఆరోజు తనే వెళ్లివుంటే ఇంత పని జరిగేదా? లేక బలవంతంగా సత్యవతమ్మను పంపకుండా ఉంటే ఈ సంసారం ఇలా అయిఉండేదా? ఇంతకూ ఇప్పుడు ఏమనుకుంటే ఏంలాభం? తనకూ లేదు చదువు; తన భార్యకూ లేదు చదువు. చదువు లేకపోవడం వల్లనే అనూరాధఅప్పా, తమ్ముడూ అలా పోయినారు. చదువుకున్న అనూరాధ చక్కగా కాపరంచేస్తున్నది. చదువుకున్నఆడవాళ్లు సంసారం చేయడానికి పనికిరారనే "పెద్దలవాదాన్ని" సత్యంగా గ్రహించి రామమోహను సత్యవతమ్మను పెండ్లిచేసుకున్నాడు. దానికి కారణం తనకు చదువులేకపోవడమే. ఫలితం నేటి తన అనుభవమే అని అమితంగా బాధపడుతున్నాడు.

అప్పట్నుంచీ రామమోహనుకు మనోహరంపైనా, అనూరాధపైనా విపరీతమైన గౌరవం, అభిమానం ఏర్పడింది. వాళ్లకు పిల్లలు లేకపోవడంవల్ల రామమోహనుపిల్లల్నే తమ పిల్లలుగా పెంచుతూ వచ్చారు. ఆఊళ్లోవాళ్లందరికీ సత్యవతమ్మపరివర్తనం ఒక తీవ్రహెచ్చరిక అయింది. అనూరాధప్రవర్తన అందరికీ ఆదర్శప్రాయమైంది. సత్యవతమ్మ లేచిపోయింతరువాత ఆఊళ్లో ఎలా తలెత్తుకుతిరుగుతామా అని అనుకున్నారు అన్నదమ్ములిద్దరూ. కాని అనూరాధ పోయిన గౌరవాన్ని తిరిగి సంపాదించడమే గాక తన ప్రవర్తనవల్ల ఆ గౌరవాన్ని హెచ్చుచేసింది.

మనోహరం పంచుకోవాల్సిన అవసరం లేకనే, అందుకు ముఠాలోచేరిపోతానని ఎవర్నీ బెదిరించాల్సిన అవసరం లేకనే అనూరాధ ఇంటియజమానురాలైంది. సత్యవతమ్మ పోయినందుకు విచారించేవాళ్లకంటె అనూరాధ ఇంటియజమానురాలైనందుకు సంతోషించినవాళ్లే ఆఊళ్లో ఎక్కువైనారు. రామమోహను కూడా క్రమంగా సత్యవతమ్మసంగతే మరిచిపోయి తండ్రి పోయినతరువాత మనోహరం, అనూరాధలకు తండ్రిలాగా ఉండి కాలం వెళ్లబుచ్చుకుంటున్నాడు.

* * * *

అప్పటికీ ఇప్పటికీ సత్యవతమ్మ ఏమైందో, ఏ గెరిల్లాదళానికి నాయకత్వం వహించి ఏ విప్లవాన్ని సాధిస్తున్నదో ఎవరికీ తెలియదు. కాని రామమోహనరావు ఇంట్లో దొంగలు పడి ఇల్లంతా దోచి అనూరాధనూ, రామమోహన్నూ కాల్చి పారిపోయిన ముసుగువాళ్లల్లో సత్యవతమ్మా, అనూరాధతమ్ముడూ ఉన్నారని మాత్రం ఊరంతా గోలయింది. ఇది జరిగి ఆరుమాసాలైంది. పోలీసుల విచారణ ఇంకా పూర్తికాలేదు. అప్పుడుగాని నిజం తెలియదు. తీరా తెల్సిన తరువాత అది నిజంకాకనూ పోవచ్చు. లేదా, ఊళ్లో బయల్దేరిన వదంతులే యథార్థం అని ఋజువుకానూ వచ్చు.



# వీరశైవవాఙ్మయము - తద్విశేషములు

★

శ్రీ బండారు తమ్మయ్య

శ్రీమంతంబగు నీ భరతఖండంబున వెలసిన మతములలో శైవము మిక్కిలి ప్రాచీనమయినది. నామరూపవిరహితుడగు పరమేశ్వరునకు నామరూపములు సాధకుని సాధనకొఱకే కల్పింపబడిన వని నిర్వివాదముగ నంగీకరింపవలయును. పరమేశ్వరతత్త్వము శివ రుద్రాదినామములతో వేదకాలమునుండియు వ్యవహరింపబడినట్లు ఋగ్యజుర్వేదములవలన గానవగును. శివ యనగా నది మంగళప్రదము, సులభోచ్చారణసంయుతము నగు శివశబ్దమునందు నిబిడీకృతమయినది. "శ్వః శ్రేయసం శివం భద్రం కల్యాణం మంగళం శుభమ్" అని నిఘంటువు. "శివస్య ఇదం శైవమ్" అను వ్యుత్పత్తిచే శైవశబ్ద మేర్పడినది. "మన్" (తలంచు) అను ధాతువువలన మతము అను శబ్దము నిష్పన్నమయినది. కావున శైవమనునది పరమేశ్వరతత్త్వజిజ్ఞాసకయి యీ భారతదేశమున వెలసిన పురాతనమత మని యెన్నదగును. పరమేశ్వరుడగు శివుని నిశ్శ్వాసజనితములు నిగమము (వేదము) లనియు, తద్వదనసంజనితములు ఆగమము లనియు శాస్త్రవ్యవహారము. ఆగమములలో శివాగమములు కామికాదినామములతో నిరువదియెనిమిది యున్నవి. శైవమతమునందలి యవాంతరభేదము లీయాగమములందు ప్రతిపాదితము లయియున్నవి. వీనిలో నొకటి మొదట వెలసిన దనియు, దక్కినవి దానిలోనుండి క్రమపరిణామము నొంది తరువాత వెలసిన వనియు నిర్ధరించి వచించుటకు దగిన సామగ్రి కానరాదు. అట్లూహించుటకూడ సరికాదనియే తలంపవలయును. ఈ యవాంతరభేదము లన్నియు నాయా యాచార్యులచే మిగుల పురాతనకాలమునుండియే వేర్వేఱు దేశముల వెలయింపబడియుండు ననియు, నందులో గొన్ని రానురాను గొంత కాలమునకు నితరమతవ్యాప్తిచే దగిన ప్రచారము లేక యంతరించుటయో, తదితరములగు నవాంతరభేదములలో విలీనమగుటయో జరిగియుండు ననియు దలంచుటయే సమంజసము.

సూక్ష్మాగమములో—

"సామాన్యశైవం ప్రథమం మిశ్రశైవం తతఃపరమ్
శుద్ధశైవం తతో జ్ఞేయం వీరశైవం తతఃపరమ్."

అని స్థూలదృష్టితో చతుర్విధశైవములును, కారణాగమములో—

"ఆదౌ సామాన్యశైవంతు పూర్వశైవం ద్వితీయకం
మిశ్రశైవం తృతీయంతు శుద్ధశైవం చతుర్థకం
పంచమం శ్రౌతశైవంతు షష్ఠంతు మార్గశైవంచ
సప్తమం వీరశైవం స్యా ద్వీరసామాన్య మష్టమం
విశేషం వీరశైవంతు నవమం పరికీర్తితం
నిరాభారాఖ్యశైవంతు దశమం పరిబోధితం
క్రియాశైవం దశవిధం తత్తత్కృత మిహోచ్యతే."

అవి దశవిధశైవములుగ పేర్కొనబడి వాని భేదములు వివరింపబడినవి. వీనిలో శ్రౌతశైవ, మార్గశైవ, వీరశైవములలో సాధకునకు గురుదత్తమగు నిష్టలింగమును హస్తపీఠమందునిచి యర్చించుట విధింపబడినది. ఇష్టలింగ మెప్పుడును ధరింపవలసిన దనియు, తద్విషయమున సాధకు డతిజాగరూకతతో మెలంగవలె ననియు, అది ప్రమాదమున నైనను భూపతితముగాని వినష్టముగాని యైనచో ప్రాణపరిత్యాగముకన్న వేఱుగతి లేదనియు వీరశైవుని విషయమున శాసింపబడి యిష్టలింగార్చనమునం దాతనికి విశిష్టభక్తినియమములు విధింపబడినవి. దహరాకాశప్రతిష్ఠితమగు నంతర్లింగమునకు (భావలింగము), గురుదత్తమయిన బాహ్యలింగమునకు (ఇష్టలింగము) బింబప్రతిబింబరూపకమగు నైక్యానుసంధానమును నిరంతరము సాధనచేయుచు నాతడు కాలము గడపవలెను. పంచాక్షరీజపము, ఇష్టలింగపూజనము మాత్రమే యాతడొనర్పవలెను. అన్యదేవతాస్మరణమంత్రోపాసనము లెల్ల నాతనికి నిషేధింపబడినవి. ఇందుచేతనే వీరశైవము శూలాంగసాదృశ్యమనియు, అల్పక్రియ గలిగి బహుఫలదాయకమగు నీ వీరవ్రతమును విధియుతముగ నిర్వహించు సాధకున కొక్కజన్మమునందే ముక్తి సిద్ధించుననియు శైవాగమములలో జెప్పబడినది.

"విశబ్దే నోచ్యతే విద్యా శివజీవైక్యబోధికా
తస్యాం రమంతే యే శైవా వీరశైవాస్తు తే మతాః
వేదాంతజన్యం యజ్జ్ఞానం విద్యేతి పరికీర్తితా
విద్యాయాం రమతే తస్యాం వీరఇత్యభిధీయతే.
విశిష్ట ఈర్యతే యస్మా ద్వీర ఇత్యభిధీయతే."

ఇత్యాదిగా వీరశబ్దము నిర్వహించబడినది. కావున శివజీవైక్య జ్ఞానము(లింగాంగసామరస్యము)కయి నిరంతరము సాధన చేయు జనుడు వీరశైవు డని వ్యవహరింపబడునుగాని కొందఱు సామాన్యముగ భ్రమించునట్టు ఇతరమతములను, మతస్థులను ద్వేషించువాడు కాడు. వీరవ్రతుని దృష్టి యెప్పుడు నాత్మోన్నతి యందేగాని పరమతద్వేషాదులపయి ప్రసరింప నేరదు.

"పవిత్రం తే వితతం బ్రహ్మణస్పతే ప్రభు ర్గాత్రాణి పర్యేషి విశ్వతః
అతప్తతనుర్న తదామో అశ్నుతే శ్రుతాస ఇద్వహం తత్సమాశత."
"అయం మే హస్తో భగవా నయం మే విశ్వభేషజోఽయం శివాభిమర్శనః
అయం మాతా అయంపితా అయంజీవాతు రాగమాత్."

"అమృతస్య దేవధారణో భూయాసమ్."
"నమో బ్రహ్మణే ధారణం మే అస్తు."

మున్నగు శ్రుతివాక్యములు, "చాతుర్వర్ణానాం లింగధారణ ముచ్యతే" ఇత్యాద్యుపనిషద్వాక్యములు, "ముఖే మంత్రం హృది ధ్యానం మస్తకే లింగధారణం, శిఖాసూత్రం జటాధీనస్య ఏతద్బ్రాహ్మణలక్షణమ్" మొదలగు స్మృతిప్రమాణములు,

"తదేవ హస్తాంబుజ పీఠమధ్యే నిధాయ లింగం పరమాత్మచిహ్నం
సమర్చయే దేకధియా సదా నైర్మల్య స్వశాస్త్రాంతర భేదభిన్నః."

మున్నగు పురాణవాక్యములును వీరశైవమునకు ప్రధానాంగ మయిన యిష్టలింగధారణము ప్రాచీనార్యసమ్మతమనియు, వీర శైవము శ్రుతిస్మృతిపురాణవిహితమనియు విశదీకరించును.

ఈమతప్రచారమునకయి శివుని సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానముఖములనుండి వీరశైవగోత్రకర్తలగు వీర, నంది, భృంగి, వృష, స్కందు లుద్భవించిరనియు, వారే వేర్వేఱుయుగములలో వేర్వేఱు నామములతో వ్యవహృతులయి వీర శైవమతప్రచారోద్ధరణముల గావింతు రనియు సుప్రబోధ, స్వయంభువాది శివాగమములవలన దెలియుచున్నది. రేణుక (రేవణసిద్ధ), మరుళసిద్ధ, ఏకోరామ, పండితారాధ్య, విశ్వారాధ్య అనునవి వీరి కలియుగవ్యవహారనామములు. ఈ పంచాచార్యుల పీఠము లిప్పుడు వరుసగ రంభాపురి (బాళెహొన్నూరు, మైసూరురాష్ట్రము), ఉజ్జని (బళ్లారిమండలము) కేదారము, శ్రీశైలము, కాశి యను క్షేత్రముల నెలకొని యున్నవి.

వీరశైవులకు భూతి, రుద్రాక్ష, మంత్రము, గురువు, లింగము, జంగమము, పాదతీర్థము, ప్రసాదము అనెడి యష్టావరణములును, లింగాచారము, సదాచారము, శివాచారము, గణాచారము, భృత్యాచారము అను పంచాచారములును విహితములయియున్నవి. మఱియు శివజీవైక్యజ్ఞానసాధనవిషయమున భక్త, మాహేశ్వర, ప్రసాది ప్రాణలింగి, శరణ, ఐక్యస్థలము లను ఆఱు ప్రధానస్థలములును, వానిలో అంగస్థలములు నలుబదినాలుగు, లింగస్థలములు ఏబదియేడు మొత్తము నూటయొకటి యవాంతరస్థలములును ఏర్పఱుపబడినవి. వీరశైవపరిభాషలో లింగ, స్థలశబ్దములు రెండునుగూడ పరబ్రహ్మ వాచకములగు సమానార్థకము లయియున్నవి. సచరాచరప్రపంచ మెల్ల దేనియందు సృష్టిస్థితిలయము లొందుచున్నదో యదియే లింగము, స్థలము అని నిర్వచింపదగును. కావున బూర్వోక్తము లయిన యష్టావరణ, పంచాచారముల గూర్చిగాని, షట్స్థలవిజ్ఞానమును గూర్చిగాని, పంచాచార్యులను గుఱించిగాని, యీ మతోద్ధరణమున కయి యవతరించిన బసవేశ్వర, మల్లికార్జునపండితి, సోమనాథాది మహాపురుషుల విషయమునగాని వెలసిన వాఙ్మయము నెల్ల మనము వీరశైవవాఙ్మయముగా బరిగణింపదగును. తదితరమతములవలెనే శ్రుతిస్మృతిపురాణములు, ఉపనిషత్తులు, ఆగమములు ఈ మతమునకుగూడ ప్రమాణరూపకములగు ప్రాథమికవాఙ్మయమని యెన్న దగును. వేదాంతము లని చెప్పబడెడి యుపనిషత్తులలో లింగోప నిషత్తు, వీరశైవోపనిషత్తు, అథర్వశిరఉపనిషత్తు, కాలాగ్ని రుద్రోపనిషత్తు, రుద్రజాబాలోపనిషత్తు మున్నగునవి పైని చెప్పిన యష్టావరణములకు సంబంధించినవిగూడ గలవు. ప్రాచీనతరంబగు నిట్టి వైదికవాఙ్మయముమాట యటుంచి యైతిహాసికయుగమునకు సంబంధించిన యీమతవాఙ్మయముమాట విచారింతము.

బ్రహ్మసూత్రములకు శంకరభాష్యమునకు మున్నే కొన్ని భాష్యము లుండెడివి. వానిలో వీరశైవపరముగ నీలకంఠశివా చార్యుడు రచించిన భాష్య మొకటి యని యనుశ్రుతముగ దెలియు చున్నది. కాని యాభాష్య మిప్పుడు సమగ్రముగ లభించుటలేదు. కొన్నివందలసంవత్సరములక్రిందట కర్ణాటదేశీయుడు నీలకంఠపండి తుడు క్రియాసార మను పేరతో వ్రాసిన సంస్కృతగ్రంథమే యా భాష్యమునకు ప్రతీకముగా గాన్పించుచున్నది. ఈ బ్రహ్మ సూత్రములకే మార్గానుసారివృత్తియు వీరశైవపంచాచార్యులలో మరుళసిద్ధుడు, ఏకోరామాచార్యుడు, పండితారాధ్యుడు, విశ్వా రాధ్యుడు, పండితత్రయములోని మంచనపండితుడు వేర్వేఱుగా భాష్యములు రచించిరని శ్రీపతి పండితుడు (క్రీ. శ. ౧౦౭౦ ప్రాంతము) వ్రాసిన శ్రీకరభాష్యమువలన దెలియుచున్నదిగాని యవి యిప్పుడు గానరావు. వీరశైవమతపరములగు బ్రహ్మసూత్రభాష్యము లలో శ్రీపతి పండితారాధ్యుని శ్రీకరభాష్యమే యిప్పుడు ప్రచారమం దున్నది. రేణుకాచార్యుడు అగస్త్యునకు బోధించి నట్లుగా వీరశైవమతసిద్ధాంతమును నిరువదియొక్క ప్రకరణము లలో వివరించుచు శివయోగిశివాచార్యుడు సిద్ధాంతశిఖామణి యను మహోత్తమగ్రంథమును రచించెను. ఇది మిక్కిలి ప్రామాణికమయి నది. షట్స్థలములు, వాని యవాంతరములగు నేకోత్తరశతస్థలముల గూర్చియు నిది వాల్మీకిరామాయణశైలినింబోలు మనోహరశైలిలో

జక్కగా బోధించును. శ్రీకరభాష్యమునందును, శ్రీకంఠ భాష్యమునందును, నింకను ఇతరతరవీరశైవమతగ్రంథములందును సిద్ధాంతశిఖామణిశ్లోకము లుదాహృతము లవుటచే నిది కడుంగడు పురాతనగ్రంథముగ దెలియనగును. ఇది ముద్రితమయి విశేషప్రచారమునం దున్నది. ఇదిగాక షట్స్థలజ్ఞానముగూర్చి 'అనాదివీరశైవ షట్స్థలసారసంగ్రహము' అని మఱియొక యుత్తమగ్రంథము గలదు. అది యింతదనుక ముద్రితమయినట్లు కానరాదు. వాతూలాగమముయొక్క యుత్తరభాగమున శివుడు పార్వతికి బోధించిన శివసిద్ధాంతతంత్రము ననుసరించి షట్స్థలనిర్ణయాత్మకముగ 'శివానుభవసూత్రము' అను పేరుతో నెనిమిది యధికరణములు గల గ్రంథమును, గురుశిష్యసంవాదరూపకముగ విశేషార్థప్రకాశిక యనెడి యైదధికరణములుగల మఱియొక గ్రంథమును కళ్యాణసోపనామకుడగు మాయిదేవుడు రచించియున్నాడు. ఇతడు మలప్రహారిణి యను నది యొడ్డున నున్న 'ఐపుర' మందలి సోమేశ్వరస్వామిభక్తుడు. ఐపురము మైసూరురాష్ట్రమున గలదేమో! నరసింహబల్లాళుని యాస్థానమున క్రీ. శ. ౧౧౬౦ ప్రాంతమున దండనాథుడుగా నుండిన కెరెయపద్మరసు కన్నడమున 'వీరశైవదీక్షాబోధ' యను గ్రంథమును రచించెను. ఈ పద్మరసువంశస్థుడయిన పద్మణాంకకవి క్రీ. శ. ౧౩౮౫ ప్రాంతమున 'పద్మరాజపురాణము' అను పేరితో పద్మరసుచరిత్రమును గన్నడమున రచించెను. దానిలో నాతడు చెప్పిన వంశానుక్రమణికలో పద్మరసుతండ్రి మాయిదేవు డని కలదు. శివానుభవసూత్రములు, విశేషార్థప్రకాశిక రచించినది యీతడేమో విచారింపదగును. ఈ రెండునుగూడ నుత్తమగ్రంథములే. ఏబదియేండ్లక్రిందట తెలుగులిపిలో ముద్రితమయినవిగాని తిరిగి పరిశుద్ధముగ బరిష్కృతములయి ముద్రింపదగి యున్నవి. 'లింగధారణచంద్రిక' యను గ్రంథమును నందికేశ్వరశివాచార్యుడు రచించెను. ఇదికూడ తెలుగులిపిలో జాలగాలమయి ముద్రింపబడినది. ఈ కృతికర్త యాంధ్రదేశీయుడనియు, విజయనగరసంస్థానపండితులుగా నుండిన యిటూరి నందికేశ్వరశాస్త్రిగారి మాతామహుడు చాగంటి నందికేశ్వరశాస్త్రిగా రనియు గొందఱు చెప్పెదరుగాని యిదనిశ్చితమనుట కాధారములు లేవు. ఇరువదిసంవత్సరముల క్రిందట శ్రీ కాశీ విశ్వారాధ్యపీఠాధ్యక్షులగు శ్రీ జగద్గురు రాజేంద్రమహాస్వాములవారు మహామహోపాధ్యాయ పండిత శివకుమారశాస్త్రిగారిచే వ్యాఖ్యానము వ్రాయించి యీ యుత్తమ గ్రంథమును దేవనాగరిలిపిలో ముద్రింపించియున్నారు. మైసూరు రాష్ట్రమందలి కెలాదిసంస్థానమును క్రీ. శ. ౧౫౦౦ ప్రాంతమున బరిపాలించిన బసవప్పనాయకుడు 'శివతత్త్వరత్నాకరము' అను మహోత్కృష్టగ్రంథమును రచించెను. దానిలో వివిధవిషయములతోపాటు వీరశైవమునకు సంబంధించిన యుత్తమాంశములు పెక్కులు గలవు. ఇవిగాక యీ మతాచారధర్మములనుగూర్చి వీరశైవాచారసంగ్రహము, వీరశైవరత్నాకరము, వీరశైవచింతామణి, వీరశైవాచారకౌస్తుభము, వీరశైవసంజీవిని, వీరశైవాచారప్రదీపిక మున్నగు గ్రంథము లనేకములు సంస్కృతభాషలో గలవు. వీనిలో గొన్ని సంకలితగ్రంథములుగ గానవనగును. గీర్వాణవాఙ్మయాంబునిధి తఱచినకొలది యనేకమతగ్రంథరత్నములు దొరకగలవు. శ్రీ కాశీ విశ్వారాధ్యపీఠపక్షమున నే యిరువదిసంవత్సరములక్రిందట వ్యాకరణతీర్థులు శ్రీ పండిత సదాశివశాస్త్రిగారు 'వీరశైవేందుశేఖరము' అను గ్రంథము రచించి దేవనాగరిలో నే ప్రకటించిరి. వీరు తరువాత రంభాపురియందలి రేణుకాచార్యసింహాసనము నధిష్ఠించి మూడేండ్లక్రిందట లింగైక్యమొందిరి.

ఇక సంస్కృతభాషలో వీరశైవపంచాచార్యుల చరిత్రములగూర్చి యిప్పటికి లబ్ధమయినంతలో సిద్ధనాథరచితమగు రేణుకవిజయ మొక్కటియే కాన్పించుచున్నది. ఇది మంజరీనామకములగు పంచప్రకరణములుగా నింపుమించుగ మూడువందలగద్యపద్యములతో మనోహరమగు ప్రౌఢశైలిలో గూర్పబడినది. కృతికర్త "బుధప్రహ్వనియద్భ్రహ్మమితే విక్రమ వత్సరే మార్గశీర్షేచ పౌర్ణమాస్యాం ప్రబంధః ప్రాప పూర్ణతాం" అని గ్రంథాంతమున జెప్పుటచే నిది విక్రమశకము ౧౧౧౬ (క్రీ. శ. ౯౬౦) లో రచింపబడినట్లు తెల్లమగును. ఇది కన్నడలిపిలో ౧౯౩౬ సంవత్సరములో మైసూరువందు పండిత హరీశ్వరశాస్త్రిగారిచే బ్రకటింపబడినది. పంచాచార్యప్రభాపత్రికాధిపతులగు శ్రీ కాశీనాథశాస్త్రిగారు ఈ సంస్కృతప్రబంధమునుబట్టి కన్నడమున గొంద ఱాధునికపండితులచే రేణుకవిజయపురాణము, రేణుకవిజయము అను పద్యకావ్యమును గద్యకావ్యమును వ్రాయించి తమ గ్రంథమాలికలో బ్రకటించిరి. దాని ననుసరించియే శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు ఆంధ్రమున 'రేణుకవిజయ' మను పద్యకావ్యమునుగూర్చి బ్రకటించిరి. మఱియొక ప్రబంధమును కీర్తిశేషులు దేవిసంస్థానాధీశులు శ్రీ కందుకూరి బాలసూర్యప్రసాదరావుగారి యాస్థానకవీశ్వరులుగా నుండిన శ్రీ జేమాని సూర్యప్రకాశకవిగారు ప్రౌఢశైలిలో విరచించిరి. కాని యది యింతవఱకు ముద్రితముకాలేదు. పంచాచార్య సింహాసనములలో నాల్గవదియగు శ్రీశైలసింహాసనమునకు దక్షిణహిందూస్థానమున బలుతావుల శాఖామఠములు గలవు. అందులో మైసూరురాష్ట్రమందలి కోలారుజిల్లా బాగేపల్లితాలూకా గూళూరుసమీపమున నిడుమామిడియందలి మఠము సుప్రసిద్ధమయినది. ఆ మఠమునందు ఇగడూరు రుద్రకవి రచించిన పండితచరిత్రము, ఫుల్లకవి రచించిన పండితారాధ్యచరిత్రము అను తెల్గుకృతుల తాళపత్రప్రతులు గలవని తెలియుచున్నది. ఇం దుదాహృతుడయిన పండితారాధ్యుడు శ్రీశైలసింహాసనాధ్యక్షుడగు ఆచార్యపండితుడే కాదగును.

కర్ణాటభాషలో వీరశైవవాఙ్మయము విశేషముగ గలదు. అందుగూర్చి వివరించుట కిచ్చట దావు చాలదు. ఆ భాషలో గూడ క్రీ. శ. ౧౧౬౦ ప్రాంతమున వీరశైవదీక్షాబోధ రచించిన కెరెయ

పద్మరసు, శివగణదరగళే, గిరిజాకళ్యాణము మున్నగు కృతులు క్రీ. శ. ౧౧౯౦ ప్రాంతమున రచించిన హరీశ్వరుడు మొదలగువారి నుండియే ప్రబంధవాఙ్మయము ప్రారంభమయినట్లు కానవచ్చును. అంతకుమున్న బసవేశ్వరాదులు గేయరూపకముగను, వచనరూపకముగను రచించిన వచనవాఙ్మయము విస్తరించియుండును. ఆంధ్రభాషలో నిప్పటికి లభ్యమయినంతలో మల్లికార్జునపండితుని (క్రీ. శ. ౧౧౦౦-౧౧౬౦) శివతత్త్వసారాదికృతులను, పాలకురికి సోమనాథుని (క్రీ. శ. ౧౧౮౦-౧౨౪౦) అనుభవసారము, బసవపురాణము (ద్విపద), వృషాధిపశతకము, చెన్నమల్లుసీసములు, చతుర్వేదసారము, మల్లమదేవీపురాణము (ద్విపద), పండితారాధ్యచరిత్రము (ద్విపద), బసవోదాహరణము, బసవస్తోత్రపరములగు పంచప్రకారగద్య, నమస్కారగద్య, అక్షరాంకగద్యాదికలఘుకృతులును ఈ వాఙ్మయమునకు సంబంధించిన ప్రాథమికకృతులుగా గానవచ్చును. మల్లికార్జునపండితుడు శివతత్త్వసారము నాంధ్రమునందే గాక కన్నడమునగూడ వ్రాసియున్నాడు. ఇదిగాక యాతడు రుద్రమహిమ, దీపకళికమహానాటకము, సంసారమాయాస్తవము, ఉమాలింగోద్భవదేవగద్య, పంచగద్యలు, అమరేశ్వరాష్టకము, శ్రీముఖదర్పణగద్య మున్నగు సంస్కృతకృతులుగూడ రచించినట్లు కానవచ్చును. కాని వీనిలో శ్రీముఖదర్పణగద్యము మాత్రమే యింతవఱకు లభ్యమైనది. సోమనాథుడుగూడ సంస్కృతమున రుద్రభాష్యము, సోమనాథభాష్యము, బసవోదాహరణము, వృషభాష్టకము, బసవాష్టకము, బసవపంచకము, త్రివిధలింగాష్టకము మున్నగు కృతులు రచించినాడు. రుద్రభాష్యము యజుర్వేదమందలి శతరుద్రీయము(నమకచమకములు)పయి భాష్యమయి యుండును. అది లభ్యము కాలేదు. సోమనాథభాష్యమునందు వీరశైవవిహితములగు అష్టావరణములయొక్క మహిమాదికము లెక్కువగా ప్రశంసింపబడినవి. ఆంధ్రవీరశైవకవులలో సోమనాథుడగ్రగణ్యుడు. తరువాతివారి కెల్ల గురుప్రాయుడు. ఈతని వైదుష్య, కవితావైశారద్యము లప్రమేయములు. ఆంధ్రమునకే సంస్కృతమునకు, కర్ణాటమునకు బరివర్తితములగు గౌరవము తొలందొలుత నీమహనీయుని ద్విపదకావ్యములకే సంప్రాప్తమయినది. ఈతని బసవపురాణమును భీమకవి మునుముందు క్రీ. శ. ౧౩౬౯ సంవత్సరములో గన్నడించెను. అటుతరువాత సింగిరాజు (క్రీ. శ. ౧౫౦౦) మహాబసవరాజచరిత్రము (సింగిరాజపురాణము) అను పేరితో వార్ధకషట్పదులలో మఱియొక కర్ణాటానువాదమును, షడక్షరకవి (క్రీ. శ. ౧౬౫౫) బసవరాజవిజయము (వృషభేంద్రవిజయము) అను పేర నొక చంపూకావ్యమును విరచించిరి. భీమకవి గావించిన పరివర్తనము ననుసరించి తమిళభాషలోగూడ నొక కవి బసవపురాణమును బద్యకృతిగా రచించియున్నాడని శ్రీ ప్రభాకరశాస్త్రిగారు వ్రాసినారు. ఇక నీ బసవపురాణమునకే శంకరారాధ్యులను కవి యొక సంస్కృతానువాదమును వెలయించెను. ఏలూరునందలి యారాధ్యబ్రాహ్మణులు కందుకూరివారి పూర్వులలో నొకరు గౌరవయునకయి వ్యాసప్రోక్తమని పేర్కొనుచు స్కందాగస్త్యసంవాదరూపకముగ బసవేశ్వరపురాణ మను పేరితో సోమనాథుని కావ్యము ననుసరించియే యొక సంస్కృతగ్రంథము నవతరింపజేసిరి. ఈతని పండితారాధ్యచరిత్రమునకు గురురాజకవి (క్రీ. శ. ౧౮౩౦) సంస్కృతానువాదమును, నీలకంఠాచార్యుడు (క్రీ. శ. ౧౮౬౫) వార్ధకషట్పదులలో ఆరాధ్యచరిత్ర మను పేరితో గర్ణాటభాషానువాదమును గావించిరి. ఇక నాంధ్రకవులలో శ్రీనాథకవిసార్వభౌముడీతని పండితారాధ్యచరిత్రమునుబట్టి తెలుగుగా ద్విపదల బొందుపఱచుచు క్రీ. శ. ౧౩౯౦ ప్రాంతమున బద్యకావ్యమును రచించెను. కాని యది యింతవఱకు మనకు దొరకలేదు. అట్లే సోమనాథుని శిష్యప్రశిష్యకోటికి జెందిన పిడుపర్తి సోమనాథకవి యాతని ద్విపదలనే యొక్కటుగ నిలుపుచు బసవపురాణమును దన తండ్రి బసవకవియానతిపయి క్రీ. శ. ౧౫౩౦ ప్రాంతమున బద్యకావ్యముగా రచించెను. ఈ పద్యానువాద మున్నను దానితో దనివి నొందక పాల్కురికి సోమనాథునందలి గౌరవముచే నాతని ద్విపదబసవపురాణమునకు విజయవాడవాస్తవ్యుడు, శ్రీపతి పండితారాధ్యవంశ్యుడు నగు మహాదేవారాధ్యుడు మఱియొక పద్యానువాదమును గూర్చియు, తుమ్మలపల్లి నాగభూషణకవి బసవవిజయ మనుపేర మఱొక ప్రబంధము రచించియు దమ భక్తిని బ్రకటించిరి. ఈ బసవవిజయము ననుసరించి యాపేరనే వల్లగంట్ల సారవారాధ్యు డొక ద్విపదకృతిని గూర్చెను. పాలకురికి సోమనాథుడు బసవేశ్వరుని మహిమాదికముల భక్తులవలన విని యాతనిపయి భక్తి కుదిరినంతనే మునుముందు బసవస్తోత్రములను పంచప్రకారగద్యాదికములు, అష్టకములు, పంచకములు మున్నగు లఘుకృతులమూలమున గావించి యటు తరువాత దరువాత జనవశీకరణమునకు, విశేషప్రచారమునకు జాతీయచ్ఛందమగు ద్విపద మిగుల ననువగునని యెంచి తన ప్రధానకృతులగు బసవపురాణ, పండితారాధ్యచరిత్రములను ద్విపదకావ్యములుగా రచించినట్లు కాన్పించును. పూర్వోక్తములయిన లఘుకృతులు గేయరూపకములయి యింపుమించుగ గీర్వాణభాషాబద్ధము లగుటచే నవి యాంధ్రులకు, కర్ణాటులకుగూడ నొక్క తీరుననే యుపకరించి యుభయదేశములందుగూడ వెనువెంటనే ప్రచారమొందెను. కాని ద్విపదలలో గూర్పబడినను బెద్దకావ్యము లగుటచే బసవపురాణపండితారాధ్యచరిత్రములు కర్ణాటమున బరివర్తనమొంది కన్నడభూమిలో బ్రచారమొందుటకు దగినంత వ్యవధి కావలసి వచ్చెను. అందుచేతనే శాలివాహనశకము ౧౧౮౮ (క్రీ. శ. ౧౨౬౬)లో శృంగారసార మను పేరితో రచించిన తన యుద్భటకావ్యములో గన్నడకవి సోమరాజు సమీపకాలమందలి హరీశ్వరుడు, కెరెయపద్మరసు అను వీరశైవకవుల నుతించుచు వ్రాసిన పద్యములో వారితోపాటు "సముదంచద్వృషభస్తవామరమహీజారామనం సోమనం" అని పాలకురికి సోమనాథునిగూడ బ్రశంసించుటకు గారణమయినది. సోమనాథుని కృతులలో జెన్నమల్లుసీసములు షట్స్థలజ్ఞానానుభవమునకు సంబంధించినవి. అనుభవసార మాతని

ప్రాథమికకృతిగ గానవసును. అందు కథారూపకమయిన యితివృత్త మేదియు లేదు. గురుమహిమ, భక్తిస్వరూపము, భక్తుల లక్షణము, భక్తమహిమ, భావశ్రీయార్చనావిధి, ఇష్టలింగార్చనావిధి, షట్స్థలస్వరూపము మున్నగు విషయములగుఱించి గ్రంథముఖమునను, భక్తజనముల వలనను గరి వినిన యనుభవముల నారఁడింటు వర్ణించును. వృషాధిప శతక ముత్పలచంపకమాలికావృత్తములతో "బసవా! బసవా! బసవా! వృషాధిపా!" అను మకుటముతో నత్కృటమగు బసవ భక్తితో గూర్చబడినది. చతుర్వేదసారము "బసవలింగ" అను మకుటముతో రచితమయిన సీసశతకము. రానురాను ఆంధ్రభాషలో విస్తృతినొందిన శతకవాఙ్మయమున కీరెండుశతకములు చాలవఱకు మార్గదర్శకములు, మహోత్తేజకములు నయ్యెనని యెన్నదగును. ఉదాహరణవాఙ్మయమునకుగూడ నీతని బసవోదాహరణమొక్కటే దారి జూపెను. ఈ మహాకవి వీరశైవమతవ్యాపనమునకు, ఆంధ్రభాషావికాసమునకు గావించిన సేవ యపారము, చిరస్మరణీయము. ఇతని తరువాత వీరశైవవాఙ్మయాభివృద్ధికయి యీతని మార్గ మనుసరించి కృషి యొనర్చినవా రాతని శిష్యప్రశిష్యులు పిడుపర్తికవులు. సోమనాథుని, వీరికి నడుమ రమారమి నూఱునందలసంవత్సరముల యంతర మున్నది. ఈ మధ్యకాలములో కొలనిగణపతిదేవుని (క్రీ. శ. ౧౨౬౦ ప్రాంతము) శివయోగసారము, శ్రీనాథుని పండితారాధ్యచరిత్రము తప్ప గణింపదగిన వీరశైవగ్రంథములు గానరావు.

బసవేశ్వరుని కాలములోనే మైసూరుప్రాంతమున బసవపీఠపరసముల అల్లమప్రభు వను విరక్తశరణమూర్తి యవతరించెను. అల్ల, ఇల్ల శబ్దములు కన్నడమున శూన్యార్థసూచకములు. ఈ యల్లమ ప్రభుని లీలలను, జరిత్రమును వర్ణించుచు గన్నడమున చామరసు అను కవి క్రీ. శ. ౧౪౫౦ ప్రాంతమున 'ప్రభులింగలీల' అను ప్రశస్త గ్రంథము రచించెను. వేదాంతగ్రంథములలో నిది విశేషగణ్యత గలిగియున్నది. పైని జెప్పిన పిడుపర్తికవులలో బసవకవి, యీతని కొడుకు సోమనాథకవి, యీతని తమ్ముడు పాలనార్యుని కొడుకు బసవప్పకవి ముఖ్యులు. వీరిలో బసవకవి కెరెయపద్మరసు కన్నడమున రచించిన వీరశైవదీక్షాబోధను ద్విపదకావ్యముగ దెలిగించెను. మఱియు పెర్లనయనారు (అఱువత్తుమూవురు పురాతనులలోని తిరుజ్ఞానసంబంధి)కథ, బ్రహ్మోత్తరఖండముగూడ ద్విపదలుగ రచించెను. ఇతని తనయుడు సోమనాథకవి పాల్కురికి సోముని ద్విపద బసవపురాణము నింతకు ముందు చెప్పినట్లు పద్యకావ్యముగ ననువదించుటయే కాక చామరసు కన్నడప్రభులింగలీలను ద్విపదలో దెలిగించెను. దీనినే యీతని తమ్ముని కొడుకు బసవప్ప పద్యకావ్యముగా రచించెను. వీరి సంతతివాడే యొకడు "ఈశానుసంగ! యేకామ్రగురుచిత్త నలినభృంగ సోమనాథ లింగ" అను మకుటముతో పాలకురికి సోమనాథున కంకితముగా "అన్యవాదకోలాహలము" అను సీసశతకము రచించి దానిని "పాల్కురికయ్య ప్రబంధంబు లన్నింటి కెట్టిన యొడికంపు పెట్టె యనగ" అని ప్రశంసించినాడు. ఇంచుమించుగ నీకాలమునందే కృష్ణదేవరాయల యాస్థానకవియగు తెనాలి రామలింగకవి యారాజేచయమంత్రి కంకితముగా ఉద్భటారాధ్యచరిత్ర మను ప్రబంధమును రచించెను. ఉద్భటుని చరిత్రము కొంత సంగ్రహముగా పాల్కురికి సోముని పండితారాధ్యచరిత్రమున గలదు. అతడు సుప్రసిద్ధసంస్కృతకవి, కవిపోషకుడు, ధారానగరాధీశ్వరుడు నగు ముంజభోజుని దీక్షాగురువు. నేటి యారాధ్యబ్రాహ్మణులలో మదిగొండవారు మున్నగువారు ఉద్భటారాధ్యుడు తమ కూటస్థుడని చెప్పెదరు. ఈగ్రంథము శ్రీ ముక్త్యాలసంస్థానాధీశ్వరుల యాదరమున శ్రీ ప్రభాకరశాస్త్రిగారి పీఠికతో బ్రకటితమయి ప్రచారమందున్నది. ప్రభులింగలీలకు పిడుపర్తికవుల యనువాదము లున్నను వీరశైవేతరులుగూడ గొందఱు దాని నిటీవల మరల పద్యకావ్యములుగా రచించిరి. వారిలో గొచ్చర్లకోట రామకవి, నడకుదుటి రామన్నకవి ముఖ్యులు. దీనివలన వేదాంతవాసనగల పరమతీయులకుగూడ నీ కావ్యము నెడ నెంత యాదరము గలదో వ్యక్తమగును.

బసవేశ్వరుని మేనల్లుడు చెన్నబసవేశ్వరుడు. అతడుగూడ వీరశైవమతోద్ధరణవిషయమున మేనమామకు బాసటగా నుండెడివాడు. ఈతని పేర విరూపాక్షపండితుడు (క్రీ. శ. ౧౫౮౦ ప్రాంతము) కన్నడమున చెన్నబసవపురాణమును రచించెను. బసవేశ్వరమల్లికార్జునపండితుల చరితముల ననుసరించి యందువలన గన్నడులకు గూడ మార్గదర్శకుడయి వారి మన్ననల బడసినవారి యాంధ్రకవియే యైనను వీరశైవవాఙ్మయములో నట్టి గౌరవము చెన్నబసవపురాణవిషయమున మన యాంధ్రులకు గలుగలేదు. కన్నడగ్రంథము ననుసరించియే అత్తలూరి పాపయామాత్యుడు (క్రీ. శ. ౧౭౫౦-౧౮౦౦ ప్రాంతము) కందుకూరి అమృతలింగార్యుల కంకితముగా నయిదాశ్వాసముల ప్రబంధముగా చెన్నబసవపురాణమును రచించినాడు. ఆటుతరువాత మఱికొంతకాలమునకు దీని ననుసరించి మల్లికార్జునపండితారాధ్యవంశజుడగు ఘట్టుపల్లి రాజలింగార్యశంకరాంబికలపుత్త్రుడు కుమారస్వామిశాస్త్రి యను కవివరుడు ఏబది యధ్యాయముల గ్రంథముగా నీపురాణమును సంస్కృతమున రచించెను. అది కరంగల్లులో ముద్రింపబడినది.

ఇవిగాక వీరశైవవాఙ్మయమునకు సంబంధించిన మఱికొన్ని గ్రంథములలో ముఖ్యమయినవానిని సంగ్రహముగ వివరింతును.

(౧) వీరమాహేశ్వరాచారసంగ్రహము:—పర్వతమంత్రి లింగన. ద్విపద. ౧౦ ఆశ్వాసములు. విభూతి, రుద్రాక్ష, పంచాక్షరి, హరనామ, శివరాత్రిమహిమములు, శంఖచక్రోత్పత్తి, మార్కండేయచరిత్ర, విష్ణుశాపమోచనము, శిరశ్చంద్రమహిమ, వ్యాసశిక్ష మున్నగు విషయములు వర్ణించును.

(౨) శైవాచారసంగ్రహము:—గుంటముక్కల తిరుమలనాథుడు. మూడాశ్వాసముల పద్యకావ్యము. గురుశిష్యలక్షణము, నైవేద్య, కర్పూరతాంబూలప్రదక్షిణనమస్కారము, లింగార్చనాకాల విశేషము, లింగోదక పాదోదక ప్రసాదోదకమాహాత్మ్యములు,

ప్రసాదసేవాస్థానస్థలక్షణము, షట్స్థలప్రకారము, సంసారహేయస్థలము మున్నగునవి వర్ణితములు.

(౩) వీరశైవాచారసంగ్రహము:—శివరామలింగకవి. గోకర్ణ మఠమువారి శిష్యుడు. మూడాశ్వాసముల పద్యకావ్యము. శంకర సంహిత ననుసరించి రచింపబడినది.

(౪) శైవసిద్ధాంతశిఖామణి:—చెన్నాప్రెగ్గడ నాగేశ్వరకవి. ద్విపద. శివయోగి శివాచార్యుని సంస్కృతకృతి కిది యనువాదము.

(౫) శైవాగమశిఖామణి:—చెప్పల్లి అప్పయార్యుడు. శివాగమవిషయముల ననుసరించి రచించిన అయిదాశ్వాసముల పద్యకావ్యము.

(౬) షట్స్థలదర్పణము:—సీసపద్యములు. సిద్ధనాథరచితము.

(౭) గురుబోధ:—సోమశివకవి. ద్విపద. ఆశ్వాసములు ౩. శివయోగవిషయముల దెలుపును.

(౮) మనోబోధ:—గంగనారాధ్యుడు. మంజరీద్విపద. శైవ వేదాంతము.

(౯) శివజ్ఞానమంజరి:—పరమానందయతి. ద్విపద. శివయోగ వేదాంతముల నుడివినది.

(౧౦) మణిబసవపురాణము : — బమ్మసిద్ధకవి. ద్విపద. ఆశ్వాసములు ౭. బసవేశ్వరునివలెనే వీరశైవమతప్రచార మొనర్చిన మఱియొక భక్తవరుని చరిత్రము. ఇందలి ప్రథమాశ్వాసముమాత్రము ఏలూరులో కొన్ని వత్సరములక్రిందట ముద్రింపబడినది.

(౧౧) వరచోళచరిత్ర:—పోట్టి లింగన. ౫ ఆశ్వాసముల ద్విపద. భక్తిరసభరితము. కరికాలచోడుడు మున్నగు తొమ్మండ్రు చోళరాజుల చరిత్రములను, వీరశైవాచారధార్మికతను వర్ణించును. ఆంధ్రగ్రంథమాలలో ౧౯౨౨ లో ముద్రితము.

(౧౨) రుద్రాక్షమాహాత్మ్యము: — పర్వతమంత్రిలింగన. ద్విపద.

(౧౩) పంచాక్షరీమాహాత్మ్యము:—రెంటాల వీరనారాధ్యుడు. ౫ ఆశ్వాసముల పద్యకావ్యము. కవి పట్టిసక్షేత్రమందలి వీరభద్రస్వామిభక్తుడు. కందుకూరి వీరేశ్వరలింగార్యుని కంకితము.

(౧౪) రుద్రాక్షఫలమాహాత్మ్యము:—అమలాపురపు సన్యాసికవి. కులాల వంశజుడు. మూడాశ్వాసముల పద్యకావ్యము. కవిత్వము ప్రౌఢమయినది.

(౧౫) విభూతిరుద్రాక్షమాహాత్మ్యము:—పోచిరాజు వీరన. ద్విపద.

(౧౬) సోమవారవ్రతమాహాత్మ్యము:—తిమ్మని వీరభద్రకవి. ద్విపద.

(౧౭) సోమవారవ్రతమాహాత్మ్యము: — తుమ్మలపల్లి నాగభూషణకవి. ఏకాశ్వాసము గల పద్యకృతి.

(౧౮) శివరాత్రిమాహాత్మ్యము:—అక్కనార్యుడు. విశ్వబ్రాహ్మణకులజుడు; మృత్యుంజయబ్రహ్మపుత్రుడు. ౫ ఆశ్వాసముల పద్యకావ్యము. శ్రీశైలమల్లికార్జునస్వామి కంకితము. శ్రీనాథుని కృతివలెనే యీశానసంహిత ననుసరించి వ్రాయబడినది.

(౧౯) రాజశేఖరవిలాసము:—కూచిమంచి తిమ్మకవి. పద్యకావ్యము. భల్లాణుని కథ. ముద్రితము.

(౨౦) భల్లాణచరిత్రము:—కొలకలూరి వీరన్న. ౩ ఆశ్వాసముల పద్యకృతి.

(౨౧) భల్లాణచరిత్రము:—నాగేశ్వరుడు. ౫ ఆశ్వాసముల పద్యకృతి. మల్లవరమునందలి సోమేశ్వరస్వామి కంకితము.

(౨౨) భల్లాణచరిత్రము:—చిత్తారు గంగాధరకవి. ద్విపద. రాచపేట వీరభద్రస్వామి కంకితము. శృంగార గ్రంథమాలలో ముద్రితము.

(౨౩, ౨౪, ౨౫) సిరియాళచరిత్రము, గంగావివాహము, కొలనుపాక మాహాత్మ్యము:—చిత్తారు గంగాధరకవి. ఇవియును ద్విపదలోనే రచింపబడినవి.

(౨౬) సిరియాళచరిత్రము:—గిరికిపాటి తిమ్మయ్య. ౩ ఆశ్వాసముల పద్యకృతి.

(౨౭) మల్హారిచరిత్రము:—మరింగంటి వేంకటాచార్యుడు. ద్విపద. స్కాందపురాణమునుబట్టి కూర్చిన కర్ణభక్తుని చరిత్రము.

శతకవాఙ్మయములో వీరశైవమునకు సంబంధించినవానిలో ముఖ్యము లయినవి:— (౧) సోమేశ్వరశతకము. శివరామకవి. (౨) చోడలింగ శతకము (పరవాదిగజాంకుశము) - గ్రంథి రామలింగకవి (౩) బసవలింగశతకము. పూతోట సోమనారాధ్యుడు. సీసములు. ఇవి ముద్రితములు. (౪) అల్లమప్రభుశతకము - చెందలూరి పద్మనాభుడు.

## యక్షగానములు

(౧) బసవకల్యాణము—అనుమోద పద్మశికవి (౨) అక్కమహాదేవిచరిత్రము—బాలపాపాంబ (౩) బసవమహిమామృతవిలాసము—కొమారి వీరభద్రము (౪) శివపారిజాతము—లింగమూర్తి కవి (౫) వీరభద్రవిజయము—శివశెంక మల్లనారాధ్యుడు (౬, ౭) సకలనంబిచరిత్రము, నిజలింగయ్యచరిత్రము — నిమ్మనారాధ్యుడు (౮) చిఱుతొండనికథ—వాలె కోటయ్య (౯) వీరబోసవ్వచరిత్ర—సుబ్బం చినకపోతయ్య (౧౦) భల్లాణచరిత్ర—జక్కన సాంబయ్య (౧౧) భల్లాణనాటకము—ఆలపాక పెద్దన.

భక్తివైరాగ్యములను ప్రబోధించుచు ఉపనిషద్రహస్యములను జనసామాన్యమునకు దేటతెల్లముగ ప్రకటించు బసవేశ్వరవచనముల వంటి గేయరూపకవచనవాఙ్మయము కన్నడభాషలో విశేషస్థానము వహించుచున్నది. అట్టిది మన యాంధ్రభాషలో నంతగా నెలకొనలేదు. ఉన్నవానిలో శంకరవచనములు, భవానీశంకరవిన్నపములు, ప్రభుదేవరవాక్యములు పేర్కొనదగినవి. శైవాచారధర్మములను, శివయోగరహస్యాదికములను బోధించు గ్రంథము లనేకములు ముద్రణ మొందకయే ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారము మున్నగు సంస్థలలోను, పరిషద్భాండారములందును శిథిలములగుచున్నవి. భాషాభిమానులు, మతాభిమానులు పూర్వోక్తగ్రంథములందు ముద్రితములు కానివానిలో ముఖ్యములయినవాని నయినను త్వరలో ముద్రించి ప్రచారమునకు దెచ్చి చరితార్థులగుదురుగాక యని ప్రార్థింతును.

# అజంతా గుహల్లోని కొన్నిశిల్పాలు



యశోధర



అలంకరణము



మధుపాయి



'విశ్వాంతర' జాతక కథ

# దత్తాత్రేయ తంత్రము

అను మహామంత్ర శాస్త్రము

గ్రంధకర్త:

చెర్విరాల భాగయ్యగారు

## ఇందలి విషయములు

సర్వోపరిమంత్రము, మారణప్రయోగాభిధానము, మోహన ప్రయోగాభిధానము, స్తంభన ప్రయోగాభిధానము, అగ్ని స్తంభనము, ఆసన స్తంభనము, బుద్ధిస్తంభనము, శస్త్ర స్తంభనము, శస్త్ర లేపనము సైన్యస్తంభనము, సైన్య పలాయనము, పశు స్తంభనమంత్రము, మనుష్య స్తంభనము, మేఘ స్తంభనము నిద్రా స్తంభనము, గర్భ స్తంభనము, విద్వేషణాభిధానము, ఉచ్చాటనాభిధానము. వశీకరణాభిధానము, స్త్రీ. పురుష వశీకరణ ప్రయోగములు రాజవశీకరణము. ఆకర్షణాభిధానము, ఇంద్రజాలాభిధానము, శరీర రక్షణమంత్రము, యక్షిణీసాధనాభిధానము, మహాయక్షిణీసాధనము, సురసుందరీయక్షిణీసాధనము, మనోహరయక్షిణీసాధనము, కనకవతీయక్షిణీసాధనము, కామేశ్వరీయక్షిణీసాధనము, రతిప్రియయక్షిణీసాధనము, పద్మినీ,నటీ,అనురాగిణీయక్షిణీసాధనములు. విశాలాయక్షిణీసాధనము, చంద్రికాసాధనము, లక్ష్మీయక్షిణీసాధనము, శోభనాయక్షిణీసాధనము, మదనాయక్షిణీసాధనము, రసాయనప్రయోగాభిధానము, కాలజ్ఞానాభిధానము, అనాహారప్రయోగాభిధానము, అధికాహారప్రయోగాభిధానము, వంధ్యా చికిత్సాభిధానము, భూతగ్రహబాధానివారణాభిధానము.

కొలదిప్రతులు మాత్రమే ముద్రింపబడినవి. వెల రు. **2-0-0**

వలయువారు :—

**కొండా వీరయ్య,**

పుస్తకముల వ్యాపారం, మహాకాళివీధి, సికింద్రాబాద్.

గొప్ప వైద్య గ్రంధము

# స్త్రీజనకల్పవల్లి

వెల రు. **4-0-0**

గ్రంధకర్త: మల్లంపల్లి భైరవమూర్తి

చక్కని క్యాలికో బైండు, పేజీలు 450, ఫోటోలతో సహా.

# శ్రీకొండ అమరకోశము

వెల రు. **4-0-0**

క్యాలికో బైండు, పేజీలు 600. పోస్టు ఖర్చులు ప్రత్యేకం.

దొరకుచోటు:

**కొండా శంకరయ్య**

పుస్తకముల వ్యాపారము,

సికింద్రాబాద్ — వరంగల్.

ఆంధ్ర సరస్వతి కొక నూతనాలంకారము

# శ్రీ శివపురాణము

శైవభక్త శిఖామణి శ్రీముదిగొండ నాగవీరేశ్వర కవిగారు ఆంధ్రీకరించిన మనోహర పద్యకావ్యము

శతావధానులు బ్ర. శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రుల వారిచే ఆమూలాగ్రముగ పరిష్కరింప బడియున్నది. కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారిచే విమర్శనాత్మకమగు పీఠికలోను, మదనపల్లి థియసాఫికల్ కాలేజి ప్రొఫెసరు శ్రీ తూములూరి శివరామకృష్ణశాస్త్రి గారి విపులమగు ఉపోద్ఘాతములోను ప్రశంసింప బడియున్నది. ఇంకను ఎందరో మహాకవి పండితుల పొగడ్తలనందియున్నది.

విష్ణులీలలను వర్ణించుటలో భాగవత మెట్టిదో శివుని లీలలను వర్ణించుటలో శివపురాణము అట్టిది. ఈ మహాగ్రంథము 11 ఖండములలో పూర్వకవులను మరపించు ముద్దులు మూటగట్టు శైలిని సుమారు 6000 పద్యములు కలది. రాయల్ సైజు 800 పుటలు. అర్ధక్యాలికో బైండు.

వెల రు. 10-0-0 (ఐ. జీ.) మాత్రమే.

పోస్టేజి ప్రత్యేకము.

**శ్రీరామా బుక్ డిపో**

సికింద్రాబాద్.

# ఆంధ్రుల సాంఘిక చరిత్ర

ఈ ఉద్గ్రంథము "గోలకొండ" పత్రికా పూర్వసంపాదకులును (ప్రఖ్యాతాంధ్ర) సాంఘికసారస్వత విమర్శకులును అగు శ్రీ సురవరము ప్రతాపరెడ్డి గారిచే రచింపబడి, ఆంధ్ర సారస్వతపరిషత్తు (హైదరాబాదు) వారిచే ప్రచురింపబడినది. చారిత్రకాధారములు లభించు నన్నయభట్టు కాలమునుండి ఈ శతాబ్దారంభమువరకును (అనగా 850 సంవత్సరములకు) ఆంధ్రజాతియొక్క సాంఘిక చరిత్రము ఇందు వర్ణింపబడినది. ఆంధ్రులవిద్య, విజ్ఞానము, కళలు, రాజ్యపరిపాలన, సంఘజీవనము, విదేశీయుల ప్రాబల్యమువలన కలిగిన ఫలితములు, ఆహారవిహారములు, వేషధారణ, ఆయుధములు, మహిళాలోకము మున్నగు ఎన్నో విషయములు చారిత్రకాధారములు అనగా శాసనములు, ప్రాచీనగ్రంథములు, మున్నగువానిసహాయముతో ఈ గ్రంథమున చక్కగా వర్ణింపబడి యున్నవి. ప్రతి ఆంధ్రుడును తప్పక చదువదగిన గ్రంథము. బాలబాలికలకు సహితము తెలియునట్లు తేటతెనుగులో వ్యావహారికభాషలో, వ్రాయబడినది.

450 పేజీలు వెల ఐ. జీ. రు. **4-0-0**

పోస్టేజి ప్రత్యేకము.

**దాచేపల్లి కిష్టయ్య & సన్సు,**

వెంకటేశ్వర బుక్ డిపో, సికింద్రాబాద్.

[వ్యంగ్యరచన]

# కచేరీ  కథనం

శ్రీ మాచిరాజు దేవీప్రసాద్

## 1

నెం. శూన్యం                ది. ఆషాఢబహుళవిదియ.

వసంతపుంత పోలీస్ స్టేషన్ సబ్ యిన్స్పెక్టరుకు జారీచేసిన సంజాయిషీపత్రం.

గడచిన చైత్రవైశాఖమాసములలో నీ రక్షకభటస్థావరంనుంచి జరిగే ఉత్తరప్రత్యుత్తరాలు, పిలువడే, లేక పలికే నెలవరి, పక్షవరి, దినవరివగైరా లెక్కలు, సజావుగా సకాలంలో రావందుకుగాను, క్రమశిక్షణక్రింద చర్యగాని, లేక యితరత్రా శిక్షించుటగాని చేయుట ఏల క్రమబద్ధం కాదో, వివరించే సంజాయిషీ యిది ముట్టిన మూడురోజుల్లో యిచ్చేది.

ఉపసూపరెంటు,
అఖండపురీఖండము.

## 2

వసంతపుంత,
ఆషాఢబహుళచవితి.

ఉపసూపరెంటు
అఖండపురిగార్కి,

అయ్యా,

విషయము: కచేరీకాగితాల కలాపం—కాలహరణ—సంజాయిషీ—వివరణ.

సందర్భము: పూర్ణానుస్వారాంచితద్వితీయసంజాయిషీపత్రం.

ఆఫీసుపనికి అంతరాయములు కల్పించు అవరోధములు యిచట ఆదివారములు కాక మరిరెండు కలవు. అవి—

1. చెదలు,
2. కోకిలలు.

అందు ద్వితీయంగురించి చెప్పవలసినది కొంత. ఈ స్టేషన్ పుంతమధ్యమున నిర్మింపబడియుండుటచే యిచటి సన్నమామిడిచెట్లపై నదరు చేరొక్కన్నవి మిక్కుటము. పైపెచ్చు, పైనెలలు చైత్రవైశాఖమాసములు. చెట్లు చిగిర్చి పూలు పూయును. ఆ చిగురుటాకుల తై చేరి యివి చేయు కూజితములు గానస్పందనోన్ముఖమైన నా హృదయమునకు దుర్భరములు. 'కపిలవాయి' పాతరికార్డే నన్ను ఉన్మత్తుని చేయు, యిక పికపంచమ పంచమము చెప్పనేల! అప్పుడు చేయి ఆడదు సరికదా, పులి ఆఫీసులోనికి వచ్చినను కాలు కదలదు. వేయేల! ఆ వేళల ఒక్క వీనులు తప్ప తక్కిన పంచేంద్రియములు పరాధీనములు. ఇక ఆఫీసుపని దైవాధీనము.

కనుక ఆఫీసుపనికి అంతరాయములు కల్పించు జవాబుదారీ కేవలం కోకిల్లది. వీటిపై పైఅధికారులు తగు చర్య తీసుకొనవలసినదిగా విన్నవించుచున్నాను.

సబ్ యిన్స్పెక్టరు,
వసంతపుంత.

## 3

నివేదింపదగినది—

2) ఈ స్టేషను సార్థకనామము కలది. దీనిని ఆవరించియున్న ప్రదేశము యావత్తూ తాటిచెట్లు, వాటిమధ్య మామిడిచెట్లు అల్లిబిల్లిగా కల పుంత. కోకిలలు మామిడికొమ్మలమీద నివాసముగా నుండును. "మామిడికొమ్మమీద కలమంత్రపరాయణుడైన కోకిలస్వామికి మ్రొక్కి" అని రాయప్రోలీయం. కనుక యీ మామిడిచెట్లు కొట్టించినచో మన సిబ్బందికి వీటి ముప్పు తప్పిపోవును.

3) సబ్ యిన్స్పెక్టరునివేదనములో యివి అవరోధకరములైన ప్రాణులక్రింద సూచింపబడ్డవి. వీటివలన నిత్యవిధుల అభివృద్ధి నిరోధింపబడిన దనుట నిస్సందేహము. కావున వీటిని అభివృద్ధినిరోధకశక్తులక్రింద పాటించి, ఆ సంబంధమైన చట్టము జిల్లాకలెక్టరు వీటిపై వర్తింపజేసినచో, తగుచర్య తుపాకులద్వారా వెంటనే తీసుకొనుటకు ఎట్టి అభ్యంతరము లేదు.

ఉపసూపరెంటుకు,
అఖండ పురీఖండము.

వర్తులాధికారి,
సమానాంతర చతుర్భుజేంద్రవరం.

## 4

నివేదించబడినది :

2) పంజాయిషీలోని విషయములు వర్తులాధికారివర్గాల దృష్ట్యా పర్యవేక్షించినాను. రెండవ పేరాలో వా రుదహరించిన పద్యం ప్రకారం కోకిలస్వాములు మంత్రపారాయణము చేయుట మామిడికొమ్మలమీద కూర్చొని అనికదా! అట్టిచో చెట్లుమొత్తము ఏల కొట్టవలయును ? కొమ్మలుమాత్రమే ఏల కొట్టరాదు ? కనుక కొమ్మలుమాత్రమే కొట్టునట్లు ఉత్తర్వులు జారీచేయుట ఉచితము.

3) వారి మూడవ పేరాలోని అభిప్రాయముతో నేను ఏకీభవించుట లేదు. 'రక్షణస్మృతి'లోయిచ్చిన 'అభివృద్ధినిరోధక' శక్తి నిర్వచనంక్రిందకు కోకిల ఏమాత్రమూ రాదు. అదియునుగాక తుపాకులద్వారా చర్య ప్రస్తుతము తగదు. కారణం మన సిబ్బందికి సరఫరాచేసిన తుపాకులు ప్రథమప్రపంచసంగ్రామకాలంవి అగుటచే పశ్చిమంగా సరిమాచి ప్రయోగించిన గుండ్లు ఖచ్చితముగా వాయువ్యమువైపు వెళ్లును. వాయువ్యమువైపు వెళ్లుట అనగా వాయువులో వ్యయమగుట అని నా భావము. ఈ క్లిష్టపరిస్థితిలో జిల్లాకలెక్టరుఉత్తర్వులకై కోరుట అవసరమని యీక్రింది చిరునామాదారుడు తలచుట లేదు.

జిల్లాసూపరెంటు
పోలీసుశాఖను

ఉపసూపరెంటు,
అఖండపురీఖండము.

## 5

త్రిప్పివేయబడినది :

కోకిల అనగా నేమి ? పురుషుడా ? స్త్రీయా ? లేక స్వామియా ? సులభావగాహననిమిత్తం, ఉన్నచో ఛాయాపటము గాని, లేనిచో చిత్రపటముగాని గీచి పంపునది. చిత్రపటమైనచో నియమితపరిమాణములో ఉండవలెను (చూడుము నిబంధనలు 156 (క) విధి).

'కపిలవాయి'అనగా నేమిటి ? యీపదార్థము మాపరా పంపునది. మాపరాతూకం రెండుసేర్లకు మించకూడదు. (చూడుము 156 (ఖ) విధి.)

జిల్లాసూపరెంటు,
అనుబంధము: బొత్తి మొత్తం. కూన్యబుర్రారం

## 6

పునర్నివేదించబడినది.

(సమ్మర్గంసంపా)

2) ఈ స్థావరప్రధానరక్షకభటుడు ఆదేశానుసారం తయారుచేసిన కోకిలయొక్క చిత్రపటము యిందుతో జతపరచుచున్నాను. ఆబొమ్మ కేవలం కోకిలవలె లేకపోయిననూ బొత్తిగా గాడిదవలె లేదు. ఇది అక్షరాలా విధికృతం (156 (క) విధి). ఆపేరాప్రకారమే ఎడమచేతివాలన బొమ్మ ఎటు పైకో, ఎటు క్రిందకో తెలియ జేయు దిక్సూచిరస్తుకూడా వేయబడ్డది.

3) 'కపిలవాయి', అనగా కపిలవాయి రామనాథశాస్త్రి అను ఒక గాయకుడు. వీరు కీర్తిశేషులవుటవల్ల మాపరాపంపుట అన్న ప్రశ్న ఉత్పన్నము కాదు.

సబ్ యిన్‌స్పెక్టరు.
అనుబంధం : బొత్తి మొత్తం. వసంతపురం.

## 7

పునర్నివేదించబడినది :

2) సానుకూలఉత్తర్వులకై ఉపేక్షించుచున్నాను.

వర్తులాధికారి.
సమానాంతర చతుర్భుజేంద్రపురం.

## 8

పునర్నివేదించబడినది.

2) కావలె నన్నచో పరిశీలనార్థం ఒక బ్రతికియున్న కోకిల బంగీద్వారా పంపుటకు తగిన యేర్పాటు కావించబడును. పట్టుకొనుటకు అగు ఖర్చు ఆర్డినరీ, లేక సాదాకోకిల అయినచో రూ. 4-0-0 మాత్రం. గండుకోకిల అయినచో రూ. 1-0-0 అదనము.

ఉపసూపరెంటు,
అఖండపురీఖండము.

## 9

కూన్యబుర్రారం జిల్లా పోలీసుసూపరెంటువారి కార్యస్థానం—కూన్యబుర్రారంజిల్లా—కూన్యబుర్రారం.

తపలపెట్టె క్రమణిక. నెం 77/ మర్కటి—దుందుభి.

ది. ఆశ్వయుజశుద్ధ ద్వాదశి.

| నుంచి. | కు. |
|---|---|
| మ॥ రా॥ రా॥ శ్రీ......గారు. | సబ్ యిన్‌స్పెక్టరు. |
| జిల్లాసూపరెంటు. | వసంతపురం. |
| కూన్యబుర్రారం | |

విష : కోకిలలు—దుష్ప్రవర్తన—నివారణ—ఆజ్ఞాపితము—

కోకిలలు అను తిర్యక్జంతుసముదాయం వసంతపురంరక్షకుల సక్రమవిధులకు అంతరాయము కల్పించుచున్నది. వీటికి ముఖ్యస్థావరాలు మామిడికొమ్మలు, వాటికి మూలము లేతచిగుళ్లు అని క్రింది ఉద్యోగులు నిరూపించిన నివేదికలు పరిశీలించగా తేలినది. అందుకై పోలీసు యిలాఖాఅధీనములో ఉండు యావత్ప్రదేశములో గల మామిడికొమ్మలు (వాటికి కలసియుండు లేతచిగుళ్లతో సహా) ఖండించునట్లు ఇందుమూలకముగా ఆదేశించబడినది.

అట్లు ఖండించగా వచ్చిన కొమ్మలను, లేతచిగుళ్లను ఉమ్మడిగా కాని, లేక విడివిడిగాకాని బహిరంగవేలములో విక్రయించి రాబట్టబడిన ఒకమూనం పరిసరభూమిపిస్తుఖజానాలో జమ కట్టేది.

విక్రయకర్తృత్వము కొమ్మలది, లేజిసళ్లది చెలానులలో విడివిడిగా విపులముగా చూపుట సమంజసము.

(సం)............
జిల్లాసూపరెంటు,
కూన్యబుర్రారం జిల్లా,
కూన్యబుర్రారం.

## 10

నుంచి—

సబ్ యిన్‌స్పెక్టరు,
వసంతపుంత.

కు—జిల్లా సూపరెంటు,
కూన్యబుర్రారం.

విష:—కొమ్మలు—లేజిసళ్లు—ఖండన — ఒక్కొక్క కుశంక—సమర్పణ.

సంగ:—శ్రీ క్రమణిక నెం 77/ దుర్మతి—దుందుభి. ది. ఆశ్వయుజ శు. 12.

మామిడిచెట్లకు కొమ్మలుమాత్రమే కొట్టమని ఆజ్ఞాపించి యున్నారు. అట్లు కావించినచో ఉపద్రవము ద్విగుణీకృతము. మామిడికొమ్మలుమాత్రమే కొట్టుటచేత ఈ కోకిలలు ప్రక్కనే గల తాటిచెట్లమీదికి వెంటనే సకుటుంబముగా చేరును. అట్లు స్థిరముగా చేరి మునుపటివలెనే కూత ఆరంభించును. అప్పుడు మరి నెత్తినెక్కి కూసినట్లుండును.

కావున వాటితో సహా తాటిచెట్లనుకూడా కలిపి కొట్టించుట అత్యావశ్యకమని విన్నవించు విధేయుడు.

సబ్ యిన్‌స్పెక్టరు,
వసంతపుంత.

## 11

త్రిప్పి వేయనైనది.

స్థానికాధికారి పుంతమొత్తం ఉండుట అపాయకరమని అనిస్తున్నాడు గనుక, ఆ ఆరోపణ ఎంతవరకు సక్రమమో విచారించి స్వయముగా విషయములు పరిశీలించి, తన్నిర్మూలనానికి, సకారణ సహేతుకమైన ఒక సమగ్రనివేదిక కాపీత్రయం దృష్ట్యా చర్చించి పంపునది.

గడువు మూడువారములు లేక పక్షమున్నర.

అఖండపురీఖండము

ఉపసూపరెంటుకు,
అఖండపురి.

జిల్లాసూపరెంటు.

## 12

కు...

జిల్లా సూపరెంటు. (ముకాం) వసంతపుంత
అయ్యా, పుష్యబహుళ చతుర్దశి

విష:—వసంతపుంత — సంహారకార్యము—నివేదిక—సమర్పితము.

సంగ:—1. తా॥ క్ర॥ 77/దుర్మతి—దుందుభి ది॥ ఆశ్వయుజ శు. పన్నెండు.

2. తదనంతరోద్ధారిత ఆజ్ఞాపితవిచారణము.

నేను చతుర్భుజ న్యాయాధికారితో సహా గడచిన వారంరోజులు యిచట బసచేసి వారితో అంతరంగికంగాను, యితరులతో బహిరంగంగాను సంప్రదించినమీదట యీక్రింది ముఖ్యపరిశీలనకు రాగల్గితిని.

(౧) ఆర్థికము:—ఈ రెండుజాతుల వృక్షములు ఫలవృక్షములేకాని ఆ ఫలములు ఆర్థికముగా చెప్పుకోతగ్గ ఫలములు కలవి గావు. మామిడిచెట్లకు కాపు బహుకొద్ది. వీటి పంట వేలము వేయగా పాలుకు రూ 1-2-0 చొప్పున గడచిన అయిదుఫసలీలలో రూ 4-8-0 రాబడి వచ్చినది. (ఒకఏడుపంట తుపానుకెరయైనది.) అనగా సగటున పాలుకు వచ్చిన ఆదాయం రూ 0-14-5, లేదా రూ. 0-14-0 ఈ వచ్చిన సొమ్మును ఖజానాలో జమకట్టుటకై వెళ్లిన రక్షకభటునకు యిచ్చిన భత్యం సాలీకి రూ. 2-6-0. కనుక నికరనష్టం రూ 1-7-7, లేదా రూ. 1-8-0. వీటి ధర యింత తక్కువ వీలనని సందేహము వచ్చి ప్రశ్నించగా మన జవానులు యిచటి మామిళ్లు ఒక చిత్రమైన జాతివనిన్నీ, వీటి పండ్లకు పైన చర్మము, లోపల టెంక తప్ప మాంసం మరేమీ ఉండదనిన్నీ తెలియచేసినారు. నేను ఋతువు కానందున ఒక టెంకను తెప్పించి స్వయముగా పరీక్షించితిని. ఈ టెంకలావు నేజూచిన యితర (తోలుతో సహా కల) మామిడికాయల గరిష్ఠప్రమాణానికి మించియున్నందున, అమ్మల్లో కండ ఉండదు సరిగదా, యీమాత్రం పీచుకూడా ఉండుటకు చోటులేదని నమ్మగల్గితిని.

(౨) భౌగోళికము:—ఇక భౌగోళికముగా యీ పుంత ఉపద్రవకరమగు ప్రదేశము అనుచున్నది. ఇది యీకొన్యమూలను ఒక చిన్నపర్వతశ్రేణికి అనుకొనియుండుటచే వన్యమృగములకు విహారస్థలి మగుచున్నది. ఈపుంతపడిగర్భమున ఎటు చూచినను రెండుకుసులలోతుకు మించని బోదువు ఒకటి గలదు. దీని మూలమున, అవి చెట్లకై పొదలచివరా నీటికై యిచట జేరును. మరూరు ఒకనెల క్రితం యీ స్టేషన్ (*Lock up*) లో తాత్కాలికబందీలుగా యున్న యిద్దరు ఖైదీలు తెల్లవారేసరికి మరణించిపడియుండిరి. తదనంతరం జరిపిన పంచాయితీలో పైచెప్పినట్లు చేరిన ఒక బెబ్బులి నిశిరాత్రివేళ గాండ్రించినదనిన్నీ, ఆ గాండ్రింపుకు భయాకుల

చిత్తములతో ఉన్న వీరు తట్టుకొనలేక గడుపువల్ల నుండే అగి పూర్తిగా మరణించినారని తీర్పు చెప్పబడ్డది. నిర్నిద్రుడైన మన కొవలాభిటుడు నిద్రించుచుండుటవల్ల చావు తప్పించుకొనెను. ఒక్క గోంగ్రేంపుకే యిద్దరు మరణించ అయ్యెది నేరుగా లోనికి కెంచేసినచో మన సిబ్బంది యావత్తు మరణించియుండు రనుట నిస్సందేహము. కట్టి పులులు మాత్రమే కాదు, యిచట రెండు భయంకరములగు ఎలుగుబంట్లు కూడా కలవు.

ఈ భూచరములు చాలవో అన్నట్లు, ఎటు చూచినను రెండుమైళ్ల లోతుకు మించని ఆ హ్రదములో అన్ని రకముల జలచరములు (తిమింగిలములుమినహా) కలవు.

(iii) వైజ్ఞానికము:—విజ్ఞానాభివృద్ధికి తోడ్పడటానికి ఇవేమీ అజంతాగుహలు కావు. అటవీశాఖయిలాకా చెట్లపై చదువుకొనుటకు అక్షరములు లేకపోయినను, నేర్చుకొనుటకు నెంబర్లైనను ఉండును. వీటిపై అమాత్రం విజ్ఞానం అయినా లేదు.

పై బలవత్తరమైన ఓ, వ, మహాల దృష్ట్యా దీని నిర్మూలనం శ్రేయస్కరం అని త్రిశుద్ధిగ నమ్ముచున్నాను.

ఉపసూపరెంటు,
అఖండపురీఖండము.

## 13

శూన్యబుర్రారంజిల్లా పోలీసు సూపరెంటువారి కార్యస్థానం.
శూన్యబుర్రారంజిల్లా. శూన్యబుర్రారం.
శా॥ శ్రీ॥ 77/ దుర్మతి - దుందుభి. మాఘ శు॥ పాడ్యమి.

| నుంచి | కు— |
|---|---|
| మ॥ రా॥ రా॥ శ్రీ......గారు.<br>జిల్లాసూపరెంటు. | ఇన్స్పెక్టరు జనరల్<br>ఆఫ్ పోలీసు,<br>పోలీసుశాఖ |

అయ్యా,

విష:—నిర్మూలనకార్యక్రమం—వసంతపుంత—నిర్మూలన—ఉద్దేశ్యము.

సంర్ :—ఉపసూపరెంటువారి ప్రశస్తబహుళచతుర్దశిజన్య సమన్వితమైన వేదికం.

వసంతపుంతరక్షకభటస్థావరాన్ని ఆవరించియున్న మహారణ్యం సకలతిర్యగ్జంతుసముదాయమునకు (తిమింగిలములుమినహా) ఆలవాలమై అలరారుచున్నది. ఈ ఘోరాటవి ప్రభుత్వపక్రమవిధులకు మిక్కిలి పీడాకరమై విలసిల్లుచున్నది. సిబ్బంది, మరియు పరిసర ప్రజానీకం అపస్మారప్రమాదములకు గురిక్రైనట్లు ఉపసూపరెంటు విపులీకరణ ఒనమాలలోనే స్పష్టీకరించినది. ఈ వనసంహారకార్యం మహా తీవ్రమైన సమస్యయై మన శాఖను ఎదుర్కొంటున్నది. కనుక దీని సత్వరనిర్మూలనం చేయ మనః పూర్తిగా ఆశిస్తున్నాను.

ఈవిషయం మంత్రివర్గముతో సంప్రదింపులు జరిపి తగు పూనవల సిందిగా కోరుచున్నాను.

ఉపసూపరెంటు తన నివేదికలో ఎటు చూచినను రెండు మైళ్ల లోతు గల ఆ అగాధములో తిమింగిలములు లేవనుచున్నారు. మిగతా అన్ని జంతువులు ఉండగా ఇవి ఎందువల్ల లేవో అన్న విషయం దుర్గ్రాహ్యం. లేవని నిర్ధారించువరకు ఉన్నవనియే నా దృఢ విశ్వాసం.

(సం)............
జిల్లాసూపరెంటు.

## 14

నివేదించబడినది—

సంర్ :—శా॥ శ్రీ॥ 77/ దుర్మతి—దుందుభి. ది. మాఘ శుద్ధపాడ్యమి.

విష:—అభివృద్ధి నిరోధకశక్తులు—వగైరా—అటవస్తు—నిర్మూలన.

వసంతపుంతపరిసరమున గల కీకారణ్యం యావత్తూ అభ్యుదయనిరోధకశక్తులకు ఆలవాలమై, విధ్వంసకశక్తులకు జన్మభూమియై విప్లవాత్మకపీఠమై విరాజిల్లుచున్నది.

తత్సంచలనోద్రేకం తీవ్రరూపం దాల్చకమునుపే, ఏతత్ నిర్మూలనం అవశ్యం అవశ్యకమని ఉద్ఘాటించుచున్నాను.

తదుత్పాటనోత్తరువులు జారీకావించి, కార్యక్రమం తక్షణం ఆచరణలో పెట్టుట ప్రజాశ్రేయస్సుదృష్ట్యా అత్యంత అభిలషణీయం.

మంత్రివర్గం ఇంటి (హోం) శాఖకు.

ఇన్స్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీసు.
పోలీసుశాఖ.

## 15

మహారాజరాజశ్రీ శూన్యబుర్రారంజిల్లా
పోలీసుసూపరెంటుధీమంవారి దివ్యసముఖమునకు—

వసంతపుంతపరిసరగ్రామకాపురస్తులు, యీ క్రింది చేవ్రాళ్లు, నిశానీలు గలవారలు స్వయముగా వ్రాయించి, సమక్షమున దాఖల్ చేసుకొన్న మహజర్ విన్నపములు—

ఘనమైన అయ్యా,

ఈ జిల్లావసంతపుంతస్టేషన్ యిలాఖా భూమిలో గల యావత్ చెట్లను సమూలంగా పెళ్లగింప తమరు ఉత్తర్వు చేసినట్లు తెలియ వచ్చినది. సదరు చెట్లు పురుషాంతరములనుండి పుష్కలముగా పెరిగి బాటసారులకు చల్లని నీడ నిచ్చుచున్నవి. అట్లు గావించినచో బాటలు లేక పథికులు ప్రయాసపడుచుండగా, నిలువ నీడలేక భూలోకిల్లి పోవుదురని విన్నవించుకొనుచున్నాము.

అశోకుడు తోటలు వేయించి ప్రక్కన చెట్లు నాటించెను. అశోకచక్రం, స్తంభము చిహ్నములుగా గల మన ప్రభుత్వం తోటలు వేయకపోగా ఉన్న చెట్లు కొట్టించుట యీ గ్రామస్థులకు అపకారము చేయుచున్నదని మా మనవిపూర్వకవిన్నపం. దీనులమైన మాకు వీటి వలన యివిగాక అనేకబహుళప్రయోజనములుకూడా గలవు.

తాటిచెట్లకు గల రెండుమట్టలు పనిలేని రెండాకాలములలో వంటచెరకుక్రింద కొంతి అమ్ముకొని మా మాలపల్లెయావత్తూ జీవనోపాధి ఏర్పాటుచేసుకొనుచున్నది. ఇక యీ పర్యాయరుమామిడిమండలు మా తాతముత్తాతలనాటినుండియు పండుగదినముల తోరణములుగా వాడబడుచున్నవి. వాటిని నిర్మూలించిన తోరణములు లేక, పండుగలు నిలచిపోయి గ్రామస్థులు నానాబాధ పడుదురు. తూర్పువనంలో గల మామిడిచెట్లలో ఒక పాతిక చెట్లపేరు కాయ ఒకటోరకం ఫలంపు గలది. దాని చర్మము బహుపల్చన. టెంక అన్నదో గోలి కాయంత. కావున దాని కండపుష్టి వర్ణనాతీతము. ఇట్టియుత్తరకమైన తమ రక్షకభటాళి సౌజన్యములో, పదిమైళ్లలోని సకలగ్రామ ప్రజలకు వీటి కాయలే ఆవకాయకు గతియగుచున్నవి. ఇవి లేనిచో ప్రజానీకం ఆవకాయ లేక అలమటించిపోయెదరు.

కనుక ధీమందులవారు యీ దీనప్రజమొర ఆలకించి తాజే దారులవల్ల గాని ఖుద్దుగాని విచారించి, నిజానిజములు పరిశీలించి, విధ్వంసం ఆపవలసిందిగా తమ ఘనమునుగూర్చి మిక్కిలి ప్రార్థించు చున్నాము.

దివ్యచిత్తమునకు సేవలయము.
ఆరుపైచిల్లర అన్నిభామలలో సంతకాలు
వేయిపైచిల్లర ఎడమచేతిబొటనవ్రేలిముద్రలు.
పాతికపైచిల్లర యితరబొటనవ్రేళ్ల ముద్రలు కలవు.

కాపీలు

1. భారతప్రభుత్వఅధ్యక్షునకు తంతిద్వారా.
2. రాష్ట్రపతి అఖిలభారత్ కాంగ్రెస్ గార్కి.
3. కిసాన్ కాంగ్రెస్ అధ్యక్షునకు.
4. హరిజనోద్ధారక, మాజీమంత్రి......గారికి
   రిజిష్టరుద్వారా పంపుకొనడమైనది.

## 16

సమగ్రమైన ఉన్నతాధికారుల నివేదికలవల్ల, సంతృప్తికరమైన కారణములవల్ల యీక్రిందినిర్ణయములకు రాగల్గినందుకు యీ మంత్రివర్గం సంతసించుచున్నది.

1. వసంతపుంతపరిసరప్రదేశము యావత్తూ చుట్టుముట్టియుండు పుంత తూకటివ్రేళ్లతో నిర్మూలించుట శుద్ధమని తలపోయడమైనది.

2. అట్లు కాగల ఖర్చునిమిత్తం ప్రధానయంత్రకారుడు (*Chief Engineer*) అంచనాలు తయారుచేయించుట భావ్యము. ఈ నిర్మూలనవల్ల లభించు కలప పరిసరగ్రామపునర్నిర్మాణానికి ఉపకరించువిధానములు పరిశీలిస్తూ వాటికికూడ అంచనాలు జతపరచి పంపుట సమంజసము.

3. పుంతనడిమిభాగములో గల హ్రదములోని తిమింగిలములు సురక్షితముగా గొనివచ్చి ఇతరమత్స్యసంపదతోపాటు పరంపరాభివృద్ధిగ పెంపొందించుట లాభదాయకమని తోచనమైనది. మత్స్యశాఖనిర్వహణాధికారి (*Director*) తన శ్రద్ధాశక్తులు వుపయోగించుట ముదావహము.

ఘనతవహించిన మంత్రి
హోంశాఖ.

పి. డబ్ల్యు. డి. శాఖామాత్యునకు పేరా 1 టి; 2 డు మాత్రం. పారిశ్రామిక మరియు పరభరామంత్రికి పేరా 1 టి; 3 డు మాత్రం. జిల్లాకూపరెంటుకు. (జిల్లాధికారి యావత్ లేజిపర్లను తన స్వాధీనమునం దుంచుకొని, సముచితరీతిని మూడుసంవత్సరములలోగా సద్వినియోగం కావించవచ్చును.)
పైలుకు.

## 17

అంచనాపైనం (*Specification*)

వసంతపుంత కార్యక్రమం (అ) తెగనరుకుట, (ఆ) కలప గమ్యస్థానముచేయుట, (ఇ) పునఃప్రతిష్ఠ అని మూడుభాగములుగా విభాగింపబడ్డది. ఈమూడుపద్దులు ఏపద్దు కాపద్దు దిగ్గంతులవంటి యింజనీర్లచే మథించి మదింపుకావింపబడ్డవి. మొదటిదైన (అ) పద్దు సామాన్యఅచరణ గలది. కాని (ఆ) పద్దులో గమ్యస్థానము వరకు కలప లారీలపై తోలుటకై ఒక రోడ్డునిర్మాణం సంకల్పించబడినది. పదునెరోడ్డు 13 మైళ్లు నిరాఘాటముగా సాగి తదనంతరం ఒక నదీప్రవాహమును దాటవలయును. కావున యిచట చరిత్రాత్మకమైన వారధినిర్మాణం సహజం. ఇక మిగిలిన (ఇ) పద్దులో కార్యక్రమం సమాప్తి. ఆఖరుదైన యీ క్రియలో "గృహపరిశ్రమాభివృద్ధి"కై కలప శోభాకరమైన విధముగా ఉద్దేశింపబడి వినియోగింపబడినది. గృహపరిశ్రమ అనగా గృహము, పరిశ్రమ అను రెండు ప్రధానముల మేలు కలయిక. అట్టి గృహపరిశ్రమాభివృద్ధికి పరిశ్రమమాట ఎట్లున్నను ముందు గృహము ప్రప్రధానము. కనుక ఏతత్ గృహనిర్మాణం యీ కలపతో గావించిన వెనుక, వీలునుబట్టి పరిశ్రమ అవసరమైనచో నెలకొల్పవచ్చును. అదియే యీ అంత్యక్రియలో సాధించిన లక్ష్యం.

ఇచటికి 25 మైళ్లలో నిర్జన "సితిపైకతము" ఒకటి కలదు. అదియే దీన గైకొన్న గమ్యస్థానం. అచట గృహనిర్మాణం కావించిన గృహపరిశ్రమాభివృద్ధితోబాటు "సితపైకతోద్ధరణ" కూడా జరుగును. అప్పుడు యీ ప్రణాళికయొక్క ఫలము ద్విగుణీకృతమై భాసిల్లును.

వేరువేరు అంచనాల సంక్షిప్తం మంత్రివర్గపరిశీలనార్థం యీక్రింద క్రోడీకరించబడ్డది:—

# సంగ్రహము

| రాసులు | వర్ణన, వివరము వగైరా. | రేటు. 1కి | రూ. | అ. | పై. | మొత్తం. రూ. | అ. | పై. | మొత్తముల మొత్తం. రూ. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | (హా) | | | | | | | | | | |
| 25,00 | శేలమట్టంవరకు భూరుహ విచ్ఛేదం. | చెట్టు | 4 | - | - | 10,000 | - | - | | | |
| 2,500 | భూతలంలోగల మొదలు, వ్రేళ్ల వగైరాల నిర్మూలనం. | రూ | 2 | - | - | 5,000 | - | - | | | - |
| 2,500 | వ్రేళ్లు త్రవ్వగా ఏర్పడిన గుంటల పూడ్పు. | గుంట | 2 | - | - | 5,000 | - | - | 20,000 | - | |
| | (ల) | | | | | | | | | | |
| 20 | ధనురాకారజాడ్యలు గల వారధినిర్మాణం | జాడ్య | 5,000 | - | - | 1,00,000 | - | - | | | |
| 20 | ఇంజనీర్ల శిక్షివిహారాలకై, అసలు బ్రిడ్జి అను కొని కర్రతో నిర్మింపబడిన కాలిబ్రిడ్జి. | జాడ్య | 200 | - | - | 4,000 | - | - | | | |
| 1,000 | బ్రిడ్జినిర్మాణకాలంలో నీటి అపుదలవల్ల మునిగి పోయిన పంటభూములకు నష్టపరిహారం. | ఎకరం | 100 | - | - | 1,00,000 | - | - | | | |
| 20 | ప్రధానవారధినిర్మాణానంతరం కర్రనిర్మిత కాలిబ్రిడ్జి విచ్ఛిన్నం... | జాడ్య | 50 | 8 | 4 | 1,010 | 6 | 8 | | | |
| 300 | కోడ్లు నిర్మాణం | ఘనం | 1,000 | - | - | 3,00,000 | - | - | 5,05,010 | 6 | 8 |
| | (క్ష) | | | | | | | | | | |
| 1,000 | గమ్యస్థాన పునః ప్రతిష్ఠ. | ఇలు | 3,300 | - | - | 33,00,000 | - | - | | | |
| 5250½ | పనిమొత్తానికి పుంకూలీలు. | కూలీ | 2 | - | - | 10,501 | - | - | | | - |
| 4880½ | పనిమొత్తానికి స్త్రీకూలీలు. | రూ | 1 | 8 | - | 7,320 | 12 | - | | | |
| 122½ | పిల్ల కూలీలు. | రూ | 1 | - | - | 122 | 8 | - | 38,17,944 | 4 | - |
| | చేకావలి. 5% వంతున ... | ... | ... | ... | ... | ... | ... | ... | 1,87,045 | 5 | 4 |
| | మొత్తముల మొత్తంయొక్క మహామొత్తం... | ... | ... | ... | ... | ... | ... | ... | 40,30,000 | - | - |

అంచనాలు శీఘ్రముగా ఆమోదింపబడినచో టెండర్ల ఆహ్వానం మరుక్షణం జరిపింపబడును.

త్రైప్రతీయం (*Triplicate*).

ప్రధానయంత్రకారుడు,
రాష్ట్రం.

## 18

కేంద్రప్రభుత్వమునకు—

జరుగుచున్న ఆర్థికసంవత్సరమునకు ప్రతిపాదించిన ఆదాయ వ్యయపట్టిక మిగులుబడ్జెట్ అని తెలియజేయుటకు యీప్రభుత్వం మిగుల సంతసించుచున్నది. కాని యీ మిగులు మొత్తం రూ. 0-0-3 అయియున్నది (అక్షరాలా సున్నా రూపాయిలూ, సున్నా అణాలు, మూడుపైసలుమాత్రం). బడ్జెట్ ప్రతిపాదనకాలములో ఆసరప్రణాళికలు ఏరి వ్యయము కేటాయించియున్నాము. కాని సద్యఃకాలములో ఒక నూత్నప్రణాళిక ఉద్భవించి అత్యావశ్యకమైనదిగా యీ ప్రభుత్వాన్ని ఎదుర్కొంటున్నది. ఎదుర్కొనుటయే కాదు-ఢీకొనుచున్నదని చెప్పవలయును. నవభారతభావిభోగోదయానికి, ప్రజాభ్యుదయానికి, గ్రామపునర్నిర్మాణానికి, గ్రామపునరుజ్జీవనానికి, పుగ్రామపురోభివృద్ధికి సంబంధించినదికనుక యీ బృహత్ప్రణాళికను వెంటనే అమలుపరచవలసిన ఆవశ్యకంలోకి యీప్రభుత్వం నెట్టబడినది. ఇది ప్రస్తుతము జాతీయసమస్యగా నే ఉన్నది. ఆలస్యము కావించినచో అంతర్జాతీయసమస్యగా మారవచ్చుట నిస్సంశయము.

మొత్తంఖర్చు అంచనా ౪౦.౩ లక్షలరూపాయిలు అయి ఉన్నది. దీనికి బడ్జెట్‌లోని మిగులు 0-0-3 చాలదు. కనుక

పైమొత్తం (మా బడ్జెట్‌లోని మిగులుమినహా) అప్పుకింద మంజూరు చేసేది. లేక ప్రపంచఆర్థికనిధి (*World Bank*) నుంచి కేంద్రమునకు యీ ఆకేత్రాలో ఎన్ని మిలియన్ల డాలర్లు రాబోవుచున్నవో, దానిలో ఈ రాష్ట్రమునకు కేటాయించినది ఎంతో తెలియజేసిన యీ రాష్ట్రం ఆనందించగలదు.

రాష్ట్రప్రభుత్వం.

అనుబంధం :—త్రిపత్రిష్ఠఅంచనా మదింపునకళ్లు.

## 19

తంతి

| రాజ్యోపయుక్తం. | ఝంఝాగమని. |
|---|---|

నిర్మాణకార్యక్రమం. వసంతపురంతో. బృహత్ ప్రణాళిక. బింద్. సంహారకార్యం. బింద్. పరిశీలనార్థం. యావద్గ్రంథం. సంబోధన. బింద్. యమ అర్జంట్.

కేంద్రం.

## 20

కేంద్రప్రభుత్వమునకు—

తంత్ర్యనుసారం వసంతపురంసంబంధియగు యూనిట్ ఫైలు యింకా వెంట పంపుచున్నందుకు యీ ప్రభుత్వం సంతసించుచున్నది. నిధి తిత మంజూరియైనందుకు యీ ప్రభుత్వం ఆహ్లాదించుచున్నది.

రాష్ట్రప్రభుత్వం.

విడాయింపు :—110 పేజీల గ్రంథం,
ఒక చిత్రపటం.

## 21

కేంద్రప్రభుత్వ కార్యాలయం

చదవవలసినది—

1. త్రిపత్రిష్ఠఅంచనానకళ్లు.
2. 110 పేజీల బృహత్ ప్రణాళికకు సంబంధించిన గ్రంథం.

ఉత్తరువు

ఆర్థికనిధినుంచి వచ్చిన ఋణం ధనం కాదు. డైలుయింజన్లు అయియున్నవి.

శిక్షాతీతుడైన ఒక వెటిటేషన్ యిన్స్పెక్టరును శాశ్వతంగా వసంతపురంకు బదిలీచేసేది.

కార్యదర్శి,
కేంద్రప్రభుత్వం.

అనుబంధము :—1. త్రిపత్రిష్ఠఅంచనానకళ్లు.
2. 110 పేజీల గ్రంథం.
3. విధిక్కృతమైన ఒక చిత్రపటం.



# ఓ తెనుగు దేశమా!

శ్రీ హనుమచ్ఛాస్త్రి

ఓ తెనుగు దేశమా నా అనుగు దేశమా!
  కదలు నా బంగారు కలల వెలిగే తల్లి!
ఆకుపచ్చపొలాల కేకువిచ్చిన పూల
  ప్రాకు తీయని పెలల నాకు దర్శన మిచ్చు ।ఓ।
ఏమి మాధురు లమ్మ ఈ గాలిపొరల!
  త్యాగయ్యపలుకు క్షేత్రయ్య గానము లొలుకు ।ఓ।
తలపులో స్వర్గాల ఉలి మొనల కుంచియల
  పలికి కొండల మొదల కళల నింపిన రాణి! ।ఓ।
గౌతమీ పెన్న తుంగాభద్ర కెరటాలు
  వినుచు చిక్కని కవిత మనసు లూచే నమ్మ! ।ఓ।
కత్తిగంటము లొక్క కదనులో నడచి
  విజయశంఖము లొత్తు వేళలను దలతు. ।ఓ।

"పాటలమంజరి" నుండి



★ కథానిక ★

★

శ్రీ పి. గణపతిశాస్త్రి

ఇందుమౌళి జగదీశ్వరాలయమంటపంలో అరచేయి తలగడగా ఆనుకొని అలాగే శయనించియున్నాడు. అర్ధరాత్రివేళ ఉదయించిన చంద్రుని కిరణాలలో ఆలయసహస్రస్తంభమంటపం మన కలు వేస్తూ వెలుగుతున్నట్లు ఉన్నది. ముమ్మరమైన జ్యేష్ఠగ్రీష్మాతపం వల్ల అర్ధరాత్రి అయినా ఇంకా గాలి తిరగలేదు. దూరంగా ప్రవహిస్తున్న సెలయేటిలో అప్పుడప్పుడు పక్షుల రెక్కల కదలికలు విన వస్తున్నాయి. చుట్టూ ఉన్న నిర్జనారణ్యంలో ఎండుటాకుల గల గలలాడిన చప్పుడు కూడా అతనికి నిద్రాభంగం కలిగిస్తున్నది. కాషాయధారులైన ఆచార్యుని శిష్యులు సమీపంలో గాఢంగా నిద్రిస్తున్నారు. వెన్నెల మెల్లి మెల్లిగా సహస్రస్తంభమంటపం మీదికి ఎక్కి వస్తున్నది. ఎంత ప్రయత్నించినా ఇందుమౌళికి ఆ వేళ కంటికి కునుకు పట్టడంలేదు. అతనికి గతజీవితమంతా లాస్యం



"ఎంత ప్రయత్నించినా ఇందుమౌళికి కంటికి కునుకు పట్టడంలేదు. గతజీవితమంతా లాస్యంచేస్తూ కన్నుల ఎదుట కదలిపోతున్నది."

చేస్తూ కన్నుల ఎదుట కదలిపోతున్నది. ఆచార్యుని దర్శించిన మొదటినాటి వృత్తాంతమంతా కూడా కన్నులకు కట్టినట్లున్నది.

మొట్టమొదట ఆచార్యుని దర్శించిన ఉత్తరక్షణంలో శోకంతో అతని హృదయం ఉరకలు వేసుకుంటూ పైకి ఉబికింది. ఆచార్యుడు అతని వైపు ప్రశాంతంగా నిశ్చలంగా తిలకించాడు. ఇందుమౌళిహృదయం కొంతసేపటివరకూ బాష్పరుద్ధమైనది. అతనిని చూచిన ఆచార్యదేవుల నేత్రాలు కరుణార్ద్రములైనాయి. అతడు బెంగటిల్లిపోయిన శిశువులా వెక్కి వెక్కి ఏడ్చాడు. ఆచార్యదేవుడు చల్లని మాటలు చెప్పి, అతనికి పత్నీవియోగదుఃఖము ఉపశమింపచేయడానికి వేయివిధాలుగా ప్రయత్నించాడు.

ఆపిమ్మట ఇందుమౌళి ఆ ఆశ్రమంలో రెండుమూడురోజులున్నాడు. తరవాత మళ్లీ ఆచార్యుని దర్శించి, తానింక విదర్భదేశానికి తిరిగి పోదలుచుకోలేదనీ, ఆశ్రమంలోనే ఉండి తపశ్చర్య చెయ్యదలచినని నిశ్చయించుకున్నాననీ విన్నవించాడు. మొదట ఆచార్యుడు దానికి అంగీకరించలేదు. తిరిగి విదర్భదేశానికి వెళ్లి సాంసారిక జీవనం గడపడం మంచిదని ఆదేశించాడు. ఇందుమౌళి కొంతసేపుండి, మళ్లీ దృఢంగా ఆచార్యునికి తన మనోభిప్రాయం వెల్లడించాడు. "నేనిక్కడనే ఉండి, ఇకనుండి యావజ్జీవమూ తత్త్వాన్వేషణ చెయ్యదలుచుకొన్నాను. ఇది నా తుదినిశ్చయము!"

ఆచార్యుడు క్షణకాలం మౌనముద్ర వహించి, ప్రశాంతంగా, "ఈ నిర్జనారణ్యంలో నీ అన్వేషణకు ఫలితం కలుగదు" అన్నాడు.

ఇందుమౌళికి ఆచార్యుని సమాధానం ఇలాగ ఉండగలదని తట్టలేదు. కొంతసేపు ఊరుకొని, "నిర్జనారణ్యంలో కాకపోతే, జనాకీర్ణ నగరంలోనా అన్వేషణ!" అన్నాడు.

"ఔను! అక్కడనే!"

"అక్కడ మనశ్శాంతి కలుగగలదా?"

"అక్కడ రాని మనశ్శాంతి ఇక్కడ కుదరదు!"

"ఆ వ్యామోహాలలో—ఆ తీవ్రదుఃఖాలలో—ఆ ఆఘాతాల లోనా?"

"అవును. ఆ అఘాతాలలోనే, ఆ దుఃఖాలలోనే నీ జిజ్ఞాసకు ఫలితం లభించగలదు!"

కొంతసేపు ఉండి మళ్లీ ఇందుమౌళి ఆచార్యదేవునికి తన అభ్యర్థన నెరవేర్చవలసిందని విన్నవించాడు. మళ్లీ ఆచార్యుని మౌనముద్ర. ఇందుమౌళి తిరిగి ప్రాధేయపడ్డాడు.

"నీ తరుణవయస్సులో ఈ తపశ్చర్య సాధ్యం కాదు."

"తమ అనుగ్రహానికి అసాధ్యం ఏమీ ఉండదు"

"నీ చిత్తవృత్తి బాల్యంనించీ రాజభోగాలకు అలవాటుపడి ఉన్నది"

"......అందుచేతనే వాటితో విసిగి, తమ సన్నిధికి వచ్చాను."

ఆచార్యుడు వ్యగ్రంగా అతనివైపు చూచాడు. ఇందుమౌళి "తమ రనుగ్రహించకపోయినా నే నిక్కడే అకులూ, అలములూ తింటూ ఉండిపోతాను." అన్నాడు.

మళ్లీ చాలాసేపటివరకూ ఆచార్యుడు మాట్లాడలేదు. చివరికి ఆయన నిశితంగా అతనివైపు చూచి ఇలాగ అన్నాడు:

"నీ విక్కడ ఉండవద్దని అనడానికి నాకు అధికారం లేదు. నీ విక్కడనే ఉండిపోవచ్చును. దానికి నా అభ్యంతరం కించిత్తూ లేదు. అయితే ఒక్కమాట! ఎప్పటికైనా ఆ నగర మధ్యంలో, ఆ జీవనకోలాహలంలోనే నీ తత్త్వాన్వేషణ ఫలిస్తుంది. ఇది ముమ్మాటికీ నిశ్చయము."

ఇందుమౌళి దూరంగా అస్పష్టంగా కనిపించే వైశాలీసౌధశిఖరాలవైపు తిలకించాడు. అవి అతనికి తెల్లని అగ్నిజ్వాలాజిహ్వల లాగ భాసించాయి. మళ్లీ అతడు ఆచార్యునివైపు తిరిగి "ఆ అగ్ని జ్వాలలోనా?" అని ప్రశ్నించాడు.

"ఆ, అవును! ఆ మహాగ్నిజ్వాలలోనే!"

అపిమ్మట ఒకటీరెండు దినాలకు ఇందుమౌళి ఆశ్రమవాసిగా అక్కడనే ఉండిపోయాడు. అప్పడే ఇది జరిగి రెండేళ్ళు కావస్తోంది. ఆ ఆచార్యుడు అన్న మాటలు అతని హృదయంలో జేగంటలలా ప్రతిధ్వనిస్తున్నాయి. అయితే ఈ రెండేళ్లలోనూ అతని జీవితం ఎంతో ప్రశాంతంగా గడిచిపోయింది. ఇది ఆచార్యుని అనుగ్రహబలమేమో ఎవరు చెప్పగలరు?

అప్పటికే రాత్రి నాలుగోయామం ప్రవేశించినట్లే ఉన్నది. నిండువెన్నెలలో జగదీశ్వరాలయమండపశిల్పాలు కన్నులు మిరుమిట్లు గొలుపుతున్నాయి. మెల్లిగా ఒక పిల్లగాలి వీచింది. అతని నేత్రాలు అప్రయత్నంగా అశిల్పాలవైపు ప్రసరించాయి. అలిసిపోతున్న అతని నేత్రాలు మూసుకునిపోతున్నట్లున్నాయి. కాని నిద్రమాత్రం పట్టడంలేదు. ముందుగా అతని నేత్రాలు నరనారాయణశిల్పాలవైపు ప్రసరించాయి. నరనారాయణులు సృజించిన ఊర్వశీరూపానికి సిగ్గుపడి దేవకన్యకలు తలలు వంచుకొన్నారు! ఆ నరనారాయణుల విగ్రహాలలో ఎంతటి ప్రశాంతత తాండవిస్తున్నది! పిమ్మట అతనికి విశ్వామిత్రతపోభంగశిల్పం కనబడింది. విశ్వామిత్రుడు మేనకాలాస్యముగ్ధుడై తదేకతానంగా ఆమెవైపు తిలకిస్తున్నాడు! అది మేనకావిగ్రహమేనా? అది ఎంత మనోహరశిల్పము! తాను అటువంటి మూర్తిని ఎప్పుడో చూచినట్లే ఉన్నది. ఆమె ఎవరు? అతనికి తటాలున ఆమెసౌందర్యము, పేరు స్మృతిపథంలో మెరిశాయి. అవును! ఆమెపేరు వారుణి! విదర్భదేశం అంతా ఆమెలాస్యానికి తన్మయమైపోయింది. ప్రత్యేకంగా తానామెలాస్యానికి మెచ్చి స్వర్ణకింకిణులుకూడా బహూకరించాడు. ఆమెలాస్యగోష్ఠి అంటే ఆరోజులలో తాను ఎంతో ఆప్యాయత కనబరిచేవాడు! అది తన వివాహానికి పూర్వం జరిగినకథ! ఆరోజులు ఎంత మనోజ్ఞంగా గడిచిపోయాయి! ఆమె ఎంత సౌందర్యవతి!—ఈ చివరిభావన అతని స్మృతికి కశాఘాతంలా తగిలింది! తటాలున అతడు పశ్చాత్తప్తుడై ఆ ఆలోచనలన్నిటినీ తన భావనాపథంలోనించి తరిమివేశాడు. ముకుళితనయనాలతో ఆచార్యుని నామధేయము ఉచ్చరించి, ఆయన మూర్తిని మనస్సులో ప్రతిష్ఠించుకొన్నాడు. ఆమూర్తికేసి నిశ్చలంగా తిలకించాడు. అది ఆచార్యుని మూర్తి కాదు! వారుణీమూర్తిలా కనిపించింది. మళ్లీ పరితప్తహృదయంతో ఆచార్యమూర్తిని ధ్యానించుకొన్నాడు. అతనికి దూరదూరాన సన్నని సెలయేటిగానంలో తన ధ్యానప్రవాహం కలిసిపోతున్నట్లనిపించింది. చివరికి తెల్లతెల్లవారేవేళ అలసిపోయిన అతని నేత్రాలకు ఏదో కలతనిద్ర పట్టింది.

## ౨

ఆచార్యుని ఆశ్రమం వైశాలీనగరానికి సుమా రొక క్రోశం దూరంలో ఉన్నది. అరణ్యమధ్యభాగంలో ఉన్న జగదీశ్వరాలయపు సహస్రస్తంభమంటపంలోనే ఒక భాగంలో ఆయన నివాసము. ఆచార్యుని శిష్యులు వైశాలీనగరానికి భిక్షకుపోయి మిట్టమధ్యాహ్నవేళకు తిరిగివస్తూంటారు. మరీ వృద్ధులైనవారు కొంతమంది అరణ్యంలో కందమూలఫలాలతోనే కాలక్షేపం చేస్తూంటారు. వైశాలీనగరానికీ జగదీశ్వరాలయానికీ మధ్యన అడ్డంగా సెలయే రొకటి ప్రవహిస్తున్నది. వేసవికావడంచేత సెలయేటి నీరు యజ్ఞోపవీతంలా సన్నగా స్వచ్ఛంగా మెరుస్తున్నది. కొన్నికొన్నిచోట్ల సెలయేరు ఇంకిపోయినట్లే కనిపిస్తున్నది. అల్లాంటి పట్టులలో తెల్లటి కొంగలు కదలిపోయే మీనాలకోసం నిరీక్షిస్తూ అవి కనబడినప్పుడల్లా ఎగిరి వాటిని అందుకుంటున్నవి. ఇందుమౌళి నేడు స్నానానికి సెలయేటికి వచ్చేసరికే కొంత ఆలస్యం అయింది. సెలయేటిఒడ్డున సైకతంలో నిశ్చలధ్యాననిష్ఠలో మునిగిన అతనికి అపరాహ్ణం సమీపించేవరకు కాలాతిక్రమణవిషయమే తెలియలేదు. ధ్యానం ముగించుకొని అతడు భిక్షార్థం వైశాలీనగరంవైపు త్వరత్వరగా నడకసాగించాడు. వేడెక్కిన సెలయేటి ఇసుకలో అతని పాదాలు బొబ్బలెక్కుతున్నాయి. కొంగలు తమ వేట ముగించి

సమీపంగా ఉన్న చెట్లకొమ్మల్లో తలదాచుకున్నాయి. మృగశిర ప్రవేశించి అప్పుడే పదిరోజులు కావస్తున్నది. అయినా పెద్ద వానలు కురవకపోవడంచేత గ్రీష్మతాప మింకా అలాగే ఉన్నది. ఇందుమౌళి తొందరగా వైశాలీనగరం ప్రవేశించాడు. ఆకాశంవైపు పరికిస్తే అప్పుడే అపరాహ్ణం ప్రవేశించినట్లే కనిపించింది. ఒక మూల నల్లని మేఘం మత్తగజంలా పైకి ఉరకలు వేసుకుంటూ వస్తున్నది. అయినా వర్షం కురుస్తుందని అతనికి నమ్మకం కలగలేదు. నాలుగైదు గృహాలలో భిక్షం స్వీకరించేసరికి ఆ మేఘం ఆకాశమధ్యానికి వచ్చింది దానితోపాటు గాలిదుమారంకూడా లేచింది!

ఇందుమౌళి ఇక లాభంలేదని ఆశ్రమోన్ముఖుడైనాడు. కొంచెం చిన్నచిన్న చినుకులు ప్రారంభించాయి. క్రమంగా అవి బట్టతడుపుచినుకులైనాయి. కొంచెంసేపుండి వాన వెలిసినతరవాత పోవచ్చునని అతనికి ఆలోచన తట్టింది. తన బాటకు ఒక వైపున ఒక మనోహరసౌధము, మరిఒక వైపున ఒక జీర్ణదేవాయతనము ఉన్నాయి. సౌధమే తలదాచుకోడానికి ఎక్కువ అనువుగా ఉన్నది. అయినా దానిలోకి ప్రవేశించడం ఇష్టంలేక జీర్ణదేవాయతనమంటపంలోకే వెళ్లి తలదాచుకొన్నాడు.

వర్షం ధారాపాతంగా కురవడం మొదలుపెట్టింది. కొంతసేపటికి మళ్లీ ఆ ఉద్ధృతం తగ్గింది. ఇందుమౌళి ఉల్లాసంగా ఆకాశం వైపుచూచాడు. ఎదురుగా ఉన్న సౌధంమీదనుండి అగరుధూపమాలికలు మెలికలు తిరిగి మందమందంగా ఖండఖండాలుగా వర్షంలో ఆకాశంవైపు ప్రయాణిస్తున్నాయి. ఇక వాన వెలిసి పోవచ్చునని అతడు దేవాలయద్వారందగ్గరకు వచ్చాడు. ఇంతలో హఠాత్తుగా పెద్దజడి! ఈజడి తగ్గిన తరువాత ఆశ్రమానికి తరలిపోవచ్చు నని అతని ఆశ. మళ్లీ వర్షం క్రమంగా ఎక్కువైపోయింది. దానితో పాటు రంయిమని మోతపెడుతూ ప్రచండమైన గాలికూడా రేగింది. అంతకంతకు గాలి, వాన ఒకదానితో ఒకటి స్పర్థించి గాలివానగా మారిపోయాయి! చెట్లమీద తలదాచుకున్న కాకులు గాలితాకిడి భరించలేక చెట్లమీదనించి జారి కింద పడిపోతున్నాయి. అతడు ఆశ ఏమైనా ఉన్నదేమోనని ఆకాశంవైపు చూచాడు. సాయంకాలం కావస్తూంది. ఇరుగుపొరుగు ఇళ్లల్లో బయలుదేరిన పొగ గాలివానలో నలువైపులా పరుగెత్తుకొనిపోతున్నది.

ఇక ఆగడం మంచిది కాదని ఇందుమౌళి మళ్లీ వీథిలోకి వచ్చాడు. వీథి అంతా మోకాటిలోతున నీరు ప్రవహిస్తున్నది. అయినా నాలుగైదు అడుగులు వేశాడు. వీథులే ఇంత జలమయంగా ఉంటే క్షణంలో పొంగిపోయే పొలమేరు ఎలాగ ఉన్నదో! అయినా ఆసంగతి తరవాత చూడవచ్చునని మళ్లీ నాలుగడుగులు వేశాడు. వాననీరు నడుమువరకూ వచ్చింది. అంతకంతకు వాననీటి ప్రవాహం పెరిగిపోతున్నది. ఇక ఈ గాలివానలో—ఈ ప్రవాహంలో ప్రయాణం లాభంలేదు. వాన బాగా వెలిసేవరకూ జీర్ణదేవాయతనంలో తల దాచుకోవడం తప్పనిసరి. ఇందుమౌళి అతి కష్టంమీద వెనక్కు వచ్చి దేవాలయంలో తలదాచుకున్నాడు. వీథిలో వాననీరు దేవాలయావరణంలోకి వచ్చి చెరువుగామారిపోయింది.

బాగా చీకటిపడింది. ఆ జీర్ణదేవాయతనంలో పూజాపునస్కారాలు లేవు. అతని చైతన్యం అంతా గాలివానహోరుతో నిండిపోయింది. ఉరుములు భయంకరంగా వినవస్తున్నాయి. తటాలున మెరిసిన మెరుపులో మెరిసిన జగత్తు క్షణంలో అంధకారంలో విలీనమైపోతున్నది. ఒక్కొక్కసారి భయంకరంగా ఆకాశం గర్జించేసరికి దేవాలయమంటపం ఊగిసలాడిపోతున్నది! ఆ భయంకరఝంఝూవాతంలో ఆ జీర్ణదేవాలయంలో ఉండడంకూడా క్షేమం కాదని అతనికి తోచింది. కాని చేసేది ఏమున్నది! కన్నూ కన్నూ కనబడడం లేదు. అప్పుడే ఒక ఝామురాత్రి గడిచి ఉండవచ్చును. అప్పుడప్పుడు అస్పష్టంగా వినవచ్చే ధ్వజస్తంభఘంటికల మోతలలో నీరసమైన అతని శరీరానికి నిద్ర ఆవేశిస్తున్నది.

ప్రళయగర్జనలా ఒక పిడుగు పడిన మోత వినిపించింది. ఆ పిడుగు చాలా సమీపంలోనే పడి ఉంటుంది. క్షణంలో దేవాలయంగోడ కూలి అతనిమీద పడింది. ఒక్క అంగలో అత డాఘాతం నించి తప్పుకొన్నాడు. శిరస్సుపై పెద్ద ఆఘాతం తగిలినట్లయింది. అప్రయత్నంగా అతడు ఆచార్యనామం స్మరించుకొన్నాడు. దగ్గరగా జనకోలాహలము, ఆక్రందనధ్వనులు వినిపించాయి. మళ్లీ అతడు ఆచార్యనామం ఉచ్చరించాడు. అంతే! ఆపైన ఏమి జరిగిందో అతనికి స్మృతి లేదు. ఆ పిడుగుపాటుతాకిడికి ఆ జీర్ణదేవాలయంలో ఒక భాగం కూలిపోయింది. ప్రకృతిశక్తులు భయంకరంగా తాండవించాయి. గాలిహోరు ఆ జీర్ణదేవాయతనగర్భగృహంలో మారుమోగింది.

## 3

ఇందుమౌళికి కొంచెం తెలివి వచ్చింది. అంతరాంతరాల్లో అతని కింకా ఝంఝామారుతగర్జనలు, ఉరుములు వినిపిస్తూనే ఉన్నాయి. వీథుల్లో వర్షధ్వని, గాలిహోరు రొద చేస్తూనే ఉన్నాయి. కాని పరిసరం మాత్రం మొట్టమొదట అత డది సత్యమని విశ్వసించలేకపోయాడు. తా నొక సుఖతల్పంపై శయనించి ఉన్నాడు. ఒక పరిచారకుడు, పరిచారిక అతనివైపు ఆత్రంగా తిలకిస్తున్నారు. తాను శయనించిన గృహ మొక ధనిక ప్రాసాదంలా ఉన్నది. ఒక మూల బంగారు నర్తకీశిల్పమూర్తి హస్తంలోనుండి సురభిళమైన అగరుధూపమాలికలు లేచి పరిసరం అంతా ఆవరించుకొంటున్నాయి. రంగురంగుల కాచపాత్రికలలో చిత్రవిచిత్రమైన దీపకళికలు వెలుగుతూ కనులకు మిరుమిట్లు గొల్పుతున్నాయి. దగ్గరగా వివిధములైన భక్ష్యాలు, పానీయాలు అమర్చబడి ఉన్నాయి. ధగధగలాడే ఆపరిసరం చూస్తే అతనికి దిగ్భ్రమ

కలిగింది. ఒక్కసారి కళ్లు మూసుకుని మనస్సులో ఏదో జపించు కున్నాడు. ఒక అరగడియ ధ్యానం ముగించుకొని అతడు మళ్లీ కన్నులు తెరిచాడు. ఎదురుగా మనోహర నారీమూర్తి నిలబడి ఉన్నది. ఆమెను చూడగానే జగదీశ్వ రాలయంలో మేనకా లాస్య శిల్పము తటాలున స్మృతి పథానికి తట్టింది. ఏమి విచిత్రము! ఆ శిల్పమే సజీవమై ఇక్కడికి వచ్చిందా? ఈమె ఎవరు? పరిచారికా పరిచారకులవలె కని పించినవారిద్దరు ఎవరు? వారెక్కడికి వెళ్లిపోయారు? ఈమె ఎవ్వరు? నేను కలగంటున్నానా? ఇలాంటి అభిప్రాయాలన్నీ మెరు పుల్లా అతని భావనాకాశంలో పరిగెత్తాయి. చివరికి అతడు క్షీణ స్వరంతో ఇలాగ అన్నాడు:

"నేనెక్కడ ఉన్నాను? మీరెవరు?"

ఆస్త్రీ నెమ్మదిగా సంకోచిస్తూ సమాధానం చెప్పింది:

"వైశాలీనగరంలో"

"ఈ ఇల్లెవరిది?"

"మాదే!"

"మాదే! అంటే—? మీరెవరు?"

"నేనెవరో గుర్తించలేరా?"

ఈమాటలు వినేసరికి అతనిలో వెయ్యి స్మృతులు ఒకదాని వెంబడి మరొకటి అవిచ్ఛిన్న వేగంలో పరుగెత్తుకుపోయాయి. ఇంతలో భయంకరమైన మేఘగర్జన వినబడింది. తరువాత కుండ పోతగా వర్షిస్తున్న వర్షపు ధ్వని, రొదగాలి మోత. ఆ ధ్వనికి అతని ఆలోచనలు చెదిరిపోయాయి. మెరుపు ఆమెముఖం మీద తటాలున మెరిసి మాయమైపోయింది.

"ఎవరు?—ఎవరు? వారుణీ..."

"అవును, నేను వారుణినే."

"ఈ భవన మెవరిది?"

"మాదే!"

"ఇక్కడికెప్పుడు వచ్చావు?"

"సంవత్సరం పూర్వము."

"ఇక్కడికి నన్నెవరు తీసుకువచ్చారు?"

"మా పరిచారకులు. మీకు తలపై గాయం తగిలి బొప్పి కట్టింది. మీరు దేవాలయమంటపంలో స్పృహతప్పి—"

ఈమాటలు విని ఇందుమౌళి తటాలున శయ్యమీదనించి లేచి "నేనిక్కడ ఉండడానికి వీల్లేదు! ఆశ్రమానికి తిరిగి వెళ్లిపోవాలి!" అన్నాడు. ఆమె తటాలున అతని దగ్గరకు వచ్చి "ఇంకా గాలి వాన చాలా భయంకరంగా ఉన్నది. ఈరాత్రి ఇక్కడ విశ్రమించి వెళ్లవచ్చును. ఇప్పుడు మీరు చాలా నీరసించి ఉన్నారు! కదిలితే తలకట్టు విడిపోతుంది! లేవకండి!" అన్నది. ఒక్కసారి శిరస్సు మీద తగిలిన ఆఘాతంలోంచి హృదయంవరకు అతనికి బల్లెం గుచ్చుకొన్నట్లయింది. అతడు నిలబడలేక మళ్లీ శయ్యమీద కూలబడిపోయాడు. ఆ కదలికలో అతని తలకు కట్టిన కట్టు విడిపోయి కొంచెం రక్తం ప్రవహించడం మొదలుపెట్టింది. తటాలున ఆమె అతని శయ్యపై కూర్చుని కట్టుకట్టడం మొదలుపెట్టింది. దానితో అతని శిరోవేదన కొంత శాంతించినట్లయింది. అతడామె వైపు ఒక నిమిషం నిశ్చలంగా చూసి "నీవు వైశాలీనగరానికి ఎందుకు వచ్చావు వారుణీ!" అన్నాడు.

ఆమె మాట్లాడలేదు. ఆమె వేడికన్నీటిబిందువొకటి అతని వక్షఃస్థలంపై రాలింది. "అదేమి వారుణీ! అలాగ విచారిస్తున్నావు." అన్నాడు. అంతే! ఆ ప్రశ్నతో ఆమె ఒక్కసారి అతని వక్షఃస్థలంపై పడి వెక్కివెక్కి ఏడ్చింది. భీషణంగా ఫెటఫెటార్భటులతో ఆకాశం గర్జిస్తూనే ఉన్నది. గాలివాన గవాక్షాలగుండా వారి ముఖాలపైన వర్ష శీకరాలు విసురుతున్నది. భయంకరమైన ఆ బాహ్యప్రకృతి వారి అంతరాంతరాలలో మైకంలా, మద్యంలా, మూర్ఛలా అలము కొని, వారిని పండుటాకులవలె నృత్యం చేయించింది.

అతని కొక్కసారిగా పూర్వవృత్తాంతం అంతా కన్నులకు కట్టింది. మొదట ఆమెనొక నృత్యోత్సవంలో దర్శించాడు. అప్పుడు స్వయంగా ఆమె వైపుకే ఒక ముత్యాలహారం బహూక రించాడు. ఆ హారం ఆమె ఎంత ఒయ్యారంగా స్వీకరించింది! నాటి నుంచీ ఇంచుమించుగా వివాహంవరకు ఆమెమూర్తి తనలో నిత్యమూ కదులుతూనే ఉండేది. ఆమె తనదగ్గరనుండి ఎరువుతీసుకొన్న తాళ పత్రగ్రంథాలతో అప్పుడప్పుడు మదనలేఖలు పంపిస్తూ ఉండేది. ఆమెలేఖలు ఎంత ఆర్ద్రంగా, ఎంత దీనంగా ఉండేవి! కాని ఏమీ లేకపోయినా అనవసరంగా లోకాపవాద వల్లు వైపులా అల్లుకు పోయింది. క్రమంగా పెద్దల మాటలకు జడిసి అతడు ఆమె నృత్యో త్సవాలకు కూడా వెళ్లడం మానివేశాడు! చివరికి తన వివాహం నాడు కూడా ఆమె దీనాతిదీనమైన లేఖ పంపించింది. ఆపిమ్మట రాజకార్యాంతరాలవల్ల అతడు నగరాంతరానికి వెళ్ళిపోయాడు. తరువాత ఆమెవృత్తాంతం తెలియలేదు! పిమ్మట తనకు దారుణమైన కళత్రవియోగమూ, కొంతకాలానికి ఆచార్యదర్శనమూ జరిగాయి. ఆసంఘటనలన్నీ ఎంత విచిత్రంగా గడిచిపోయాయి!

ఆమె అతన్ని గాఢంగా ఆశ్లేషించుకొని హృదయంమీదనే మూర్ఛపోయింది. లోలోపల అతనికి ఆ ఆశ్లేషంలోనించి తప్పించు కొని బయటపడవలెనని అనిపించింది. ఒక్కసారిగా శాయ శక్తులా ప్రయత్నించాడు. ఆమె పెన్నిధానం విడువలేని పేదలా మరింత గాఢంగా అతనిని కౌగలించుకొన్నది. గాలివాన మూలుగు తున్నట్లు భీషణంగా వీచింది. ఆకాశం నిరంతరంగా రోదిస్తూన్న ట్లుగా వర్షిస్తున్నది. సహజంగా అలసిన అతని శరీరానికి, మన స్సుకూ, చైతన్యానికీ మగత కమ్ముతున్నట్లు నిద్ర పట్టింది. మళ్లీ భీకర

మైన ఝంఝామారుతం రంయిమని వీచి, వారిపూరితమైనా పెద్ద జల్లులు కురిపించింది. ఆ గాలికి ఆగదిలోని చిత్రదీపికలన్నీ ఆరి పోయాయి. ఆ మహాంధకారంలో ధూమ్యాకారాలు విలయనృత్యం చేస్తూ గర్జించాయి.

౪

రెండు రోజులనుండి తీవ్రంగా వీచిన గాలివాన మూడవనాటికి తగ్గుముఖం పట్టింది. కాని ఆకాశం అంతా మేఘాచ్ఛాదితంగానే ఉన్నది. గాలి బాగా తగ్గినా వర్షం కురుస్తూనే ఉన్నది. నేలమీద పడిన పక్షివృక్షాదులతోను, అక్కడక్కడ కూలిన గృహాల తోను వైశాలీనగరం అంతా పాడుపడినట్లున్నది. వీధులన్నీ జలమయమై, కప్పలబెకలు దారుణంగా వినవస్తున్నాయి. మూడవ నాటి ఉదయం అతని కొరకు దేవాలయఘంటానాదం వినబడింది. అప్పటినించీ ఇందువాహినిమనస్సులో పశ్చాత్తాపాగ్ని క్రమక్రమంగా రాజుకోవడం మొదలుపెట్టింది. తన పతితవృత్తాంతం తలుచుకుంటే, అతని కొరకు భయంకరస్వప్నంలా కనిపించింది. ఎక్కడి విదర్భ దేశము! ఎక్కడి వైశాలీనగరం! ఎప్పటి వారుణీ ప్రణయగాథ! ఆ గాలివాన, ఆ దేవాలయంలో అపూతం కేవలం తనకోసమే వచ్చాయా? ఆ మానసికభౌతికప్రళయాలకు సంబంధమేమైనా ఉన్నదా? తాను మళ్లీ ఆశ్రమానికి పోగలడా? పోతే ఆచార్యులేమంటారు? ఆచార్యశిష్యులేమంటారు? వారికి వృత్తాంతం తెలియకపోవచ్చును! కాని తిరిగి తానే మొహం పెట్టుకుని ఆశ్రమంలో అడుగు పెట్టగలడు? తన కపటం అక్కడ అడుగుపెట్టే అర్హత ఉన్నదా? అతడిట్లాగే ఆలోచిస్తూ శయ్యపై శయనించి ఉన్నాడు. కన్నీళ్లు ధారాపాతంగా అతని చెక్కిళ్లనుండి ప్రవహిస్తున్నవి. ఇంతలో వారుణి కాచదీపికతో అక్కడికి వచ్చింది. ఆమె ఎదుట అతన్ని చూచి నిర్ఘాంతపోయింది. ఆ దీపిక ఒకచోట ఉంచి తటాలున అతని శయ్యపైకి వచ్చి కూర్చున్నది. ఇంతవరకు ఇందువాహినికి సూర్యాస్తమాన మైనసంగతే తెలియదు. మేఘచ్ఛన్నమైన ఆ దుర్దినంలో పగటికీ రాత్రికీ భేదం విలుప్తమై పోయింది!

ఆమె దగ్గరకు వచ్చేసరికి అతను యథాప్రకారంగా నవ్వుతూనే మాట్లాడాడు. ఆమెకు తన వేదనాకారణం తెలిసిఉండవచ్చును! కాని ఆమె అతని నావిషయంలో ప్రశ్నించలేదు! ఆమె ముఖంలోకూడా అతనికి తీవ్రమైన వేదనాచ్ఛాయలు కనిపించాయి. అయినా ఆమె కలకల నవ్వుతూనే మాట్లాడింది. ఆమె గడిచిన రెండురోజుల కంటె ఎక్కువ మనోజ్ఞంగా అలంకరించుకొన్నది. చిత్రవిచిత్రమైన అలంకారాలతో కబరీభరం అంతా పూచిన తీగె వలె ఉన్నది. ఆమె తటాలున అతన్ని గాఢంగా ఆశ్లేషించుకొన్నది! తటస్థంగా ఉన్న అతని హృదయాన్ని కది మైమరచే మత్తు కలిగించింది. ఆమె ఈవేళ శరీరానుభూతి వంటిదేదో కోరికతో జాగ్రుపుంటున్నది. ఆమెముఖంలో నేడు రెండురోజులనుండీ లేని తన్మయత, ఆనందము తాండవించాయి. ఆమె తృప్తితానికి ఆనందసౌధపు మెట్లెక్కిపోతూన్నట్లు కనిపించింది. ఇందువాహినికి నేడామెమహోత్సాహము కొంత విచిత్రంగా కనిపించింది. ఆమె అతని కళ్లలోకి కొంతసేపు దీనంగా చూచి, "మీరు నన్నెప్పటికీ మరిచిపోకూడదు!" అన్నది. ఆపైన అతనిచేతి చేతిలో చెయ్యివేయించుకొని నిశ్చింతగా అతని కౌగిలిలో నిద్రపోయింది.

అతనికి ఆవేళ రెండురోజులనించీ పట్టినంత గాఢంగా నిద్రపట్టలేదు. అతనికి కలలో తన్నెవరో వీపుమీద చరిచి లేపినట్లయింది. తటాలున లేచి చూచాడు. వారుణి గాఢంగా తనపక్కనే నిద్రిస్తున్నది. అతడు మళ్లీ నిద్రించాడు. గాలితోబాటు వాన కూడా క్రమక్రమంగా తగ్గిపోతున్నది. మారులనుండి ధారాపాతంగా



"అతడాపత్రాలు తీసుకొని ఆత్రంగా చదవడం మొదలుపెట్టాడు."

వర్షం కురవడం మానివేసి బిందువులు బిందువులుగా వర్షం కురుస్తున్నది. అప్పుడప్పుడు చెట్లమీద తల దాచుకొన్న పక్షులు తడిసిన రెక్కలు విదిలించుకొంటున్నాయి. ఆసమయంలో చెట్లఆకులపై నిలిచిపోయిన వర్షబిందువులన్నీ వర్షపుజల్లులాగ ధ్వని చేస్తూ నేలమీద పడుతున్నాయి.

ఇంతమాలికి నిద్రలో తొందరతొందరగా తన్నెవరో పిలుస్తున్నట్లనిపించింది. తటాలున కళ్లు నులుముకుంటూ శయ్యమీద కూర్చున్నాడు. సమీపంగా "కొక్కొరోకో" అని కోడి కూసింది. ఇంకా బాగా తెల్లవారలేదు. అయితే కారుచీకటి తగ్గింది. వర్షం కూడా బాగా తగ్గింది. ఆకాశం అంతా నిర్మలంగా ఉన్నది. పైపైన సప్తఋషుల నక్షత్రాలు మెరుస్తున్నాయి. దూరంగా ధ్రువతార మినుకుమినుకుమంటూన్నది. తరువాత అతని దృష్టి వారుణివైపు తిరిగింది. కాని ఆమె అక్కడ లేదు. ఎక్కడకు వెళ్లింది? దూరంగా ఒకమూల ఉన్న దీపం శయ్యకు దగ్గరగా పెట్టి పోయింది. ఆదీపికకు సమీపంలో భూర్జపత్రాలపై వారుణిహస్తాక్షరాలు కనిపించాయి. అత డాపత్రాలు తీసుకుని ఆత్రంగా చదవడం మొదలుపెట్టాడు. అది ఆమె తన్నుద్దేశించి వ్రాసిన లేఖ. అతడు మొదటిభాగం అంతా గబగబా చదివాడు. ఆ లేఖాంశం పూర్తికాలేదు. అత డింకా తొందరగా చదవడం ప్రారంభించాడు: "మీరు నిర్దాక్షిణ్యంగా నన్ను, విదర్భదేశాన్ని విడిచి వెళ్లిపోయారు. ఒక్కమాటైనా చెప్పకుండా నన్నావిధంగా విడిచివెళ్లడం మీకు న్యాయంగా ఉన్నదా? నేను మీకోసం ఎంత తపించిపోయాను! నాకు అంతవరకు మీ పత్నివియోగవార్త తెలియనేలేదు. తరవాత ఒక ఆరుమాసాలకు మీరు జగదీశ్వరాలయంలో ఆశ్రమంలో ప్రవేశించినట్లు తెలిసింది. నేను విదర్భదేశం విడిచి నాసంసారంతోసహా వైశాలీనగరానికి వచ్చివేసి, ఈ ప్రాసాదంలో నివసించడం మొదలుపెట్టాను. కొన్నాళ్లకు మీ మూర్తి నాకు ప్రత్యక్షమైంది. అప్పటినించీ ఆ మధ్యాహ్నభిక్షవేళ మీవైపొకసారి తిలకించడమే నాకు నేత్రామృతంగా ఉండేది. కాని నాకు మిమ్మల్ని ఒక్కసారి నోరారా పలకరించడానికి కూడా సాహసం కలగలేదు.

"ఎన్నో రాత్రులు మీమూర్తిని మనస్సులో నిలిపి జాగరాలు చేశాను. నేను ఎన్నడూ కలలోకూడా మీ వ్రతభంగం చెయ్యదలచుకోలేదు! ఆ గాలివానలో మీరావిధంగా చిక్కుకొని ఉండడం నేను మేడమీదనించి గమనించాను. కాని మిమ్మల్ని మా భవనానికి ఆహ్వానించడానికి కూడా నాకు సాహసం కలగలేదు. ఇక ఆ దేవాలయంలో మీరు అఘాతం తగిలి పడిపోయినప్పుడు మాత్రం మా పరిచారకుల నక్కడికి పంపించాను. మీరు స్పృహలేకుండా ఉండడంచేత మా భవనంలో ఉంచి సేదదేరేవరకు పరిచర్య చేశాను. ఆ గాలివాన, ఆ సంఘటన అది అంతా కేవలం దైవికమని నమ్మండి!

కాని, ఒక్కమాటమాత్రం నిశ్చయము. నేను మిమ్మల్ని విడిచి జీవించలేకపోయాను. మీరు లేని బ్రతుకే వ్యర్థమని అనిపించింది. అనేకసారులు ఆత్మహత్యాప్రయత్నంకూడా చేశాను. ఒక్కసారి మీ కౌగిలింతలో క్షణమాత్రం విశ్రమించి, ఆపిమ్మట మరణించవలెనని అనిపించింది. నాహృదయరహస్యం ఎరిగిన మీ కిది అంతా చర్వితచర్వణం కాగలదని అనుకుంటున్నాను. మొదటినాటి రాత్రి మీస్పర్శలోనే నాకు మైమరపు కలిగింది. ఆ రెండవనాటి రాత్రితో జీవితపరమావధికమైన దివ్యానందం అనుభవించాను. ఆ ఆనందానుభూతిని నేను మీ కేవిధంగా వ్యక్తం చెయ్యగలను? నా కానాడు జీవితపు ఆనందావధులు అందుకొన్నట్లు తోచింది. నా జన్మ తరించినట్లు కనబడినది. ఆ రెండవనాటి రాత్రి మీరుకూడా ఆనందతన్మయతలో లీనులైపోయినారు. అది ఎంత గొప్పరాత్రి! నా కానాడు మరి కన్నులు తెరవాలని బుద్ధి పుట్టలేదు! ఆ సుఖస్వప్నంలో అల్లాగే మరణించాలని అనిపించింది. నా కా ఆనందం స్థిరంగా నిలదని తెలుసును! ఆ మరునాడు నేను మీముఖంలో పశ్చాత్తాపం గమనించాను. నా ఆనందం ఎంత గభీరమైనదో మీ పశ్చాత్తాపం కూడా అంత గభీరమైనదని నా కాక్షణంలో స్ఫురించినది. అయితే జరిగినదంతా అనాలోచితంగాను, దైవికంగాను జరిగినదనే తృప్తి నాకున్నది! ఒక్కరాత్రిలో ఆనందావధికూడా అందుకున్నాను! మరునాడు ఉదయం లేచేసరికి ఆ మైకం నాకన్నులలో తొంగులువారుతూనే ఉన్నది. అంత అవధి అందుకొన్నతరవాత నాకు భవిష్యజ్జీవితం అంతా నిస్సారంగా కనిపించింది. నా కా ఆనందపు మైకంలోనే మరణించవలెనని కోరిక కలిగింది. విషపాత్ర తాగిన తరవాతనే నేనీలేఖ ప్రారంభించాను! మీరీలేఖ చూచేసరికి నేను మృతినిద్రలో తన్మయురాలనై ఉంటాను! సెలవు—చరణదాసి, వారుణి."

జరిగినదంతా క్షణంలో అతని హృదయంలో అవగతమైంది. తటాలున శయ్యమీదనించి కిందికి ఉరికి అతడు నలువైపులా కలయజూచాడు! శయ్యకు తలగడవైపున వారుణి నేలపై పడి ఉన్నది. తటాలున అత డామెనాడి పరిశీలించాడు. అనుకున్నంతపనీ జరిగిపోయింది! స్తబ్ధహృదయంతో అత డలాగే నిలబడిపోయాడు! అతని కనుల కెదురుగా గవాక్షంలో కలకలలాడుతూన్న అరుణోదయము, నిర్మలాకాశము కనిపించాయి. పక్షుల కిలకిలారావాలతో జగత్తంతా ఉషోనృత్యం ప్రతిధ్వనించింది. ఆ తీవ్రహృదయాఘాతంలోను, ఆపక్షుల కలకలారావాలలోను, ద్విధావిభిన్నమైన బాహ్యప్రపంచంవైపు చూస్తూ అతడు అలాగే నిలబడిపోయాడు! "ఎప్పటికైనా ఆ నగరమధ్యంలోనే, ఆ జీవితకోలాహలంలోనే నీ తత్త్వాన్వేషణ ఫలిస్తుంది. ఇది ముమ్మాటికీ నిశ్చయము." అని ఆచార్యదన్న మాటలు అతని హృదయంలో గభీరంగా మారుమ్రోగాయి.

అతడు మళ్లీతిరుగుతూ ఉరకలు వేసుకుంటూ పరుగెత్తిపోయే ఆ జీవిత ప్రవాహంవైపు చూచాడు! ఈటాలవ అతనికి ఆచార్యుని మాటల లోని అంతరార్థం స్ఫురించింది! జీవితచాంచల్యము, అచాంచల్యంలో అంతర్లీనమైన జీవితసత్యము, ఆనందము అతనిలో ఒక్క సారిగా ప్రజ్వలించాయి! మళ్లీ శయ్యదగ్గర చిరునవ్వులతో మరణించి పడిఉన్న వారుణీముఖంవైపు పాకపారి పరికించాడు. బాష్పార్ద్రనయనాలతో వెళ్లిగా మళ్లీ ఆశ్రమంవైపు నడిచివెళ్లి పోయాడు!

---



# పండితరాయుల సూర్యోపాసన

ఈ మహాకవి యవనకన్యయైన లవంగిని చేపట్టి వర్ణభ్రష్టు డయ్యెనుగాని మతభ్రష్టుడు కాలేదు. ఇతడు శుద్ధాద్వైతుడు. అందును లక్ష్మీనారాయణభక్తుడు. భక్తియోగనిష్ఠుడు. ఇందు కితని లహరీవచనములే ప్రమాణము.

"పతే నిత్యం మాతే ర్గుణమయి పరబ్రహ్మమహిషే,
జగన్నాథ స్స్వాకర్ణయ మృదుల గ్రాహి విభూతే"
"ఆధివ్యాధిజరాపరాహతి! యది క్షేమం నిజం వాంఛసి!
శ్రీకృష్ణేతి రసాయనం రసయ రే శూన్యైః కిమన్యైః శ్రమైః?"
"సంజ్ఞాకాంతసుతే కృతాంతభగినీ శ్రీకృష్ణనిత్యప్రియే!
పాపోన్మూలిని పుణ్యదాత్రి యమునే కాలింది తుభ్యం నమః"

పండితరాజు వైదికకర్మవిహీనుడు కాడుగాని, వైదికతత్త్వమును వేదాంతరహస్యముల నెఱిగిన మీమాంసాతత్త్వవేత్త. ఆ విజ్ఞాన మితని స్తుతికావ్యము లన్నిట ప్రతిఫలించుచునే యున్నది. అం దితని సుధాలహరినిబట్టి యితని సౌరవిజ్ఞాన మించుక తెలిసికొందము.

ఋగ్వేదములో నగ్నీంద్రసూక్తములతరువాత గణింపదగినవి సూర్యసూక్తములు. మఱియు సౌర మహత్త్వము నెక్కువగా వర్ణించినది తైత్తిరీయారణ్యకము. అందలి విజ్ఞానమును సంగ్రహముగా సూచించిన దితని సుధాలహరి. ఇది చూచుటకు ముప్పది శ్లోకముల చిన్నకావ్యమేకాని, గుణమున నిది గొప్ప కావ్యమే. మయూరకవ్యాదుల సూర్యస్తవములు దేశమున వ్యాపించియున్నవి. వానితో బోల్చి చదివినవారి కిందలి విశేషము గోచరింపకపోదు. మఱియు, వివిధాలంకారభూషిత, మపూర్వభావోపేతము నైన యీ చిన్న కావ్యము శబ్దార్థముల శ్రవణానందము హృదయానందము నగుచున్నదనుట చెప్పదగిన విశేషాంశము.

ఋగ్వేదములోని "ఇంద్రం మిత్రం వరుణ మగ్ని మాహు రథో దివ్య స్ససుపర్ణో గరుత్మాన్, ఏకం సద్విప్రా బహుధా వదం త్యగ్నిం యమం మాతరిశ్వాన మాహుః" ఇత్యాదిమంత్రముల భావమును మనస్సున నుంచుకొని సూర్యుడు సకలజగదాధారభూతు డన్న భావము నిందు ప్రదర్శించియున్నాడు. ఇందుకు సూర్యలీలావిలాసవర్ణన మొక యుదాహరణము.

> "ఆపాథోజాసనాయుః క్షణలవఘటికాద్యాత్మకం కాలచక్రం
> ప్రాహుః పూర్వే పురాణాగమవిషయవిదో యస్య లీలావిలాసం,
> భావానాం షడ్వికారా నథ ఖలు గతిభి ర్యశ్చ నిత్యం ప్రమాతే
> స ప్రాతః పారహాలాతే పరిలసతి హరిన్మండలే చండభానుః"

ఇందు సృష్టిస్థితిలయాత్మకమైన జగత్తత్వ మిమిడియున్నది.

సూర్యోపాసనావిధానము త్ర్యచసౌరారుణకేతుకచిత్యరూపమున త్రివిధము. అం దుద్యన్నద్యేతి మహామంత్రార్థ మిట్లు వర్ణింపబడినది:

> "భానో స్తేఽమీ హృష్టికా గ్యఖిలతనుభృతాం హర్షయంతో హి తేహో
> హృద్రోగం సంహరంతాం హిమమహిమహృతో హేమహృద్యాః కరా వః"

పరమేశ్వరుడు దివ్యసత్యనిత్యతేజోరూపమున సూర్యమండలాంతర్వర్తియై యాత్మసంకల్పసంజాతమైన సకలజగము వీక్షించుచున్నా డన్న యాత్మతత్వమును "శుద్ధం బ్రహ్మాలవాలం ప్రకృతిశబలితం యస్య మూల" మిత్యాదివాక్యముల నావిష్కరించియున్నాడు. తాదృశమైన పరబ్రహ్మతేజస్సును ప్రాతస్సాయంకాలముల నర్ఘ్యప్రదాన మాచరించి ధ్యానింపదగు నన్న వేదోక్తధర్మము నిట్లు విశదీకరించినాడు:

> "సాయంప్రాతశ్చ సంధ్యాంజలి మవనిసురాః సంప్రయచ్ఛంతి యస్మై
> తస్మై కస్మైచి దేతన్మమ పరమహసే దేవతాయై నమోఽస్తు"

శ్రేష్ఠవాచకములుగా ఇంద్రచంద్రసింహాదిశబ్దములు వాడుట ప్రతీతమైయుండగా నితడు "శ్రీమత్పేరమభట్టసూను రనిశం విద్వల్లలాటంతపః" అనుచు సూర్యవాచకమైన లలాటంతపశబ్దము వాడుకొనుటయే యితని సూర్యారాధనప్రియత్వమును ప్రకటించుచున్నది.

అక్బరుపాదుషా సూర్యారాధనప్రియు డని ప్రతీతి. అతని కడపటి రోజులలో తదాస్థాన మలంకరించిన యీ మనీషి యతని సూర్యభక్తియు, తన సౌరవిజ్ఞానము సన్వర్థముగా నీసుధాలహరి నిర్మించె నని భావింపవచ్చును. ఇందలి "ఉల్లాసః ఫుల్లపంకేరుహ" త్యాద్యప్రథమశ్లోకమును తన రసగంగాధరప్రథమాననమున నుదాహరించుకొనుట తన సూర్యస్తవము నితడు సర్వదా స్మరించుకొనుచుండెడివా డనుటకు నిదర్శనమగును.

—మల్లాది సూర్యనారాయణశాస్త్రి


సుద్ధ
వస్త్రములను
శుభ్ర
పరచదు
కేరళ
వాష్‌వెల్
WASHWELL BAR SOAP
పరిశుద్ధమైన
బారు
సబ్బు
ఈసబ్బుతో గృహవస్త్రపరిశుభ్రత
అతిసులభమైనది
కేరళా సోప్ ఇన్‌స్టిట్యూట్, కాలికట్.
పారిశ్రామిక, వాణిజ్యశాఖ
మద్రాసు ప్రభుత్వము

# అవతరించకనే అస్తమించిన ఆంధ్రరాష్ట్రం

('ఒక ఆంధ్రుడు')

> ఆంధ్రరాష్ట్రం వచ్చింది అని అనుకుంటూ ఉండగానే రాకుండా పోయింది. అవతరించకుండానే అస్తమించింది. 1935 వ సంవత్సరపు భారత రాజ్యాంగ శాసనంలోని 290 సెక్షన్ ప్రకారం ఆంధ్రరాష్ట్రాన్ని సృష్టిస్తూ గవర్నర్ జనరల్ తయారుచేయవలసిన 'ఉత్తరువు' ముసాయిదా కూడా తయారైంది. ప్రత్యేక ఆంధ్రహైకోర్టు స్థాపనపై రాష్ట్రశాసన సభలు తీర్మానాలుకూడా చేసినవి. అయినా ఆంధ్రరాష్ట్రం రాలేదు. ఇక నూత్న రాజ్యాంగం ప్రకారమే ఆంధ్రరాష్ట్రనిర్మాణం జరగాలి. అయితే, అసలు రాష్ట్రనిర్మాణం అనేది ఉంటేగదా ఏ రాజ్యాంగం ప్రకారం అన్న ప్రశ్న. మనకు రాష్ట్రమూ లేదు; రాజ్యాంగమూ లేదు.

ఆంధ్రరాష్ట్రం ఏమైంది?—సోది అడిగి సమాధానం తెలుసుకోవలసిన పరిస్థితులు ఏర్పడ్డవి. అథవా అంతపని చేసినా అందువల్ల ప్రయోజనం ఏమైనా ఉంటుందా అనే అనుమానం కూడా బాధిస్తూనే ఉంది.

"ఆంధ్రరాష్ట్రసమస్య సజీవంగానే ఉన్నది" అని అఖిల భారత కాంగ్రెస్ కార్యదర్శి—రాష్ట్రం వచ్చిఉంటే మనకు ముఖ్యమంత్రి అయిఉండే శ్రీ కళా వెంకట్రావుగారు అన్నారు. మద్రాసు ప్రభుత్వం మళ్లా ఈసమస్యాపరిష్కారానికి తలపడేటట్లు చేయడానికి తాను పూనుకుంటున్నాననీ, తన పూనిక వెనుకటిమాదిరి కాకుండా ఉండేందుకు ఆంధ్రులు అంతా తనవెంట ఉన్నట్లు చెప్పాలనీ మొన్నీమధ్యనే విజయవాడలో ఉద్బోధించారు. ఎవరివెనుకనో ఒకరివెనుకనే ఉండడం ఆంధ్రులకు అలవాటు కొబట్టి వెంకట్రావుగారివెనుకనే ఉంటారు. అయితే వెంకట్రావుగారు ఆంధ్రు డవడం దీనికి ఒక ప్రతిబంధకం కావచ్చు. నలభైయేళ్లుగా "కాకిగోల" చేసినా రాష్ట్రం రాకపోవడానికి ఆంధ్రులకు ఆంధ్రులే నాయకత్వం వహించడమే కారణం. ఈ సత్యాన్ని ఋజువుచేయడానికి పెద్ద పరిశోధనలు అవసరంలేదు. నిన్నమొన్నటి విభజనసంఘం వ్యవహారాలనూ, వాటిపైన రాష్ట్రకాంగ్రెస్‌సంఘం సాగించిన చాణక్యాన్నీ ఒక్కసారి జ్ఞాపకం చేసుకుంటే విషయం బోధపడిపోతుంది.

రెండుమాసాల క్రిందట "ఆంధ్రరాష్ట్రనిర్మాణం విషయంలో ఒక్కరోజుకూడా విలంబన జరగదు" అని మన ప్రధానమంత్రి పండిట్ జవహర్లాల్ నెహ్రూ ప్రకటించారు. అప్పటికి ఆంధ్ర రాష్ట్రావతరణకు పెద్దలు పెట్టిన ముహూర్తం ఇంకా ఇరవైరోజులున్నది. లాంఛనల విషయంలో, ఇచ్చిపుచ్చుకోవడంలో రెండు పక్షాలవారికీ సమాధానం కుదిరితే, ఆ సమాధానాన్ని తక్షణం అమలుజరుపుతామని ప్రధానమంత్రి మనకు హామీ ఇచ్చారు. దాంతో అందరిదృష్టి విభజనసంఘకార్యకలాపాలపై పడింది. ఈ విభజనసంఘం ఎలా, ఎందుకు ఏర్పడిందీ, ఏమి చేసిందీ చూస్తే "ఆంధ్రరాష్ట్రసమస్య" చాలావరకు అర్థమవుతుంది. మన వర్తమాన రాజకీయాలుకూడా అకళింపుకు వస్తవి.

అన్నీ ఉండి అయిరోతనం ఒక్కటి తక్కువైనట్లు మనకు రాష్ట్రానికి కావాల్సిన అన్నిహంగులూ ఉండి వాటిని వినియోగించుకొని ఆశయసిద్ధికి కృషిచేయడానికి కావలసిన ఐక్యత ఒక్కటే లోపించింది. ఆ ఐక్యత ఏర్పడి, స్థిరపడితేగాని మనకు రాష్ట్రం రాదని మన నాయకులకూ తెలుసు. ఉపప్రధానమంత్రి సర్దార్ వల్లభాయిపటేల్ కూడా ఈ ఐక్యత కుదిరితేనే రాష్ట్రం ఏర్పడుతుందని పార్లమెంటులో ప్రకటించారు. ఈ ఐక్యత మనకూ, మన తమిళసోదరులకూ మధ్యనేగాక మనలో మన మధ్యకూడా ఏర్పడవలసి ఉందని సర్దార్ పటేల్ చెప్పారు. ఇది అసాధ్యం అని మన నాయకులు క్షణక్షణం ఋజువు చేస్తున్నారు.

విభజనసంఘం సంగతి విచారించడానికిముందు—అందుకు సంబంధించిన చరిత్రను పరిశీలించడానికిముందు వర్తమానాంధ్ర రాజకీయాలను స్థూలంగానే అయినా సమీక్షించడం అవసరం. కారణం వేరే యేమీ లేదు. విభజనసంఘకార్యక్రమంలో ఈ మన రాజకీయాలే అడుగడుగునా ప్రతిఫలించినవి.

ఆంధ్రులలో ఐకమత్యము లేదని ఇవాళ క్రొత్తగా ఋజువు చేయవలసిన అవసరం లేదు. ఈనాడు మనకు ఉన్న వారిలో అగ్ర

నాయకుడు అని మనం అనుకుంటున్న శ్రీ ప్రకాశంపంతులుగారే "ఆంధ్రులు అందరూ ఒక్క తాటిమీద నడవడం ప్రారంభించిన నాటంగాలకు రాష్ట్రం సిద్ధిస్తుంది"అని అన్నారు. అంటే రాష్ట్రం సిద్ధించకపోవడానికి ఆంధ్రులందరూ ఒక్క తాటిమీద నడవలేకపోవడము, నడవకపోవడమూ కారణమని స్పష్టమౌతున్నది. అఖిలభారతకాంగ్రెస్ కార్యదర్శి శ్రీ కళా వెంకట్రావుగారున్నూ ఇదేమాట చెప్పిఉన్నారు. మన నాయకులే ఈవిధంగా చెప్పినపుడు, నొప్పుకుంటున్నప్పుడు "భారతప్రభుత్వం బ్రిటిష్‌సామ్రాజ్య ప్రభుత్వవిధానాన్ని అనుసరిస్తున్నది"అని నిందించడంలో సబబు ఏమీ లేదు. "మీలో మీరు ఒక సమాధానానికి రండి, రాష్ట్రం ప్రసాదిస్తాం"అని అధిష్ఠానవర్గంవా రంటున్నందుకు మనం గింజుకో నవసరం లేదు.

1946-వ సంవత్సరంలో ప్రకాశంపంతులుగారు మనకు ప్రసాదించిన "ఏకతాటిపై నడక" నినాదమే వర్తమానఅనైక్యతకు హేతువైనది. ఆ నినాదమే కర్తవ్యంఅని అనుకోవలసిన నిస్సహాయస్థితి ఏర్పడింది. మాలో మాకు ఐక్యతలేదని చాటుకొని మన కంఠానికి తెచ్చుకోవడంవల్ల అది మనకు ఉరితాడైంది. కేంద్రప్రభుత్వానికి ఈ"తాడు" మహాసర్పంలాగా కన్పించి రాష్ట్రనిర్మాణాన్ని నిరవధికంగా వాయిదా వేయడానికికూడా కారణమైనది.

విభజనసంఘం ఏర్పడి ఆ సంఘనివేదిక వెల్లడి అయ్యేవరకూ కూడా మన నాయకులు అందరూ ఆంధ్రరాష్ట్రసత్వరనిర్మాణంలో కలిసికట్టుగానే వ్యవహరిస్తున్నారనీ, ఆవిధంగా అందరూ "ఒక్క తాటిమీదనే" నడుస్తున్నారనీ అందరూ అనుకున్నారు. ఇక నేముంది, కేంద్రప్రభుత్వం అన్నమాటకు నిలబడితే, 1950 జనవరి 26 లోపున ఆంధ్రరాష్ట్రం సిద్ధిస్తుంది అని ఆశపడ్డాం. మనకు ముఖ్యమంత్రి ఎవరు? అసలు మంత్రులు ఎంతమంది ఉంటారు? పార్లమెంటరీ కార్యదర్శులు ఉండాలా, అక్కర్లేదా? మన రాజధాని ఎక్కడ? హైకోర్టు ఎక్కడ? మన ప్రభుత్వానికి ప్రధాన కార్యదర్శి ఎవరు? ప్రస్తుతం ప్రమోషన్లులేక దిగువమెట్టులో ఉన్న ఆంధ్రులు ఎంతమంది పైమెట్టుకు రాగలుగుతారు? ఇవాళ రాష్ట్రం వస్తే మనకు వచ్చే లాభం ఏమిటి?— ఈ విషయాలను విచారించడానికీ, ఈ ప్రశ్నలకు సమాధానం తెలుసుకోవడానికీ ప్రయత్నం ప్రారంభించాం. మీ రీవిషయాలు ఆలోచించుకొని ఒక నిర్ణయానికి రమ్మని ఆంధ్రరాష్ట్రం కాస్తా చక్కాపోయింది. అప్పుడు అసలు సంగతి తెలిసింది. మన నాయకులు "ఒక్క తాడుమీదనే" నడుస్తున్నారు. కాని ఆ నడక ఒకరివెనక మరొకరుగాక ఒకరి కెదురుగా మరొకరు సాగించారు. తాడు మధ్య కొచ్చేసరికి ఎవరు తప్పుకోవాలన్న సమస్య వచ్చింది. ఎవ్వరూ తప్పుకోవడానికి సమ్మతించలేదు. దాంతో చేయి చిక్కిందని ఆశపడ్డ ఆంధ్రరాష్ట్రం పైకెగిరి పోయి మనకు గగనకుసుమమైంది!

రాష్ట్రం వస్తే ఎవరు ప్రధానమంత్రి కావాలి? ఏవూరు రాజధాని కావాలి? అన్న సమస్యలు రెండే విభజనసంఘకృషిని ఫలప్రదం కాకుండా చేసినవి. తమిళ్‌నాడులోవలెగాక మన తెలుగునాడులో కాంగ్రెస్ అధికారం ఒకరిచేతులో, ప్రభుత్వాధికారం మరొకరి చేతులో ఉంది. రాష్ట్రం వస్తే ఈ రెండూ ఒకరికే సంక్రమించాలని రెండుపక్షాలవారూ అనుకున్నారు. ఒక పక్షంవారు ఆఖరునిమిషం వరకూ అన్ని అధికారాలూ తమకే దక్కుతవని విశ్వసించారు. కాబట్టే, ఏమైనాసరే నూతన రాజ్యాంగం అమలు జరగడానికి ముందు ప్రత్యేకాంధ్రరాష్ట్రం ఏర్పడా లన్నారు. రెండో పక్షంవారు యథార్థం తెలిసినవారవడంవల్ల, వాస్తవికదృష్టి కలవారవడంవల్ల ప్రస్తుతం తమ కున్న అధికారం పోదని గ్రహించి అలాగే జనవరి 26 లోపున ఆంధ్రరాష్ట్రాన్ని సంపాదించడానికి ఎదుటిపక్షంవారితో చేతులు కలిపారు. కాబట్టే మనకు జనవరి 26 లోపున రాష్ట్రం రాగలదనే ఆశ కలిగింది. విభజనసంఘకార్యక్రమం ముగింపుదశకు వచ్చేసరికి ప్రకాశంపంతులుగారి పక్షంవారు ముందున్న 'పండగ'ను చూడగలిగారు. రాష్ట్రకాంగ్రెస్‌సంఘ పెత్తందార్లు కూడా ఈ 'ముప్పు'ను అప్పుడే గ్రహించగలిగారు. ప్రత్యేకాంధ్రరాష్ట్రం ఏర్పడ్డంవల్ల లేని ప్రభుత్వాధికారం రాకపోవడమే గాక, ఉన్న 'అనధికారఅధికారం' కూడా పోతుందని తెలుసుకున్నారు. రాష్ట్రం రాకపోవడమే నయం అనుకున్నారు. అందుకు విభజనసంఘనివేదికను ఉపయోగించుకుందా మనుకున్నారు. ప్రకాశంపంతులుగారు సుదీర్ఘమైన ఒక వ్యతిరేకాభిప్రాయనివేదికను విభజనసంఘానికి అందజేశారు. తన అభిప్రాయాలే సరియైనవని రాష్ట్రకాంగ్రెస్‌చేత అనిపించుకున్నారు. వెంటనే ఢిల్లీ పోయి అక్కడి నాయకులకు ఆంధ్రులకు అన్యాయం జరుగుతూ ఉందని చెప్పారు. అలాంటి అవకాశం కోసరం కనిపెట్టుకు కూర్చున్న నాయకులకు ఈ "ఆంధ్రులకు అన్యాయం జరుగుతూ ఉన్నది"అనే నినాదం బాగా అక్కరకు వచ్చింది. ఇది చాల దన్నట్లుగా, రాష్ట్రం వచ్చిపోతోంది అన్నట్లుగా, కొందరు రాయలసీమనాయకులు ఢిల్లీ రాయబారం వెళ్లారు. వీటన్నిటి ఫలితంగా జనవరి 24 వ తారీఖున కేంద్రప్రభుత్వం రాష్ట్రనిర్మాణాన్ని వాయిదా వేస్తూ ఒక ప్రకటన చేసింది. బాధ్యతఅంతా చెన్నరాష్ట్రప్రభుత్వానిదే అని తేల్చింది. అన్నివిషయాలమీదా నూటికి నూటయాభైపాళ్లు సమాధానం కుదిరితేనే తప్ప ఈవిషయంలో తాము చేయగల్గిందేమీ లేదని కేంద్రమంత్రివర్గంవారు స్పష్టం చేశారు. ఆ తరువాతనే సర్దార్ పటేల్ ఆంధ్రులలో ఆంధ్రులకూ, ఆంధ్రులకూ తమిళులకూ సంపూర్ణాంగీకారం కుదిరే వరకూ ఆంధ్రరాష్ట్రనిర్మాణం విషయంలో కేంద్రప్రభుత్వం ఏచర్యా తీసుకోదని ప్రకటించారు. ఆమాట విన్న తరువాత మన నాయకులు ఇక భయం లేదని సుఖంగా నిద్ర పోతున్నారు. ఇవన్నీ చూచే కొందరు ఆంధ్రరాష్ట్రసమస్య చచ్చి సమాధి అయిందని

అవమానం జరిగింది. మంత్రి డాక్టర్ రాజన్ గారు అంత్యక్రియలకు సన్నాహాలు చేయడం గురించి ప్రస్తావించారు.

ఇది మన వర్తమానరాజకీయస్థితి. ఇక మన రాష్ట్రసమస్య పరిష్కారం సందర్భంలో అధికారరీత్యా జరిగిన ప్రయత్నాలను పరిశీలిద్దాం.

1947 ఫిబ్రవరిమాసంలో రాజ్యాంగరచనాసంఘ అధ్యక్షుడు డాక్టర్ అంబేద్కర్ గారు ఆంధ్రరాష్ట్రం నూతన రాజ్యాంగం అమలుజరిగే సమయానికి అవతరించవలసి ఉంటే ఈలోపునే 1935 వ సంవత్సరపు భారతప్రభుత్వచట్టంలోని 290వ సెక్షను ప్రకారం రాష్ట్రం ఏర్పడాలనీ, కేవలం రాజ్యాంగముసాయిదాలోని రాష్ట్రాల జాబితాలో పేరు నమోదుచేసినందువలన ప్రయోజనం లేదనీ అన్నారు. కాబట్టి నూతన రాజ్యాంగం అమలు జరగడంతో ఆంధ్రరాష్ట్రంగాని, మరోరాష్ట్రంగాని ఏర్పడాలంటే, నూతన రాజ్యాంగాన్ని పరిషత్తు ఆమోదించడానికి పూర్వం ఏ యేరాష్ట్రాలను ప్రభుత్వం ఏ ప్రకారం ఏర్పాటుచేయదలచిందో విచారించి, తదనుగుణంగా చర్యలు తీసుకోవాలని ఆయన సలహా ఇచ్చారు. 1945 నవంబరులో ప్రధాన మంత్రి పండిట్ నెహ్రూ అధినివేశపార్లమెంటులో ప్రకటించిన విధంగా నూతన రాజ్యాంగంలోని రాష్ట్రాల జాబితాలో ఆంధ్రను చేర్చడానికి ఈవిధంగా వీల్లేకుండా పోయింది. తరువాత రాజ్యాంగపరిషత్తు అధ్యక్షుడు యస్. కె. ధార్ అధ్యక్షుడుగా ఈ భాషారాష్ట్రనిర్మాణసమస్యను పరిశీలించి, ఏయేభాషాప్రాంతాలను ప్రత్యేకరాష్ట్రాలుగా ఏర్పాటుచేయడానికి వీలుంటుందో విచారించి నివేదించడానికి ఒక కమిషనును ఏర్పాటుచేశారు. ఈ కమిషన్ వారు భాషారాష్ట్రములుగా ఏయేప్రాంతముల నిర్మాణం సాధ్యం అనే విషయాన్ని గాక అసలు భాషారాష్ట్రసిద్ధాంతంయొక్క మంచిచెడ్డలను విచారించి కాంగ్రెసుకు హితబోధ చేయడం తమ కర్తవ్యంగా పెట్టుకున్నారు. దేశం ఇప్పటికే రెండుగా విభాగమైందనీ, ఈ భాషా రాష్ట్రసిద్ధాంతాన్ని ప్రోత్సహిస్తే దేశం ముక్కలుముక్కలు అయిపోతుందనీ, కాబట్టి కాంగ్రెసువారు తమ పూర్వాభిప్రాయాలను మార్చుకొని ఈ భాషారాష్ట్రసిద్ధాంతాన్ని సమాధి చేయాలనీ హెచ్చరించారు. ఆదృష్టితోనే ఆంధ్రకేరళకర్నాటకమహారాష్ట్ర ప్రాంతాలను ప్రత్యేకరాష్ట్రాలుగా ఏర్పాటుచేయాలనే విషయాన్ని పరిశీలించి ప్రస్తుతపరిస్థితుల్లో అలాంటిది అసంభవమనీ, అవాంఛనీయమనీ తీర్పు ఇచ్చారు. తమ వాదాన్ని సమర్థించుకోవడానికి నూతన ఆంధ్రరాష్ట్రానికి ఏటా అరకోట్లరూపాయిల తరుగు ఉంటుందని ప్రకటించారు. ఇప్పుడు ఏకరాష్ట్రంగా ఉన్న చెన్న రాజధానిని మూడుభాషారాష్ట్రాలుగా విభజించడంవల్ల సిబ్బందికొరత ఏర్పడుతుందన్నారు. పనిలోపనిగా ఆంధ్రరాష్ట్రనిర్మాణానికి రాయలసీమవారు కొందరు ప్రతికూలంగా ఉన్నారని తమ నివేదికలో చేర్కొన్నారు.

ధార్ కమిషన్ నివేదికను అందరూ ఖండించారు. ఆంధ్రులు చాలాతీవ్రంగా నిరసించారు. నివేదిక వెలువడేముందు మన పట్టాభి సీతారామయ్యగారు కాంగ్రెస్ అధ్యక్షులైనారు. భాషారాష్ట్ర వాదాన్ని పోషించి, పెంచుకొన్న పట్టాభిగారు ఈ ధార్ కమిషన్ నివేదికపై తమ తీవ్రాభిప్రాయాలను వెల్లడించకుండా ఎలా ఉంటారు? దానిపైన కాంగ్రెస్ మహాసభ ఏచర్య తీసుకోకుండా ఎలా ఉంటుంది? తత్ఫలితంగా జయపూర్ కాంగ్రెస్ సమావేశంలో ధార్ కమిషన్ నివేదికను పునః పరిశీలించి భాషాప్రయుక్త రాష్ట్రనిర్మాణసాధ్యాసాధ్యాలను పరిశీలించి కార్యవర్గానికి నివేదించేందుకు మరొక నాయకత్రయసంఘం ఏర్పాటైంది. వీరు 1949 ఏప్రెల్లోగా తమ నివేదికను తయారుచేసి సమర్పించాలన్నారు. ఈ కమిటీనియామకంతో రాష్ట్రం విషయంలో తిరిగి ఆంధ్రులకు కొంచెం ఆశ కలిగింది.

ఈ కమిటీవారు నివేదికను తయారుచేసి గడువులోపలనే కాంగ్రెస్ కార్యవర్గానికి సమర్పించారు. ఆ నివేదికను నిష్కర్షగా, నిర్నిబంధంగా ఆంధ్రులు అంగీకరించలేదు. అందుకు తగిన కారణాలు లేకపోలేదు. ఆంధ్రులు తక్షణం రాష్ట్రాన్ని పొందగోరితే వారు చెన్నపట్నంపై తమ హక్కులను వదులుకోవాలన్నారు; రాష్ట్రసరిహద్దుల విషయంలో ఇరుగుపొరుగువారితో సమాధానం కుదుర్చుకోవాలన్నారు. ఇందుకు ఆంధ్రులు ఎవ్వరూ సిద్ధంగా లేరు. ముందు ఈ షరతుల అంతరార్థాన్ని ఆంధ్రనాయకులు పూర్తిగా అర్థం చేసుకోలేదు. ఆంధ్రులు చెన్నపట్నంపై హక్కులు వదులుకోవడమేమిటి అని హడావిడి చేశారు. కాని అసలు వదులుకొమ్మని నాయకత్రయనివేదిక సూచించిన హక్కులు ఏమిటో తెలుసుకోవడానికి ప్రయత్నించలేదు. "ఆంధ్రపత్రిక" ఈ విషయంమీద ఎన్నో ప్రధానవ్యాసాలు వ్రాసి అసలు విషయాన్ని బోధపరచినా ఎవ్వరూ గ్రహించే స్థితిలో లేరు. అలా గ్రహించడంవల్ల తమకు రాగల ప్రయోజనం ఏముందని వారి అభిప్రాయం కావచ్చు. "ఆంధ్రులు నగరముపై వదులుకోవలసిన హక్కులు అంటూ వేరే ఏమీలేవు. చెన్నపట్నంలో ఉంటున్న ఇతరవర్గాలవారికి ఏహక్కు లున్నవో ఆహక్కులు నగరంలోని ఆంధ్రులు అందరికీ ఉన్నవి. అయితే చెన్నపట్నం ఆంధ్రరాష్ట్ర అంతర్భాగం కావాలనే వాదాన్ని మాత్రం ఉపసంహరించుకోవాలి. నాయకత్రయనివేదిక విధించిన షరతు తాత్పర్యం ఇదే" అని ఆంధ్రపత్రిక అనుమానాలకు ఆస్కారం లేకుండా చెప్పింది. చెన్నపట్నాన్ని ప్రత్యేకరాష్ట్రంగా చేయాలనే ఆందోళనను విరమించవలసిన అవసరం లేదనికూడా ఆ సందర్భంలో స్పష్టం చేసింది. అయినా ఆంధ్రరాష్ట్రకాంగ్రెస్ సంఘంవారు నాయకత్రయనివేదికను అంగీకరించలేదు. తమిళకాంగ్రెస్ సంఘంమాత్రం గొప్ప రాజనీతిజ్ఞత ప్రదర్శించి నాయకత్రయనివేదికను ఆమోదించింది. చెన్నపట్నం తమిళపట్నమేననీ, ఏపరిస్థితుల్లోనూ ఆనగరాన్ని తమిళరాష్ట్రంనుండి వేరుచేయడానికి వీలులేదనీ ఆ సందర్భంలో తీర్మానించింది. ఆంధ్రరాష్ట్రకాంగ్రెస్ సంఘం

పూర్ణంగా నాయకత్రయ నివేదికను ఆమోదిస్తూ, నగరంపై హక్కులను వదులుకొమ్మని ఆంధ్రులకు సలహా ఇవ్వలేనని తీర్మానించింది. ఆవిధంగా తీర్మానంచేసిన మూడుమాసాలకే నగరంపై హక్కులు వదులుకున్నట్లే తీర్మానంచేయవలసివస్తుందని అప్పట్లో రాష్ట్ర కాంగ్రెస్ నాయకులు అనుకొనివుండరు. నవంబరు 11 వ తేదీ చేసిన తీర్మానాన్నే మొదట్లో చేసివుంటే మనకు రాష్ట్రం తప్పకుండా వచ్చివుండేది.

నాయకత్రయనివేదికపై అంతవరకూ వెలువడిన అభిప్రాయాలను పరిశీలించిన కాంగ్రెస్ కార్యవర్గం ఈ కాంగ్రెస్ సంఘాల తీర్మానాలనుబట్టి ఒక నిర్ణయానికి రాలేక నివేదికపై తమ ఖచ్చితమైన అభిప్రాయాలను నవంబరు 15 లోపున తెలుపవలసిందని ఆంధ్ర, తమిళ కాంగ్రెస్ సంఘాలనూ, చెన్నరాష్ట్రప్రభుత్వాన్నీ కోరుతూ అక్టోబరులో ఒక తీర్మానం చేసింది.

తమిళనాడుకాంగ్రెస్ సంఘం వెనుకటితీర్మానాన్నే పునరుద్ఘాటిస్తూ నాయకత్రయసంఘసూచనలను అంగీకరిస్తూ నిర్వివాదమైన ఆంధ్రజిల్లాలతో వెంటనే రాష్ట్రాన్ని ఏర్పాటుచేయవలసిందని కోరుతూ తీర్మానంచేసింది.

చెన్నరాష్ట్రప్రభుత్వంకూడా నాయకత్రయనివేదికప్రకారం ఆంధ్రరాష్ట్రనిర్మాణం జరగడానికి తమకు ఏమాత్రం అభ్యంతరం లేదని కాంగ్రెస్ కార్యవర్గానికి తెలిపింది.

ఆంధ్రరాష్ట్రకాంగ్రెస్ సంఘం ఆఖరునిమిషంలో సమావేశమై 'మే' తీర్మానాన్ని, అటుతరువాత ఆంధ్రప్రజాపరిషత్తు చేసిన తీర్మానాన్ని సవరించి నాయకత్రయనివేదికను నిస్సందేహంగా ఆమోదిస్తూ తీర్మానంచేసింది. అందులోనూ చెన్నపట్నంవిషయంలో, ఆంధ్రరాజధానివిషయంలో అప్పట్లో అవసరం లేని అంశాలను వివరిస్తూ ఒక అనుబంధతీర్మానం చేసింది.

కాంగ్రెస్ కార్యవర్గం అన్నీ విచారించి, ఆంధ్రరాష్ట్రనిర్మాణంతో సంబంధంఉన్న మూడుపక్షాలూ నాయకత్రయనివేదికను ఆమోదించినట్లుగానే భావించి నూతనరాజ్యాంగంలోని రాష్ట్రముల జాబితాలో ఆంధ్రను చేర్చేందుకు అవసరమైన చర్యలను తీసుకోవలసిందిగా కేంద్రప్రభుత్వాన్ని కోరుతూ నవంబరు 16 వ తీర్మానించింది. ఆ తీర్మానంలో రాష్ట్రపరిహద్దుల నిర్ణయసంఘంప్రసక్తికూడా ఉంది. వీటన్నింటినిబట్టీ, రెండేళ్ల క్రితం రాజ్యాంగరచనాసంఘఅధ్యక్షుడు చేసిన వివరణనుబట్టీ 1950 జనవరి 26 వ ఆంధ్రరాష్ట్రం నూతనరాజ్యాంగం అమలుకావడంతోబాటు అవతరించగలదని ఆంధ్రులు అందరూ ఆశించారు. రాష్ట్రంలో ప్రబలిన స్పర్థలను, వాటి ఫలితాలను కళ్లారా చూచినవారు రాష్ట్రం వచ్చేస్తున్నదని భయపడడంకూడా జరిగింది.

కాంగ్రెస్ కార్యవర్గతీర్మానంపై కేంద్రప్రభుత్వం వెంటనే ఒక నిర్ణయానికి రావడంకూడా జరిగింది. నాయకత్రయనివేదికను కేంద్రప్రభుత్వం అంగీకరించేననీ, ఆప్రకారం ఏ భూప్రాంతము నాయకత్రయనివేదికవరకులకు తృప్తికరిస్తే ఆ ప్రాంతాన్ని ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పాటుచేయడానికి కేంద్రప్రభుత్వం సిద్ధంగా ఉన్నదనీ ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ స్పష్టంచేశారు. కాబట్టే కాంగ్రెస్ కార్యవర్గతీర్మానంప్రకారం కేంద్రప్రభుత్వహోంశాఖ వారు నవంబరు 26 న మద్రాసుప్రభుత్వానికి లేఖ వ్రాశారు. ఆ లేఖలో హోంశాఖాకార్యదర్శి ఆంధ్రరాష్ట్రనిర్మాణానికి ముందు పరిష్కారం కావలసిన 'అనేక' సమస్యలను చేర్కొన్నారు. కాంగ్రెస్ కార్యవర్గం నవంబరు 16 వ తేదీ చేసిన తీర్మానాన్ని ఉల్లేఖించి, ఆప్రకారం నూతన రాజ్యాంగం అమలు జరిగేలోపున రాష్ట్రం ఏర్పడాలంటే నూతనరాష్ట్రసరిహద్దులు నిష్కర్షగా, తిరిగి వివాదాలకు ఆస్కారం లేనివిధంగా పరిష్కారం కావలసివుంటుందనీ, నూతనరాష్ట్రం ఆర్థికంగా స్వయంపోషకంగా ఉంటుందని ఋజువుకావాలనీ, చెన్నపట్నానికి సంబంధించిన అన్ని సమస్యలూ పరిష్కారం కావాలనీ, రాష్ట్రంలో తీవ్రంగా ఉన్న కమ్యూనిస్టు ముప్పును దృష్టిలో ఉంచుకొని నూతనరాష్ట్రరాజధానీస్థలనిర్ణయం జరగాలనీ—ఈవిధంగా సవాలక్షప్రశ్నలను, సమస్యలను హోంశాఖాకార్యదర్శి ఆలేఖలో చేర్కొన్నారు. ఆంధ్రరాష్ట్రం ఎప్పుడు ఏర్పడినా ఈసమస్యలన్నీ పరిష్కారంకావాలనీ, కాబట్టి వీటినన్నిటినీ ముందే పరిష్కరించుకోవడం మేలనీ ఆయన సలహా ఇచ్చారు. ఈ సమస్యలను పరిశీలించి పరిష్కారమార్గాలను సూచించేందుకు ఒక విభజనసంఘాన్ని ఏర్పాటుచేయవలసిందిగా రాష్ట్రప్రభుత్వానికి సూచించారు. నూతనరాష్ట్రం జనవరి 26 న గాక ఏప్రెల్ 1 వ తేదీన ఏర్పాటు కావడం అందరికీ ఉనువుగా ఉంటుందనీ, అదే కేంద్రప్రభుత్వఅభిమతమైనట్లూ హోంశాఖాకార్యదర్శి ప్రకటించారు.

ఈలేఖాంశాలను, ఈలేఖకు చెన్నరాష్ట్రప్రభుత్వం పంపిన సమాధానవివరాలను చూచినప్పుడే జనవరి 26 లోపున ఆంధ్రరాష్ట్రం రాదని స్పష్టమైంది. 1950 జనవరి 26 లోపునైతే విభజనకు సంబంధించిన కార్యక్రమాన్నంతటినీ పూర్తిచేయడం సాధ్యంగాదని చెన్నరాష్ట్రప్రభుత్వం స్పష్టంచేసింది. ఏప్రెల్ కైతే కొంతవరకు ప్రయత్నించవచ్చునన్నట్లు సూచించింది. కేంద్రప్రభుత్వంవారు ఈ పాయింటును పట్టుకొని ఏప్రెల్ 1 కైతేనే వీలనీ, ఆప్రకారంగానే కేంద్రప్రభుత్వం పనిచేస్తున్నదనీ డిసెంబరు 12 న హోంశాఖాకార్యదర్శి చెన్నరాష్ట్రప్రభుత్వానికి వ్రాశారు.

ఈప్రకారంఅయినా మనకు మరోపదిరోజుల్లో రాష్ట్రం రావలసింది. అయితే వచ్చే కళలు ఎక్కడా కనిపించడంలేదు. ఆంధ్రనాయకులలో అనైక్యత రోజురోజుకూ ఎక్కువైపోతున్నది. నిజంగా దేశోద్ధారక నాగేశ్వరరావుపంతులుగారివంటి నాయకుడు ఒక్కడు ఈసమయంలో లేకపోవడం మన దురదృష్టమే!

నవంబరు 26 వ తేదీన హోంశాఖ వ్రాసిన లేఖమేరకు చెన్నరాష్ట్రమంత్రివర్గం ఒక విభజనసంఘాన్ని నియమించింది. ఆ

సంఘంలో ఆంధ్రులతరఫున శ్రీయుతులు ప్రకాశం పంతులు, కళా వెంకట్రావు, బెజవాడ గోపాలరెడ్డి, నీలం సంజీవరెడ్డిగార్లూ, ఆంధ్రేతరులతరఫున శ్రీయుతులు పి. యస్. కుమారస్వామిరాజా, యం. భక్తవత్సలం, టి. టి. కృష్ణమాచారి, కె. మాధవమీనన్ గార్లూ సభ్యులు.

ఈసంఘం డిసెంబరు మొదట్లో కుమారస్వామిరాజాగారి అధ్యక్షతక్రింద సమావేశమై 'నవంబరు 26 వ తేదీ లేఖా'ంశాలను మూలంగా పరిశీలించి జనవరి 26 వ రాష్ట్రనిర్మాణానికి వీలుగా విభజనకార్యక్రమాన్నంతా పూర్తిచేయవచ్చుననీ, ఆస్తిపాస్తుల విభజన విషయంలో ఖచ్చితంగా ఆఖరుపైసావరకూ పరిష్కారంకావడం ఎప్పటికీ సాధ్యంగాదనీ, సిద్ధాంతాలను నిర్ధారణచేస్తే ఆప్రకారం ఆస్తి అప్పుల విభజన జరుగవచ్చునీ తీర్మానించింది. అయితే అంతకు పూర్వమే చెన్నరాష్ట్రమంత్రివర్గం జనవరి 26 లోపున రాష్ట్రవిభజనకలాపం పూర్తిగాదని తీర్మానించి, ఆతీర్మానాన్ని కేంద్రప్రభుత్వానికి తెలియజేసింది. విభజనసంఘంలో ప్రధానితోసహా అయిదుగురు మంత్రులున్నా ఆసంఘం జనవరి 26 లోపున వీటి న్నింటినీ పరిష్కారంచేయడం సాధ్యమని తీర్మానించింది! రాష్ట్రప్రభుత్వం ఈతీర్మానంమీద తన అభిప్రాయం తెలపకుండా విభజనసంఘతీర్మానాల సారాంశాన్ని కేంద్రప్రభుత్వానికి అందజేసింది. కేంద్రప్రభుత్వం విభజనసంఘతీర్మానాన్ని లక్ష్యంచేయలేదు. ఈ సంఘంవారు విషయప్రాధాన్యాన్ని అర్థంచేసుకోక తొందరపాటును ప్రదర్శిస్తున్నారనీ, జనవరి 26 లోపున, ఆనాటికి రాష్ట్రనిర్మాణం సాధ్యంగాదనే చెన్నరాష్ట్రప్రభుత్వాభిప్రాయమే సరియైందనీ హోంశాఖా కార్యదర్శి డిసెంబరు 12 వ తిరిగి లేఖ వ్రాశారు.

ఆలేఖప్రకారం విభజనసంఘం అన్నివిషయాలపైనా సంపూర్ణమైన ఏకాభిప్రాయాన్ని సాధించాల్సిఉంది. అందులో ముఖ్యమైన విషయాలు నాలుగైదుమాత్రమే ఉన్నవి.

ఆస్తి, అప్పుల విభజన మళ్లీ పేచీకి ఆస్కారంలేకుండా స్థిరంగా పరిష్కారం కావాలి.

సరిహద్దులను సంబంధించినంతవరకూ, అవసరమైతే ఒక సరిహద్దునిర్ణాయకసంఘాన్ని నియమించిఅయినాసరే మళ్లీమళ్లీ మార్పులకు అవకాశం, అవసరం లేనట్లు నిర్ధారణకావాలి. ఈసందర్భంలో బళ్లారిజిల్లా, రాయలసీమలోని మరికొన్ని జిల్లాల విషయంలో కర్నాటకులు సాగిస్తున్న ఆందోళనను గమనించవలసిఉంటుంది.

ఆంధ్రరాష్ట్రరాజధాని ఆరాష్ట్రంలోనే ఉంచటం ఉచితం. ఆంధ్రజిల్లాలు కొన్నింట్లో కమ్యూనిస్టుఅల్లరులు విపరీతంగా ఉన్నవి. వాటిని గమనించి మరీ రాజధానీస్థలనిర్ణయం చేసుకోవలసివుంటుంది.

ఆంధ్రరాష్ట్రరాజధాని సమస్య కొంతకాలం—అన్నిహంగులతో ఆంధ్రరాజధాని ఏర్పడేవరకూ—చెన్నపట్నంలోనే ఉండాలనే ఆంధ్రుల కోరికను తమిళనాయకులు మన్నించేటట్లు కన్పించడం లేదు. కొందరు తమిళనాయకులు కేంద్రమంత్రులవద్దకు రాయబారం వెళ్లి ఏపరిస్థితుల్లోనూ, ఒకక్షణంఅయినా ఆంధ్రరాజధాని చెన్నపట్నంలో ఉంచేందుకు వీలుగాదని చెప్పారు. ఆంధ్రనాయకులు ఈ సంగతిని గ్రహించి ఈపాటికి తమిళరాష్ట్రరాజధానివిషయమై ఒక నిర్ణయానికి వచ్చేఉంటారు.

నూత్నరాష్ట్రఆర్థికస్థితి అన్నింటికన్నా ముఖ్యమైనది. కేంద్రప్రభుత్వం ఈ క్రొత్తరాష్ట్రానికి ఇంతలో ఎంతమాత్రం ఆర్థికసహాయం చేయగలిగేటట్లు కనిపించదు. నూత్నరాష్ట్రం పూర్తిగా స్వశక్తిపైనే ఆధారపడవలసిఉంటుంది. ధార్ కమిషన్ అంచనాలనుబట్టి ఈఆంధ్రరాష్ట్రానికి దాదాపు ఆరకోట్ల రూపాయలు ఏటా తరుగుఉంటుందని తేలింది. కాబట్టి భవిష్యదాంధ్ర రాష్ట్రఆర్థికస్థితిస్వరూపం నిర్దుష్టంగా తేలడం చాలా ముఖ్యం.

ఈసమస్యలన్నింటిపైనా ఏకగ్రీవాభిప్రాయం కుదరడం అత్యంతావశ్యకం. ఏదైనా ఒక విషయంపైన సమాధానం కుదరని పక్షంలో వాటిని కేంద్రప్రభుత్వానికి నివేదించవలెను.

హోంశాఖా కార్యదర్శి నవంబరు 26 నా, డిసెంబరు 12 నా రాష్ట్రప్రభుత్వానికి వ్రాసిన లేఖల్లో పేర్కొన్న ఈ ప్రధానవిషయాలన్నింటినీ విభజనసంఘం డిసెంబరు 20 నుంచి జనవరి 2 వ తేదీవరకూ ఆమూలాగ్రంగా చర్చించి ఒక నివేదికను తయారుచేసింది. ఆ నివేదికను రాష్ట్రప్రభుత్వం అంగీకరించింది. జనవరి 26 వ ఆంధ్రరాష్ట్రావతరణకు వీలుగా విభజనవ్యవహారాన్ని పూర్తిచేయడం సాధ్యం గాదని అభిప్రాయపడిన రాష్ట్రమంత్రివర్గం సమంతా పూర్తిచేసి, రాష్ట్రనిర్మాణం తక్షణం జరగాలనీ, ఇంతపనిచేసిన తరువాత రాష్ట్రవిభజన వాయిదాపడితే పరిపాలనాయంత్రం దెబ్బతింటుందనీ కేంద్రప్రభుత్వాన్ని హెచ్చరించింది. అయినా కేంద్రప్రభుత్వం పూర్వనిర్ణయాన్ని మార్చుకునేకోరికే ఏమీ కనిపించలేదు. కొలంబోలో జరిగే కామన్వెల్తుసభకు వెళ్తూ భారత ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ క్షణంసేపు మద్రాసులో ఆగి జనవరి 26 లోపున ఆంధ్రరాష్ట్రనిర్మాణం సాధ్యం కాదేమో అన్నారు. విభజనసంఘంలో ప్రకాశం గారు భిన్నాభిప్రాయాన్ని ప్రకటించడం, రాష్ట్రకాంగ్రెస్ సంఘం ఆ భిన్నాభిప్రాయాన్ని ఆమోదించడంవల్ల నాయకత్రయనివేదికలో ప్రధానమైన షరతు ("అన్నివిషయాల్లోనూ అందరిమధ్యా సంపూర్ణమైన ఏకాభిప్రాయం ఉండాలి") సఫలం కాలేదనీ, ఆకారణంగా ఈసమస్యలన్నింటిని పునః విచారించినమీదటగాని ఏమీ చేయడం సాధ్యం గాదనీ పండిట్ నెహ్రూ ఆసందర్భంలో స్పష్టంచేశారు. ఏమైనా కాస్త అనుమానం ఉండిఉంటే, నెహ్రూ స్పష్టీకరణవల్ల అదికాస్తా పోయి 1950 జనవరి 26 లోపున ఆంధ్రరాష్ట్రం రాదని తేలిపోయింది. అయినా శ్రీ కళా వెంకట్రావుప్రభృతులు జనవరి

26 లోపున రాష్ట్రావతరణ సాధ్యమే గాక తథ్యం అనికూడా చెప్పుతూ వచ్చారు. 'ఇది కేవలం భ్రాంతి' అని ఎప్పటికప్పుడు హెచ్చరిస్తూవచ్చిన 'ఆంధ్రపత్రిక'ను ఉత్సాహభరితులైన ఆంధ్రులు అపార్థంచేసుకోవడంకూడా జరిగింది.

ఇదంతా జరిగి ఇప్పటికి రెండుమాసాలైంది కాబట్టి ఇప్పుడు వెనక్కు తిరిగిచూచుకుంటే, ప్రకాశంగారి భిన్నాభిప్రాయప్రకటనా, దానిపై రాష్ట్రకాంగ్రెస్ తీర్మానమూ ఇవే ఆంధ్రరాష్ట్రావతరణకు ఆటంకాలైనట్లు తెలిసిపోతుంది.

విభజనసంఘం వీలైనంతలో అన్నివిషయాలపైనా ఏకాభిప్రాయాన్ని సాధించడానికే ప్రయత్నించింది. ప్రకాశంపంతులుగారికీ, మిగతా ఏడుగురుసభ్యులకూ, అభిప్రాయభేదాలు ఏర్పడింది ఆస్తిపాస్తుల పంపకంవిషయంలోనూ తాత్కాలికరాజధానివిషయంలోనూ, చెన్నానగరంలోని ప్రభుత్వఆస్తికిపరిహారంవిషయంలోనూ మాత్రమే. సిబ్బందిపంపకంవిషయంలో విభేదాలు ఏర్పడినా కొంత వరకు రాజీమార్గంగా పరిష్కారమైంది. అయితే చివరికి ఆవిషయంలోనూ ప్రకాశంగారూ, సర్ యస్. వి. రామమూర్తిప్రభృతులూ కేంద్రప్రభుత్వానికి వేరొక విజ్ఞాపన సమర్పించారు.

ఆస్తి, అప్పులకు సంబంధించి, ప్రకాశంపంతులుగారు ఆంధ్రలో విద్యుచ్ఛక్తిప్రాజెక్టులు ఇంతవరకూ అలక్ష్యం చేయబడినవి కనుక, ఆ ప్రాజెక్టుల నిర్మాణంకోసం ఆంధ్రేతరఆస్తినుండి దాదాపు 20 కోట్లు ఆంధ్రరాష్ట్రానికి ఇచ్చుకోవాలన్నారు. అదేవిధంగా ఆంధ్రరాజధానీనిర్మాణానికి చెన్నపట్నంలోని ప్రభుత్వఆస్తులక్రింద ఇవ్వవలసినపరిహారం ఒక్క కోటిరూపాయలూ చాలదనీ, ఆ పంపకం అక్రమంగా జరిగిందనీ అన్నారు. రాష్ట్రతాత్కాలికరాజధాని చెన్నపట్నంలోనే ఉండితీరాలన్నారు. రాష్ట్రఆర్థికస్థోమతు గురించి వీరు తమ నివేదికలో నూత్నరాష్ట్రానికి తరుగు ఏమాత్రం ఉండదనీ, కొద్దో గొప్పో కేంద్రప్రభుత్వం ఇచ్చే ఆహారసబ్సిడీలను కూడా లెఖ్ఖలోకి తీసుకుంటే, మిగులే ఉంటుందనీ చెప్పారు. విభజనసంఘంవారుమాత్రం నూత్నరాష్ట్రంలోటు ఒక కోటిరూపాయల ప్రాంతంలోనే ఉంటుందనీ, దాన్ని తేలిగ్గానే భర్తీచేయవచ్చుననీ చెప్పారు.

ఈవిధంగా విభజనసంఘంలో అభిప్రాయభేదాలు ఏర్పడ్డవి. అయితే ఇది అభిప్రాయభేదంగా పరిగణింపరాదనీ, ఆంధ్రుల్లో మగ్గురు ఒక అభిప్రాయానికి రాగా ఒకరు ఏకీభవింపకపోయినా, అది ఆంధ్రపక్షఅభిప్రాయంగానే ఎంచాలనీ ఆప్రకారం విభజనసంఘంలోని ఆంధ్ర, ఆంధ్రేతరపక్షాలకు ఏకాభిప్రాయం కుదిరినట్లేననీ విభజనసంఘంవారు వాదించారు. కేంద్రప్రభుత్వం ఈవాదనను అంగీకరించలేదు. కాబట్టే సర్దార్ పటేల్ ఆంధ్ర-తమిళపక్షాలకే గాక, ఆంధ్రులలో ఆంధ్రులకు ఏకాభిప్రాయం కుదరాలనీ, అప్పుడే అది ఏకగ్రీవనిర్ణయం కాగలదనీ, ఆ నిర్ణయాన్నే తాము అమలుజరపగలమనీ చెప్పారు.

విభజనసంఘంలో ఈదృష్ట్యా భేదాభిప్రాయాలు ఏర్పడిన మాట వాస్తవమే. అలాంటప్పుడు సమాధానం కుదరని విషయాలను కేంద్రప్రభుత్వం హోంశాఖకార్యదర్శిలేఖల్లో సూచించినప్రకారం మధ్యవర్తిపరిష్కారానికి నివేదింపవలసివుండెను. అలా చేయవలసిందనే ప్రకాశంప్రభృతులూ, రాష్ట్రకాంగ్రెస్ సంఘమూ కోరియుండెను. తుంగభద్రాప్రాజెక్టునిర్మాణంవిషయంలో ఉత్పన్నమైన సమస్య ఏనాటికైనా మధ్యవర్తిద్వారానే పరిష్కారం కావాల్సిఉంది. అయితే కేంద్రప్రభుత్వం రాష్ట్రనిర్మాణానికి అంత సుముఖంగా లేనందువల్ల మధ్యవర్తిపరిష్కారబాధ్యతను వహింపదలచలేదు. ఏదోవిధంగా ఆంధ్రరాష్ట్రనిర్మాణాన్ని వాయిదా వేస్తే కర్నాటకులు, మహారాష్ట్రులూ ఆందోళనకు అవకాశం లేకుండా చేయవచ్చునని కేంద్రప్రభుత్వం భావించిఉండవచ్చు. అందుకు ప్రకాశంగారి భిన్నాభిప్రాయం, రాష్ట్రకాంగ్రెస్ తీర్మానం, రాయలసీమమహాసభరాయబారాలూ కేంద్రప్రభుత్వానికి బాగా ఉపయోగపడ్డవి. తమ బాధ్యతను వదులుకొని, ఈసమస్యలను పరిష్కరించవలసింది రాష్ట్రప్రభుత్వమే అని చెప్పి చేతులు కడుక్కున్నది. తాము చేయగలిగింది లేదని మద్రాసుప్రభుత్వఆర్థికమంత్రి ఈ సమస్యను బుట్టదాఖలుచేశారు.

నిన్న మొన్నటివరకూ ఆంధ్రరాష్ట్రనిర్మాణంవిషయంలో ఆంధ్రులకంటే ఎక్కువ తొందరపాటును ప్రదర్శించిన తమిళ నాయకులు ప్రస్తుతం నిమ్మకునీరెత్తినట్లు కూర్చున్నారు. ఆంధ్ర నాయకులు తమ తమ బలాబలాలను పరీక్షించుకొనుటలో నిమగ్నులైనారు. కాబట్టే ఆంధ్రప్రాంతానికి ప్రత్యేకన్యాయస్థానం ఏర్పాటుచేయవలసినదిగా 'గవర్నర్ జనరల్'ను కోరమని రాష్ట్ర గవర్నర్‌ను 'ప్రార్థిస్తూ' రాష్ట్రఅసెంబ్లీ, కౌన్సిళ్లు తీర్మానంచేసినా, ప్రభుత్వయంత్రవిభజనకు అన్నిఏర్పాట్లూ జరిగినా ఆంధ్రరాష్ట్ర నిర్మాణం వాయిదాపడినది. ఇంతలో కాదుగదా ఏనాటికైనా ఆంధ్రరాష్ట్రం రాకతప్పదనే ఆశకూడా అడుగంటిపోతున్నది. సర్దార్ వల్లభాయిపటేల్ పార్లమెంటులో చేసిన ప్రకటననుబట్టి కేంద్రప్రభుత్వం అసలు భాషారాష్ట్రసిద్ధాంతానికే స్వస్తిచెప్పేటట్లు కనిపిస్తున్నది. భాషారాష్ట్రనిర్మాణానికి కేంద్రప్రభుత్వం కట్టుబడి ఉన్నదా అన్న ప్రశ్నకు కేంద్రప్రభుత్వం దేనికీ బద్ధమైలేదని సర్దార్ పటేల్ ఖండితంగా బదులు చెప్పినతరువాత ఆంధ్రులు రాష్ట్రసిద్ధికి కేంద్రప్రభుత్వంపై ఆశలుపెట్టుకొని ఏమీ ప్రయోజనం లేదు. నిర్వివాద ప్రాంతాలతో ఆంధ్రరాష్ట్రనిర్మాణం సాధ్యమని నాయకత్రయ సంఘం అభిప్రాయపడినతరువాత ఆప్రకారమే ఉత్తర, దక్షిణవిశాఖ, తూర్పు, పశ్చిమగోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, చిత్తూరు, కడప, కర్నూలు, అనంతపురంజిల్లాలతోనూ, బళ్లారిజిల్లాలో కొల్కూర్

తీర్పుప్రకారం ఆంధ్రప్రాంతంగా చేరిన ఆలూరు, రాయదుర్గం, అదోనితాలూకాలతోనూ ఆంధ్రరాష్ట్రాన్ని ఏర్పాటు చేయమని రాష్ట్రకాంగ్రెస్‌సంఘం తీర్మానించినతరువాత కూడా కేంద్రప్రభుత్వం రాష్ట్రనిర్మాణాన్ని వాయిదా వేయడం న్యాయంగా లేదు. బళ్లారినగరంవిషయంలో పేచీ ఉన్నా, చెన్ననగరంవిషయంలో వివాదా లున్నా ఆంధ్రులు సత్వరరాష్ట్రనిర్మాణానికి వీలుగా ఆ రెంటినీ వదులుకున్నారు. అయినా కర్నాటకులు బళ్ళారిజిల్లాప్రాంతాలనుగురించి పేచీపెట్టున్నారని కేంద్రప్రభుత్వం అపరిహార్యసమస్యను ఒక బ్రహ్మాండమైన సమస్యగా ప్రకటించింది. ఈప్రకారం రాష్ట్రనిర్మాణం వాయిదాపడుతున్నకొద్దీ ఇవాళ స్వల్పసమస్యలుగా ఉన్నవి బృహత్సమస్యలుగా పరిణమించగలవు. రాష్ట్రముఖ్యమంత్రి శ్రీ కుమారస్వామిరాజాగారు ప్రకటించినట్లు ఏ అల్పవిషయంపైనా నూటికి నూరుపాళ్లు ఏకాభిప్రాయం సాధ్యం కాదు. ఎంత ఎక్కువ సమాధానం కుదిరిందా అన్నదే ఏ సమస్యాపరిష్కారానికైనా విచారణీయాంశం. ఆ దృష్ట్యా ఆంధ్రరాష్ట్రనిర్మాణానికి యథార్థమైన అవరోధాలు ఏమీ లేవు.

చెన్నపట్నమే ఆంధ్రరాష్ట్రానికి రాజధాని కావాలని వాదించేవారందరూ ఆంధ్రలో ఏ నగరం ఆంధ్రరాజధాని కావాలి అనే విషయాన్ని తేల్చుకోలేనివారే. శ్రీబాగుఒడంబడికను సాకుగా తీసుకొని ఆంధ్రనాయకులు అసలు రాజధానీస్థలనిర్ణయసమస్యను మరింత క్లిష్టంచేసి అప్పటికే ఎక్కువగా ఉంటున్న అనైక్యతను ఇంకా ఎక్కువచేశారు. ఏదో ఒకనగరంవిషయంలో ఖచ్చితమైన అభిప్రాయానికి రాజాలక రాజధానిసమస్యను గొడవంత చేసిన మన నాయకులు రాష్ట్రాన్ని ఎలా సంపాదించగలుగుతారు ?

ఇక విద్యుచ్ఛక్తి, తదితరప్రాజెక్టుల విషయంలో రాష్ట్రనిర్మాణం వాయిదాపడ్డందువల్ల ఇంతవరకూ జరుగుతూఉన్న అన్యాయమే ఇకముందూ జరుగుతూ ఉంటుంది. ప్రకాశంపంతులుగారి భిన్నాభిప్రాయప్రకటనవలన ఇకముందు పరిస్థితులు ఆంధ్రులకు అనుకూలంగా మార్పుచెందవు.

ఇవాళ మన ఆంధ్రకాంగ్రెస్‌లో ఎన్నిపక్షాలు, ఎన్ని ముఠాలు ఉన్నవో చెప్పలేము. ఆంధ్రరాష్ట్రం యావన్మందికీ సంబంధించింది. కాంగ్రెస్‌వారూ కాంగ్రెసేతరులూకూడా కలసి పని చేయవలసిన విషయం ఇది. కాని అది ఈ పురుషాంతరంలో అసంభవం లాగా కనిపిస్తున్నది. 'విరోధి'లో ఏర్పడిన విరోధాలు ఇంకా పెరిగి వికృతమయ్యే అవకాశాలే ఎక్కువగా ఉన్నవి. ఇక ఆంధ్రులు రాష్ట్రాన్ని వదిలి సుఖంగా నిద్రించవచ్చు. మళ్లీ లేపేవారూ ఉండరు!

---

# కళాతపస్వి

★

శ్రీ మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రి

నిసువుల బోసిన వ్వాలయ నేడు ప్రభాతము వచ్చి యంతలో
ముసిముసినవ్వు నవ్వుకొని ముద్దియకో ! చిరునవ్వు వెల్గులన్
విసరదొడంగె నొక్కమెయి, వేగిరమే కొనితెమ్ము పాత్ర యూ
నిసి యను మాటనే మరచి నీవును నే సుఖముంద మిందులన్.

పగడపు జాయకన్న నికశై నొక చాయ గలట్టి నీదు నె
మ్మొగమున నిక్కువంబయిన ముత్యముకన్నను గూడ నెంతొ సొం
పుగ నటియించెడిన్ కెమరు ముత్తియ మాటను కేసి కృత్రిమం
బగునది కేవలమ్మునకు సత్యధికమ్ము మనోజ్ఞ మయ్యెడిన్.

బంధము పోక ప్రాణి కెగబ్రాకగ నేర్పడి యున్నయట్లు యా
నందపు టంచు జేరుకొన నాకొక సాధన మయ్యెగాని నీ
యందము, గమ్య మెంత చనినప్పటికిన్ గడముట్ట దయ్యె, నీ
బొందికి దాని నందుకొను పున్నియ మున్నదొ లేదొ నెచ్చెలీ.

నవనవలాడు నీ విలసనం బను పూబొదరింటిలోపలన్
నివసనమున్నయట్టి నను నీకడగంటను దాగియుండి వ
స్తు వెదియొ మాటిమాటికిని దొంగవిధమ్మున తొంగిచూచు జూ
తువ వెదియేని యల్ల గజదొంగను బట్టు నుపాయ ముండినన్.

హాయిగ వీచు గాలి కెదు రాడుచు దీయని కూనిరాగముల్
దీయుచు, లేయలల్ పయికి లేచుచు, వెన్నెల కౌగిలింపగా
బ్రేయసి గాలికిన్ విడిచిపెట్టిన నావపయిన్ విహారమున్
జేయుదమా సరోజలము జీల్చుచు నీవును నేను వేడుకన్?

సడలగ నేల నా జవము, సత్వము నాటికి నాటి కిట్టులన్?
వడిలి శరీర మెల్ల ముడివడ్డయి పోవగ నేల? యాత్మ మె
య్యెడకొ ఇకొక్క దిక్కునకు దృష్టిమరల్పగబోలు లేక యు
న్నెడ దనురూపబుద్ధులకు వృద్ధివిఘాత మిటుల కల్గెడిన్?

ఒడలికెగాని వార్ధక, మహో యిది యేమిటొ వెన్క వెన్కకున్
నడచి క్రమక్రమమ్ముగను నా మన సెప్పటిబాల్యమందు కా
లిడుట కుపక్రమించినది, యీపొర యీమెడ రాలి, యింక నె
య్యెడ నొడిబిడ్డ నయ్యెదనొ యే కడుపందున కాయగాతునో.

మది యొక కన్నతల్లివలె మర్మము లన్నియు దాచుగాని యీ
పెదవి యటన్నదే బయటపెట్టును వల్లని పెండ్లమట్టులన్
నిదురను మించు మిత్రమిక నీకు మరొక్కటి లేదు చూడు మ
య్యదె గద మెట్టిమెట్టి యమయాతనలన్ మరపించివైచెడిన్.

జగతి సమస్త మేలు నృపసత్తముదాకనుగూడ జిత్ర మే
మొగమును జారజూచినను ముద్రితమైనట్లు లోకవైన్యమే
యగపడు, బ్రస్తుతస్థితికి సత్యధికస్థితి యేదొ యందుకో
దగియు నెవేవొ యడ్డుపడ దానిటులన్ బడియున్న యట్టులన్.

ఏను నరత్వ మందుకొన నెంతటి లోనను దప్పిపోమె నన్
దీనత చేత నేమి దయసేయుముగా నెటు మోముపెట్టినో
వానరువంక చూచితివె? వారికి లేసుమి మానవాత్మయున్
దానలిచింత చే నొగులు దైవము నందుకొనంగ జాలమిన్.

# ఉన్నదీ: కోరుతున్నదీ

శ్రీ అనిసెట్టి సుబ్బారావు

పట్నానికి నలభైమైళ్ల దూరంలో వున్న పల్లెటూరు. డొంక దారితప్ప రైలుగాని, రోడ్డుగాని అటు వెళ్లవు. చిన్న పల్లె! ఆకలు, అవస్థలు అనుభవించే పల్లీయులకు తామే బాగుపడాలని తాపత్రయం; ఇతరులు చల్లగా వుండే మంట. పల్లెనిండా పేదరికం, మాఢ్యం పాలిస్తున్నాయి. పల్లీయులకు పాతను చూస్తే భ్రమ, కొత్తని చూస్తే భయం. కాని, నాగరికతాసౌధశిఖరాలు మెరుస్తూ పిలుస్తూవుంటే కొత్తగా ఎక్కవచ్చిన యువకులు లోకం లోకి బయలుదేరిపోతున్నారు. పిల్లలు పాతజీవితాన్ని భరించలేరు; తల్లులు కొత్తజీవితాన్ని సహించలేరు. అదీ సంఘర్షణ!—

సరస్వతమ్మ తన పెంకుటేభవంతిమధ్యలో దిగులుగా కూచుని బియ్యం చెరుగుకున్నది. కొంగుతో కళ్లు తుడుచుకుంటున్నది. లోలోపల పాడుకుంటున్నది. వంటగదినుంచి పొగ వస్తోంది. గోడల మీద శ్రీరామపట్టాభిషేకం, ఆంజనేయులు, విశ్వామిత్రుడు-మేనక మొదలైన రవివర్మచిత్రాలు; గాంధీజీ, మెహర్‌బాబా చిత్రాలు; సరస్వతమ్మభర్తఫోటో మొదలైనవి వరుసగా వున్నాయి. వాటిమీద అలంకరించిన గాజులగొలుసు. కిందగూటిలో మినుకుతున్న దీపం. గూటిచుట్టూ నల్లని చారలు. గూటిపక్కనే పెద్ద కిటికీ. ఆమె కూచున్న మంచంఎదురుగా ఒక చెయ్యివిరిగిన కుర్చీ; దానిపక్కనే కావిడిపెట్టెమీద రెండు బోర్లా వేసిన బుట్టలు.

* * * *

రవణయ్య :-[బైటినుంచి] అమ్మాయ్! సరస్వతమ్మా!

సరస్వతమ్మ :-[మంచంమీదినుంచి లేచి నేలమీద కూచుం టుంది] రా అన్నయ్యా, లోపలికి రా.

రవణయ్య :-ఏం, ఇంత పెందరాళే పిలిపించావ్?

సరస్వతమ్మ :-నిన్న నే పిలవనంపుదామంటే శీనిగాడు రాలేదు. ఇందాకా రామయ్యగారబ్బాయి కనబడితే 'కొంచెం రవణయ్యన్నని కేకేసిపో అమ్మా' అని చెప్పాను.

రవణయ్య :-శీనిగాడికేమొచ్చింది? వాడికేమైనా బకాయి పడ్డావా యేం?

సరస్వతమ్మ :-ఏదో కొద్దిగా ఇవ్వాల్లే!

రవణయ్య :-మరి వందరూపాయలదాకా రావాలని ఊళ్లో టాంటాం వేస్తున్నాడూ!

సరస్వతమ్మ :-ఇంకా కొద్దిగా...

రవణయ్య :-చూడమ్మాయ్! అసలు నేనే వచ్చి ఆ నాలుగు ముక్కలూ అడిగిపోదా మనుకుంటున్నా—

సరస్వతమ్మ :-ఆదేమిటన్నయ్యా!

రవణయ్య :-ఏం! నిన్న పేరంటానికి పిలిస్తే ఒంట్లో బాగాలే దన్నావుట? మొన్న జున్నుపాలు తెచ్చిస్తే వొద్దని తిప్పి పంపావుట? ఎంత మేం తీసిపోయినా నీపద్ధతి నా కేం నచ్చలేదమ్మాయ్!

సరస్వతమ్మ :-అలా అనుకోకన్నయ్యా, దేవుడితోడు! ఏం చెయ్యాలన్నా చేతులాడటం లేదు. నా కేదో...

రవణయ్య :-ఉన్న దేదో విడమర్చి స్పష్టంగా చెప్పరాదూ! నే నంత పరాయివాణ్ణా! ఎంత దూరపుచుట్టాలమైనా 'అన్నయ్యా' అని పిలుస్తూ నేవుంటివిగా...

సరస్వతమ్మ :-మరేమన్నా విన్నావేమోనని...అదే... మనవాడూ...

రవణయ్య :-మనవాడి సంగతేనా! ఆహా, వినకేం! లోక మంతా కోడైకూస్తుంటే నే నంత చెవిటివాణ్ణా! మరి నువ్వు కిమి న్నాస్తిగా ఊరుకుంటే "ఏమిటమ్మా! నీకొడుకు ఆస్తంతా అమ్మ కని వూళ్ళమ్మట తిరుగుతున్నాట్ట?" అని నోరుతెరిచి ఎట్లా అడగను?

సరస్వతమ్మ :-అన్నయ్యా! నిజం చెబుతున్నా...ఈ రెండేళ్లనుంచీ లోలోపల కుళ్లిపోతున్నా...ఏరోజుకారోజు రేపన్నా వస్తాడు గదా అని డొంకదారిన కళ్లుపెట్టి చూస్తున్నా!

రమణయ్య :-నే నంతమాత్రం కనిపెట్టకపోలేదులే...అందుకే నువ్విట్లా కృశించి మరీ ఎముకలపోగుగా తయారైనావు! ఆయన నున్నప్పుడు ఎంత సుఖంగా, ఉల్లాసంగా, సందులా నున్నావో ఇప్పుడంత...

సరస్వతమ్మ :-నేను కలలోగూడ అనుకోలేదు...ఆయన చని పోయి నేటికి రెండేళ్లు!

రమణయ్య :-ఆయన పోవడం చూసుకొని వీడు మకాం ఎత్తాడూ...

సరస్వతమ్మ :-ఇరోజుల్లో మావా డెంత నెమ్మదిగా, ఎంత వినయంగా వుండేవాడు...ఇప్పుడిట్లా పుట్టిందిగాని...హైస్కూల్లో చదువుకునేటప్పుడు రోజూ దీపాలు పెట్టకతలికే ఇంటి కొచ్చే వాడు...నీకు తెలుసుగా!

రమణయ్య :-అవునవును. [కుర్చీమీదినుంచి లేచి, చల్లెవాటు సరిచేసుకుంటూ గోడమీది చిత్రాలు పరధ్యానంగా చూస్తున్నాడు.]

సరస్వతమ్మ :-ఒకరితో పరాచికాలుగాని, పోట్లాటలుగాని వాడి జీవితంలోనే లేదు...మనూళ్లో ఫస్టున పాసయిందివాడేగా... ఆయనసగా ఎంతో గర్వంగా చెప్పుకునేవారు...ఎప్పుడూ పుస్తకాలు కళ్ల కతికించుకుని కూచుని, తండ్రితో అట్లా పొలం పోదామనిగాని, కోతలూ నూర్పిళ్లూ చూద్దామనిగాని...వాడికి ధ్యాసే లేదన్నయ్యా!

రమణయ్య :-[తొందరపడుతూ] ఇంతకూ నన్ను రమ్మన్న కథేమిటమ్మాయ్! [ఆమెవంక చూసి నెమ్మదించి] నీస్థితి చూస్తే నాకుండె తరుక్కుపోతున్నది. రాత్రి మాపిల్ల నీసంగతి ఒకటే ఇదిగా అంటూంటే వాళ్లమ్మ వోదార్చి—

సరస్వతమ్మ :-మా కాఅదృష్ట ముంటా అని...అదే...

రమణయ్య :-ఏమిటని?

సరస్వతమ్మ :-[తొట్రుపడుతూ] అదే...వరహాయ్‌కి లలిత నిచ్చి...

రమణయ్య :-[నవ్వు తెచ్చిపెట్టుకుని] అ దెంత భాగ్య మమ్మాయ్! నేను మాట తప్పుతానా!

సరస్వతమ్మ :-జ్ఞాపకం తెచ్చుకో అన్నయ్యా! ఆయన చని పోయేటప్పుడు నువ్వే చేతులు పట్టుకుని అడిగావు...

రమణయ్య :-చాల్లే అమ్మాయ్! నే నెందుకు మరిచిపోతాను! వాడికేం! కడుపునిండా తిండుంది, వొంటినిండా కండుంది! పైగా చదువుకున్నవాడు...

సరస్వతమ్మ :-ఎవరో అనుకున్నారులే...ఇం కెక్కడన్నా సంబంధం చూడాలనుందీ...నీకూ...అనీ...?

రమణయ్య :-[నిర్లక్ష్యంగా] అ...అనడాని కేముచ్చె...అం తమాత్రానికే...కాని?...

సరస్వతమ్మ :-నువ్వు నమ్మొద్దన్నయ్యా! ఒకవేళ వాడి పరా రాలా పోగొట్టుకున్నా, నా నాలుగెకరాలూ బంగారం పండు తుంది...హాయిగా భార్యా, భర్తా తా మింత తినడానికీ, ఒకరి కింత పెయ్యడానికీ అది చాలదూ?

రమణయ్య :-[ఆశ్చర్యంతో] ఏతే నిజంగా తగలేసినట్టేనా... కర్ణాకర్ణిగా తెలిసిందిగానీ...

సరస్వతమ్మ :-[భయపడుతూ] వాడి కేం లేదన్నయ్యా! స్నేహితులవల్ల చెడిపోయుంటాడు...

రమణయ్య :-[కనుబొమలు పైకెత్తి] ఏమో! అసాధ్యుడు!

సరస్వతమ్మ :-అసలు వాడు హైస్కూల్లో పాసయినతర్వాత పెద్దచదువుకు పోతానంటే వాళ్ల నాయన నూరేళ్లు కట్టేసినట్టు ఇంట్లో కూచోబెట్టాడు...అప్పుడే వాడికి కొంచెం కష్టం వేసి పోట్లాడాడుగాని, లేకపోతే వాడి వినయం...

రమణయ్య :-[గట్టిగా] ఏతే పొలం అమ్మేసిన్నది నిర్ధారణయిందా?

సరస్వతమ్మ :-[కన్నీరు తుడుచుకుంటూ] ఇదీ సంగతని నాకు చెప్పేవా రెవరు? చూచాయగా తెలిసింది...అది విన్నప్పట్నుంచీ దిక్కుతోచక కాలాలా చెరువో చూసుకుంటా మనిపిస్తున్నది!

రమణయ్య :-[ఓదార్చుతూ] తప్పు! తప్పు! అవేం మాటలు! అంత దిగులుపడితే లోకం నడుస్తుందా! మనుషులకు కష్టాలు రావడం లేదా, పోవడం లేదా! నీకే కష్టా లొచ్చినట్టు మాట్లాడతావేం!...

సరస్వతమ్మ :-[దుఃఖంతో] నువ్వు తప్ప నా కిప్పుడు దిక్కెవ్వరు చెప్పు! ముంచినా తేల్చినా నువ్వే ఇక...పట్నంలో వున్నాడనీ, నాలుగురోజులనాడు గుంటూరొచ్చాడనీ తెలిసింది...నువ్వెళ్లి మాట్లాడితే...

రమణయ్య :-ఏమోనమ్మా! కొరుకుతాడా! ఉడుకుపింపం!

సరస్వతమ్మ :-అట్లా అనొద్దన్నయ్యా! మాగుట్టు నీ గుండెలో వుంది...కన్నకడుపు ఎట్లాంటిదో నీకు తెలుసు...ఒక్కసా రెళ్లి... పిల్చుకురావూ!

రమణయ్య :-అంత గట్టిగా అడిగితే నేను కాదనగలనా... నాక్కూడా ప్లీడరుతో మాట్లాడవలసిన పనుందిగానీ...వాడొట్టి పిచ్చివాడివి గాకపోతే ఎందు కీతాపత్రయం...

సరస్వతమ్మ :-[అనునయంగా] ఈకష్టం గడిచి గట్టెక్కించే భారం నీది...నీకు పుణ్యముంటుంది...చూడన్నయ్యా! మ వ్యాకక పొర్లు గుంటూ రెళ్లాకే... వాయిదాలకనీ వ్యాపారానికనీ. వెళ్లినప్పు డెప్పుడూ కన్పించలా?

రమణయ్య :-[చిరునవ్వుతో] అన్నట్టు జ్ఞాపకంవచ్చింది... ఒకసారి సినిమాలో...

సరస్వతమ్మ :-మరి చెప్పకూడదూ... వాడూ నీ అల్లుడే కదా... దగ్గరికి పిల్చి మాట్లాడకూడదూ!

రమణయ్య :-ఎక్కడమ్మాయ్! మేమేమో తొమ్మిదణాల టిక్కెట్టులో కూచుంటే, వాడు స్నేహితబృందంతో సల్లాపాలాడుతూ పరువులవీళ్లో, సిగరెట్టు కాలుస్తూ... నాకు నమ్మకం లేదమ్మాయ్! మొక్కనైతే వంచవచ్చుగానీ... ఏం ప్రయోజనం!

సరస్వతమ్మ :-[ఆందోళనతో] నేను నీ తోబుట్టువునే అనుకో... నా కంఠమాత్రం స్వతంత్ర ముంది... ఇవాళ సాయంత్రం కొంచెం... బయలుదేరుదువుగాని...

రమణయ్య :-ఇంకోవారం చూడకూడదా అని! అబ్బో! అడుగు బైటపెడితే కోలెడంత ఖర్చు! ఎక్కడని వెతికేట్టు, ఎక్కడని తిరిగేట్టు!

సరస్వతమ్మ :-[నచ్చచెప్పాలని] నీకు తెలుసుగదన్నయ్యా వాడి సంగతి! వేళకు తిండీ తిప్పలూ లేకుండా ఎక్కడ తిరుగుతున్నాడో, ఏమో! [శోకంతో] కంటిపాపలా కాచుకున్నాను... ఇక నేను బ్రతకలేను...

రమణయ్య :-వెర్రి సర్వకాలపు మనిషివి!

సరస్వతమ్మ :-ఇదిగో ఈ రెండుగాజులూ తీసుకో... ఇక నాదగ్గర ఒక్క వస్తువైనా లేదు... ఉన్న సొమ్ములన్నీ అమ్మి ఆయన పోయినప్పుడు రెండువేల అప్పు తీర్చాను... వొంటిమీది నాగరం, గొలుసూ, పట్టీలూ కర్పూరంలా హారించుకుపోయినై...

రమణయ్య :-[బాధపడుతూ] ఐతే సొమ్ములన్నీ అమ్మేశావా? నాతో అనలేదే!

సరస్వతమ్మ :-క్షమించన్నయ్యా! వడ్డాణం పిల్లకి పెడతానన్నా... మాట నిలుపుకోలేకపోయా!

రమణయ్య :-[బాధ కప్పిపుచ్చుకుంటూ] అబ్బెబ్బే! అందుకు కాదు! ఎంత మాటన్నావమ్మాయ్! నే నావుద్దేశంతో అడుగుతున్నానా!... ఐతే ఆ పరకరాలూ తగలేసినట్టేనా, లేక చిలుకేమైనా వుంచావా?...

[బైట దూరంగా మోటార్ సైకిల్ ధ్వని వినపడుతోంది. ధ్వని దగ్గరగా వస్తోంది. ఇద్దరూ ఆలకిస్తారు]

సరస్వతమ్మ :-ఏమి టామోత?

రమణయ్య :-[కిటికీదగ్గరి కొస్తూ] కలెక్టరుగా రొస్తా రనుకుంటున్నారులే... కాదు; ఎక్కడిదో మోటారుసైకిల్... అంత మొనగా ళ్లెవరబ్బా ఈవూళ్లో?

సరస్వతమ్మ :-ఎవరైతేమాత్రం ఎండ నిప్పులు చెరుగుతుంటే ఈ వేళప్పుడేం పనొచ్చిందో!

రమణయ్య :-[బైటికి చూస్తూనే] చూడమ్మాయ్! ఇట్రా!

సరస్వతమ్మ :-పోనిద్దూ, మన కెందుకు...

రమణయ్య :-కాదు, కాదు, ఇట్రా! నాకేనా... అని...

సరస్వతమ్మ :-[కిటికీలోనుంచి ఆతురతగా చూస్తుంది. ఆమె ముఖం దుఃఖంతో, సంతోషంతో కళకళలాడుతుంది] వాడే! నరసా యొస్తున్నాడన్నయ్యా!

రమణయ్య :-[తాపీగా] ఇద్దరున్నట్టుందీ?

సరస్వతమ్మ :-[ముఖం తుడుచుకుంటూ] రానీ! నా దొస్తే చాలు! ఇంకా ఈ ఊరంతమందిని తెచ్చినా నాకు బాధలేదు!— అన్నయ్యా! చూడు! ఇదిగో! వొట్టే!

రమణయ్య :-పిచ్చితల్లీ! ఏమిటది?

సరస్వతమ్మ :-[కండ్లనెంట నీరు కారుతోంది] నేను దిగులుగా వున్నానని చెపితే... నేను డబ్బుకోసం బాధపడుతున్నానని చెపితే!

రమణయ్య :-[కోపంతో] ఏం! ఇంతలో పాడిపోదులే!— చెప్పాలమ్మాయ్! వింటే వాడికే బుద్ధొస్తుంది!

సరస్వతమ్మ :-[నివారించాలని] వొద్దు! వొద్దు! వాడి దసకే వచ్చిగుండే... వాడి ముఖం విచారంగా వుంటే నేను చూడలేను.

రమణయ్య :-సరే కానివ్వు...

సరస్వతమ్మ :-[దిగులుతో] అన్నయ్యా! మరీ... అడిగా ననుకోకుండా ఒక పాతికరూపాయలు తెచ్చి పెడతావా?

రమణయ్య :-[ఒకక్షణం యోచించి] హూఁ! ఐతే వెళ్లి పట్టుకొస్తా! ఇక తప్పేదేముంది!—అదిగో వచ్చేసింది... ఏం దుమ్ము! ఏంస్పీడు!

సరస్వతమ్మ :-[సంతోషసంభ్రమాలతో] రాజాలా గొస్తాడు! వాడి కేం!

[రమణయ్య మెల్లగా వెళ్లిపోతాడు. ఆమె తలుపురెక్క బెంబడించి, వచ్చి కిటికీలోనుంచి చూస్తుంది. ధ్వని దగ్గరగా వచ్చి, హెచ్చుతుంది. ఆమె తొట్రుపాటుతో తలుపుదగ్గరికి నడుస్తుంది. తలుపు తెరిచి బైటికి వెళ్లి వాళ్ల నాహ్వానిస్తుంది]

సరస్వతమ్మ :-[బైటినుండి] రండి! రండి! లోపలికి రండి! ఆ కారుకూడా లోపలికి తీసుకురండి!

నరసింహారావు :-[బైటినుంచి] గెటిన్, వెంకట్రావ్!

వెంకట్రావు :-[బైటినుంచి] నే నీ సైకిలు గడప దాటిస్తాను, పద!

[నరసింహారావువెంట సరస్వతమ్మ లోపలి కొస్తుంది. ఆమెలో సంతోషమూ, శోకమూ పొంగి కళ్లవెంట ధారలుకారుతున్నాయి.]

వెంకట్రావు మోటారుసైకిలు నడిపించి తెచ్చి, కావికిపెట్టి పక్కనే నిలబడతాడు. ఇద్దరూ తెల్లని పొడుగైన చొక్కాలు, పైజమాలు, బూట్లు వేసుకునివున్నారు. ఎండవల్ల ముఖాలు కంది, ధూళి నిండివున్నాయి. నరసింహారావుచేతికి గడియారం, చేతిలో ఒక గ్రంథం; వెంకట్రావు పెదవులమధ్య సిగరెట్టూ, పైన కళ్లద్దాలూ]

సరస్వతమ్మ :-[గాద్గదికంగా] ఏరా నరిసీ! ఎన్నాళ్లకొచ్చావురా! [వొళ్లంతా నిమురుతూ] మా నాయనా! ఎంత తగ్గిపోయావురా! ఏ యెండల్లో వానల్లో తిరిగావో! అసలు నీ రంగే మారిపోయింది.

నరసింహారావు :-[సిగ్గూ, విసుగూ] అబ్బబ్బ! వుండవే! నే నేం పాపాయి ననుకున్నావా! వుండు!

సరస్వతమ్మ :-[ఆప్యాయంగా] పరాయూరికి పోతే నిద్ర పట్టదనేవాడివే, ఇన్నాళ్లెట్లా వున్నావో నన్నొదిలి...నీకోసం కళ్లల్లో వొత్తులుపెట్టుకుని చూస్తున్నా...

నరసింహారావు :-బాగానే వున్నానమ్మా! చదువుకుంటున్నా!...

సరస్వతమ్మ :-పోనీ, నాలో ఇంకా జీవుడున్నాడుగదా! నీకోసం తపించిపోతున్నానుగదా...ఒక్క ఉత్తరం రాయగూడ దట్రా...

నరసింహారావు :-[ఇల్లంతా తేరిపారచూస్తూ] రాశానే...చేరలేదా?

సరస్వతమ్మ :-ఏదీ, మొన్న వొచ్చిందొక్కటేగా...మళ్లీ మళ్లీ చదివించుకుని అదే పదివుత్తరా లనుకున్నా...

నరసింహారావు :-ఐతే మరి జవాబు రాయించలేదేం?

సరస్వతమ్మ :- [దిగులుగా] ఏం రాయించమన్నావ్! నువ్వేమో రెండేళ్ల నాడు ఇల్లుదాటి వల్లప్రాసైపోతివి...ఇప్పుడొక్క వుత్తరం ముక్క రాసి ఇంకా మనసు ధూము లెక్కడున్నయో రాయమంటే ఏముఖంతో రాయించను...

నరసింహారావు :-రాస్తే తప్పా? అంతమాత్రం...

సరస్వతమ్మ :-[అనలేక] అది కాదు...నాయనా...అసలు...ఇప్పుడు...ఇంకా...మనకు పొల మెక్కడిది? ఆ చెరువుగట్టునుండే పదకరాలూ అమ్మి సొమ్ము చేసుకున్నా నంటేని!...ఆ సొమ్మే మయిందో మరి...ఇంకా దేనికిగాను కావలసొచ్చిందో...[ఏడుస్తూ] నే నిక్కడ పతిమతిమాలుతుంటిని...

నరసింహారావు :-[అలసటగా వొళ్లు విరుచుకుంటూ]సరే, తర్వాత మాట్లాడాం! ముందు నీళ్లుపట్టు...స్నానం చెయ్యాలి—వెంకట్రావ్! వొళ్లంతా విరగ్గొట్టిన ట్లుందోయ్!

సరస్వతమ్మ :-[అనుమానంగా] ఈ అబ్బా యెవర్రా నరిసీ!

నరసింహారావు:-వెంకట్రావని, నాస్నేహితుడులే, గుంటూరు.

సరస్వతమ్మ :-ఇద్దరూ కలిసే తిరిగారా?

నరసింహారావు :-[కోపంతో] ఎక్కడ తిరిగారు, ఏం చేశారు, వచ్చేది - అనేగా నీప్రశ్న!

సరస్వతమ్మ :-[భయంతో] అదేమిట్రా! నీ వాలకమే మారిపోయింది! ఎందుకు తిరిగావని నే నడిగానా! ఐతే, ఎక్కడెక్కడి కెళ్లావ్ నాయనా?

నరసింహారావు :-[నెమ్మదిగా] బొంబాయి, కలకత్తావంటి పట్నాలూ అవీ చూశానుగాని, అసలు పట్నంలోనే వుండి ఇంటర్మీడియెట్ చదువుకున్నా...

సరస్వతమ్మ :-[భయపడుతూ] ఒక్కడివే! అమ్మో! ఒక్కడివే ఇంతదేశం ఎట్లా...

వెంకట్రావు :-[మరొక సిగరెట్టు వెలిగిస్తూ] మీవాడు కాశ్మీర్ కూడా వెళ్లాడండి!

సరస్వతమ్మ :- [ఆశ్చర్యంతో] నిజంగా? చలిదేశమంటగా? ఆ చలి కెట్లా తట్టుకున్నావో, తిండీ నీళ్లూ సరిగ్గా అమిరినయ్యో లేదో...ఎంత ఖర్చయింది?

నరసింహారావు :-స్టూడెంట్సంతా ఎక్స్కర్షన్ వెడుతోంటే నేనూ వెళ్లాను. నేను లీడర్ని. అందుకని నాకేం డబ్బు తగల్లేదు ..

సరస్వతమ్మ :-[బుగ్గన చెయ్యిపెట్టుకుని] అబ్బాయ్! వెంకట్రావ్! వాడి వ్యవహారమే మారిపోయింది నాయనా!

వెంకట్రావు :-అతని కేమండీ! ఎవ్యకే బెడ్ మాన్! ఇంగ్లీషొస్తే ప్రపంచంలో ఎక్కడికిపోయినా ఢోకా లేదు!

సరస్వతమ్మ :-మావా డింగ్లీషులో మాట్లాడతాడా? నిజంగా? వాడు హైస్కూల్లో పాసై రాగానే కరణంగారొచ్చి—అంటే మావాడు ఘట్టున పాసయ్యాడులే—ఇంగ్లీషులో రెండుముక్కలు మాట్లాడమంటే ముద్దులా కూచున్నాడు. నాకెంతో సిగ్గేసింది! ఆతర్వాత మా శేష్లు వాళ్ల నాయన ఎక్కడికీ కదలనివ్వకుండా కట్టేసినట్టు కూచోబెట్టాడు...వీడేమో పట్నంపోయి చదువుతా నంటాడు...వాళ్ల నాయన హుం! కుతరామూ వొప్పుకోలేదు... అప్పుడు వాడికి మతి స్థిరం లేదు నాయనా...పిచ్చెక్కుతుం దనుకున్నాం ..

నరసింహారావు :-[కట్టిగా] అందుకే నీ కీశాస్తి జరిగింది—[బాధపడుతూ] అమ్మా! నేను చదువుకుని ఎక్కిరావాలని నీకు లేదూ? నే నెంత దిగులుపడ్డానో నాకు తెలుసు! నన్ను క్షమించమ్మా!

సరస్వతమ్మ :-నాకేం తెలుస్తుంది నాయనా! నువ్వు బాగు పడితే సంతోషిస్తా! ఊళ్లోవాళ్లంతా నువ్వు చెడితిరుగుతున్నా

వంటుంటే దుఃఖంతో కుమిలిపోతున్నా! అంతకంటే నే నేం చేస్తాను...[ఏడుస్తూ] ఒంటరిదాన్ని చేసి నీ అజా పజా తెలియకుండా...

నరసింహారావు :-[విసుగుతో] అబ్బబ్బ! ఎలాగే! ఆకలితో చచ్చిపోతుంటే నువ్వు...! లేకపోతే వచ్చినవారిని పొమ్మంటావా ఏం?

వెంకట్రావు :-[లోపలినుంచి వచ్చే పొగకు కళ్లునులుముకుంటూను] అంత తొందరేమిటోయ్!

సరస్వతమ్మ :-[దీనంగా] చూడు నాయనా! ఆ కోపం! వాడు నామనిషి కాడు. నన్ను మరిచిపోయాడు...ఎంత ఇదైనా తల్లిని—నీళ్లు కాగుతున్నై, ఇద్దరూ నీళ్లుపోసుకుని అన్నం తిందురు గాని...

నరసింహారావు :-ఈ పొగతో చచ్చిపోతున్నాం. వెళ్లి ఆ కట్టెలు మంటపెట్టరాదూ!

సరస్వతమ్మ:-[బాధపడుతూ] కొంచెం ఓర్చుకోరా నరిసీ! రెండురోజులు పోతే అదే అలవాటౌతుంది...కట్టెల్లేక పొయిలో పిడకలు పెట్టాను...

నరసింహారావు :- [విసుక్కుంటూ] ఏం, తెప్పించక పోయావా?

సరస్వతమ్మ :-[ఆపుకోలేక] దుకాణంలో రెండురూపాయలదాకా యిచ్చాడు, మహారాజు! ఇక ఆవగింజన్నా అడగొద్దన్నాడు... [లోపలికి వెడుతూ] చిటికెలో వచ్చేస్తా...ఆకలౌతుందేమో...

వెంకట్రావు :-టైమెంతయిందోయ్? రెండా?

నరసింహారావు :-ఒకటే మువ్పావు! ఏం తొందర?

వెంకట్రావు :-ఇవాళ తెములుతుంటావా అని?

నరసింహారావు :-ఇదిగో, భోంచేసి...నెమ్మదిగా...

వెంకట్రావు :-రాత్రి మెయిలుకు బయలుదేరాలన్నావ్!

నరసింహారావు :-వెళ్లాలి మరి! అదిమాత్రం తప్పదు! వచ్చిన సీటు పోతే ఇక ఈ జీవితానికి బొట్టిదే!

వెంకట్రావు:-నా కేం నమ్మకం లేదు...రాక రాక వచ్చావా...

నరసింహారావు:-[వ్యాకులపడుతూ] నిజంగా నా మనస్సంతా గంద్రగోళంగా వుందోయ్! ఇంట్లో ఇలా వుంటుందని నే ననుకోలే దింతవరకూ...అమ్మని వేలుముద్రవెయ్యమని అడగడానికే బాధగా వుంది...ఆమె కర్థంకానిది మన మెంత చెప్తే ఏం ప్రయోజనం!

వెంకట్రావు :-ఒక విషయం చెప్పనా...నువ్వు లేకపోతే ఇక ఆమె ఎంతో కాలం బ్రతక...లేదు.

నరసింహారావు :-[బాధపడుతూ]అవును! నాకు తెలుసు!... ఆమె ఈ వూరుగడప దాటిరాదు...అంతవరకూ ఖాయం...నేను చదువు మానుకుని ఇక్కడే వుంటాను...ఉండి ఏంచేస్తాను...అబ్బ! ఈ నికృష్టపుజీవితం నేను భరించలేను...

వెంకట్రావు :-మరి ఆమె నెక్కడుంచాలని...

నరసింహారావు :-[ఆలోచిస్తూ] అదే ఆలోచిస్తున్నా...రవణయ్యమామగారి ఇంట్లో వుండమంటే ఎలా వుంటుందా అని... ఆ ఏర్పాటే చెయ్యాలిక...

వెంకట్రావు :-సాయంత్రం బయలుదేరుతున్నామా! వాడికా రసీదు పడేసి, డబ్బు తీసుకోవాలిగా!

నరసింహారావు :-[నిశ్చయంతో] నువ్వే మా స్తావుగా... [వీధిలో అరుపు విని చప్పుడు విని, పెద్దగా] ఎవరండీ! రండి!

రవణయ్య :-[మందహాసంతో] నేనేరా, రవణయ్యని! ఏం, కొత్తగా మర్యాద చేస్తున్నట్టుందే!

నరసింహారావు :-రా, మామా! గడపలో నిలబడతా వేం!

రవణయ్య :-[కూరగాయల మూట దించుతూ] ఆ, ఏమీ లేదు...బైట పిల్లలు మూగుతుంటే కేకలేస్తున్నాను...

నరసింహారావు :-ఎందుకూ మూగడం?

రవణయ్య :-ఆ, రాకరాక వచ్చావా! నాలుగుగా కనపడు తుంటేను...అవి లీసైకిలు మూర్తాని కొచ్చుంటారులే!

నరసింహారావు :-ఈవూరి కన్నీ విచిత్రాలే! ఇంకేం, ఇక వెలతోలుదాకా ప్రాకుపోయిం దన్నమాటే...

రవణయ్య :-[కోపం తెచ్చిపెట్టుకుని] అదేమిట్రా! ఎంత చెడ్డా పుట్టినగడ్డ! కొంచెం పస్తాయించి మాట్లాడూ...

నరసింహారావు :-ఇందులో తప్పేముంది...నే నొచ్చినప్పట్నుంచీ కనిపెడుతున్నాను...అందరూ తొంగిచూడటమే... సిటీలో ఎవరే వచ్చినా బ్రతికినా పట్టించుకు నేవా డుండడు...అభిమానమన్నా నిలుస్తుంది!

రవణయ్య :-ఈ రెండేళ్లలో కరకుతేలావురా అబ్బాయ్! మంచిదే!—అమ్మ లోపలుందా?

నరసింహారావు :-వంట చేస్తోంది!

రవణయ్య :-[లోపలికి వెడుతూ] వస్తున్నా నుండు..... [కూరలమూట తీసుకుని లోపలికి వెళతాడు.]

వెంకట్రావు :-ఈయనేనా నువు చెప్పిందీ...

నరసింహారావు :-ఈయనే...మాతాతలకాలంనుంచీ రెండు కుటుంబాలూ మంచిస్నేహంగా వుంటున్నయ్...

వెంకట్రావు :-[నవ్వుతూ] గడుసువాడిలా వున్నా డే!

నరసింహారావు :-[నవ్వుతూనే] అతని తీరే అంత!

రవణయ్య:-[వంటగదిలోనుంచి వచ్చి, నరసింహారావుపక్కన

మంచంమీద కూచుంటాడు. అతను నిలబడి కిటికీలోనుంచి బయటికి చూస్తూ మాట్లాడతాడు.]

. . నరసింహారావు :-ఏంమామా! ఏమిటీ సంగతులు?

రవణయ్య :-పైట తిరిగొచ్చినవాడివి నీకు తెలియాలిగాని, ఇక్కడ కొత్తగా ఏముంటయ్! మా సేద్యమేమిటో, మేమేమిటో...

నరసింహారావు :-[నవ్వుతూ] కేసులు జోరుగా సాగుతున్నాయా? అత్తయ్యవాళ్లూ బాగా వున్నారు?

రవణయ్య :-ఇంతవరకూ చల్లగానే గడుస్తున్నది...పిల్లదాని పెళ్లిసంగతే ఆలోచిస్తున్నా...[పరిశీలనగా చూస్తాడు] ఆ కోసం బయలుదేరా లనుకుంటుంటే నువ్వే వచ్చావ్...

నరసింహారావు :-[నవ్వు మాని, తాపీగా] అలాగా...

రవణయ్య :-[కోపం వెలిబుచ్చకుండా] ఏరే, అబ్బాయ్! మోటార్ సైకి లెంతయిందిరా?

నరసింహారావు :-నాది కాదు మామా...

వెంకట్రావు :-కొత్తదండీ...అందుచేత పన్నెండువందల దాకా అయింది...అదీ చౌకే...

రవణయ్య :-[ఆశ్చర్యంతో] పన్నెండొందలే! చూడ బ్బాయ్! పట్నంలో ఉద్యోగం చేస్తున్నా వన్నారూ...నిజమేనా?...

నరసింహారావు :-[ఏదో వెటకారంగా గ్రహించి] ఎవ రా అన్నది? అన్నీ ఇలాంటివే పుట్టిస్తుంటా రీవూళ్లో...ఇంకా ఏమన్నారేం?!

రవణయ్య :-ఎవరు?

నరసింహారావు :-[విసుగ్గా] ఆ అన్నవారే...

రవణయ్య :-[కోపంపట్టలేక] ఆ...ఇక వాళ్ల కేంపని... ఏమంటున్నారో వినరాదూ పోయి! ఊరూ వాడూ కోసి దేశ మంతా తిరుగుతున్నా వనుకుంటున్నారు...

వెంకట్రావు :-[సరదాగా] నరసింహారావ్! ఎందుకో అంత విసుగు! తెలుసుకోవాలని అడిగినట్టుంది...

రవణయ్య :-[నిర్లక్ష్యంగా] మీ పేరేమిటండీ?

వెంకట్రావు :-వెంకట్రావంటారండీ...

రవణయ్య :-అలాగా. మావా ణ్ణిప్పుడు నరసింహారావును చేశారం! మంచిదే...చిన్నప్పుడు నరసా యనేవాళ్లంతే... అంటే...వాళ్ల అయ్య పెట్టిన పేరే!...

నరసింహారావు :-[నవ్వడానికి ప్రయత్నిస్తూ] పోనీ, నీయిష్ట మొచ్చిన పేరుతోనే పిలువు...

రవణయ్య :-[వెంటనే, బాధగా] ఎందుకబ్బాయ్! నేనూ నరసింహారా వనే అంటాను—అంటే, ఇంతప్పట్నుంచీ ఎత్తుకొని తిరిగేవాణ్ణండి; అందుకని నాతో స్వతంత్రంగా వుంటాడు...

నరసింహారావు :-[నవ్వుతూ] ఎంతలో కోప మొచ్చింది మామా! నీయిష్ట మొచ్చిందన్నందుకు...సమాధానం చెప్తాను! కాని, ఇందులో ఏదో దాపరికం, దొంగతనం వున్నట్టూ, నేను నేరస్థుణ్ణయి నట్టూ మాట్లాడితేమాత్రం నేను సహించలేను...

రవణయ్య :-[కొంత సరదా, కొంత కోపం] నువ్వన్నా వన తానురా! నేను మామనుగానా, నువ్వల్లుడివి గావా...

[నరసింహారావు, వెంకట్రావు నవ్వుతారు]

రవణయ్య :- ఇప్పటి కుర్రాళ్లకి అన్నీ నవ్వులే—ఐతే, నరస...నరసింహారావ్! ఎక్కడెక్కడి కెళ్లావ్? ఏమేం చేశావ్?

వెంకట్రావు :-ఒక్క ముక్కలో చెప్పాలంటే, ఎ పీస్ అఫ్ కోల్ హాస్ టర్న్డ్ ఎ డైమండ్!

రవణయ్య :-చూడండి! వాడు మాట్లాడతాడు లెండి!

నరసింహారావు :-[నెమ్మదిగా] పట్నంలో ఇంటర్ పాసయ్యాను...మన దేశమంతా, ఇంచుమించు అన్నిరాష్ట్రాలూ చూశాను...మన మనుష్యులూ, మన వేషభాషలూ, మన ఆచారాలూ అవస్థలూ అన్నీ చూసి, గ్రహించాలనీ...[చిరునవ్వుతో] ఖర్చంతా ఎక్కువభాగం ఆటలపోటీలవల్ల కలిసొచ్చింది...

వెంకట్రావు :-చాలా అనుభవం, తెలివి...అతని కేమండి!

రవణయ్య :-అలాగేం! ఇంకా?...

నరసింహారావు :-అంతే...పత్రికలనీ, పుస్తకాలనీ, మీటింగు లనీ...ఏదో ప్రపంచం తెలుసుకొని కొద్ది గొప్పో విజ్ఞానం పొందు దామని...

రవణయ్య :-అప్పుడేనా ఈ గడియారం కొన్నది? నీ చేతికి బాగా అమరింది! ఎంతయింది?

నరసింహారావు :-నూటయాభైదాకా అయింది...

వెంకట్రావు :-వాటర్ ప్రూఫ్ వాచండీ!

రవణయ్య :-[ఆశ్చర్యంతో, ఆపుకోలేక] ఉహూ...నాకు తెలియకడుగుతానుగానీ, గడియారం కొనకపోతే సాగదా యేంరా?

నరసింహారావు :-[విసుగుతో] నేను దుబారాచేశా నని ఈ ప్రశ్నలన్నీ వేస్తున్నారని నాకు తెలుసు...కానీ, [ఆగ్రహంతో] కాలంవిలువ తెలియడమంటే జీవితంవిలువ తెలియడమన్నమాట... బ్రతికిన నాలుగురోజులూ సద్వినియోగం చెయ్యాలంటే గడియారం లేకపోతే ఎలాగ?

రవణయ్య :-[అధికారంతో] ఇది సద్వినియోగమా! పాతిక సెంట్ల భూ మొచ్చుండేదిగదరా.

నరసింహారావు :-నీతో వాదించను మామా! పూర్తిగా తెలిశాన్నా వుండాలి...

వెంకట్రావు :-[అందుకుని] హాఫ్ నాలెడ్జ్ ఈజ్ డేంజరస్...

రమణయ్య :-[కోపోద్రిక్తుడై] ఆ, ఆ, ఎంతమాటన్నావ్! మనిషెదురుండగానేనా ఈమాటలు! అంతవరకొచ్చిందీ!

నరసింహారావు :-మనిషి వెనకాల మాట్లాడటం మనూళ్లో పెద్దలకు బాగా అలవాటు...

రమణయ్య :-[మంచంమీదినుంచి లేస్తూ] అను! అనరా! ఇల్లు నెత్తికెక్కినతర్వాత అన కేంచేస్తావ్!

వెంకట్రావు :- [సమాధానపరుస్తూ] రమణయ్యగారూ! కూచోండి...మేమేదో ఇప్పుడొచ్చాం...సాయంత్రం వెళ్లిపోతాం...ఇంతలో మళ్లీ తగాదాలు దేనికీ...

రమణయ్య :-ఏమి. ఏమిటీ! వెళిపోతున్నారా? ఎప్పుడూ? మీ వాలకం చూసి ముందే అనుకున్నాననుగానీ...

[వంటగదిలోనుంచి వస్తున్న సరస్వతమ్మను చూసి రమణయ్య ఊరుకుంటాడు. ఆమె త్వరగా ప్రవేశించి సంతోషంతో చూస్తూంది]

సరస్వతమ్మ :-ఏం నాయనా! ఆకలౌతున్నదా? నీళ్లు పట్టాను పోసుకోరా నరిసీ...సబ్బుముక్క వెతికితే ఎక్కడా కన్పించలేదు...

రమణయ్య :-[నవ్వు తెచ్చిపెట్టుకుని] అమ్మాయ్! మనవాణ్ణిక నుంచీ నరసింహారావని పిలువ్...పెద్దవాడైనాడు!

సరస్వతమ్మ :- ఏమిటన్నయ్యా...ఎల్లకాలం చిన్నవాడుగానే వుంటాడా ఏమిటి! లేవండి!

నరసింహారావు :-[ఆలోచిస్తూ]ముందు నీవు లే వెంకట్రా... నేను తర్వాత చేస్తాను...

వెంకట్రావు :-అలాగే...[లేచి, సిగరెట్టు వెలిగించుకుంటూ లోపలికి వెళిపోతాడు]

సరస్వతమ్మ :-[లోపలికి తిరిగి] తుండుగుడ్డ దండెంమీదుంది నాయనా!...[నరసింహారావుతో] ఈ పూటంటే ఆలస్యమైందిగాని, రేపట్నుంచీ ప్రొద్దున్నే నీళ్ళోసుకొని, భోంచేద్దువుగాని; ఆరోగ్యం కుదుటపడుతుంది...[రమణయ్యతో] రెండురోజులు పిల్లనొచ్చి సాయం చెయ్యమను అన్నయ్యా!

రమణయ్య :-[నిర్లక్ష్యంగా] ఇక మీరెందీ, మీసోకదే కావాల్సొచ్చింది వాడికి...సాయంత్రం వెళుతున్నాట్ట...ఆ దేమిటో కనుక్కో ముందు!...

నరసింహారావు :-[దీనంగా] అవునమ్మా...

సరస్వతమ్మ :-[వెర్రెత్తినట్లు నరసింహారావువైపు చూస్తుంది. కళ్లవెంట నీటిధారలు].

నరసింహారావు :-నీకు కష్టంగా వుంటుందని ముందే చెప్పలేదుగాని...

సరస్వతమ్మ :- [రుద్ధకంఠంతో] ఏమిట్రా? నిజమే? నువ్వు...పోతావా...ఏం? అంత కావాలంటే ఆ అబ్బాయిని పంపించరాదూ!

నరసింహారావు :-కాదమ్మా...నేనే వెళ్లాలి...పట్నంలో మెడికల్ కాలేజీలో సీటొచ్చింది...వెళ్లి చేరకపోతే ప్రయోజనం లేదు...

రమణయ్య :-[వెగటుగా] డాక్టరౌతాడటమ్మా...మాటలు నేర్చుకున్నాడు...

సరస్వతమ్మ :-అంటే డాక్టరుద్యోగమా? వెర్రినాయనా! నువ్వు సంపాదించడం, నేను తినడం! బాగానే వుంది...లేనిపోని మనస్తాపం తెచ్చిపెట్టుకుంటానంటావేమిట్రా!...

నరసింహారావు :-[నిశ్చయంతో] నీకు తెలీదులే అమ్మా... అంతా ఏర్పాటైపోయింది...

సరస్వతమ్మ :-ఏమిట్రా నీ పిచ్చి! ఆ చదివిందేదో చాలదూ... పట్నో మరి? డబ్బు మిగిల్చావా?

రమణయ్య :-[పట్టుదలతో] పదకరాల దుబారా రూపైందా?

నరసింహారావు :-[కోపంతో] ఏమిటీ?...ఆ, అవును... అమ్మేశాను...మొత్తం ఐదు వేలొచ్చింది...

సరస్వతమ్మ :-ఐతే, ఈ చదువుకు సరిపోతుందా, మిగిలిందా?

నరసింహారావు :-ఖర్చయిందమ్మా...ఇవ్వాళ్లిలా వుంటుంది చెల్లా.

సరస్వతమ్మ :- [దిగులుగా] లేదూ, లేదూ? చూశావన్నయ్యా...నాకు మొదట్నుంచీ భయంగానే వుంది...

రమణయ్య :-[వెటకారంగా] ఉంటే ఎందుకొస్తానమ్మా!... బాగుంది!

సరస్వతమ్మ :-మరి దీనికి ఉద్దేశ్యమేది?... ఉంటేమాత్రం నన్నిక్కడ ఏకాకిని చేసి పోదామనేనా? నీ మనసెట్లా వొప్పుతుందిరా?...

నరసింహారావు :-[తల వంచుకొని, మౌనంగా నిలబడుతాడు, ఆలోచిస్తాడు.] ఏంచెప్పనమ్మా! కాని, నే నిక్కడుండలేను... ఊహుం...నే నుండలేను...ఎక్కడున్నా ఎప్పుడూ నువ్వే జ్ఞాపకమొచ్చేదానివి...నేనుమాత్రం ఈ మురికికూపంలో పడి చావలేను...

సరస్వతమ్మ :-[అతని గడ్డం పట్టుకొని] అదేమిట్రా! మనవంశం ఆదినుంచీ ఇక్కడే వుందిగా...ఇక్కడే పుట్టారు, ఇక్కడే,

ఇక్కడే హాయిగా వెళ్లిపోయారు! ఉన్నప్పుడు తిన్నారు, లేనప్పుడు కడుపులో కాళ్లు పెట్టుకుని పడుకున్నారు! కానీ... ఊరొదిలి బైటికి పోయి భంగపాటు కాలేదు...

నరసింహారావు :-[నవ్వు తెప్పాలని] నే నేం చెప్పనమ్మా! నాతలో పనులు వేరు, నా పద్ధతి వేరు... ఉన్న పొలమంతా నీకు చెప్పకుండా అమ్మినందుకు నీకు కోపొచ్చింది... కానీ, నన్ను నమ్ము అమ్మా! అందులో ఒక్క పైసాగూడ వృథా చెయ్యలేదు... నీకు తెలుసుగా... నాకు మొదటినుంచీ చదువుకోవాలనీ, లోకజ్ఞానం సంపాదించుకోవాలనీ ఎంతో ఆరాటపడ్డా... అందుకని ఖర్చు పెట్టా కాని...

రమణయ్య :-[వెటకారంగా] తెలిసీ తగలేశా నంటాడు... ఇంకేం చేస్తావ్!

నరసింహారావు:-[విసురుగా] మామా! నీ నాటిపోటిమాటలు ఇక ఆపేసెయ్! ఎలాగైనా ఆమె వృద్ధురాలు... ప్రపంచమంటే ఏమిటో ఆమెకు తెలియకుండానే కాలం వెళ్లిపోయింది... లేపో మాతో చనిపోతుంది... నేను బ్రతికవలసిన వాణ్ణి! బావిలో కప్పలాగ ఈవూళ్లో పడి ఇదే స్వర్గమని ఆత్మవంచన చేసుకోవడం నాచేత కాదు... అందుకే ఉన్న ఆస్తంతా ఖర్చయినా లెక్కచెయ్యదలుచుకోలేదు...

రమణయ్య :-[కోపోద్రిక్తుడై] తల్లికే ఆమాటలు! చూస్తూ చూస్తూ తల్లినే!

సరస్వతమ్మ :- [అనునయిస్తూ] ఊరుకో అన్నయ్యా! వాడి మతి సరిగ్గా లేదు...

రమణయ్య :-ఇంతమాత్రాని కేం మునిగిపోయిందని వొచ్చావోయ్!

నరసింహా :-[నిర్మలంగా చూసి, జేబులోనుంచి కాగితం తీసి] ఇదిగో ఈ రసీదు రాయించుకొచ్చాను! దానిమీద మాఅమ్మ నిశానీసంతకం పెట్టించి... చదువుకోసం...

రమణయ్య :-ఏదీ, ఇలా యివ్వు!

నరసింహారావు :-[ఆకాయితం రమణయ్యచేతి కిస్తూ] నీకు అపకారం చెయ్యాలని ఎప్పుడూ అనుకోనమ్మా... నీకు కష్టం వద్దు, నామీద కోపం వద్దు...

సరస్వతమ్మ :-నే నేం చేస్తానురా—నరిసీ! ఎవరి యిష్టం వొచ్చినట్టు...

రమణయ్య :-[కాయితం చదివి] ఎంత క్రూరుడివిరా! అమ్మాయ్! ముందున్నది ముసళ్లపండుగ! నీపాలం కాస్తా మింగుతున్నాడు మొనగాడు!

సరస్వతమ్మ :-[గాభరాపడుతూ] ఏవిటది! ఏం రాశాడు!

రమణయ్య :-ఇంకేముంటుంది... నీపేరుతో వున్న నాలుగెకరాలుకూడా ఎసరుపెట్టాడు! కొడుకంటే యిట్లా వుండాలె!

నరసింహారావు :-[ఆగ్రహంతో] అమ్మా! ఈయన నీయింట్లో వుంటే నే నిక నీతో మాట్లాడను!

రమణయ్య :-ఈయిల్లుగూడా జరిగితే అంతపనీ జరుగుతుంది!

నరసింహారావు :-[గంభీరంగా] నువ్వు వేలుముద్ర వేస్తావా వెయ్యవా చెప్పు!

రమణయ్య :-అదిగూడా నువ్వే వెయ్యకపోయావ్!

సరస్వతమ్మ:-[కొంగుతో కండ్లు వొత్తుకుంటూ] అన్నయ్యా! నువ్విట్లా మాట్లాడితే నేను సహించను...[దుఃఖంతో] కడుపున పుట్టిన బిడ్డ!

రమణయ్య :-నా కెందుకులే మధ్య! ఏదో పెంచిన మమకారంతోటి, పిల్లనిచ్చి ఒకయింటివాణ్ణి చేద్దాంగదా అని... కోపం పట్టలేక అనేశాను! వాడి ముక్కుకు సూటిగా పొయ్యే తత్వం!

నరసింహారావు :-[ఆవేశంతో] నే నీవూళ్లో వుండబోవటం లేదు! నీ పిల్లని మెడలో కట్టుకుని వూరేగుతానని నే నేం మిమ్మల్ని ప్రాధేయపడటంలేదు...

రమణయ్య :-ఆ! అదే! ఇప్పుడు నీకాళ్లు పట్టుకొని బ్రతిమాలుతుంటే! పొలమమ్మకం ఎప్పుడైతే మొదలెట్టావో, నీరాత అప్పుడే బయటపడింది!

సరస్వతమ్మ :-[బ్రతిమాలుతూ] నరిసీ! పెద్దవాణ్ణి చెపుతున్నా విను! చూస్తూచూస్తూ ఎందుకు గోతిలో దించుతావ్! ఇప్పటికే మనసంసారం నలుగురి నోళ్లలో పడింది!

నరసింహారావు :-నేను చదువుకోవాలమ్మా! అంతకంటే గత్యంతరం లేదు!

రమణయ్య :- [వెంకట్రావును సురించి] అంతా వాడు నూరిపోసినట్టున్నాడు... ఈపట్నంలో అంతా వొక్కి కాడీసుంపు!

నరసింహారావు :-[ఆలోచిస్తూ] నామాట వినమ్మా! మామకూ మనకూ ఎలాగో సరిపడేట్టు లేదు... నాతో రా... హాయిగా తిన్నా తినక పోయినా పట్నంలోనే బ్రతుకుదాం...

సరస్వతమ్మ :-ఎప్పుడైనా ఇంత కఠినంగా మాట్లాడావా! నీ సావాసం మంచిది కాదు, నీచుట్టూ దుర్మార్గులు చేరారు... నీ కన్నీ చెడుబుద్ధులు నేర్పారు... నా ప్రాణంమీదకు తెచ్చావ్! పైగా నాకు ముందే స్నానం చెయ్యాలిట!

నరసింహారావు :-[కష్టంగా] నువ్వు అర్థం చేసుకోకపోతే నే నేం చెప్పను! వాళ్ల నన్యాయంగా అంటున్నావ్... నామాట వినవే... నాతో రా!

సరస్వతమ్మ :-ఒకరిపంచ పట్టే గతి నాకేంరా! హాయిగా కోటంత భవంతి వుంది...అదుకునే ఆప్తులున్నారు!

నరసింహారావు :-నేను వెడితే వొంటరిగా వుండలేవు... ఇద్దరం వెడదాం...నీమాట జవదాటను.. వొప్పుకో..."ఊ" అను!

సరస్వతమ్మ :-నే నవను! నాగొంతులో ఊపిరుండగా నే నిక్కణ్ణుంచి కదలను...[ఏడుస్తూ] పరాయూళ్ళైతే దూరమౌతుందని మా అయ్య ఇక్కడే యిచ్చాడు...ఎప్పుడో చిన్నతనంలో తిరుపతి పోయినప్పుడు తప్ప నాజీవితంలో ఈవూరిపొలిమేర దాటి ఎరగను...అబ్బో! అక్కడ మనుషులూ, బండ్లూ, మోటార్లూ...వాళ్ల లోకం వాళ్లది...మన లోకం మనది...ఏ కారుకిందనో పడి కాలువిరిగితే గొంతులో గుక్కెడు నీళ్లు పోసేవాళ్లెవరుంటార్రా!

నరసింహారావు :-[నవ్వుచెప్పాలని] నీ కేం భయంలేదే! నా ప్రాణమిచ్చి చూసుకుంటా! నా కింకేపనీ లేదూ! ఇక్కడుండి పెళ్లి చేసుకుని పిల్లల్ని కనడమేనా? నామాట విను! లేకపోతే మనిద్దరికీ సుఖముండదు...నీవంతా వెర్రిగావి. పట్నంలో నీఅంత అమాయకులూ వున్నారు, మామయ్యవంటి బొట్లూ వున్నారు—

[వెంకటరావు లోపలినుంచి పిలుస్తాడు. "నరసింహారావ్! రావోయ్! నాస్నానం పూర్తయింది!" సరస్వతమ్మ, నరసింహారావు నోటికి అరిచేయి అడ్డంపెట్టి "వుండు. వుండు. తర్వాత మాట్లాడుకుందాంలే" అంటుంది]

నరసింహారావు :-[పెద్దగానే] ఫర్వాలేదమ్మా! అతనికి మన సంగతంతా తెలుసు! పాపం, నా కెంతో డబ్బు ఖర్చుపెట్టి సహాయం చేశాడు!

సరస్వతమ్మ :-[ఆందోళన పడుతూ] వొద్దు! వొద్దు! తర్వాత మాట్లాడుకుందాం!

రవణయ్య :-నీ ఆహాస్యం గోల! ముందు నీళ్లోసుకుని అన్నం తినవోయ్! దురుకు తగ్గుతుంది!

వెంకట్రావు :-[లోపలికి వచ్చి] ముందు స్నానం కానియ్యవోయ్! అంత తొందరపడతావేం!

[నరసింహారావు మెల్లగా లోపలికి వెళ్లిపోతాడు]

రవణయ్య :-[వెంకట్రావుతో] ఏమండీ! ఎండదెబ్బ తగిలినట్టుంది...ఇప్పుడు కొంచెం అలసట తీరిందా!

వెంకట్రావు :-ఫరవాలేదండీ! బాగానే వుంది! వారికీ, మీకే శ్రమయిస్తున్నాను!

సరస్వతమ్మ :-అదెంత నాయనా! దేవుడిలాగ యింటికొచ్చిన వారికి అంతమాత్రం సత్కారం చెయ్యలేకపోతామా...

రవణయ్య :-ఏమండీ! మీకు ఈ రెండేళ్లనుంచీ...

వెంకట్రావు :-లేదండీ! నా కొక సంవత్సరంనరనుంచీ స్నేహితం...

రవణయ్య :-ఐతే మీయిద్దరూ దేహాలు రెండైనా ఆత్మ ఒకటే ననుకుంటా...

వెంకట్రావు :-అప్పట్నుంచీ మంచి స్నేహితంగానే వుంటున్నాం...అతనంటే చదువుకున్నవాడు...

రవణయ్య :-కూడండి! మనలో మాట! మనుకారం పోక అడుగుతున్నా....మనవాడెక్కడ తేమైనా వుండాముతకా...

వెంకట్రావు :-[కోపం నిగ్రహించుకొని] మీ అపోహలూ, మీఅనుమానాలకేం గాని....

రవణయ్య :-అంటే దానర్థం?

వెంకట్రావు :-ఉన్నదున్నట్టు చెప్తున్నా...

సరస్వతమ్మ :-[భయపడుతూ] చెప్పు నాయనా! అలాగే చెప్పు!

వెంకట్రావు :-మొట్టమొదట్లో కొందరు స్నేహితు లతన్ని మోసంచేసి సినిమాలు, హోటళ్లు, షికార్లు తిప్పి కొంతడబ్బు ఖర్చుపెట్టించారు. పట్నవాసం కొత్తకావడంవల్ల ఆ ఆకర్షణలలో తమా పడిపోయాడు....ఆతర్వాత ఆ స్నేహితు లెంత వారించినా వినకుండా వెళ్లి కాలేజీలో చేరాడు...ఆనాటినుంచీ ఇతను పుస్తకాలు ముందు వేసుకుని కూచుంటే, ఆ స్నేహితు లొచ్చి ఏడిపించేవారు...ముందు అమ్మింది రెండేకరాలే....తర్వాత ఆడబ్బు వృథా అయిపోయినప్పట్నుంచీ...మిగిలిన ఎనిమిదెకరాలూ అమ్మి జాగ్రత పడ్డాడు...రెండవసారి అమ్మడానికి గుంటూరు వచ్చినప్పుడు నాకు పరిచయమయింది...మా దంత వున్న కుటుంబం గాదులెండి, అందుచేత నేనుగూడా మానాన్న సైకిలుషాపులోనే పనిచేస్తూ చాలా శ్రీగా తిరిగేవాణ్ణి! నరసింహారావుస్నేహితమైనప్పటినుంచీ కొంచెం ప్రపంచమంటే తెలుసుకుని, దుర్వ్యసనాలన్నీ మానుకున్నాను...

రవణయ్య :-[నిట్టూర్చుతూ] మీకేం హాయిగా షాపులో కూచుంటారు...మావాడేమో...

వెంకట్రావు :-చదువులేనప్పుడు ఏంచేస్తావండీ...కాని, అతనంటే నాకు గురువుతో సమానం...నాతత్వాన్నే మార్చేశాడండీ....

సరస్వతమ్మ :-[సంతోషంతో] విన్నావా! అన్నయ్యా, విన్నావా! నిజంగా వాడి తెలివి పనికొస్తుంది!

రవణయ్య :-వెర్రిదాని వమ్మాయ్! మ వ్యాకుకో—నా దొక్కటే మన వుందండీ!

వెంకట్రావు :-[ఆశ్చర్యపడి] ఏమంటారూ? నాతోనా?

రవణయ్య :-మీరు చూస్తే అనుభవం వున్నవారిలా కనబడుతున్నారు...ఈ కుటుంబాన్ని నిలబెట్టే భారం మీది.

సరస్వతమ్మ :-[వెంటనే,అందుకుని] ఇంత ఆస్తి నాశనంచేసి

ఇప్పుడొచ్చి, వచ్చినదారిన పోతానంటే, కని పెంచిన తల్లికి ఎలా వుంటుందో, చూడు నాయనా!

వెంకట్రావు :-[ఆలోచిస్తూ] నే నేం చెయ్యగలనండీ! అతనే పదిమందికీ చెప్పవలసినవాడు! మంచీ చెడ్డా అతనికే తెలుసు! [విచారంతో] అతనికి సలహాయిచ్చే శక్తి నాకు లేదండీ!

సరస్వతమ్మ :-[దీనంగా] ఐతే, ఈయింట్లో దీపం యిట్లా ఆరిపోవలసిందేనా! ఇక యిట్లా ఐతే వూళ్లోవాళ్ల నోళ్లు కట్టెయ్యలేం...రేపీపాటికి నేను ఉరిపోసుకోవలసిందే...

రమణయ్య :-చూడండి! మాపిల్ల నిచ్చి వీడికి పెళ్లి చేద్దామనుకున్నాను...బుద్ధిమంతుడు, ఎక్కివస్తాడుగదా అనుకున్నా...ఒక యింటివాడై సంసారం చేస్తాడుగదా అనుకున్నాం...ఇంత మిడిమేలంగా తయారౌతాడని ఎప్పుడూ...అస లావాసన అట్లాంటిది!

వెంకట్రావు :-అదేమిటండీ...నారిమాత్రం పట్నం కాదూ... అత నన్నట్టు ఆ జీవితం మహాప్రవాహంలాంటిది...ఇది మురికికూపం! ఎంత కల్మషమైనా అక్కడ అటో యిటో కొట్టుకుపోతుంది... ఇక్కడ వున్న జీవితమే కుళ్లిపోయి దుర్వాసన వేస్తున్నది...

రమణయ్య :-[నిరాశగా] ఇంకేం లాభ మమ్మాయ్!

[బైటనుంచి పిలుపు వినిపిస్తుంది: "ఏమండీ! నరసింహారావున్నాడా!", ఇంకొక గొంతుక: "ఇందాకే వచ్చాడు, కనుక్కోండి!]

రమణయ్య :-ఎవరో వచ్చినట్టుంది—[లేచి చూసి, పెద్దగా] ఆ, ఇక్కడేనండి! లోపలికి రండి!—అమ్మాయ్! నువు లోపలికి పద!

[సరస్వతమ్మ లోపలికి వెళ్లిపోతుంది. బైటనుంచి మార్వాడీ గుమాస్తా వస్తాడు. పొడుగైన కోటూ, గోధుమరంగు టోపీ, ధోవతీ ధరించాడు. లోపలినుంచి చొక్కా తొడుక్కుంటూ నరసింహారావు వస్తాడు.]

గుమాస్తా :-ఏమయ్యా! నీకోసం విలేజంతా వెర్రి చెయ్యలేక చాలా ట్రబుల్ అయిందే...ఏమి! వాకిలిదగ్గర అంత క్రౌడ్ వుందారి?

నరసింహారావు :-ఎప్పు డొచ్చారు?

గుమాస్తా :-టూకి బయలుదేరి అర్జెంటుపనిమీద నీకోసం వచ్చినాము......మా సేట్‌జీ కారు తీసుకొనివచ్చినాము...[జేబులోనుంచి ఉత్తరం తీసియిస్తూ] మీకు ఈ లెటర్ తెచ్చినాము...

[నరసింహారావు అందుకుని, చదివి నిశ్చేష్టు డౌతాడు. తల్లి లోపలినుంచి తొంగిచూస్తూవుంటుంది. వెంకట్రావు తెలిసి ఆశ్చర్యపోతాడు. రమణయ్య తెలియక అందోళనపడతాడు]

గుమాస్తా :-రేపు మార్నింగ్‌కి అక్యుపై చేసుకోవాలి...హౌస్ ఓల్డ్ వన్నే...

రమణయ్య :-ఏమిట్రా అదీ? ఏహౌసూ!

గుమాస్తా :-[రమణయ్యతో] ఈ హౌసండీ! మా సేట్‌జీకి నరసింహారావు సేల్ చేసినాడు...

రమణయ్య :-[ఆదుర్దాగా] అమ్మాయ్! ఇట్రా! ఇట్రా! సర్వాశే దిట్రా!—[గుమాస్తాతో] ఏమన్నా రాసిచ్చాడా?

గుమాస్తా :-డాక్యుమెంటా అడుగుతున్నారు? [నవ్వుతూ] అందుకే సేట్‌జీ "కీప్ ఇట్ విత్ యూ!" అన్నాడు. [జేబులోనుంచి తీసి] ఇదిగో, మీరే చూడండి!

రమణయ్య :-[అందుకుని ,చూస్తున్నాడు. అతని కోపం, ఆవేదనా ముఖాన స్పష్టంగా కన్పిస్తున్నాయి.]

సరస్వతమ్మ :-[ముందుకు వస్తూ] ఏమిటన్నయ్యా!

గుమాస్తా :-[నరసింహారావుతో] ఏమయ్యా! మీ మదరా?

నరసింహారావు :-[తల వూపుతాడు]

గుమాస్తా :-రాం, రాం, అమ్మా! సంతోషం! చాలా సంతోషం!

రమణయ్య :-[ఉగ్రుడై] భ్రష్టుడు! వచ్చినకాడికి తెగనమ్మేశాడు...

సరస్వతమ్మ :-[కళ్లు తుడుచుకుంటూ] నాకు విన్పించన్నయ్యా! దిక్కు లేని ఆడదాన్ని ఈవిధంగా చేశాడే, ఇక నీ కెంతైనా తగును...ఇక నే నెక్కడుండేట్టు?

రమణయ్య :-అది వాగ్దానము...మొన్న రాశాడో లేదో, మూడు నెలల్లోపల ఎప్పుడైనా స్వాధీనం చేసుకోవచ్చుని పెట్టాడు...

నరసింహారావు :-[క్రుంగిపోయి]ఐతే మీ రెప్పుడు వెడతారు?

గుమాస్తా :-అక్యుపేషన్ చేసుకని, కీస్ తీసుకుని వెళతాం... మా సేట్‌జీ మార్నింగ్ కారులో వస్తాడు...ఆయనకు ఫీవర్‌గా వుండిందీ, డాక్టర్ కంట్రీసైడ్‌లో రెస్ట్ తీసుకోమన్నాడు...రాత్రికి హౌస్ క్లియర్ చేయించాలి—ఏమయ్యా! లేక్ అవుతుందా ఇల్లు?

వెంకట్రావు :-[కలగజేసుకుని] వన్ ఆఫ్ ఎ ఫైన్ హౌస్... రెండు రోజులాగమని చెప్పలేరూ ఆయనతో...

[బైట మూగిన పల్లీయుల మాటలు బిగ్గరగా వినపడతాయి! "అయిందిరోయ్"; "అమ్మేశాడురా"; "ఊరోళ్లోవాళ్లు అమ్మడమే గాని కొనడ మెక్కడుందిరా"; "ఇంకేం, బస్తీప్రాణం!" నరసింహారావు అటు చూస్తూ దిక్కు తోచక నిలబడతాడు]

గుమాస్తా :-[వెంకట్రావుతో] సేట్‌జీతో...నే నేం చెప్పగలనండీ!—నరసింహారావ్! ఈయన కేమి ఇంటరెస్టండీ...[వెంకట్రావుతో] ఆయ నింట్లో ఆయన ఎంటరైతే మధ్య మీ ఆక్షేప చేమిటండీ!...

[నరసింహారావుతో] ఏమయ్యా! మీవూళ్ళో అంతా దెవిల్సులా నున్నారే, ఏ మా వాయిస్? [రమణయ్య, సరస్వతమ్మ నిర్ఘాంతపోతారు]

సరస్వతమ్మ :-అన్నయ్యా! వాళ్లను పంపించరాదూ వెళ్లి! ఇల్లు తగలబడుతుంటే మూగినట్టున్నారే!

నరసింహారావు :-తగలబడుతుంటే ఆర్పడాని కొస్తారు, ఇప్పుడేదన్నా మండితే సంతోషించటాని కొచ్చారు.

రమణయ్య :-[వెటకారంగా] ఏదన్నా వుంటేగా తగలబడటానికి!

సరస్వతమ్మ :-[ప్రార్థిస్తూ] నువ్వెళ్లి చెప్పన్నయ్యా! మేమేం అపరాధం చేశామని? ఊరంతా ఇంటిముందే కాపురం పెట్టింది! [బైటినుంచి: "నరసింహారావ్! ఓహోయ్!" అని కేకలు; "నరసాయ్ రా!" అని వేళాకోళాలు] నే నుండలేను. ఇం కెవరి ముఖం చూసేట్టు! ఎట్లా బ్రతికేట్టు!

రమణయ్య :-[అధికారంతో] వెళ్లరాదురా! అంత నిర్భంతిగా నిలబడతావేం...ఆమ్మేటప్పుడు తెలియలా!

[నరసింహారావు రమణయ్యకేసి తిరస్కారం, నిర్లక్ష్యం వెల్లడిస్తూ చూస్తాడు. వెంకట్రావు సుమాస్తాను లేపి ముస్తురూ బైటికి వెడతారు.

బైటినుంచి కేకలు, సమాధానాలు, అరుపులు జవాబులు వినిపిస్తాయి]

సరస్వతమ్మ :-రేపటినుంచీ నన్ను పిచ్చిదాన్ని చేస్తారు... అన్నయ్యా! ఏదో మార్గం చూడు...వాడికీ, నాకూ...ఏదోవిధంగా అమ్మాయి నిచ్చి...

రమణయ్య :-[నిశ్చయంగా] 'లేనిపోని' ఆశలు పెట్టుకోవద్దమ్మాయ్!

సరస్వతమ్మ :-[పిడుగుపడినట్టు] అదేమిటి?

రమణయ్య :-దానికైనా సుఖంగా బ్రతకనియ్యి...ఇక నీతో ఆడీ, దానితో చేస్తూ, ఎదురెదురుగా ఏడుస్తూ కూచోవలసిందే... [ఆలోచించి] నే నొక మార్గం చెప్పనా...వొప్పేస్తావా...

సరస్వతమ్మ :-[ఆతురతతో] ఏమిటది? ఏం చేద్దాం?

రమణయ్య :-ఈఆస్తంతా దమ్మిడీ బేరగాకుండా పోయి నట్టే గదా...

సరస్వతమ్మ :-అదేమిటో చెప్పరాదూ...

రమణయ్య :-ఈ నాలుగెకరాలూ అమ్మి ఆసొమ్ము నాకియ్యి...

సరస్వతమ్మ :-[సంతోషంతో] పెళ్లి చేస్తావా! అలాగే, తీసుకో...

రమణయ్య :-అసంగతి ఇప్పు డెత్తవద్దు...ఈఇల్లూ, పోయిన భూమీ అంతా తిరిగొచ్చేటట్టు చేసే భారం నాది...ఎన్నేళ్లైనా సరే...

సరస్వతమ్మ :-[ఆశతో] నిజంగా? ఎట్లా?

రమణయ్య :-దావా వేద్దాం...మైనరుతరపున పెట్టి, ఏడుచెరువుల నీళ్లు తాగించనూ!

సరస్వతమ్మ :-[భయంతో] అమ్మో! కోర్టుకే! అయి నట్లాగే పదేళ్లు కోర్టుచుట్టూ తిరిగి వొళ్లు గుల్లచేసుకున్నారు...

రమణయ్య :-[వొప్పించాలని] ఎట్లాగూ పోయింది పోయినట్టే గదా! ఇక వాడు కేసిపాటికి నీకుగూడా ధ్వంసం చెయ్యడూ...

నరసింహారావు :-[తిరిగివస్తాడు] అమ్మా!

సరస్వతమ్మ :-[బాధపడుతూ] ఏం నాయనా, వాళ్లేమన్నా దూషణగా మాట్లాడుతున్నారా?

నరసింహారావు :-[గంభీరంగా] లేదమ్మా! వాళ్లు చేసింది తప్పో వొప్పో తర్వాత తేల్చుకుందాం గానీ, ఇదిమాత్రం నేను సహించలేను—మామా! నీ కేసులూ నీఅబద్ధాలూ నీతోనే తెల్లవారనీ...పుట్రతో పుట్టిన బుద్ధి పుడకలతోగాని పోదు!—

రమణయ్య :-[మండిపడి] ఏమిటే!

సరస్వతమ్మ :-ఊరుకోరా! మన మంచి కోరి చెప్తుంటే...

నరసింహారావు :-[రమణయ్యతో] నువ్వు బైటికి నడువు!... నేను మైనరుని కాను... నాజీవిత మేమిటో, నే నెట్లా బ్రతకాలో అన్నీ నాకు తెలుసు! నీకుట్రలూ కుచ్చితాలూ...

రమణయ్య :-[చేతులూపుతూ] ఏంచేస్తావోయ్!

నరసింహారావు :-నీమొఖం చూడలేను...[బైట గోల వినిపిస్తుంది]

రమణయ్య :-ఆ, ఇక నీ మొఖమే ధగధగలాడిపోతుంది! పట్నంపోయి అడుక్కుతింటే సరి! ఈచదువులూ చట్టుబండలూ ఎవరికి గొలిచాయ్...[బైట గోల హెచ్చుతుంది] వెడదాం రా అమ్మాయి! [తను చరచర వెళిపోతాడు]

సరస్వతమ్మ :-[ఏడుస్తూ] రాను! నేను రాను! ఏముఖంతో ఎట్లా వుండను ఈవూళ్లో...ఇప్పుడే నలుగురి నోళ్లలో పడ్డాం... చూడు! కాకుల్లాగ ఎట్లా మూగారో!

నరసింహారావు :-వొద్దమ్మా! ఈవూళ్లో వుండొద్దు...ఏం బావు కున్నామని ఇక్కడే ఇల కేసుకుని వుండటానికి...నాతో రా...నాకూ సుఖముంటుంది...నీమనస్సుకూ శాంతి వుంటుంది!

సరస్వతమ్మ :-[ఏడుస్తూ] నీవంటే అంత ప్రేమ వుంటే, దిక్కులేని పక్షిని చేసి...నాతో చెప్పకుండా...

నరసింహారావు :-[కళ్లలో నీరుబుకుతుంది] అమ్మా! నేనే గెలవాలని పట్టు బట్టాను... నేను ముందే చెపితే ఒప్పుకోవని నాకు తెలుసు...నాకు భవిష్యత్తు వుంది! నన్ను లొంగదీయడానికి లోకులు చెప్పే యుక్తులన్నీ నమ్మకావు...అందుచేత రహస్యంగా అమ్మేశా...తప్పని సరి అయింది...నన్ను నమ్ము అమ్మా!

సరస్వతమ్మ :-నీకూ నాకూ ఏదో కక్ష వున్నట్టు మాట్లాడతా వేంరా! గెలవడ మేమిటి, ఓడిపోవడ మేమిటి!

నరసింహారావు:-నన్ను క్షమించమ్మా! తెలిస్తే ఆరా తీసైనా పట్టుకుంటారు ఈవూళ్ళో పెద్దలు...నీదగ్గరికొస్తే నీ దుఃఖం చూసి నీమాట జవదాటిపోలేనని ఇన్నాళ్లూ ఈవూళ్ళో అడుగు పెట్టలేదు... నీ కర్థం కాదమ్మా! ఇక్కడున్న జీవితం వేరు! నేను కోరుతున్న జీవితం వేరు! [ఆమె రెండుభుజాలమీద చేతులు వేస్తాడు] చూడు! నే నిప్పుడు యౌవనంలో వున్నానా! ఈ ప్రపంచాన్ని ఈ రెండు హస్తాలమధ్య పట్టుకొని, ఒక్కసారి కుదిపి పకపక నవ్వాలని వుంది నాకు! ఈ భూమిమీద ఎన్ని బ్రతుకులున్నాయో, ఎన్ని ఆత్మలున్నాయో, అన్నిటితో నా శ్రుతి కలిపి, తీవ్రంగా నిండుగా గంభీరంగా బ్రతకాలని వుంది నాకు! నీ కర్థం కాదు! ఏం చెయ్యను? ఎలాగ? నీ కర్థంకాదు!—

సరస్వతమ్మ :-[నవ్వూ, ఏడుపూ] నీ మాటలేమిటో, నువ్వేమిటో! వెర్రివాడివి!

నరసింహారావు :-నాతో రా అమ్మా! నా ప్రాణమిస్తా, రా.

సరస్వతమ్మ :-(మెల్లగా నిశ్చయంతో) వస్తా నాయనా. ఇక్కడ నే నుండను! అప్పుడే ఈ వూరంతా వుడికిపోయింది! ఇం కేం తలపెడతారో! నాకు దిక్కేముంది!

నరసింహారావు : [ఆదుర్దాతో] నేనున్నా నమ్మా! అమ్మా! నన్ను స్వయంగా బ్రతకనివ్వండి! నాకు ఆశలున్నాయి, ఆదర్శాలున్నాయి! వాటికోసం పోరాడి ఓడిపోయినా అదేనాకు ఆనందం.

సరస్వతమ్మ :-[కౌగలించుకుని] వస్తా! అట్లాగే వస్తా! [ఒళ్లు తడుముతూ] చూడు! నీ వొళ్లెట్లా కృశించిపోతున్నదో...అక్కడికే వస్తా...

నరసింహారావు :-[ఆనందంతో] నిజంగా వస్తావా! నిజంగా? చూడు! నామీద కోపం లేదుగదూ! పోదాం! రైలుదేరి వెళిపోదాం. సామానన్నీ సర్దు!

[వెంకట్రావు ప్రవేశిస్తూ. "రేపు సాయంత్రం ఖాళీ చెయ్యడానికి ఒప్పుకున్నారోయ్" అంటాడు. ఇద్దరూ పరవశులై వుండటం చూసి వెనక్కు వెళిపోతాడు. అతన్ని ఇద్దరూ గమనించరు.]

సరస్వతమ్మ:-[ఆప్యాయంగా] పిచ్చి తండ్రీ! ఐతే, ఇన్నాళ్ళ ఇంతదేశం చూశావు గదా, కాశీ వెళ్ళొచ్చావా లేదా?

నరసింహారావు :-[ఆశ్చర్యంతో] కావాలంటే వెడదాంలే అమ్మా!

సరస్వతమ్మ :-[చింతపడుతూ] ఇన్ని చోట్ల కెళ్లి అక్కడి కెళ్ళకపోతే ఫలితం ఏముందిరా!

నరసింహారావు :-[నొక్కి చెపుతూ] వెళ్లానే వెళ్ళాను! కాని సీటు లేదు!

సరస్వతమ్మ :-ఐతే గంగాస్నానం చేశావా లేదా?

నరసింహారావు :-[నవ్వుతూ] చేశానే అమ్మా!

సరస్వతమ్మ :-[సంతృప్తి సంతోషాలతో] నాకు తెలుసు. నువ్వూరికే డబ్బు ఖర్చు పెట్టవు! పోనీలే, పుణ్యమన్నా దక్కింది. [లోపలికి వెళ్లిపోతుంది]

వెంకట్రావు :-[నవ్వుతూ ప్రవేశిస్తాడు] ఇటీజ్ మోర్ లైక్ ఎ డ్రామా!

నరసింహారావు :-నో! ఇటీజ్ లైఫ్!

సరస్వతమ్మ :-[లోపలినుంచి] లోపలికి రండి!



# ఆంధ్రులు - సంగీతము

★

శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ



ఆంధ్రులకు తెలుగుభాషలో సాహిత్యం పుట్టక మునున్నూఱ్ఱండల యేండ్ల మొదలే సంగీతంలో స్థిర సంబంధం కలిగింది. నన్నయకు మొదలు మన భాషలో సాహిత్య ముండెననేమాట నేటికీ నిస్సంకోచంగా చెప్పలేకున్నాము. తర్క-చరిత్రల సాహాయ్యంతో ఎంత ప్రయత్నించినా క్రీస్తుశకం పదెనిమిదవ శతకాలకు వెనుక ఆంధ్రసాహిత్యపు పోకడను ఊడ్చుకోపోలేము. కాని క్రీస్తుకుపూర్వమే సంగీతకళాప్రపంచంలో ఆంధ్రులకు స్థానం లాక్షణికు లంగీకరించినారు.

### మొట్టమొదటి సంగీత వ్యాకరణం :

ఇప్పటికి భారతీయసంగీతకళకు మొదటి లక్షణగ్రంథం భరతమునినాట్యశాస్త్రం. సామవేదాన్ని పాడే ప్రయత్నంలో సప్తస్వరాలను కనుక్కొన్న వెంటనే స్థాయిత్రయం, వికృతిస్వరాలు, సూక్ష్మశ్రుతులు, గ్రహస్వరభేదంతో కలిగే రాగభేదాలు మొదలైనవన్నీ క్రమంగా ప్రత్యక్షము కాజొచ్చి సంగీతకళ స్వచ్ఛందంగా విహరించేందుకు ప్రయత్నించింది. అప్పుడు దాన్ని 'పితామహుడు' సామగానంనుంచి వేరుపరచి ప్రాచీనగానసంప్రదాయాన్ని రక్షించినాడు. భరతుడు ఆ సమయంలో ఆ కళను చక్కగా శోధించి, వివరించి, నాదశాస్త్రం రచించవలసివచ్చినాడు. నాట్యశాస్త్రం ౨౮, ౨౯, ౩౦ వ అధ్యాయాలలో ఉన్న దీ మొట్టమొదటి సంగీతవ్యాకరణం.

ఉత్తరోత్తరవృద్ధిగా స్థూలస్వరాలను ఏడింటిని పాడుతూ ఇంకా మీాదికి పోబోతే యెనిమిదవ స్వరం మొదటి స్వరంతో సర్వవిధాలా సమానమై, ప్రయత్నంలోమాత్రం ద్విగుణమై అగపడుతుంది. మొదటి స్వరంనుంచీ క్రిందికి దిగినా అదే అనుభవమే వస్తుంది. కనుక నాదప్రపంచమంతా ఏడు స్వరాలలోనే ఇమిడింద౦ని తెలుస్తుంది. ఈ స్వరాలలో మొదటిది మిగిలిన స్వరాల స్వరూపాన్ని నిర్ణయిస్తూ ప్రధానతమంగా ఉంటుంది. దానినే గ్రహస్వర మంటారు. మిగిలిన ఆరు స్వరాలను పుట్టించేదిగనుక దాన్ని 'షడ్జం' అన్నారు. తక్కిన ఆరుస్వరాలలో దేనిని ప్రధానంగా నిలిపి పాట నడపినా అదే షడ్జంవలె పనిచేస్తుంది. కాని ఒక్కొక్కటి గ్రహమైనప్పుడు ఒక్కొక్క వింతరక్తి అనుభూతమౌతుంది. కనుక షాడ్జి, ఆర్షభి, గాంధారి, మధ్యమ, పంచమి, ధైవతి, నైషాది అని యేడు 'జాతులు'— అంటే ఇప్పటి మాటలో రాగాలు— ఆ కాలంలో స్ఫురించినవి. ఇవి యేడూ శుద్ధజాతులని, వీటి పరస్పరసంకరంతో ఏర్పడినవి వికృతజాతులు పదకొండని, మొత్తం ౧౮ జాతులు భరతునికి కానవచ్చినవి. విస్తరాన్ని మన్నిస్తే వాటి కాయనకాలపు పేర్లు ఉదాహరిస్తాను:

(౧) షాడ్జీ మొదలైనవి పైన వ్రాసినవి ౭ శుద్ధజాతులు.

(౨) షడ్జోదీచ్యవతి, షడ్జకైశికి, షడ్జమధ్యమ, రక్తగాంధారి, గాంధారోదీచ్యవ, మధ్యమోదీచ్యవ, గాంధారపంచమి, ఆంధ్రి, నందయంతి, కార్మారవి, కైశికి. (నాట్య శా. ౨౮ వ అధ్యా)

## తక్కిన ఏజాతికీ రాని గౌరవం:

ఈ పేళ్ళే తరువాతి మతంగాదిలాక్షణికులు అనువాదించినారు. వీటిలో ఒకముఖ్యమైన వింత మనం గమనించవచ్చును. ఏమంటే: వికృతరాగాల పేళ్లలో 'ఉదీచ్య' శబ్దం కలవి మూడు. ఉత్తరదేశానికి సంబంధించిన వన్నమాట. అంతేకాని ఫలానాదేశమని స్పష్టంగా చెప్పలేను. స్పష్టంగా జాతిపేరు గలది 'ఆంధ్రి'యే. 'కార్మారవి'కూడా ఏదేశాన్నైనా సూచిస్తుందేమో చెప్పలేను. మరి మూడుజాతుల పేళ్ళలో 'గాంధార' శబ్ద మున్నా అది గాంధారదేశబోధకం కాదు. గాంధారస్వరాన్ని గ్రహంగా చేసుకొన్న 'గాంధారి' జాతితో ఇతరజాతుల మిశ్రణంమూలాన ఏర్పడిన వికృతముల పేళ్లవి. అసలు సప్తస్వరాలలో ఒకటైన గాంధారమే గాంధారదేశం మన కిచ్చినప్రసాదంగా భావించడం ఊహను మితిమీరి సాగదీయడమే. గాంధారస్వరానికి మతంగు డిచ్చిన వ్యుత్పత్తి 'వాచం గానాత్మికాం ధత్తే ఇతి గాంధారసంజ్ఞకః' అని. చెప్పవచ్చిందేమంటే—ప్రాచీనతరమైన ౧౮ జాతిరాగాలలో విశిష్టమైన ఆంధ్రజాతివారి సృష్టి ఒకటనేది నిస్సందేహమని, తక్కిన యేజాతివారికీ ఆ గౌరవం రాలేదని. 'నందయంతి'వలె 'ఆంధ్రి' కూడా వట్టి సంకేతనామమేల కారాదని ప్రశ్నింపవచ్చును. కాని ప్రాచీనులు దీన్ని దేశవాచకంగానే గ్రహించిరి. రేచెర్ల సర్వజ్ఞ సింగమనీడు సంగీతరత్నాకరవ్యాఖ్యలో 'యా దేశ నామ్నా జాయతే సా దేశాఖ్యా ఆంధ్ర్యాదిః' అని నిర్వచించెను. (అడయారుముద్రణం. సంపు. ౨, పు. ౧౪) మరొక వ్యాఖ్యాత చతురకల్లినాథుడు 'స్యాదాంధ్రీ చాంధ్రదేశజా' అన్నాడు (పు. ౧౫). ఇంతే కాదు. భరతమునికాలానికి తర్వాత ఈ జాతులకు లాక్షణికులు వేసిన కట్లన్నీ తెగిపోజొచ్చినవి. ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్కవిధంగా వాటిని పాడుకొన్నారు. మతంగాదిలాక్షణికులు అట్లు మారిన రాగాలను 'భాష' లనిరి. ఈ భాషారాగాలూ మారి 'విభాషలూ,' అవీ మారి 'అంతరభాషలూ' వ్యాప్తికి వచ్చినవి. పైవాటిలో పంచమరాగభాష ఒకి 'ఆంధ్రి', దాని విభాష 'ఆంధాళిక' కలవు. ఇట్లే టక్కరాగానికి విభాష ఒక 'ఆంధ్రి'. (సం. రత్నా. ౨-౨౭...) ఆంధ్రి ప్రాకృతరూపమే 'ఆంధాళి' అనుకుంటాను. ఈ రాగాన్ని 'కిన్నరవల్లభా' అని వర్ణించినాడు మతంగుడు (బృహ. పు. ౧౨౩).

ఈ ప్రాచీనరాగాలలో 'కకుభ' రాగానికి 'భాష'గా 'శాలవాహనికా' అనే రాగ మొకటి మతంగ శార్ఙ్గదేవులు పేర్కొన్నారు. ఇది ప్రాచీనాంధ్రరాజులలో ఎవరో కల్పించిందో, ప్రోత్సహించిందో కావచ్చునని ఊహించడం న్యాయ మౌతుంది.

## కర్ణాటకమని పేరు వచ్చుటకు కారణం:

శుద్ధస్వరజాతులు వికృతములైనప్పుడు ప్రాచీన లాక్షణికులు మొదలు ఆంధ్రుల 'జాతి'లోని విశిష్టతను గమనించి అనుగ్రహించినతరువాత ఇతరప్రాంతాలవారి 'భాష'లనుగూడా పరిగ్రహింపకతీరదని తెలుసుకొన్నారు. రంజనమే రాగధర్మంగా ఏర్పడినతరువాత ఆ రంజకత యేమూల నున్నా పరిగ్రాహ్యమే. కనుక ద్రవిడ, గౌడ, బంగాళ, త్రవణ, గుర్జర, మాలవ, వరాట, కర్ణాటాదిదేశాల 'భాష'ల నన్నిటినీ ఒక్క సామ్రాజ్యంక్రింద తెచ్చి ప్రాచీనులు సంగీతసంసారాన్ని విశాలంగా పెంచినారు. అందులోను కర్ణాటుల ప్రసాదం చాలా ప్రబలమైనది. కర్ణాట-కన్నడశబ్దాలతో కూడిన రాగాలు తరువాతికాలంలో అసంఖ్యంగా వెలసినవి. దాక్షిణాత్యసంగీతపద్ధతికి కర్ణాటకమని తరువాతవచ్చిన ప్రసిద్ధి కిదొక ముఖ్యహేతువు. ఈ సంతలో అసలు 'ఆంధ్రి'గాని, దాని భాషావిభాషాంతరభాషలుగాని ప్రత్యేకంగా కానరాక ఎందో కరగి కలిసిపోయినట్లున్నది.మీద నే నూహించినట్లు 'ఆంధాళి' 'ఆంధ్రి'కి అపభ్రంశమైనదే నిజమైతే అదొక్కటిమాత్రం ఇంకా మినుకుమినుకంటూ ఉన్నది. త్యాగయ్యగారి 'అభిమానము లేదేమి' అనే కీర్తనా, ముత్తుస్వామి దీక్షితుల 'బృహన్నాయకీ' అనే కృతీ ఈ రాగాన్ని ఇంతవరకూ పట్టుకొని పాకులాడుతూ ఉన్నవి. పాల్కురికి సోమన్న పండితారాధ్యచరిత్రలో (పు.౪౫౧) అష్టోత్తరశతరాగనామాలు పట్టీవేసినాడు. బసవపురాణంలో (పు. ౮౦) బత్తీసాదిరాగాలు (౩౨) పేర్కొన్నాడు. ఈ రెంటిలోను 'ఆంధ్రి' లేదు! పండితారాధ్యచరిత్రలోని 'ఆందోళి' 'ఆంధాళి'కి అపభ్రంశం కావచ్చునేమో అనే ఆశ కలదు. కాని రామామాత్యుడు 'స్వరమేళకళానిధి'లో ఈ 'ఆందోళి'ని లక్షించి అధమరాగాలలో చేర్చిపెట్టినాడు! (రాగ. పు. ౬౫) త్యాగయ్యగారి 'రాగసుధారసపానముచేసి' అనే కీర్తన ఈరాగంలో ఉంది. కాని దానికి 'మయూరధ్వని' అనే పెద్దపేరిం

కొకటి వాడుకలో కొందరు తెచ్చినారు! తేలిందేమంటే, ప్రాచీనాంధ్రులు కేవలం రక్తిఫలంగా సంగీతకళను పెంచడంలో భారతీయసముదాయంతో ఏకమై పని చేసిరేకాని, తమ ప్రతిష్ఠకై, 'తాతస్య కూపోఽయం'గా స్వల్పతృప్తితో స్వార్థపరాయణులుగా ఉండ లేదన్న మాట.

పనిచేసినారంటే అఖండంగా చేసినారు. లక్ష్య మార్గంలో ఆంధ్రులు చేసిన నూతననిర్మాణాలు మన కంతగా తెలియవు. తెలుగుకాంబోది, ఎరుకలకాంబోది అనే పేళ్లలో తెలుగుకైవాడం స్పష్టమే. కాని ఆ రెండూ ఒకటే కాబోలును. 'ఎరుకలకాంబోది' 'యదుకులకాంభోజి'గా సంస్కృతమైనట్లే, తెలుగుకాంబోది 'తిలక్ కామోద్'గా ఉత్తరహిందూస్థానసంగీతగంగలో మునిగి మడికట్టుకొన్న దనిపిస్తుంది. హిందూస్తానీవారి 'తెలంగ్' రాగంలో గల తెలుంగుసంప్రదాయమూలం స్పష్టమే. తంజావూరి రఘునాథభూపాలుడు 'జయంతసేన' మొదలైన క్రొత్తరాగాలను కొన్నిటిని కల్పించెనట. 'జయంతసేన'లో త్యాగయ్య 'వినతాసుత వాహన' అనే కృతి రచించెను.

### లక్షణమార్గంలో ఆంధ్రుల అమోఘయత్నాలు :

కాని లక్షణమార్గంలో ఆంధ్రులు చేసిన ప్రయత్నం, సంగీతకళకు వారు జనజీవితంలో సంపాదించిన వ్యాప్తి చాలా విలువగలవి. సర్వజ్ఞ సింగమనాయనిది సంగీతరత్నాకరవ్యాఖ్యలలో మొదటిది. రామామాత్యుని స్వరమేళకళానిధి—వేంకటమఖి ఎంత దుమ్మెత్తిపోసినా—మన సంగీతకళలోని పలుమర్మములను తెలుపుతూ ఉంది. అహోబలపండితుని 'సంగీతపారిజాతం' ఎన్నో లక్షణవిషయాల కాకరంగా ఉన్నది. గోవిందుని 'సంగీతశాస్త్రసంక్షేపం' ఇప్పటి లక్ష్యపద్ధతి కెక్కువ సమీపంగా ఉండడమేకాక ఎన్నో రాగాలకు ఆంధ్రసంప్రదాయవిశేషాలు గుర్తించి పెట్టింది. ముద్రణ కెక్కిన వీనాది గ్రంథాలు కాక, కాకతీయులు, రెడ్లు, వెలమలు, కర్ణాటులు, నాయకులు, మహారాష్ట్రులు మొదలైన రాజుల రాజ్యాల చలవలో తెలుగుప్రభువులూ, పండితులూ రచించిన లక్షణగ్రంథాలెన్నో, ఎంతో అమూల్యమైనవి, అక్కడక్కడ పుస్తకభాండారాలలో శిథిలాశిథిలస్థితిలో ఉన్నవి. వాటిలో కొన్నిటినైనా ప్రకటించే ప్రయత్నం ఇక్కడక్కడ కానవస్తూవుండేది శుభోదర్కంగా భావిస్తాను. లక్షణపంథలో ఆంధ్రులు కొన్ని కొత్తతెన్నులు తీసినారనడానికి సోమనాథుని పండితారాధ్యచరిత్రలో ఒక సాక్ష్యం కలదు. భరతముని సప్తస్వరాలకూ నిర్ణయించిన ఇరవైరెండు శ్రుతులకు తరువాతి లాక్షణికులు తీవ్ర, కుముద్వతి, మంద ఇత్యాదిగా పేళ్లు పెట్టిరి. కాని సోమనాథు డిచ్చినవి సకల, గూఢ, నిష్కల - ఇత్యాదులు (పు. ౮౪౧).

### సంగీత కళను జీవితానందానికి వినియోగించుకోవడంలో ఆంధ్రుల ఉత్సాహం :

ఇక సంగీతకళను సాత్మ్యకరించుకొని అంతరంగ బహిరంగజీవితాన్ని ఆనందమయంగా చేసుకోవడంలో ఆంధ్రులు చూపిన ఉత్సాహం అపరిమితమైనది. సాహిత్యంలోని సాక్ష్యాన్ని బట్టి చూస్తే పురాణాలకాలంలో కొంత మరుగుగా ఉన్న గానలోలత ప్రబంధాల కాలంలో సర్వతోముఖంగా వికసించింది. కృష్ణదేవరాయల కాలంలో 'అల్లసానివాని అల్లిక'మూలాన వరూథిని 'జిలిబిలిపాట'లోని నాట, దేశాక్షి రాగాలు నేటికిని మాసిపోలేదు. తిమ్మన్న పలుకులనిండా సంగీతపు ముద్దు ప్రతిఫలించింది. రాయల ఆముక్తమాల్యదలో గోదాదేవి పాడిన 'మేఘరంజి', మాలదాసరి పాడిన 'మంగళకైశికి' రాగాలు ఆకాలంలోని రాగాభిరుచిని చాటుచున్నవి. రాయల రాయబయకారుడు బండారు లక్ష్మీనారాయణకవి రచించిన 'సంగీతసూర్యోదయం' ఆంధ్రుల ఉదాసీనంమూలాన ఇంకా మద్రాసుభండారంలోనే మూలుగుతూ వున్నది. సూరన్న కళాపూర్ణోదయంలో 'విద్యలందెల్ల సంగీత విద్య మిగుల నుత్తమము గాదె' అని ధైర్యంగా ప్రశ్నించినాడు (౨-౬౯). నిజంగా ఆ యద్భుతకథ కంతా తల్లివేరువంటిది నారదుని, కలభాషిణీ మణికంధరుల సంగీతాభ్యాస ప్రయత్నమే. రాజాస్థానములలో ప్రవేశం లభించుటకై ఆకాలపు సంగీతవిద్వాంసు లెంత తహతహపడుతూ వుండిరో, అక్కడ గౌరవసన్మానాలు సంపాదించిన వారిని జూచి ఇతరగాయకు లెంత కడుపుచిచ్చుతో వేగుతూఉండిరో, ఒకరినొకరు జయించవలెనని ఎంత పట్టుదలతో వ్యాసంగం చేస్తూవుండిరో - నారదతుంబురుల కథలో సూరన్న చాలా మనోహరంగా వివరించి

నాడు. శ్రీకృష్ణుని యష్టమహిషులలో నొకర్తె జాంబవతి వీణమీట్టి పాడిన పాటను సూరన్న భావనలో ఎట్లనుభవించినాడో చూడండి.—

"ప్రౌఢితో షరిగమపధని స్వరంబుల
ప్రతినియతశ్రుతిక్రమము దెలిసి,
రాగభేదముల వర్ణక్రమంబు దొలంగించి
లయతాల శుద్ధి నెంతయు దలిర్ప,
గ్రామవిశేషమూర్ఛన లేరుపడ మంద్ర
మధ్యమతార సామగ్రి దనర,
ధాతుమాతువులు గీతప్రబంధములందు
వసమానలీలమై వతిశయిల్ల,
కోరమున బ్రేమరసమున దోచి తోచి
వీనులకు నిండు జలువయౌ విస్తరిలగ
శాకరణి దనకొంత యనేకగతుల
వాక్కు గుణగానములు సేయ వచ్చుతుండు."　(౨-౩౮)

ఇంతే కాదు. సంగీతకళయందు నిర్దుష్టమైన పరిణతి 'పుండరీకాక్షుని యనుగ్రహంబునకాని ఫలియింప నేరదు' అనే తత్త్వాన్ని విశదీకరించుకొరకే సూరన ఈ కథ వ్రాసినట్లున్నది. మరి ఆ కాలంలోని ఇంకొక 'సంగీతకళారహస్యనిధి' రామరాజభూషణుడు. ప్రతిపద్యంలోనూ అపూర్వశబ్దార్థకల్పన చేసిన గ్రంథమైనా ఆయన వసుచరిత్రభాషాధార నోటినిండా పాటపాడినవాని నిర్లక్ష్యపు నాజూకుతోనే నడిచింది. 'అరిగా బంచమ మేళగించి' (౧-౧౭౯)అనే పద్యంలో ఆకాలపు హిందోళ వసంతరాగాల వైఖరి బయలు పడుతుంది. 'అకుటిల సౌమ్యమాన నిలయస్ఫురణంబును' (౫-౭౧) అనే పద్యంలోని 'సింధుకన్యక' గిరిక, లక్ష్మి మాత్రమే కాకుండా 'సైంధవి' రాగం కూడా అవునేమో! 'పదమెత్తంగల హంసలీల' (3-౫౯) అనే పద్యంలోని కలహంసలీల, రాగకదంబకము, శ్రీ, వరాళి లాలక్ష్మి-ఇవి సంగీత శాస్త్రదృష్టితో చర్చింపవలసిన పదాలు. 'ఏల' ఇంకా 'యాలపదం'గా తెలుగుజనత నోట బ్రతికిఉన్న పాట. మతంగుని కాలానికే ఆంధ్రుల 'ఏల' ప్రసిద్ధం.

"అనేకగమకాకీర్ణాం అనేక స్వరమిశ్రితామ్,
అనేక రాగసంకీర్ణాం ఏలా మాంధ్రీం విదు ర్బుధాః"

(బృహద్దేశి, పు.౧౨౭)

అని అతడు దాన్ని నిర్వచించినాడు. గిరికాదేవి వీణవాయించే సీనంలో రామరాజభూషణుడు తన సంగీతరహస్యజ్ఞతను పొదిగినాడు (౨-౩౦). వీణమెట్లు రాగానుసారంగా, చితారు మొదలైన వాద్యాలవలె మార్చుకోవలసినట్లు శిథిలంగా ఉండేవి పూర్వకాలంలో. పూర్వకాలమేమి? పెద్దన్న కాలంలోనే 'నాట'కు మేళమైన వీణను 'దేశాక్షి'కి ప్రత్యేకంగా మేళగింపవలసి ఉండేది (చూ.'వాలారుం గొనగోళ్ళ'). దానివల్ల వచ్చే తొందరను గమనించి వీణకు మైనములో మెట్లు స్థిరంగా పొదిగించే యేర్పాటు రామరాజభూషణుడే చేసిందని తెలుగునాటి వృద్ధుల నమ్మకం.

ఆంధ్రుల చేతిక్రింది కర్ణాటకసామ్రాజ్యంలో పెరిగిన యీ సంగీతరసికత అది శీర్ణమైనతర్వాతకూడా తంజావూరు మధుర పుదుక్కోట మొదలైన క్షుద్ర రాజ్యాలలో చొచ్చి శతగుణితంగా వ్యాపించింది. దక్షిణాంధ్రసాహిత్యంలో కానవచ్చే అసాధారణభాషా ధారామాధుర్యానికి ఆకాలంవారి సంగీతప్రియత ప్రధాన కారణ మనడం అసత్యం కాదు. ఎగుడుదిగుళ్ళు గల భాషారచనలలో సంగీతనాదధార వ్యాపించదు.

కర్ణాటకసంగీతమందలి గీతసాహిత్యంలో
ఆంధ్రులపాలు అందరికన్నా పెద్దది:

కర్ణాటకసంగీతమందలి గీతసాహిత్యంలో ఆంధ్రులపాలు అందరికంటె పెద్దదనే మాట చెప్ప బనిలేదు. కాని ప్రాచీనాంధ్రుల రచనలలో చాలాభాగం నశించిపోయిం దనుకోవడంలో తప్పేమీ లేదు. నిన్న మొన్నటిదాకా ఆ మహామహుడు, అమానుషసంకల్పసిద్ధుడు తాళ్ళపాక అన్నమయ్యగారి వేనవేల పదాలు, ఆయనసంతతివారి రచనలు ఉన్నవనికూడా మనకు తెలియదు. తంజావూరి నాయకమహారాష్ట్రరాజుల కాలము నాటి ఆంధ్రగేయరచనలు నశించినవి పోగా మిగిలినవే 'సరస్వతీమహాలు' లో పరస్సహస్రంగా ఉన్నవి— ఇంకా చెదలపాలు కాకుండా. త్యాగయ్యగారి మాట చెప్పపనిలేదుగదా. ఆయనకు ముందు, సమకాలంలో, తర్వాత నిన్న మొన్నటివరకూ, మాతృభాషా స్వదేశమూ ఏదైనా బయటవాళ్లు తెలుగులోనే యెక్కువగా రచనలు సాగించినారనేది రహస్యవిషయం కాదు. అందులో ఎందరో, అచ్చంతెలుగువారు పలుపురికంటె



౧. శీతబాధితుడు
[మృణ్మయశిల్పము]

ఆంధ్రపత్రిక వికృతి సంవత్సరాది సంచిక

—శిల్పి : శ్రీ దేవీప్రసాద్ రాయచౌద



౨. మత్తమయూరము

[నీటిరంగుల త్రివర్ణచిత్రమునకు ఛాయారూపము]

—చిత్రకారుడు : శ్రీ దేవీప్రసాద్ రాయచౌదరి



3. గాయనీగాయకులు

ఆంధ్రపత్రిక విక్రృతి సంవత్సరాది సంచిక

[నీటిరంగుల త్రివర్ణ చిత్రమునకు ఛాయారూపము]

—చిత్రకారుడు : శ్రీ దేవీప్రసాద్ రాయచౌదరి



౪. సందిగ్ధవ్యక్తి

[నీటిరంగుల త్రివర్ణచిత్రమునకు ఛాయారూపము]

—చిత్రకారుడు : శ్రీ దేవీప్రసాద్ రాయచౌదరి

మేలైన రచన చేసినా రసడంకూడా విమర్శనహమే. అచ్చపు అరవ దొరసామయ్య - త్యాగయ్య కన్నా వృద్ధుడు - వర్ణించిన యీ నటరాజతాండవాన్ని రుచి చూడండి...

ఘరజురాగం—ఆదితాళం

ప॥ ఆడెనమ్మ, హరుడు ద్రుకుట్టుదైయని॥
అ॥ జాడగ గిరికన్యకను శ్రీగంటజాడ నంజ సెబాసని కొనియాడ,
నాడజాడ వేడుకగా చంద్రమాడుండు మూడుకండ్లవాడు॥
చ॥ చెవులనుండు తాటంకకుండలచ్ఛవి చెక్కుటమెరుగారజాహ్నవీ
యుకటీయుక్తమైన జడగట్టు ముడీయు వీడి యుసియాడ,
నవరసంబు లొలుక - మోము చిరునవ్వు ముద్దుగులుక, త్రి
భువనావనచతురుడై వెలయు త్రిపురహరుడు వడుము గిల్లని
[తిరుగ. (ఆడె)

ఇటువంటి వెన్నో! తంజాడీతమ్ము లిద్దరూ తెలుగులోనే ఎన్నో రచనలు చేసియుండగా, త్యాగయ్య గారిమీద స్పర్థతో అంటారు - సంస్కృతంలోనే రచనంతా సాగించిన ముత్తుస్వామిదీక్షితుల మనమడు అచ్చపు అరవవాడు సుబ్బరామదీక్షితులు తెలుగులో వ్రాసిన 'సంప్రదాయప్రదర్శిని' ఇప్పటి సంగీతలక్షణ గ్రంథాలకల్లా తలమానిక మైనది. ఆయనకృతుల లోనూ కష్టపడి నేర్చుకున్న తెలుగుపాండిత్యపు పోకడలు నిండినవి.

కర్ణాటకసంగీతపద్ధతిలో తెలుగుభాషకు వచ్చిన ఈవ్యాప్తికి కారణం ఆభాషలోని సహజమైన మాధుర్యసారళ్యాలే అనే దొక సంప్రదాయం. నిజం చూడబోతే ఈమాట తలకిందుగా చెప్పవలసిఉంటుంది. సంగీతంలో ఎక్కువగా వాడడంచేత, ఆ భాష కా రెండుగుణాలూ తప్పక రావలసివచ్చినవి; తెలుగువారి సంగీతప్రియత్వాన్ని వా రేదేశం వెళ్ళినా వెంటదీసికొనిపోయి ప్రజల మీద చల్లడంమూలాన ఈ సంప్రదాయగౌరవం ఆ భాష కబ్బింది - అనుకోవడమే న్యాయము.

కడపటి దొక్కమాట: సంగీతం సర్వజనీన విద్య; కళ. అది భాషామతాదిప్రయుక్తమైన యెల్లలన్నీ దాటగలది. విశ్వమానవసౌహార్దసౌభ్రాత్రాలకది దృఢమైన బునాది. ఆ అనంతప్రపంచంలో ఆంధ్రులు, కన్నడులు, అరవలు - ఇత్యాదిగా మొండిగోడలు లేవబూనడం మానవధర్మానికే అపచారం. కాని ఇల్లూ బయలూ రెండూ మనుష్యజీవనంలో విధిలేక ఉండవలసిన తత్వాలు. ఏపని చేసినా ఆ రెంటిలో దేనినీ మరచిపోకుండా ఉండగల్గేదే సంస్కారసాధనఫలం. విశ్వతో విశాలమైన సంగీతకళను ఆత్మార్థంగా ఆంధ్రులు ఎట్లు, ఎంతవరకూ భజించిరి? వారి ఆ భక్తి ఇరుగుపొరుగువారి యోగక్షేమాలకు ఎంతమట్టుకు సాధనమై సార్థకమైనది? ముందింకా ఎట్లు దాని నారాధింపగలము?—అనే దృష్టితోనే ఈ విషయం పరిశీలించవలసింది. ఈ వ్యాస మా ఉద్దేశంతోనే వ్రాసినది. అంతకుమించి యే ఆంధ్రునికైనా ఇది స్వాభిమానానికీ, పరావధీరణకూ ప్రేరకమైతే అంతకంటె పశ్చాత్తాపకరమైన విషయ ముండదు.

కథానిక:

# చలిజ్వరం

'కరుణకుమార'

"జవాన్లు ఇద్దరు."

"ఊ"

"ఒక గుమాస్తా."

"ఊ !"

"వంటవాడు."

"ఊ !"

"తహాశీల్ దారుపంతులూ."

"ఊ !"

"బియ్యం మూడు శేర్లు.
పప్పు శేరు.
చింతపండు వీశ.
మిరపకాయ లరవీశ.
ఉప్పు అర్ధశేరు.
కాఫీగింజ లరవీశ.
చక్కెర వీశ.
నెయ్యి వీశ.
విస్తరాకులు ఒకకట్ట.
ఉల్లిగడ్డలు వీశ.
మినపబేడలు శేరు.
మెంతులు, జీలకఱ్ఱ, ఆవాలూ 5 దేసి పలాలు.
ఆకులూ, వక్కలూ, లవంగాలూ వ్రాశావా."

వంటమనిషి చెప్పినప్రకారం పట్టీ వ్రాసి వంతు అంగడికి పంపించాడు మునసబు.

తాను గ్రామమునసబు నౌకరీకి వచ్చినతర్వాత ఇదే తహాశీల్ దారుగారు ఆఊరు మకాం చేయడం. తహాశీల్ దారుగారుకూడా కొత్తగా వచ్చారు ఆతాలూకాకు. ఆయనకూ ఇదే ఈవూరు మకాంచేయడం. మునసబు ఖంగారుపడుతున్నాడు.

ముందుగా వంటమనిషీ, గుమాస్తా, ఒక జవానూ వచ్చేశారు. వంతుచాకలివాండ్లు మూటలు దింపి వెళ్లిపోయారు. పదిగంటలకు తహాశీల్ దారుగారు వస్తున్నారు.

వంట చేసుకోను ఒక ఇల్లు బాగుచేయించి, చాకలివాడిని పిలిపించి దుప్పట్లుతెర అడ్డం కట్టించాడు. పొయ్యిలోకి కట్టెలూ, స్నానానికి కొత్తకుండలూ తెప్పించాడు. కుమ్మర్లను పిలిపించి నీళ్లు కాపించాడు. గ్రామచావడి కడిగించి పడకకుర్చీలూ, బల్లలూ వేయించాడు. కాఫీలోకి పాలూ, భోజనంలోకి పెరుగూ తెప్పించాడు. జవాన్ల భోజనానికి వర్తకుల ఇళ్లల్లో వంతు ఏర్పాటుచేయించాడు. పట్టీప్రకారం మోయను తెప్పించి వంటమనిషికి పంపించాడు. సప్లయిలో తాపాలు అధికారికి పట్టివ్వకుండా ముందుగానే వంట మనిషిచేతిలో రెండు రూపాయలు పెట్టి అతని గడ్డం పట్టుకున్నాడు. తనకు అనుభవం తక్కువ, ఏసప్లయి కావలసినా అడిగి చేయించుకోని మాటదక్కించవల సిందని జవాన్లని బ్రతిమాలుకొన్నాడు మునసబు.

పదకొండుగంటలకు తహాశీల్ దారుగారి జట్కా బండి వచ్చి గ్రామచావడిదగ్గర నిలిచింది. చక్కెర పొట్లం చేతపుచ్చుకొని బండిలోనేపెట్టి దణ్ణంపెట్టాడు మునసబు.

బూర్నీసు కప్పుకొని బండిలోనే కూర్చున్నారు తహాశీల్ దారుగారు. హు, హు, హు అని వొణుకు తున్నారు.

"జ్వరం తగిలిం"దని అంటూ నెమ్మదిగా దిగి, పడకకుర్చీలో కూర్చున్నారు.

"జ్వరమా!" మునసబుకూ జ్వరం తగిలినట్టయింది.

నాటువైద్యుణ్ణి పిలిపించాడు మునసబు. పొయ్యి మీది గిన్నెఅయినా దింపకుండా పరుగెత్తుకువచ్చాడు వంటవాడు. జవాన్లు వచ్చి కాళ్లు ఒత్తుతూ కూర్చు న్నారు. "ఏమి జ్వరమో !" అన్నాడు గుమాస్తా.

"తహసీల్దారుగారికి జ్వరమే!"—ఊరంతా పాక్కిపోయింది. పెద్ద రయితులూ, పెద్ద వర్తకులూ, పెద్ద బ్రాహ్మణులూ మూగిపోయారు.

"చలితో వచ్చింది—మలేరియా కాబోలు" నన్నారు కొందరు.

"శీతపైత్యపు జ్వరమేమో" అన్నారు మరి కొందరు.

"సన్నిపాతమేమో" అన్నారు ఇంకొకరు.

"దిష్టి తగిలిందేమో, ఇన్ని మిరపకాయలు తీసి పొయ్యిలో వెయ్య"మన్నారు శాస్త్రిగారు.

"దోషించిందేమో, కంట్లో ఆనందభైరవికలికం వేయండి, మంచి"దన్నాడు కోమటి.

వైద్యుణ్ణి పిలిపించుకోమన్నాడు గుమాస్తా.

"గర్భంలో శీతలించిం"దన్నాడు వైద్యుడు

"అయితే—ఎట్లా?"అన్నాడు మునసబు.

"వాతరాక్షసం అరగదీసి ప్రయోగిస్తా" నన్నాడు వైద్యుడు.

"ఇక్కడ ఉండడానికి లేదు: తక్షణం ఇంటికి వెళ్లిపోతాను. మేనా తెప్పించు"అన్నారు తహశీల్దారుగారు.

"మేనా?"—నడుం జారిపోయింది మునసబుకు.

ఆపూట్లో మేనా లేదే! ఏమిటి చెయ్యడం?

జట్కాబండి వాళ్లకుమపు—పనికిరా దన్నారు. రెండెద్దులబండికి గూడుకట్టించి పంపుతా నన్నాడు మునసబు. పనికిరాదన్నారు తహశీల్దారుగారు.

గ్రామపెద్దలందరూ మొఖమొఖాలు చూచుకొన్నారు. మేనా సప్లయిచేయలేకపోతే—అన్నా! తన విషయం ఏమనుకొంటాడో ఆ అధికారి! మునసబుకు చిన్నతనం అనిపించింది. భయంవేసింది.

"కాళ్లమంచం తెప్పించి, దానికి తాళ్లుకట్టి బొంగు దూర్చి పైన గుడ్డ కప్పి—మోసుకొనిపోతే పనికిరాదా!" అన్నాడు కోమటిశెట్టి.

'ఛీ!' అన్నారు జవానులు.

ఎట్లాగబ్బా!

"మేనా లేదుగాని చాకలివాండ్ల ఇళ్లల్లో వెల్లి పాలకీ ఒకటి ఉన్న"దన్నారు ఒకరు.

"దాన్నయినా తెప్పించవయ్యా" అన్నాడు గుమాస్తా.

"బండిలో ప్రయాణం చేయడాని కెంతమాత్రమూ వీలులేదు. పదిమైళ్ల ప్రయాణం. ఎందుకయినా పనికి వస్తాడా అయ్య! పాలకీ తెప్పించవలసిందే"నన్నారు జవాన్లు.

"ఇంతకంటె ప్రస్తుతంలో ఇంకోమార్గం లే" దన్నారు పదిమందీని.

"ఆలస్యం చేయకయ్యా"అన్నాడు వంటవాడు.

చాకలివెంకడివసారాలో మూడుకు ప్రేలాడగట్టిన పాలకీ దింపారు చాకలివాండ్లు.

బూజూ దుమ్మూ దులిపి, గ్రామచావడిదగ్గరకు తీసుకొనివచ్చారు. పాలకీపైన చాందినీ కట్టారు. లోపలకు చలిగాలి దూరకుండా నాలుగువైపులా దట్టమైన దుప్పట్లు బిగించారు. జానెడుమందం బూరుగుదూది పరుపు లోపల పరిచారు. తలకింద మూడుదిండ్లూ, కాలికింద రెండుదిండ్లూ, ఆప్రక్క నొక బాలీసూ, ఈప్రక్క నొక బాలీసూను!

తహశీల్దారుగారికి వొళ్లు సలసలా కాగిపోతోంది. పన్నెండుగంట లయింది. ఎండ తీక్షణంగా కాస్తోంది. అయ్యగారికి చలి జాస్తిఅవుతోంది. జవాన్లూ, గుమాస్తా, వంటవాడూ పట్టుకొని, అయ్యగారిని పాలకీలో పండబెట్టారు. రెండుశాలువలు పైన కప్పారు. తలకు రెండు ఊలుమప్లర్లు చుట్టబెట్టారు. ఇక పట్టండంటె పట్టం డన్నారు.

కాని, ఎవరికి పట్టినా ఒకటే తొందర. ఒకటే గలభా! పాలకీ మోయడానికి ఇటు ఇద్దరూ అటు ఇద్దరూ ఆఖరుకి నలుగురయినా ఉండాలా! ఏదీ? వాహకుల సంగతి ఎవరూ అనుకోనేలేదు.

ముగ్గురే ఉన్నారు చాకళ్లు. ఆపూట్లో మొదటి నుండీ చాకలివాడికి కరువే! శుభాలకూ, అశుభాలకూ కావలసిఉంటె ప్రక్కవూరునుండి పిలుచుకొని జరుపుకొంటున్నారు గ్రామస్థులు.

"నాలుగోవాడు చాకలికొండ డున్నాడు. కాని వాడుకూడా జ్వరం తగిలి ఇంటికాడ పండుకున్నా" డని అక్కడ చేరిన ముగ్గురుచాకళ్లలోనే ఒక డన్నాడు.

"ఇకనేం, పిలిపించండి వాణ్ణి"అన్నారు పదిమందీని. కొండడికోసరం కబురుచేశారు. వాడు కదలలే నన్నాడని వెళ్లినమనిషి చక్కా వచ్చాడు.

నడివీధిలో ఉండిపోయింది పాలకీ. ముగ్గురితో కదిలే ఎత్తు కనిపించదు. మునసబుకు తత్తర పుట్టింది.

"ఏదో పాగీ చూచి, వాహనం కదిలే మార్గం చూడవయ్యా మునసబూ" అని పదిమందీ పదిమాటలూ అనేవాళ్లేకాని మార్గం చూపేవాళ్లెవరూ కనిపించరు.

"నాలుగురూపాయలు కూలియిస్తా"నని కూలి మనుష్యుల్ని బ్రతిమలాడుకొన్నాడు మునసబు.

"మేం చాకలివాళ్లం కాదయ్యోయ్" అని ఎగతాళిచేస్తూ చక్కాబోయారు కూలీలు.

"కొండడికసలు జ్వరం తగిలిన మాట నిజమవునో కాదో—వాణ్ణి పిలిపించిచూడం"డన్నారు ఒకరు.

"ఇవ్వాళ వీణ్ణెట్లా విడిపిస్తే—రేపు ఇంకొకడు కాలునొప్పిఅని ఎగనామం పెట్టుతాడు—ఎల్లుండి ఇంకొకడు—అమర్నాడు కుమ్మరివాడు. అతర్వాత మంగలి!—విడిపిస్తే ఎట్లా?" అన్నాడు వంటమనిషి.

"వంతుచాకలివాడు రావలసిందే" అన్నారు అందరూను.

"ఎత్తండి. ఇంకా ఆలస్యం దేని"కని పాలకీలోనుండి మూలుగుతున్నారు తహశీల్దారుగారు.

"కొండడిని జుట్టుపట్టుకొని లాక్కురం"డన్నారు మునసబుకరణాలు.

కర్రలు పుచ్చుకొని డవాలీజవాన్లు చాకలిపాలెం వెళ్లారు. కళ్లు జ్యోతులై కొండడు మంచంమీద పండుకొని డోక్కుంటున్నాడు.

"జ్వరమూ లేదు, నీ బొందా లేదు. తెగ తాగితే వొళ్లు పులకరించిం" దన్నారు జవాన్లు.

చెయ్యిపట్టుకొని బయటికి లాగారు కొండడిని. మెడబట్టి గ్రామరచ్చకు నెట్టుకొనివచ్చారు.

"ఏందిరా నీకింత సొయ్యం" అన్నాడు మునసబు.

ఒళ్లుతిరిగి ఎండలోనే కూలబడ్డాడు కొండడు.

"కొమ్ము పట్టరా" అని ముదలకించారుజవాన్లు.

"నావల్ల కాదం"డని దణ్ణంపెట్టాడు కొండడు.

"అసలు వాడికి జ్వరం తగిలిన మాట నిజమేనా" అన్నాడు గుమాస్తా.

"ఇది అంతా వంతు ఎగనామంపెట్టడానికి ఎత్తిన ఎ"త్తన్నాడు ఇంకో పెద్దమనిషి.

"ఇంత సారాయి పోయిస్తాం. కొమ్ము పట్టరా" అన్నాడు మునసబు.

"బంగారంపోయించినానావల్ల కా"దన్నాడుకొండడు.

"ఎంతసేపయ్యా ఈబేరం" అని లోపలనుండి పెద్దంగా మూలిగారు తహశీల్దారుగారు.

గడబద్ధం వచ్చిపడింది మునసబుకు. వాహనం కదిలేఎత్తు కనిపించలే దతగాడికి. చెమ్మటలు పోసి నో రెండిపోతోంది.

"ఈ చాకలివాణ్ణి పట్టుకొనితన్నితే రోగం మెత్తగా కుదురుతుం"దన్నాడు జవాను.

"జ్వరం తగిలి వా డల్లాడుతుంటే దేనికయ్యా తన్నడం" అన్నాడు ఒక చాకలి.

"నాలుగో మనిషిని ఆ తలియారీని పంపరాదండీ దొరా" అని రెండో చాకలి ఉపాయం చెప్పాడు.

"తలియారీమ్యాటీ గ్రామంలో గస్తుతిరగడం, దొంగల్ని పట్టడమూ" నన్నాడు మునసబు.

"పోనీ, ముగ్గురు వెట్టివాం డ్లున్నారే—ఒక భుజంకాచుకోకూడదూ" అన్నాడు మూడో చాకలి.

మునసబు వెట్టివాళ్లవంక చూచాడు—అపద తప్పించమని.

"మేం సర్కారుముడుపులు మోసేవాళ్లంకాని అధికార్లని మోసేవాళ్లం కా"దన్నారు వెట్టివాండ్లు.

పాలకీలో మూలుగు ముదురుతోంది పంతులుకు.

అక్కడ చేరిన పదిమంది తలకాయలూ ఎక్కడివాండ్లక్కడ జారుకున్నారు.

దుప్పటీ కప్పుకొని కొండడింటికి పోయాడు. మంచినీళ్ళు తాగివస్తామని ముగ్గురుచాకలివాళ్లూ మొఖంతప్పించారు. వాహనం నట్టనడివీధిలో అట్లనే ఉండిపోయింది. చెట్టునీడకయినా పట్టుదామంటే చాకలివాళ్లు కనిపించలేదు. జవాన్లూ, వంటమనిషీ సాయంపట్టి వాహనాన్ని వేపచెట్టునీడకి ఈడ్చారు.

"ఎత్తిన వాహనం అప్పుడే దించా రెందువల్ల?" అని కేకపెట్టాడు తహశీల్దారు.

గుమాస్తావైపు తిరిగి దండంపెట్టాడు మునసబు.

"వాహకులు దొరకలేదండి" అని దగ్గరగా వెళ్లి ముసుగుతొలిగించి తహశీల్దారుగారితో చెప్పాడు గుమస్తా.

ఇక లాభం లేదనుకొని జట్కాబండి వెనక్కుతిప్పుకొని ఇంటికి వెళ్ళి, మేనా సప్లయిచేయలేని మనిషి మునసబునౌకరీకి అర్హుడు కాడని ఆ మునసబుని నౌకరీనుండి మత్తరబుచేశాడు తహశీల్దారు.

మూలము :
రవీంద్రనాథ ఠాకూరు

# సామాన్య నష్టము

★

[కథానిక]

అనువాదము :
శ్రీ బెజవాడ గోపాలరెడ్డి

మాఘమాసమున శీతలవాయువులు వీయుచుండెను. స్వచ్ఛసలిల వరుణానది ప్రవహించుచుండెను. కాశీరాణి కరుణపురినుండి దూరనిర్జనగ్రామమునకు, శిలామయఘట్టము గల చంపకవనమునకు వందలాది సఖజనములతో స్నానమునకై వెడలెను.

రాజశాసనమున ఆ మార్గము, ఆ ఘట్టము ఆ నాటి ప్రభాతమున జనశూన్యమాయెను. దగ్గరనున్న కుటీరములు వదలి ప్రజలు మరెచ్చటికో వెడలిరి. అందుచే నదీతీరము స్తబ్ధము, గభీరము నై అలరారుచుండెను. పక్షుల కూజనములు మాత్రము కాననమున విన్పించుచుండెను.

నేడు మత్తిల్లి సంచరించు ఉత్తరవాయువులచే నదియు కదలిపోవుచుండెను. స్వర్ణకాంతి జలముల పడుచుండ, పులకమున పొంగి అలలు ఎగురుచు దుముకుచుండ, లక్షమాణిక్యములచే తళతళలాడు అంచలముతో నర్తకి నృత్యమొనర్చుచు వెడలుచుండిన ట్లుండెను.

నేడు నారీకంఠ కాకలిధ్వనులు నదీకలకల్లోలముల సిగ్గుపరచుచుండెను. మృణాలభుజలగు ఆ స్త్రీల లలిత విలాసములచే చంచలనది ఉల్లాసమున మత్తిల్లిపోవుచుండెను. ఆలాపప్రలాపములచే, ఉచ్ఛ్వసితహాస్యములచే ఆకసము ఆకులమై పోవుచుండెను.

స్నానము పూర్తిచేసి, స్త్రీలందరును ఒడ్డునకు లేచి రా గా "ఉహూ, చలిచే చచ్చుచున్నాను, నా ఒడలంతయు వణకిపోవుచున్నది. సఖులారా! మంట వేయుడు, చలి కాచుకొనెదను" అని రాణి అనెను.

చెలియ లందరు చిదుగుల ఏరి తెచ్చుటకై కుసుమకాననమువైపు చనిరి. పిచ్చిఉల్లాసమున, కౌతుకరసము చిందుచుండ, శాఖల పట్టి ఈడ్చి ఇటునటు లాగుచు గంతులిడుచుండ హఠాత్తుగ రాణి అందరిని పిలిచి దరహాసవదనమున చెప్పెను:

"చెలియలారా, ఇటు రండు, రండు. అదిగో దగ్గరలో ఏవో గుడిసెలు కనబడుచున్నవి. వాటికి మీరు నిప్పు అంటించిన, చేతులు కాళ్ళు కాచుకొనెదను" అని రాణి తనయుక్తికి తానే విహ్వలయై మధురముగ పకపక నవ్వెను.

"ఇదేమి పరిహాసము, తల్లీ. నిప్పుఅంటించి వీటిని నాశనము చేయు టేల? ఇవి ఏ సాధు సన్యాసుల కుటీరములో, ఏ దీనజనులు, ఏ పరదేశీయులు నిర్మించుకొన్నవో మనకు తెలియదు, రాణిగారూ" అని అతివినయమున సకరుణ మాలతి అనెను.

"ఈ దీనదయామయిని దూరముగ గెంటివేయుడు" అని రోషమున పలికెను రాణి. అత్యంతదుర్దాముడగు కౌతుకమున నిరతులును, యౌవనమదమున నిష్ఠురులును అగు ఆ యువతులందరును కలిసి పిచ్చివారివలె పరుగెత్తుకొనిపోయి ఆ కుటీరములకు నిప్పు అంటించిరి.

ఘోరధూమము దట్టముగ తిరుగుచు తిరుగుచు, ఉబుకుచు ఉబుకుచు లేచెను. చూచుచు చూచుచుండగనే ఉస్, ఉష్ అను హుంకారములతో, ఎగయుచున్న మంటలతోకూడ విస్ఫులింగముల వెళ్ళగ్రక్కుచు, శతశతలోలజిహ్వల ప్రసారించుచు, వహ్ని ఆకసమును అలముకొనెను.

పాతాళము ప్రబద్ధలై, జ్వాలామయములగు నాగిను లన్నియు ఒక్కుమ్మడిగ బయట పడెనా! గర్జన గానమున మత్తిల్లి గగనమువైపు ఫణముల నృత్యమొన

ర్చుచు లేచినవా! ప్రళయమత్తయగు రమణి కర్ణముల ఉద్దీపక రాగిణులు ధ్వనితమాయెను.

ప్రభాతశకుంతముల ఆనందగానములు భయ విలాపములతో మాయమాయెను. కళకళములుగ కాకములు చేరి కూసి, గల్లంతు చేయసాగెను. ఉత్తరవాయువులు ప్రబలమగుచుండ, కుటీరమునుండి కుటీరమునకు అగ్నిజ్వాలలు ఎగిరెగిరి పరుగిడుచుండెను.

ప్రళయలోలుపరసనలు క్షుద్రగ్రామమును లేహన మొనర్చివేసెను. మాఘమాసప్రభాతమున, జనహీనపథమున, ప్రమోదమున క్లాంతలగు శత సఖులతోటి, దీప్తఅరుణవసనమును ధరించి, కువలయమును చేబూని రాణి మరలివెడలెను.

అప్పుడు సభయందు న్యాయాసనమున భూపతి కూర్చొనియుండెను. గృహహీనులగు ప్రజలు గుంపులు గుంపులుగ వచ్చి, సందేహమున కంపితమగు గద్గద స్వరములతో, చరణముల ప్రణమిల్లినవారై, సంకోచమున, త్రాసమున తమ దుఃఖమును నివేదించిరి.

లజ్జచే ఎఱ్ఱపడిన ముఖముతో రాజు న్యాయాసనమును వీడి వెడలెను. అకాలమున రాణివాసము ప్రవేశించి "మహిషీ! ఇది ఎట్టి వ్యవహారము! నిరుపేదలగు ప్రజల గృహముల కాల్పించివేసితివే! ఇది ఏ రాజధర్మము" అని అడిగెను.

"ఏ అర్థమున అవి గృహములాయెనో చెప్పుము కొలది జీర్ణకుటీరములు పోవుటచే ఆ ప్రాణులకు ఎంత నష్టము వాటిల్లగలదు? రాజమహిషి ప్రమోదమునకై ఒక్క ఝామములో ఎంతెంత ధనము వ్యయమగుట లేదు?" అని రోషమున దేవేరి పలికెను.

"నీవు రాణివిగ అంతఃపురమున ఉన్నంతకాలము, దీనకుటీరముల దహనముచే దీనులకు ఎంత నష్టమో నీవు తెలిసికొనజాలవని నాకు తెలియును,—కాని నీకది నిర్దయతో తెలుపగలను" అని మండుచున్న డెందమున పొంగుచున్న రోషమును అణచుకొని రాజు చెప్పెను.

రాజుఆదేశమున సేవికలు వచ్చి ఆమెభూషణముల వలిచివేసిరి. అరుణవర్ణఅంబరమును మమత లేని హస్తముల పెరికివేసిరి. భిక్షుకనారికి తగిన వస్త్రమును తెచ్చి రాణిదేహమున కట్టబెట్టిరి.

వీథిలోనికి ఆమెను తీసుకవెళ్ళి, రాజు ఇట్లనెను: "ద్వారద్వారమునకు వెళ్ళి అడుగుకొని, మనుము. నీవు నీ ఒక్క ఝాములీలకై ధ్వంసమొనర్చిన ఆ కొలది కుటీరముల తిరిగి ఎన్ని దినములలో కట్టించిఇచ్చెదవో చూచెదనుగాక.

"ఒక ఏడు గడువు నొసగుచున్నాను. అటుపై తిరిగివచ్చి, సభామధ్యమున నిలిచి ప్రణమిల్లి, జీర్ణకుటీరముల వినాశముచే జగత్తున ఎంత నష్టము వాటిల్లెనో అందరి సమ్ముఖమున, యువతీ, తెలుపుదువు గాక."



# 'విరోధి' సాహిత్యావలోకనం

శ్రీ సత్యనారాయణ 'శ్రీవాత్సవ'

"విరోధి" అనే పేరుతోనే భయపెట్టూ వచ్చేసింది. ఈ సంవత్సరం ఒక్క ఆంధ్రదేశానికే గాక ఆసేతుహిమాచలపర్యంతమూ గల సమస్తభారతదేశానికి విరోధభావంతోనే ప్రవర్తించింది. విపరీతఫలితాలతో విచ్చలవిడిగా విహరించింది; వెడలిపోయింది. కాని ఇదొక సంవత్సరమని గుర్తించేవారికి కొన్ని జ్ఞాపకాలు వదలిపోయింది. అనంతకాలప్రవాహంలో ఒకసంవత్సరం అణుమాత్రం కూడా లెక్కకురాదు. కాలవాహినిలో ఒక చరిత్ర, ఒక సాహిత్యం, ఒక సంస్కృతి ఎంత పురోగమనం, ఎంత అభివృద్ధి సాధించిందో తెలుసుకోవడానికి ఒక్కసంవత్సరంపరిమితి ఏమాత్రం? సాహిత్యం, సంస్కృతి మున్నగునవి దినదినపరివర్తనం పొందుతూనే వున్నవి. క్రమవికాసం కనబరుస్తూనేఉన్నవి. అయితే యీ పరివర్తనం, యీ వికాసం కొన్ని శతాబ్దాలతర్వాత యీ లక్ష్యం సాధించగల్గితే ఒక్క సంవత్సరకాలంలో ఇంత అని త్రైరాశికంతో లెక్కచేసి చెప్పలేము. ఈ సాహిత్యపురోగమనం, యీ వికాసం అంతర్వాహినులుగా గోచరిస్తూ, సాహిత్యసౌష్ఠవాన్ని పెంపొదిస్తూ ఉంటాయి తప్ప, ఎప్పటికప్పుడు విభజించి, రాసులు పోసినట్లు కనపడవు. ఎన్ని యుగాలు మారినా ప్రతిజాతిసాహిత్యచరిత్రలోనూ ఒక ఎడతెగని అవిచ్ఛిన్నత ఉండితీరుతుంది. అటువంటి అవిచ్ఛిన్నతా, ధారాప్రవాహమూ లేని సాహిత్యం సాహిత్యమే కాదు.

ఈ దృష్టితో 'విరోధి'సంవత్సరంలో మన తెలుగుసాహిత్యవికాసం గమనిద్దాం. సాహిత్యసమీక్ష చేసేముందు, యీసంవత్సరసాహిత్యం ఎటువంటిపరిస్థితులలో పరిఢవిల్లిందోకూడా పర్యాలోకనం చేసుకోవాలి. ముఖ్యంగా ఆధునికసాహిత్యంమీద పరిసరపరిస్థితులు పరిస్ఫుటమైన ముద్రలు తప్పనిసరిగా దిద్దితీర్చుకున్నది. పరిస్థితుల్ని క్రమించిన సాహిత్యం యీనాటిలోకంలో అరుదయిపోయింది. సాహిత్యం జీవితానికి అద్దంలాంటిదనే మాట నేటిసాహిత్యంవిషయంలో అక్షరాలా నిజమయింది. అందుకే గతసంవత్సర సాహిత్యసమీక్ష చేసేటప్పుడు, అప్పటి పరిస్థితుల సమీక్షకూడా అత్యవసరమయింది.

ప్రపంచచరిత్రలో గతసంవత్సరం కల్లోలరాజకీయాలతో ప్రారంభించి భయావహపరిస్థితులతో అంతమవుతోంది. పెద్ద రాజ్యాలమధ్య పగలు, ద్వేషాలు, పరస్పరవైమనస్యాలు మరింత పెరిగిపోతున్నాయి. యుద్ధభయం అతిశయించింది. అణుబాంబు తాత హైడ్రోజన్‌బాంబు నిర్మించాలనే ఆజ్ఞలు అధికారులు సగర్వంగా చేశారు. మారణసాధనాల పరుగుల పందెం భయంకరపరిణామాలతో విజృంభిస్తోంది. ఈ రాజ్యాలపందెంలో యావత్ప్రపంచం భస్మీపటలం అయిపోగాని ఆశ్చర్యపడవలసిన అవసరం లేదు. దేశాలు యుద్ధానికి కాలుత్రవ్వుతూఉంటే ప్రజలు ఆకలిబాధచేత అలమటించిపోతున్నారు. తిండిలేక 'అన్నమో రామచంద్రా' అని ప్రపంచంలో సగానికిపైగా ప్రజలు అల్లాడిపోతున్నారు. ఈ సమయంలో ఉన్నవారు లేనివారికి సహాయం చెయ్యకతప్పనిసరి అయింది. గతయుద్ధం వదలిపెట్టిన భయంకరఫలితాలు ప్రజల్నింకా కట్టికుడుపుతూనేఉన్నవి. అమెరికావంటి దేశాలు కొండెక్కి కూర్చుంటే, ఋణపడిన దేశాలు తమకు కష్టమైనాసరే కొన్ని బాధలకు సరికావలసివచ్చింది. దానితో తమ వస్తువుల విలువ తగ్గించుకొన్నారు. అంటే దేశంలో ధరలు పెరిగాయి. కలవారికీ, లేనివారికీ మధ్య ఆవేశాలు పెరిగిపోయాయి. మధ్యతరగతిప్రజలు ఈ యిరువురిమధ్య నలిగిపోతున్నారు. ఈ అల్లకల్లోలంలో చేతికందిన లాభాలు తీసేవాళ్లు తీస్తున్నారు. సందులు నింపేవాళ్లు నింపుతున్నారు; మేడలు కట్టేవారు కట్టున్నారు. ఇవి లేనివారికి మనస్సు మండిపోతోంది. వారి నుండేమంట రెచ్చగొట్టేవాళ్లు అదనుచూచుకొని ఆక్రమించుకొనివస్తున్నారు. ఈపరిస్థితుల తీవ్రత శైవాలగా [illegible]పూర్వదేశాలన్నింటిలోనూ వ్యాపించింది. ఎక్కడచూచినా సంఘర్షణ! మానవుడు మేల్కొన్నాడు. స్వతంత్రుడయ్యాడు. తన స్వతంత్రకంఠం విప్పి పీడితతాడితప్రజల్ని పలకరించి తనతో రమ్మంటున్నాడు. తరతరాలు పరిపాలనచేసిన పరరాజ్యాలు నిష్క్రమిస్తున్నాయి. ఒకజాతిమీద మరోజాతి పెత్తనం చేసే రోజులు పోయాయి. రంగుభేదాలు నశిస్తున్నాయి. గొంతులేని మూగజనం ఎలుగెత్తి విప్లవాక్రందనాలు చేస్తున్నారు. విప్లవశంఖారావం చేస్తున్నారు. విజృంభించి విరగబడుతున్నారు. కదలిం దిక ప్రజారథం; ఆపడం ఎవరితరమూ కాదు.

ఈ ప్రజాస్వాతంత్ర్యయాత్రలో ప్రప్రథమపతాకం ఎగుర వేసింది భారతదేశం. యుగయుగాల భారతీయసంస్కృతికి తగిన శాంతి అహింసామార్గాలలో స్వాతంత్ర్యం సాధించింది. తన స్వాతంత్ర్యశంఖం పూరించి, ప్రాచ్యలోకంలో నిద్రాణమైన ప్రజాలోకాన్ని పిలిచింది. వెన్ను చరిచి, దండె విరిచి బరిమీద నిలిచింది. ఈసాహసం పారతంత్ర్యంలో ఉన్న ఇతరజాతులకు బల మిచ్చింది. వారు తలెత్తారు. విక్రమించారు. విప్లవాలు నడిపించారు. ఇండోనీషియావంటి చోట్ల జయం సాధించారు.

భారతీయుల మనోవాంఛలకు అనుగుణంగా ఒక క్రొత్త రాజ్యాంగం నిర్మించాము. 'సత్యమేవ జయతే'అనే లక్ష్యంతో నవ భారతం ప్రజాతంత్రరాజ్యంగా సంస్థాపితం అయింది. ప్రజల కోరకలు నెరవేరాయి. కాని దానితో కష్టాలు గట్టెక్కిపోయాయా? అన్న సమస్య, ఆర్థికసమస్య అలాగే ఉన్నవి. రూపాయివిలువ తగ్గింపుతో పరిస్థితులు మరింత విషమించాయి. వివిధరాష్ట్రాలలో మన "ప్రజాప్రభుత్వాలు" తలపెట్టిన పెద్దకార్యక్రమాలకు పెద్ద పెట్టుబడులు కావలసివచ్చాయి. "సామాన్యమానవుడి" క్షేమం కోసం, "సామాన్యమానవుడి" ప్రభుత్వం అతనిమీద భరించలేని పన్నులు వేసింది.

పెచ్చుపన్నులు భరింపలేక మూల్గుతూఉన్న యీ "సామాన్యమానవుడు" ప్రియమైన ప్రభుత్వాన్ని శిరసావహిస్తూ, వారు వేసిన ఆజ్ఞలు, ఆంక్షలు, శాయిదాలు, కంట్రోల్సు అనే పద్మవ్యూహంలో పడి దారితప్పిపోతున్నాడు. ఈచిక్కుల్లోంచి విడదీసేవారు లేక చివరికి ఈ "సామాన్యమానవుడు" ఏమవుతాడో, ఎక్కడకు చేరుకుంటాడో?

క్రొత్తగా వచ్చిన స్వాతంత్ర్యంతో ఒక క్రొత్తరకం జాతీయత పెరుగుతోంది. స్వాభిమానం, స్వాతిశయం అనిపించుకొనే వరకు కూడా యీజాతీయత హద్దుమీరుతోంది. మనకు జాతీయ గీతం, జాతీయచిహ్నం, జాతీయజెండాతో ఒక జాతీయభాష శాసించారు. హిందీ రాష్ట్రభాష కావాలనీ, సమస్తమూ హిందీలోనే జరగాలనీ, అది యావద్భారతీయులు నేర్చుకోవాలనీ అన్నారు. దానితోపాటు మాతృభాషాభిమానం అన్ని భాషలవారికీ ఎక్కువయింది. వెంటనే భాషలప్రకారం రాష్ట్రాలు, ఏభాష కాజాతి అనే పూర్వవాదం మరింత బలపడుతూవచ్చింది. భాషా ప్రయుక్తరాష్ట్రాల అవసరం ఉన్నవారు, పీడితులు తాడితులు అయినవారు ఆందోళనచేశారు. కాని అధికారంలో ఉన్నవారు ఇట్టివాదాలకు మరొక నిర్వచనం చేసి హేళనచేశారు. దేశఐక్యతకు ఇది విరుద్ధం అన్నారు. క్షుద్రస్వాభిమానం అన్నారు. ఇన్నిప్రతికూలపరిస్థితులలోకూడా ఆంధ్రరాష్ట్రవాంఛ అతిన్యాయమైన దని పెద్దలు గుర్తించారు. ఆంధ్రరాష్ట్రం ఒకక్షణంలో వచ్చినట్టు గోచరింపజేశారు. కాని నీచేతితో నీకన్ను పొడిచినట్టు తిరిగి ఆంధ్రుల బహునాయకత్వం, అభిప్రాయభేదాలు, అనైక్యత కారణాలు చూపి, ఆంధ్రరాష్ట్రనిర్మాణం తాత్కాలికంగా వాయిదా వేశా[రు].

నాటకంలో గయుడులాగ "ఆంధ్రుడు" "ఆశలదుగ[...] దైవోపహతుడ నగుచు" తిరిగివచ్చి నంటున్నాడు. ఆంధ్ర[...] ఆశలు తీరినా తీరకపోయినా ఈసంవత్సరం దైవంకూడా ఆంధ్ర[...]లకు అన్యాయంచేశాడు. భయంకరమైన ప్రళయంవచ్చి ఆం[...] జిల్లాలలో పంటలు, ఆస్తులు ధ్వస్తవిధ్వస్తమైపోయాయి. ఈసం[వ]త్సరంలో ఆంధ్రులకు పోయినవిపోగా మిగిలినవి నాయక[...] విభేదాలు, ఇరుగుపొరుగువాళ్ల ఎత్తిపొడుపులు. ఇటువంటి పరి[స్థి]తులలో ప్రారంభించి పరిసమాప్తమైన విరోధిసంవత్సరసాహిత్య[...] విమర్శించేటప్పుడు మనకు ప్రస్ఫుటంగా గోచరించేది—ప్రజల[...]గల భయభీతి, వ్యాకులత, అసంతృప్తి, ఆశాభంగం, నిస్పృ[...] నిర్వేదమున్నూ. ఈ సంవత్సరం బయలువెడలిన సాహిత్యం యి[...]గుణాలను మరింత ప్రకోపింపజేసింది. కాని వీనిని మరచిపో[...] మధురస్వప్నాలు ఏమీ సృష్టిచేయలేకపోయింది. మన తెను[గు] సాహిత్యం ఒకటే కాదు; ఇతరభారతీయసాహిత్యాలూ అ[...] ఉన్నవి. ఇంకా పైకిపోతే ప్రపంచసాహిత్యమే అటువంటి నిర్వే[ద]వాదాన్ని చూపుతోంది.

ఈసంవత్సరం వెలువడిన రెండు ఆంగ్లగ్రంథాలు దీనికి ఉదా[...]హరణగా చూపవచ్చును. ఈరెండూ నవలలే. ఒకటి ప్రసిద్ధవేదాం[...] ఆల్డస్‌హక్స్లీ వ్రాసిన *Ape and Essence*(మర్కటమూ, మహా[...]మూ). మారణాస్త్రాలప్రళయంలో సర్వనాశనం పొందిన ప్రపంచంల[...] —మిగిలిపోయిన భూభాగం (ప్రస్తుతఅమెరికా ఉన్న స్థలం) ఈ క[...]స్థానం. మారణాస్త్రాలప్రయోగంవల్ల సృష్టిమారిపోయి,అంగవైకల్య[...] మనోవికారం కలిగిన మానవులు జనిస్తారు. ఆ మానవలోకంల[...] పుణ్యం, దేవుడు, సత్యం, ధర్మం, శాంతి అనేవి ధూర్తపదాలు. వాళ్ల[...] ఆరాధించేది "దయ్యం!" పాపం, వ్యభిచారం, బానిసత్వం అక్క[...] లోకధర్మాలు. మంచి అనేది తప్పు. చెడ్డ అనేది శిష్టాచారం. ప్రేమ[...] అనేది అపచారం; ద్వేషం అనేది పౌరధర్మం. ఇలాంటి[...] లోకంలో పడిన ఒక శాస్త్రవేత్త దారితప్పి, తన తప్పు తెలుసు[...]కొని మళ్లీ మామూలుమానవలోకంలోకి ఎలాగ వస్తాడో రచయి[...] తన నిశితవికటకవిత్వధోరణిలో నిరూపించాడు. ప్రస్తుతం నాగరిక[...] అని చెప్పుకొని మానవుడు చేస్తూవున్న అవకతవకలను క[...] వ్యంగ్యంగా ఎక్కిరించాడు.

హక్స్లీఉద్దేశంలో జాతీయత, ప్రగతి అనేవి రెండూ రెండు[...] మారణశక్తులు. వీటివల్ల ఆవేశం పొంది మానవుడు ప్రకృతిలోని[...] ప్రశాంతి నాశనంచేసి దానితో తన నాశనానికి దారితీశాడు. మాన[...]వుడి యీ వినాశకృత్యమే యిలాగ నిర్వచించాడు కవి.

"మానవుడు గర్వాంధుడైన మానవుడున్నాడే, తనకున్న అల్ప[...] కాలపు స్వల్పాధికారం మోచుకొని, సంపూర్ణంగా తనకి నిర్ది[...]చిన, స్వప్రకాశమైన తన మహాత్మ్యాన్నే తెలియలేకపోతున్నాడు[...]

కోసంచే గంతులేసే కోతిలాగ ఉన్మత్తస్వర్గంయందు ఉన్మత్తవేషాలు వేస్తుంటే చూచే దేవతలకయినా ఏహ్యమవుతుంది."

ఇంచుమించు ఇదే పద్ధతిలో, ఇంత విశిష్టంగా వ్రాయక పోయినాగాని, "1984" అనే నవలలో జార్జి ఆర్వెల్ (*George Orwell*) అనే యువకరచయిత ఇప్పటి రాజకీయమతాలను చిత్రించాడు. నేటి ప్రపంచంలో రెండు కక్షలుగా చీలిపోతూఉన్న ప్రపంచరాజ్యాలు ఇతని వ్యంగ్యధోరణికి అనువుగా దొరికాయి. రష్యా, అమెరికా రాజ్యాలమధ్య చెలరేగుతూవున్న భీషణ ప్రచారం, యుద్ధదావానలం, పరస్పరవైషమ్యం ఇతడు ఊహించి భవిష్యత్తులో జరిగిన ఇతివృత్తంగా వర్ణించాడు. ఈ రెండు నవలలూ వ్యంగ్యరచనలే. రెండూ అద్భుతకల్పనలే. ఈరెండూ భవిష్యత్తుకు సంబంధించిన ఊహాచిత్రాలే. రెంటిలోనూ నేటి యుద్ధమనస్కత, స్వార్థచింత, పాపనిర్భీతి మొదలైనవి నిర్వచించబడ్డాయి. ప్రస్తుతపరిస్థితులు చూచి ఆందోళనపడే బుద్ధిమంతులు మనస్సులో ఏటువంటిభావనలు చేస్తున్నారో—ఆభావనలకు ఈరెండుగ్రంథాలూ తీవ్రమైన రూపం పోశాయి.

లోకశాంతి, విశ్వశ్రేయస్సు కావాలని అన్ని రాజ్యాలవారూ చెబుతున్నారు. సామాన్యమానవుడి క్షేమం చూడాలనీ, స్వాతంత్ర్యం సౌభ్రాతృత్వం సమానత్వం—ఇవి ముఖ్యసూత్రాలనీ అంతా ఏకీభవిస్తారు. కాని ఒకరిని తెలియకుండా ఒకరు, ఒకర్ని నాశనంచెయ్యాలని ఒకరు, ఒకరు ద్రోహులని ఒకరు దూరుకుంటున్నారు; ప్రచారం చేస్తున్నారు; యుద్ధప్రయత్నాలు చేస్తున్నారు. ఈప్రభుత్వాల మహాసంరంభంలో పౌరుడెక్కడ? నీరసంగా, నిరాశగా, నిష్ఠురంగా తనలో తాను ఇతడు అనే మాటలు ఎవరికీ వినిపించవు; ఎవరూ వినిపించుకోరు. కాని ఇతని పేరున ప్రతినిధుల ఎన్నిక జరుగుతుంది; సభలకు వస్తారు; శాసనాలు చేస్తారు. ఇతనికోసం ప్రభుత్వాలు నడుపుతారు; పండుగలు చేస్తారు; పట్టాభిషేకం జరుపుతారు; పట్టప్రదానాలు జరుపుకొంటారు. కాని ఈ "సామాన్యపౌరుడు" ఎక్కువ పన్నులతో, తక్కువ రేషన్లతో, పెచ్చురద్దీల హెచ్చురణాలతో, తీరని బాధలతో, మారని ఆశయాలతో, చీకటిబజార్లలో చిక్కుపడి, ధనాగారాల్లో దాటితప్పి క్రుంగిన అవయవాలతో, మ్రింగిన ఆశలతో చతికిలబడిఉంటాడు.

అతని కలలముందు ప్రళయభాండం బద్దలవుతుంది; భూకంపం పుట్టిస్తుంది. ప్రపంచం పరిక్రమిస్తుంది. భూగోళం పరిభ్రమిస్తుంది. కాని అతనిలో మార్పు ఉండదు. తన్నుగానట్టు కునుకుపాట్లు పడతాడు.

అయినాగాని చిత్రం అదేమిటో, లోకంలో ఏది జరిగినా సామాన్యమానవుడికోసమే జరుగుతోంది. కళగాని, సాహిత్యంగాని, సంస్కృతిగాని యీ మానవుడి వికాసంకోసం; ఇతని ఆనందంకోసం; ఇతని వినోదంకోసమే నంటారు.

మనదేశంలో సామాన్యమానవుడి చరిత్రలో మహాపర్వదినం అనదగిన "ప్రజాతంత్రరాజ్యస్థాపనం" యీ సంవత్సరం జరిగింది. కాశ్మీరంనించి కన్యాకుమారివరకు, కచ్ఛ్నించి కాకినాడవరకు యావద్భారతం ఏకచ్ఛత్రాధిపత్యంలోకి వచ్చిన సుదినం. వేడుకలతో, దీపాలంకారాలతో, తోరణాలతో మహోత్సవంగా జరిగిన యీనాటిపండుగలలో సామాన్యమానవుడు ఎప్పటిలాగే ఉన్నాడు. చీటికీ మాటికీ పద్యాలువ్రాసే "సమయకవులు"సైతం చెప్పదగిన కావ్యాలు రచింపలేకపోయారు.

కవులు నిరంతరదారిద్ర్యానికి పేరుపడ్డారు. అయితే పూర్వకాలంలో రాజపోషణవల్ల కొందరు కావ్యరచన చేశారు; సభాగౌరవం పొందారు. ఆధునికయుగంలో రాజులు లేకపోయినా, జమీందారులు కొందరు కవిపండితుల్ని సన్మానించి పోషించేవారు. జమీందారీనిర్మూలనంతో ఆ అధ్యాయం సమాప్తమయింది. ఇది ప్రజాయుగం. రాజులస్థానే కవిని పోషించవలసినవారు ప్రజలు. అయితే వా రెవరు? ఎక్కడ ఉంటారు? ప్రజలలో, రైతులలో ధనవంతులయినవా రెవ్వరికీ సాహిత్యాభిమానం ఉన్నట్టు కనిపించదు.

రాజులవలె, జమీందారులవలె తమ ఆస్థానాలలో కవులను పెట్టి పోషించే ప్రజలు ఎవరూ ఉండరు. అయితే సమూహంమీద ప్రజలు తలచుకొంటే చేయని పని అంటూ ఉండదు. తమకవులను ఆదరించడం, సన్మానించడం వారికింకా అలవడలేదు. దానికి కవుల లోపంకూడా కొంత ఉన్నది. చీటికీమాటికీ కవి అనిపించుకొన్న ప్రతివాడూ బయలుదేరి సన్మానాలు చేయించుకోవడం సామాన్యమయింది. యీ సన్మానాలు ఒక వేలంవెర్రికింద పరిణమించాయి. వీటిమీద "మోజు" రానురాను పోతూవుంది. వీటిమీద ప్రజలకు విలువ తగ్గుతోంది.

కాబట్టి ప్రజాయుగంలో ప్రజలతరఫున ప్రజాప్రభుత్వాలు యీసన్మానాలు చేయవలసివస్తోంది. మద్రాసురాష్ట్రంలో ఒక విధంగా ఇందుకు దారితీశారు. ముఖ్యభాషల్లో ఆస్థానకవిపీఠాలు ఏర్పరచి ఒక్కొక్క ముఖ్యకవికి ఆ పదవి ఇచ్చారు. దీనితోపాటు వార్షికంగా వివిధసాహిత్యరంగాలలో ముఖ్యమైన గ్రంథాలకు పారితోషికాలు ఏర్పరచారు. మన తెలుగుసాహిత్యంలో ఈ యాస్థానకవిపదవి (దరిమిలాను మొన్న శివరాత్రినాడు పరమపదించిన) కవిభీష్ములు శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారికి లభించింది. అందరి ఆస్థానకవులూ ఒకయెత్తూ, శాస్త్రిగారు ఒక యెత్తూ అన్నట్టు అఖండవైభవంగా యీసన్మానోత్సవం విజయవాడలో జరిగింది. ప్రజానీకం నిజంగా అభిమానించుకొనే కవిని సన్మానింపదలిస్తే ఆసన్మానం ఎటువంటి మహనీయరూపం దాల్చగలదో యీ ఉత్సవసభలలో వ్యక్తమయింది. తొలిసారి, విశాలాంధ్రదేశానికి చెందిన, రాయలసీమ, తెలంగాణా, ఉత్తరజిల్లాల ప్రతినిధులతోపాటు మైసూరుఆంధ్రులుసైతం వచ్చి ఈఉత్సవాలలో

పాల్గొన్నారు. యావదాంధ్రదేశమూ ఆ కవిశ్రేష్ఠునకు మోకరిల్లి జయగీతి పాడుకొని పండుగ చేసుకొన్నది.

ఈ ఉత్సవాలతోనే—ఇతరసాహిత్యక్షేత్రాలలో కృషి చేసిన రచయితలకు ప్రభుత్వం ఇచ్చిన పారితోషికాల సమర్పణ కూడా జరిగింది. ఇటీవలి ఆంధ్రసాహిత్యచరిత్రలో ఇటువంటి మహోత్సవాలు జరగడం కనీవినీ లేదన్నారు కన్నవారూ, విన్నవారున్నూ. ఇతరభాషల ఆస్థానకవులు సైతం యీ ఉత్సవాలకు విచ్చేసి కవిగారికి జేజేలు చెప్పారు. ఇటువంటి ప్రభుత్వాదరాన్ని ప్రజలసమ్మతి యీవిధంగా ప్రకటించడం ప్రశంసనీయమైన విషయం. ఇక పారితోషికాల నిర్ణయం. ఈ పారితోషికాలు నిర్ణయించేటప్పుడు కొందరు వ్యక్తుల అభిమానాన్ని వలను చేసుకొని కాక, రచనల ప్రాశస్త్యాన్ని బట్టి, ప్రజల ఆదరణను బట్టి నిర్ణయించాలి. ఇటువంటి నిర్ణయాలు లోకప్రసిద్ధమైన నోబెల్ ప్రయిజు, అమెరికాలోని *Pulitzer Prize* (పులిట్జరుబహుమతి) మొదలయినవాటి సూత్రాలను అనుసరించి కొన్నినిబంధనల ప్రకారం చేస్తే బాగా ఉంటుంది. ఒకగ్రంథప్రాశస్త్యం ముఖ్యంగా ప్రజల ఆదరాన్ని బట్టి గమనించవచ్చు. మన దేశంలోనే ఢిల్లీలో ఒక బహుమతి నిర్ణయించేటప్పుడు "యాయవార్"అనే ప్రచ్ఛన్నకవి రచించిన "దృష్టిపాత" అనే గ్రంథాని కిచ్చారు. ఢిల్లీలో ఉన్న బెంగాలీ కుటుంబాల జీవితాలను చిత్రించిన యీ గ్రంథం—వెలువడిన రెండుసంవత్సరాలలో పదిముద్రణలు పొందింది. [illegible]భాషాగ్రంథాలలో ఉత్తమగ్రంథంగా యీ గ్రంథానికి బహుమతి లభించిందంటే ఎవరు వద్దంటారు?

కాని మన మద్రాసుప్రభుత్వపు నిర్ణయాలలో అటువంటి అర్హతను గుర్తించలేదనే నింద పడింది. పోటీలు, బహుమతులు ఎన్నడూ సాహిత్యవికాసానికి దోహదం చెయ్యవు. నిజమైన కవి ఎప్పుడూ నిష్కామయోగి. ఏ ఫలితమూ ఆశించకుండానే తన హృదయాన్ని స్పందింపజేసిన అంశాలను తన కావ్యాల్లో ఉల్లేఖిస్తాడు. ఆ యంశాలను సార్వజనీనమైన అనుభవాలకు చేరువగా ఉంటే చదువరులు గ్రహిస్తారు; రసాస్వాదన చేస్తారు. కాని అవి ప్రత్యేక లక్ష్యాలకోసం ఉపదేశాలుగానూ, ప్రబోధాలుగానూ, ప్రకటనలుగానూ ఉంటే ఎవరూ మెచ్చుకోరు. అందుకే ఒక మంచి విమర్శకుడు కవిత్వం సాధించవలసిన ప్రయోజనంగురించి చెబుతూ, కవిత్వం సాధించవలసిన ప్రయోజనం కవిత్వం కావడమే అన్నాడు.

ఈ లక్ష్యంతో వ్రాసే కవులు ఈకాలంలో చాలా అరుదు అయిపోయారు. దీనికి కారణం తగిన మంచి అనుభవాలు ఈకాలంలో లేకపోవడమే అని ప్రాతకాలమువా రంటారు. అది నిజం కాదు. ఈతరంవారు పొందుతూవున్న [illegible]మైన అనుభవాలు ఏ కాలంలోనూ ఎవరూ పొందలేదేమో! మన జీవితకాలంలో ప్రపంచచరిత్రలో, మన దేశచరిత్రలో, ఆంధ్రదేశచరిత్రలో ఎన్ని వింతవిశేషాలు చూశాం! ఎన్ని మార్పులు, ఎన్ని పరిణామాలు చూస్తున్నాం! కాలాన్నీ, దూరాన్నీ, ప్రకృతినీ జయించి యున్న చిత్రవిచిత్రాలు శాస్త్రం సాధించడం ఎవరు ఎరుగుదురు? కళలు, వేదాంతం, సాహిత్యం ఇది యింతగా వికాసం ఎప్పుడు పొందాయి? దూరదూరదేశాలమధ్య సంబంధం ఇంత చేరువకు రావడం ఎన్నడైనా ఎరుగున్నారా?

అయినా ఈ అనుభవాలకు, భావాలకు తగినట్టు మన సాహిత్యం అంత త్వరగా పరుగులెత్తదు. సాహిత్యం ఇతరకళల లాగే కొన్ని సంప్రదాయాలకు, లక్షణాలకు లోబడివుంటుంది. అంత చప్పున యీ బంధాలు త్రెంచుకొని బయటపడదు. అందుచేతనే యీనాటికీ, పూర్వపద్ధతులమీద ప్రబంధాలు, పురాణాలు వ్రాయడం, రామాయణాదిపురాణేతిహాసాలు తిరిగి వ్రాయడం ఘనకార్యాలుగా భావించేవా రున్నారు.

ఇది యిలాగ ఉండగా "తంత్రులు గొప్ప దేశభక్తులు; కవితావేశం గలవారు; ఈనాటి స్వాతంత్ర్యభారతగాథ తిరిగి తిక్కనశైలి, నన్నయగారికలితార్థయుక్తితో చిత్రించగలిగిన వర్ధమానకవి బయలుదేరాలి" అని కొందరు పెద్దలు ఆశీర్వదిస్తున్నారు. ఒకరు పురమాయిస్తే వ్రాసే కావ్యాలు మంచికావ్యాలు కావు. కవి తనంతట తాను మనస్సుపడి వ్రాయాలి. తిక్కన నన్నయాదులు ఇతరు లిచ్చిన ప్రోద్బలం ఉండగా తమంత తామే పూనుకొని ఆవేశపడి మహాకావ్యరచనకు ఉద్యమించారు. కృతకృత్యులయ్యారు. మన యుగంలో కవుల్ని ఆవేశపరిచే విషయాలు వేరుగా ఉన్నవి. వర్తమానకాలంలో కవి చూచే ప్రపంచం నిరాశ కల్పిస్తోంది. తాను కలగన్న ఉన్నతి మధురస్వప్నంగానే ఉండిపోతోంది. తనచుట్టూ ఉన్న సమాజంలో అసూయ, అనైక్యత, ఆశాభంగం ఇవి మరచిపోవడానికి కొందరు కవులు పూర్వకీర్తి స్మరించుకొని మురిసిపోతున్నారు. వారి దృష్టిలో భారతమాత రత్నగర్భగా, సర్వమంగళమాంగల్యగా, సస్యశ్యామలగా కనిపిస్తుంది. కొండలు, నదులు, తాము రోజూ చూచే పిల్లకాలువలకంటె లోతుగా తన పాటల్లో, పద్యాల్లో చోటు దొరికినప్పుడల్లా యీ నదుల్ని, కొండల్ని లాగుకొని వస్తారు. "మా భారతీయులిది చేశారు. మా ఆంధ్రులు అది చేశారు. మేం ఆ సంతతివాళ్ళం" అని గొప్ప చెప్పుకొంటారు కాని వారు దేనివల్ల అది సాధించారో గుర్తించరు. ఒక తరంలో ఘనత గమనించి, దానికి కారణమైన హేతువులు నిరూపించి, అప్పటి సంఘాన్ని చిత్రించి, ఆనాటి పరిస్థితుల్లో సర్వకాలసర్వజనీనమైన అంశాలు నిర్వచించడం మహాకవిమాత్రమే చేయగలడు. అలాగ రచించిన కావ్యాలు కనుకనే వాల్మీకి, వ్యాసుడు, నన్నయ, తిక్కన, షేక్స్పియరు, గొథేలాంటి కవులను యీనాటికీ తలచుకొంటున్నాం.

అంతటి మహాకవులు మన తెలుగుదేశంలో ఈయుగంలో లేరని యిప్పుడే చెప్పలేము. కాని కొద్దిప్రయత్నాలు జరుగుతున్నాయి. పురాణయుగంలోనికి, ఇతిహాసయుగంలోకి పలాయనం

కావించిన నేటి కావ్యాలలో విశ్వనాథవారి రామాయణం, గడియారం వేంకటశేషశాస్త్రిగారి 'శివభారతం', రాజశేఖరశతావధానిగారి రాణాప్రతాప్ మున్నగు కావ్యాలు ఉల్లేఖించవచ్చును.

ఈతరగతిలో చేరకపోయినా గాని, ఇటువంటి యితివృత్తాలు తీసుకొన్న కవి మరొకరు ఏటుకూరి వేంకటనరసయ్యగారు. ఈయన స్వల్పవయస్సులోనే కీర్తిశేషులై ఆంధ్రసాహిత్యానికి నిజానికి తీరని కొరత ఏర్పరచిపోయారు.

తెలుగువారల్లో ప్రత్యేకమైన ఒక జాతీయత ఏర్పరచుకొన్నది "పల్నాడు". శ్రీనాథుడితర్వాత యీసీమ ఏ కవుల్నీ ఆకర్షించినట్లు తోచదు. పల్నాడుకథలలోనూ, ప్రజావాఙ్మయంలోనూ పలుకుబడిలోనూ, తెనుగునుడికారంలోనూ ఇంకా ఇనుము కోని ఎన్నో కొత్తదనాలు ఉన్నవి. ఇవన్నీ ఆకళించినవారు ఏటుకూరి వేంకటనరసయ్యగారు. ఆయన పల్నాటిచరిత్ర భారతగాథతో పోల్చి, అది పదికావ్యాలలో రచింప సమకట్టారు. పల్నాడునించి సంతరించవలసిన శబ్దరత్నాలు, పల్లెపాటలు, వీరగాథలు ఎన్నో ఉన్నాయి. అయితే ఆ పలుకురాళ్లను, మంకుకెందలకు సహించి వీటిని వెలికితీయగలిగే దీక్షాశాలి కావాలి. ఆ సామర్థ్యమంతా తనలో దాచుకున్న "ఏటుకూరి" తన కలలు తీరకుండానే కడతేరిపోయారు. అయినా గాని, ఆతని "క్షేత్రలక్ష్మి", "అలుగురాజు" తెనుగుసాహిత్యంలో సుస్థిరస్థానం సిద్ధింపజేసుకొన్నవని చెప్పకతప్పదు.

ఈకవులందరినీ మించిన మరొకతరగతికవులు యువరచయితలు. వీరి కవితాసంప్రదాయాలు వేరు; సామగ్రి వేరు; కవిసమయాలు వేరు. ప్రాచీనకలంకారాల్ని వదలి సమకాలీనజీవితానికి అనుగుణమైన కొత్తసమయాలను, కొత్త పదచిత్రాలను యీకవులు సృష్టించుకొంటున్నారు. పూర్వపరిచితమైన శబ్ద, అర్థాలంకారాలుగాని, 'ప్రేయసి', 'కోయిల' 'పుష్పాలు' 'స్వప్నాలు'వంటి పదజాలంగాని వీరి కవితలో కనిపించవు. వ్యక్తిగతమైన అనుభవాలకంటె సమష్టిసంఘానికి అనువర్తించే ఈతిబాధలు వీరి కవితకు వస్తువులు. కొందరు సామ్యవాదాన్ని, మార్క్సువాదాన్ని తమ కవితలో ధ్వనింపజేస్తారు. ఇట్టి కవితాసంప్రదాయాలకు దారితీసినవాడు శ్రీశ్రీ. నేటి కవులలో శ్రీశ్రీప్రభావం ప్రబలంగా గోచరిస్తుంది. ఈపద్ధతిలో రచిస్తూవున్న యువకరచయితలలో ముందుకు వచ్చినవారు 'ఆరుద్ర', 'అనిసెట్టి'. ఈసంవత్సరం వీరిద్దరి రచనలూ పుస్తకరూపాలలో వెలువడ్డాయి. ఈతెగకు చెందిన మరొక రచయిత 'సోమసుందర్' రచనలుకూడా గ్రంథరూపంలో వెలువడ్డాయి. తెనుగుసాహిత్యంలో ఖండకావ్యాలు సంపుటాలుగా ప్రకటించడానికి కవులూ, ప్రకాశకులూకూడా వెనుకాడుతూవచ్చేవారు. ఈసంవత్సరం మూడు కవితాసంపుటాలు వెలువడటం చాలా ముదావహం. ఈ మూడు కావ్యాలలో ముఖ్యంగా పేర్కొనవలసినది 'ఆరుద్ర' రచించిన "త్వమేవాఽహమ్". ఇది నిజానికి 'త్వమేవాఽహమ్' 'వేదనాశకలమో' 'శఘాస్తు' అనే మూడు ఖండకావ్యాల సంపుటి. దినపత్రికలలో వెలువడిన రచనలే యీగ్రంథరూపంగా వెలువడ్డాయి. ఇప్పటికి ఇదే ఇతని ఏకైక ఖండకావ్యం. దీనికి లఘుటిప్పణి వ్రాసిన శ్రీశ్రీ రెండు పెద్ద మాటలు చెప్పాడు.

1. భారతదేశంఅంతట్లోకి రాజకీయంగా ఎక్కువ చైతన్యం చూపిస్తున్న ప్రదేశం ఆంధ్రభూమి అని.

2. నవ్యకవిత్వానికి ఈనాడు ఇండియాఅంతటికీ అగ్రస్థానం తెలుగుభాషది అని.

ఈ రెండూ వివాదగ్రస్తవిషయాలు. అయితే శ్రీశ్రీ మొదటిదానికి ఉదాహరణగా తెలంగాణావిప్లవాన్నీ, రెండవదానికి తార్కాణంగా ఆరుద్రవ్రాసిన 'త్వమేవాహం' వంటి కావ్యాల్నీ తీసుకొన్నాడు.

ఇందులో మొదటికావ్యం తెలంగాణావిప్లవం ప్రోద్బలంగా వ్రాసినది. ఇది మన ఆలోచనావిధానాలను సామ్యవాదానికి అనుకూలంగా మారుస్తుంది. దీనికి ఉదాహరణగా చూపించిన ఆరుద్ర రచించిన కొత్త పైథాగరస్ థియరం ఇది:

"వ్యక్తిగతదరిద్రాలనీ
వర్గకలహాలనీ
శోకజాలపద్ధతిని..."

పుత్రపౌత్రాభివృద్ధిగా పెంచకుండా ఆకారేఖాగణితం రీత్యా వీటి సమస్యలను పరిష్కరించుకోండని అంటాడు ఆరుద్ర. ఇతనికి ఛందస్సులు చెప్పినట్టు వింటాయి. తెలుగుజాతీయతకు అనువైన మాత్రాఛందస్సులు 'ఆరుద్ర' పేరుకొని వాటిచేత కదం నడిపించాడు. కాలంతో ఇతని ఛందస్సులు కదనుతొక్కి, "స్టాప్‌వాచీ" "క్ష" "నిమిషాలు" "సెకండ్ల"తో కొత్త టెంపో తెచ్చుకొంటాయి. "ప్రవాహదశ" అని పిలిచిన యీ కావ్యానికి ఆరుద్ర తనకు వచ్చిన ఛందస్సులన్నీ చేర్చి గొప్ప గమనం తీసుకొనివచ్చాడు. చూడండి యీపంక్తులు.

ఊరు
మేడను
నిరు
పేదలు
ఈ
కోటల
రా
రాజులు
ఈ
కొంతను
చెరపట్టగ
రా
కాసులు
తలపెట్టిరి——

స్టాప్‌వాచీ

అపశ్కాలం
చీకటిదుకూలం
ఆలస్యం నీ
ఓటమిరహస్యం—అని 'శ్రీ' యిచ్చాడు.
ఆరంభించిరి
నీచమానవులు
అత్యాచారవ్యూహమ్ముల౯.
అని శార్దూలాన్ని తెచ్చాడు.
భళానోయి భళితమ్ముడా
నక్కలు తిరిగే తోటలో
రాకాసి రాజొకడుండెరా
వాడినుండె రాబందురా
వాడిరాజ్యపు౯ పాట్లపాడురా—
అని 'సెకండ్లలో' బొబ్బిలిపాట పాడ్తాడు.

శ్రీశ్రీ అన్నట్లు శుద్ధవచనం రాస్తూన్నా దాని గమనంలో వేగం సాధించగలడు ఆరుద్ర. చూడండి 'కామా'లూ, 'ఫుల్‌స్టాఫులూ' లేని యీ వచనం.

"కారణం పిల్లికి విశ్వ సమస్తాన్నీ ఏబిందువుదగ్గర కేంద్రీకరించాలో తెలీదు. కేంద్రాలలో అఘనమ్మకం వృత్తాలలో అఘం సృష్టి విధ్వంసనయొక్క ధ్వంసం కారణంయొక్క కారణం మార్పుని మార్చాలిగానీ..."

అయితే ఆరుద్రరచనలో ఎక్కువ ఇంగ్లీషుపదాలవాడకం ఒక యిబ్బందిగా పాఠకులకు తోచవచ్చు. కాని ఆరుద్ర తీసుకొన్న కవిసమయాలు, ఉపమానాలు, రూపకాలు, భావజాలం చూస్తే యీ పదజాలం వాడితేతప్పఅతని భావం వ్యక్తం కాదని పాఠకులకు స్పష్టంకాకతప్పదు. అన్యదేశ్యపదాలను వేళాకోళంకోసం వాడటం ఇదివరకు సంప్రదాయం. ఆరుద్ర తన సీరియస్‌పొయిట్రీలోనే ఇంగ్లీషుపదాలు వాడి తన భావాలు సువ్యక్తం చేసుకొంటాడు.

బ్రెయిన్‌లో పెయిన్
ప్రతీవెయిన్‌లో మెషీన్‌గన్ రెయిన్...
అన్నమాటలు వికటకవిత్వం అనలేము.
కన్‌ఫ్యూజన్‌ముట్టడినుండి
యాన్‌గ్జయిటీసుప్పిటినించి
స్వర్గారోహణసమయంలో
టూవేస్విచ్‌మీదనించి
ఆర్పేస్తా రన్న భయంనుంచి
నిరుత్సాహం నిషానుండి
విషాదంజారినుండి
వినాశనంబారినుండి
మము బ్రోచేవా రెవరూ లేరా?

కొన్ని సంపుటాలు వ్రాసినాగాని సులభంగా వివరపరచలేని భావాలను యీ అన్యపదాల వాడకంవల్ల కుదించి క్లుప్తంగా కవి చెప్పగల్గుతున్నాడు. అందుకే ఇటువంటి కవితాసామగ్రి జాగ్రత్త పెట్టుకున్నాడు కవి.

ఆధునికశాస్త్రాలయిన గణితం, ఫిజిక్స్, కెమిస్ట్రీ, బయోలజీ, సైకోఅనాలిసిస్—వీటినుండి ఎన్నో భావాలు తన కవితావస్తువులుగా తీసుకొన్నాడు. అందుకే—మన కిదివరకుఎన్నడూ పరిచయంకాని క్రొత్తభావజాలం గోచరించి ఉక్కిరిబిక్కిరిచేస్తుంది. చూడండి—

"ఈమె ఆయస్కాం
తకాంత—నిజ
ప్రతిరజం—ఇ
కే ప్రయాణం—మూ
షలో పోసిన
ఖనిజం—నిజం—అంటాడు."
"వ్యక్తిగతదరిద్రాలనీ
వర్గకలహాలనీ
శోకఢాలపద్ధతిని
చేసేవారు మీరు
ఆశాకేశాగణితంలోత్య
అభ్యుదయబీజగణితంద్వారా
సాల్వ్‌చేద్దాం ఇప్పుడు—"

అని క్రొత్తరకమ్ వ్రాస్తాడు. "చిరంజీవిమానవుడ్ని ఉద్దేశించి మృత్యువు" చెప్పిన మాటలలో ఎన్నో అంశాలు చాలా గడుసుగా చెబుతూ ఆధునికవిషయాలు విచ్చలవిడిగా ఉపయోగించాడు.

"ఉద్దేశించిన భావాల ఆడబొమ్మలకి
వాక్యాలు గడ్డాలూ మీసాలూ పెడితే"యట.
"నువ్వు ఎక్కదలచుకొన్న రైలు
ఎప్పుడూ ఒక జీవితకాలం లేటు"ట.
"మాసిపోయిన మనస్సులు ఉతుక్కోలేక
మహాత్ముల లాండ్రీలో పారేస్తా"రుట.

ఇటువంటి చమత్కారవాక్యాలు ఎన్నైనా చూపించవచ్చు. ఇతని రెండో కావ్యం "వేదనాశకలమ్" ఒక నాటిక. ఇందులో 'జనత', 'అఖండజ్యోతి' 'పంచరంగులూ' పాత్రలు. జనత "అయ్యో ఇలా మండుతోందేం ప్రపంచం" అని దండకం మొదలు పెట్టి—"

"ఇదేం గడ్డుకాలం, మరోలక్ష బీభత్సదృశ్యాల సారం నివేదించినా లాభముందా పరిష్కారమార్గం"అని నిట్టూరుస్తుంది.

ఈ సంఘర్షణలో నిస్పృహ పొందక కవి—

"భూమిపయి దేవతల భూమి విహరించవలె
......................................."

రాములు వశించవలె ప్రేముడి హసించవలె...

అని భరతవాక్యం పాడతాడు. చివరికావ్యం "తథాస్తు" చాలా చిన్న కావ్యమైనా చిత్రంగా ఉంటుంది. విద్యుచ్ఛక్తిఉత్పత్తికి కారణాలయిన 'రాగి' 'తుత్తునాగం'.

"గల్లాపెట్టొక్కటే సకలమతసారం" అన్న "ఇనుము" వాదాన్ని ఎదిరించి—రెండూ కలిసి

"పిల్లే దరుగో సామ్యం
పిల్లేదయ్యా దొరా, కపి ఇక రయితే"

అంటాయి. అప్పుడు అయస్కాంతం ఉత్పత్తయి ధైర్యం చెబుతుంది.

"ప్రజ భయపడకూడదు
ఇల నిజం గెలుస్తుంది
కపట నీతి వెలుస్తుంది
జరామరణా లిక కల
ధ్వజంకొస నిరంతరసమసర్గం చూస్తాం"

అప్పుడు కవి తథాస్తు అంటాడు.

ఇలాంటి చమత్కారాలు కవి ఎన్నైనా చేశాడు. అణు రహస్యాలు, వాటి విశేషాలు తెలిస్తేతప్ప యీ కావ్యాలు సవ్యంగా అర్థంకావు. మొత్తంమీద "అరుద్ర" ఒక అఖండకావ్యం వ్రాసి, అఖండఖ్యాతి ఆర్జించుకున్నాడు. ఇది చదివి శ్రీశ్రీ "ఇక నేను రాయకపోయినా ఫర్వాలేదన్నాను" అని వ్రాశాడు. అరుద్రరచన వలతరవాత శ్రీశ్రీ ఈమధ్య ఆట్టే కవితారచన చేయడం లేదంటే ఆశ్చర్యపడవలసినదేమున్నది? "త్వమేవాహమ్" ప్రచురించినవారే "వజ్రాయుధం" అనే మరోకావ్యసంపుటి ప్రకటించారు. సోమసుందర్ రచించిన యీకావ్యాలలో ఎక్కువ భాగం ప్రబోధ గీతాలుగానూ, ప్రచారగీతాలుగానూ కనిపిస్తాయి. కవితాసౌందర్యంకన్నా ప్రచారం ప్రధానాశయంగా పెట్టుకున్న కావ్యాలు ఎంత అభ్యుదయపంథాలో నడిచినా కావ్యార్హత పొందలేవు. ఈ పంథాలో నడిచినా కవితాశిల్పం కొరవడని మరికొన్ని ఖండకావ్యాలు సంపుటిగా వచ్చాయి. ఈకావ్యం అనిసెట్టిసుబ్బారావుగారి "అగ్నివీణ."

ఈకవిదృక్పథాన్ని వివరిస్తూ పుస్తకకంచుకంలో ఇలా వ్రాశారు: "అద్యంతరహితమైన ప్రాణవాహినికి మార్గాన్వేషులైన రెండు గంభీరచైతన్యతరంగాలు—తత్వశాస్త్రం, కవిత్వం. ఇవి మానవుని జ్ఞాననేత్రాలు. ఈ సుందరనేత్రాల కాంతిలో లోకజీవిత రహస్యాలను శోధించాలి. నేడు కాంతి ఒక్కటే చాలదు. ప్రచండమైన ఉష్ణోగ్రతకూడా కావాలి. ఈ వేడిలో జీవితాన్ని కరిగించి, ఒక కొత్తరూపాన్ని సాధించాలి. అప్పుడు నిర్మితుడైన మహామానవుడు భూమికే కాదు, విశ్వానికే అధినేతగా నిలుస్తాడు."

వెలుగు, వేడి వీటిలో యీ కవిరచనలో దేనికి ప్రాముఖ్యమో పరిశీలిద్దాం.

నరబలిలో, చిరపీడనలో
గుడిలో, యంత్రపు దోపిడిలో
హతురా పతితుల ప్రాణజ్వాలలతో
లోకపు చీకటి
కన్ను తెరుస్తూ
....................
సముదగ్ర స్థాపిస్తూ
అధోజగత్సహోదరుల
కంఠగ నిలిచిన పిరులు
అజ్ఞాతుల, అనామకుల
కథీసందనసంకేతం
అగ్నివీణ సంగీతం!

అనే ప్రతిజ్ఞతో యీ కావ్యం ప్రారంభం అవుతుంది. ఇది కూడా "జ్వాలాతోరణం", "శాసనాలు", "మాతృసంగీతం" అనే మూడుకావ్యాల సంపుటి. వీటిలో సుదీర్ఘకావ్యం "జ్వాలాతోరణం."

"అనిసెట్టి కవిత్వం గురజాడశ్రీశ్రీల సంప్రదాయానికి చెందిందే అయినా ఒక కొత్త వ్యక్తిత్వాన్ని, విశిష్టతనూ రూపొందించుకొంది." అనీ "ఇతని కవిత్వంలో అభ్యుదయదృక్పథం విద్యుద్వాహినిలా ప్రసరిస్తుంటే, శిల్పనైపుణ్యం ఆ వాహినిలో నిగూఢంగా వున్న వెలుగునూ వేడినీ జగత్తుమీదికి విరజిమ్ముతుంది"అనీ పుస్తకకంచుకంలో ముద్రించారు.

అరుద్రకవితలోవలె యితని కవితలో అన్యదేశ్యపదాలు, క్లిష్టభావాలూ కనిపించవు. ఛందస్సులూ, గీతాలూ, భావాలూ సుపరిచితాలే అయినా, పాడటానికీ ఆవేశంతో అనుకోవడానికీ అనువుగా ఉంటాయి. అయితే ఇతని ఊహాచిత్రాలుకూడా చిత్రంగానే ఉంటాయి.

తీయని మన బ్రతుకులు
తెగని గొలుసులలో లంకెలట!
తారాసముచ్చయంవలె
ఆత్మ లగ్నిగోళాలట!
"పండుమానవజాతినిండుహృదయమై
ఈ ఉదయ మూర్తిపై
వెల్గు తెగబోవనిద" అంటాడు.

ఈకవి పూర్వసంప్రదాయాన్ని, కవిసమయాన్ని మరచి పోలేదు. తన భావాలను పాతసంప్రదాయాలమీద పాదిగి కొత్త వెలుగు తెస్తాడు. తన భావాలు పాటలుగా పాడి మనచేత పాడిస్తాడు. మీతో వస్తాను అంటాడు, రండిరండి అని పిలుస్తాడు. "రాత్రి" "ఉదయం" "మధ్యాహ్నం" వీటిని చూడమని మనల్ని కూడా తనతో తీసుకొనివెళ్తాడు.

కలతనిదరలో నన్ను మానవుని మేల్కొన మన్నప్పుడు, 'మాతృభూమి పిలుస్తోంది మారుపలుకవేమిరా' అన్నప్పుడు ప్రచార గీతాలు పాడుతున్నాడా అనిపిస్తుంది. ఈకాలంలో అందరి హృదయాల్నీ స్పందింపజేసిన యుద్ధబీభత్సం, స్వాతంత్ర్యవిప్లవాలు, ప్రజాఉద్యమాలు నేటి యువకులో కొన్ని కదిపినట్లు ఈయన్ని కూడా కదిపాయి. అందుకే యీయన "నలభైకోట్ల ప్రజావిప్లవ కంఠం"లో తన కంఠం కలిపాడు. కొన్నిచోట్ల బహిరంగంగా 'అరుణపతాక'ను జోహార్ చేశాడు.

"జగత్తును ముంచెత్తు ఎర్ర
వెల్లని ఈ శుభోదయం నాకు తెలుసు"

నంటాడు.

"మన త్యాగాల వృథ కాదని
ముందుతరాలరుణవదన
మృదుహాసం చేస్తున్నవి—"

అనే ధైర్యం వెలిబుచ్చుతాడు. ఇటువంటి గీతాలు చదివే టప్పుడు వెలుగుకంటె వేడి మనకు తాకుతుంది. దూరంగా తప్పుకొంటాం. కాని "అనిసెట్టి"లో తోడిపోదరలగూర్చి అటుపుటలాడే కవిహృదయం ఉన్నది. అదే కరుణగీతాలుగా వినిపిస్తుంది.

అన్యాయం చూచి సహించని ఆర్ద్రహృదయం పలికిన "మాని షాద" కావ్యంవంటి పలుకులు యీతని కొన్ని కావ్యాలు చదువుతూ ఉంటే స్ఫురిస్తాయి.

అనిసెట్టికి గొప్ప కవితాహృదయం ఉంది. ఆవేశం ఉంది. అది పొంగుతూవున్నప్పుడు అతని భావాలుకూడా పొంగి పొరలుతూ ఉంటాయి. అందుకే కొన్నిచోట్ల ఏమిటో చాదస్తం అనిపిస్తుంది. కవి అనుభవాలుపరిపక్వమై ఆవేశంకంటె అందానికే ప్రాముఖ్యం యిచ్చే హస్తకౌశల్యం గోచరించేటప్పుడు ఇతని కావ్యాలు సర్వజనామోదాన్ని పొందగలుగుతాయి. మునుముందు "అనిసెట్టి" కొత్తకావ్యం ప్రకటించేటప్పుడు ఉత్తమకవిగా చూడగల్గుతాం. అది అతని ఆవేశంలో కొంతనిగ్రహం ఏర్పడినప్పుడే!

సాహిత్యసమీక్ష చేసేటప్పుడు కవిత్వానికే ఎక్కువ ప్రాధాన్యం యివ్వడం మనకు అలవాటయిపోయినది. కవిత్వం వినా సాహిత్యం లేదన్నంతవరకు వచ్చినది. నిజానికి కవితా రచనకంటె ఉత్తమరచనలు నేటి వచనరచనల్లో విశేషంగా గోచరిస్తూవున్నవి. ప్రజాసామాన్యంలోకూడా పద్యరచనలకంటె గద్య రచనలు ఆస్వాదించేవారు, ఆనందించేవారు అధికంగా ఉన్నారు. నేడు బహుళప్రచారంలో ఉన్న పత్రికలు యీ గద్యరచనలు జన సామాన్యానికి మరింత అందుబాటులోనికి తెస్తున్నవి. నేడు వెలువడుతున్న ప్రతిపత్రికా కథానికలు, సీరియల్సు ప్రకటిస్తోంది. సీరియల్సుకంటె కథానికలే ఎక్కువజనం చదువుతూవున్నట్లు తార్కాణాలు కనిపిస్తున్నవి. మన రచయితలు, పేరుపడిన కథా కారులు, కొడవటిగంటి, గోఖలే, చలం, కరుణకుమార మొదలయిన వారు మంచికథలు వ్రాస్తూనేఉన్నారు. వీరుగాక యువక రచయితల్లో తెన్నేటి సూరి, చాగంటి సోమయాజులు, పొట్లపల్లి రామారావు, ఈరంకి వేంకటశాస్త్రి మొదలయినవారు మంచికథలు వ్రాస్తున్నారు. అయితే వీరికథలన్నీ అప్పుడప్పుడు పత్రికల్లో ప్రకటించడంతప్ప గ్రంథరూపాన వెలువడటంలేదు. ఈసంవత్సరం ప్రచురణల్లో ఆకారత తీసింది. 'అభ్యుదయకథ'లని ఒకసంపుటి వచ్చింది. ఇందులో పైనచెప్పిన రచయితలు చాలామంది వున్నారు. కథలన్నీ యించుమించు ప్రచారధోరణిలో ఉన్నవేమో అని తోస్తుంది. కథానికారచన అతిసులభంగా గోచరించినప్పటికీ, దానిలో "టెక్నిక్"—పనితనం చాలా ఉన్నది.

ఈ టెక్నిక్ తెలిసినవారు క్రిందటితరంవారిలో చాలామంది ఉన్నారు. వారిలో నేటికీ కథలు వ్రాస్తూఉన్నవారు ఏ ఇద్దరు ముగ్గురో ఉన్నారు. ముఖ్యంగా "చలం" "మునిమాణిక్యం" "శిశో మణి" వాటికి నేటికీ ఒకేపద్ధతిలో వ్రాస్తున్నారు. "మొక్కపాటి" "చింతా" "వేలూరి" మున్నగు రచయితలు పొత్తిగా వ్రాయడం మానుకున్నారు. వీరి కథల సంపుటాలుకూడా నేడు లభించకుండా ఉన్నవి. వీరి తరానికే చెందిన గొప్పరచయిత కే. శే. సెట్టిలక్ష్మీ నరసింహంగారి కథలు ఈసంవత్సరం సంపుటంగా వెలువడ్డాయి.

"ఉగాదికానుక"లని ఈ రచయిత ప్రతిసంవత్సరాదికీ వ్రాసిన పదికథల సంపుటి యీగ్రంథం. సంవత్సరాదికి కానుకలు పంపడం మన దేశంలో ఆచారం కాకపోయినా, ఈకథలు క్రిస్మసుకానుకలను అనుసరించి 'సెట్టి'మాష్టారు వ్రాసి ఉగాదిసంచికలలో ప్రకటించారు. అవి ప్రకటన పొందిన సమయాలలో అందరి మెప్పూ పొందాయి. ముఖ్యంగా చరిత్రాత్మకగాథను ఆధారంగా చేసుకొని వ్రాసిన ఒక కథ చదివినవారు ఎన్నటికీ మరచిపోరు. అందులో సుబ్బుపురోహితు, ఆ రోడ్డుతీసే సుత్తెందెక్కల 'టకటకా' అనే చప్పుడు ఇప్పటికీ కళ్లకుకట్టినట్టుంటాయి. అలాంటి నైపుణ్యం ఏ కొద్ది కథకులకో లభిస్తుంది. ఇది బాగా అలవరచుకొని వ్రాస్తూఉన్న కథలు ఇంకా అరుదుగానే కనిపిస్తున్నవి.

ఇటువంటి టెక్నిక్ బాగా తెలిసిన నేటి యువక రచయితల్లో "బుచ్చిబాబు" ఒకడు. ఇతడు ఈసంవత్సరం ప్రకటించిన మంచికథల్లో ఒకటి "మీ జీతం ఎంత?" అనేది. దీనికి శీర్షిక మరొకటి ఏదో ఉన్నదికాని కథావస్తువు—మన తెలుగు వారిలో ఒకరి జీతం ఎంత? ఒకరికి పిల్లలు ఎంతమంది? అని అడిగి వారితో తమ తాహతు పోల్చుకొని, అసూయ, గర్వం మొదలయినవి పడే కుతూహలాన్ని వెటకారంచేయడం. ఇది మంచి టెక్నిక్‌లో నడిచి తొలినించి చివరివరకు పాఠకుల్ని తన్మయుల్ని చేసి సహజహాస్యధోరణితో చక్కిలిగింతలు పెడు

తుంది. ఇతడు వ్రాసిన మరొకకథ "అనాప్రియుడు" అది చిన్నకథ కాదు గాని ఒక నవలిక అనవచ్చు. చిన్నతనంలో ప్రేమించిన ఒక అమ్మాయి—సినిమాతార కీర్తిపథాన విహరిస్తూ ఉన్న సమయంలో చిన్ననాటి స్నేహితుడు ఆమెను పత్రికారచయితగా కలుసుకొని పలకరించడం ఈకథ ఇతివృత్తం. ఇదికూడా సున్నితమైన హాస్యధోరణిలో యథార్థజీవితరహస్యాలు ప్రస్ఫుటంగా ఎత్తిచూపింది. జీవితంలోని సుఖదుఃఖాలు చూచి కవి హాస్యం చేసినప్పుడు, అతనితో మనం కోపగించకుండా ఉండలేము. కాని కోపాన్నీ తాపాన్నీ పోగొట్టి నవ్వి నవ్వించడం గొప్పశిల్పి అయిన రచయితకే చేతనవుతుంది. అలాంటి శిల్పం బుచ్చిబాబుచేతుల్లో ఉంది. కథానికలకు గల ప్రచారం సీరియలునవలలకు ఉండటం లేదు. దానికి కారణం ఆ నవలలలోపం కూడా అయివుంటుంది. ఈసంవత్సరం వివిధ పత్రికలలోనూ ప్రకటనపొందిన సీరియల్సు డజనుపైగా ఉన్నాయి. కాని వాటిలో వెలువడిచి చెప్పదగినవి ఒకటిరెండుకూడా లేవేమో! దీనికి కారణం ఊహించడం కష్టం కాదు. ఈనవలలు వ్రాసేవారు యథార్థజీవితాన్ని పరిస్థితుల్ని విస్మరించి, తమకు గల భావాల్ని ప్రచారంచేయడానికి పాత్రల్నీ సన్నివేశాల్నీ కల్పించి, వాటిని ఒక కథలో ఇరికించడానికి ప్రయత్నం చేస్తూ ఉండటమే. కథ చదివేవారికి ఇది చాలా ఎబ్బెట్టుగా ఉంటుంది. వెలువడిన సాముదంటే చారిత్రకనవలలూ, జీవచిత్రాలూ వ్రాసేకంటె యథార్థజీవితానికి సంబంధించిన సామాజికగాథలు వ్రాస్తే మరింత ప్రజాభిమానాన్ని పొందవచ్చు. ఈవిషయంలో చెప్పదగిన నవల వి. వి. ప్రసాదరావుగారి "వాకబలి". మధ్యతరగతికుటుంబానికి చెందిన కష్టసుఖాలు, పెండ్లిఆచారాలు, సాంఘికనిబంధనలు మొదలైనవి యీ నవలలో చక్కగా రచయిత పొందుపరచి ఆదినించి అంత్యంవరకు రక్తికట్టించాడు. ఇంత పెద్దనవల కాకపోయినా, మధ్యతరగతివారి జీవితమే కథావస్తువుగా తీసుకొని రచించిన మరొకనవల "సంపన్నులూ—చదువరులూ". మాలతీచందూర్ రచించిన యీ నవలిక సుకుమారస్త్రీహృదయంలో ఇదివరకు పురుషరచయితలు చూడని కొత్తలోతులు వెల్లడించింది. చమత్కారమైన శైలిలాగే చమత్కారమైన యీకథ సున్నితంగా, సుమనోజ్ఞంగా ఉన్నది.

నవలలకంటె ఇతరభాషల్లో బహుళప్రచారంలో ఉన్న గ్రంథాలు జీవితచరిత్రలు, ముఖ్యంగా స్వీయచరిత్రలు. మన భాషలో స్వీయచరిత్రలు అంతగా రాలేదు. ఇటీవల టంగుటూరిప్రకాశంగారి స్వీయచరిత్ర సాహిత్యంలో ఒక ఒరవడి పెట్టింది. ఈ సంవత్సరం మరిరెండు స్వీయచరిత్రలు వచ్చాయి. ఒకటి కె. యస్. కేసరిగారిది; రెండవది దరిశి చెంచయ్యగారిది. వీరు ఉభయులు సాహిత్యవేత్తలు కారు. వీరిగాథల్లో ఆనాటి పరిస్థితులు తెలుస్తాయి తప్ప సాహిత్యదృష్ట్యా చెప్పుకోదగిన శిల్పం, సౌందర్యం ఈ రచనల్లో కనిపించదు. కేసరిగారి చరిత్ర మద్రాసునగరంలో ఆకాలంనాటి పరిస్థితుల్ని జ్ఞాపకంచేస్తుంది. ఈవారు అపూర్వంగా కనిపించే ఎన్నో కొత్తవిషయాలను వెలుగులోకి తెస్తుంది. అలాగే దరిశి చెంచయ్యగారి కథలో—భారతదేశచరిత్రలో ఒకనాడు గద్దలు పెట్టిన విప్లవపక్షం "గదర్ పార్టీ" గురించిన అనేకవిశేషాలు యీచరిత్రలో పొందుపరిచారు. కందుకూరి వీరేశలింగంగారి జీవితచరిత్ర ఇతివృత్తంగా అవసరాల వెంకటనరసుగారు రచించిన ఒకనాటకం కొత్తదారి తొక్కింది.

చరిత్రగ్రంథాలతరవాత చెప్పవలసినవి శాస్త్రగ్రంథాలు. మాతృభాషద్వారా విద్య ప్రచారంలోకి వచ్చిన యీకాలంలో అనేకశాస్త్రగ్రంథాలు సర్వజనసుబోధకమైన సులభభాషలో వెలువడవలసిన అవసరం ఎంతయినా ఉంది. కాని యింతవరకు మంచి గ్రంథాలేవీ రావడంలేదు. ప్రభుత్వంవారు సంకల్పించిన విజ్ఞానసర్వస్వం యీసమయంలో వెలువడుతుందని అనుకొన్నాం. కాని వారు ప్రకటించిన మచ్చుపదాలు చూస్తే ఆ యాశ కాస్తా అంతరించిపోతోంది. కావలసిన పరిభాష లేదని విజ్ఞానవేత్తలు చెప్పవచ్చును. ప్రభుత్వంవారు 'నిపుణుల'చేత తయారుచేయించిన పారిభాషిక పదాలు సంతృప్తికరంగా లేవని ఉపాధ్యాయులూ, విద్యార్థులూ ఒప్పుకొన్నారు. పరిభాషపదాలు లేనపుడు అందాకా ఇంగ్లీషుమాటలైనా వాడి శాస్త్రం విపులపరచే ప్రయత్నాలు చెయ్యాలి కాని భాషపాలకిపోయి ఎవరికీ కొరకబడని విషమపదాలు తయారుచేయడం కొరగాని పని. కొండను త్రవ్వి ఎలుకను పట్టడం!

హిందీ రాష్ట్రభాషగా చేసినతర్వాత, రాజ్యాంగచట్టం హిందీలోకి అనువదింప ప్రయత్నించేశారు. ఈసమయంలో 700 ముఖ్యపదాలకు వివిధభాషలలో సమానపదాలు తయారుచెయ్యాలని వివిధభాషల పండితుల్ని ఢిల్లీలో సమావేశపరిచారు; చర్చలు చేశారు; పదాలు తయారుచేశారు. ఈ పనికి లక్షరూపాయలను పైగా వ్యయంచేశారు గాని తయారుచేసినపదాలు ఎవరినీ తృప్తిపరచలేదు. "లా"పుస్తకాలూ, చట్టాలూ, శాసనాలూ అనువదించేటప్పుడు ఎవరికీ బోధపడని అయోమయభాషలో అనువదించడం మన అనువాదకులకు అలవాటయిపోయింది. కొన్ని సందర్భాలలో మాతృక చూస్తే తప్ప ఇంగ్లీషుచదువుకొన్నవారికి సైతం అర్థంకాదు. ఇదివరలో ఈ అనువాదాలు ఎలాగ జరిగినాగాని మన నూతనరాజ్యాంగచట్టం అనువాదంచేసేటప్పుడుమాత్రం అది అందరికీ బోధపడేటట్టు వ్రాయించి ప్రకటించడం అవసరం. ఈపనికి పూనినవారు శ్రద్ధగా ఆలోచించి, పరభాషలో యీ అనువాదం చేయడం అత్యంతావసరం.

ఆంగ్లఅనువాదాలు చేయడంలో—ఆంగ్లంలో ఆలోచించడం, తెనుగులో వాటికి మక్కీకిమక్కీ వ్రాయడం అలవాటయిపోయింది. ఒక ప్రఖ్యాతవిమర్శకు డన్నట్టు, ఇంగ్లీషు చదివినవారు తెలుగు స్వంతంగా వ్రాసినప్పటికీకూడా యీ ప్రతిబంధకం కనిపించి, తెనుగునుడికారానికి విరుద్ధమైన పలుకుబడి

కనిపిస్తూవచ్చింది. ఈ "ఆంగ్ల మానసపుత్రులు" లాంటివారే రేపు హిందీ ప్రాముఖ్యం వచ్చినతరవాత హిందీమానసపుత్రులు కూడా బయలుదేరుతారు. అప్పుడే ఇటువంటి సూచనలు కనిపిస్తున్నాయి. ఈసంవత్సరం ప్రకటనపొందిన ఒక హిందీఅనువాదం మచ్చుగా చూపవచ్చు. హిందీలో రాహుల్ సాంకృత్యాయన్ రచించిన "వోల్గాసే గంగా" అనే పుస్తకం తెనుగుఅనువాదం చూస్తే, తెనుగు భాష యీ పుస్తకంలో ఎన్ని వికృతులు పొందిందో గ్రహించవచ్చు. హిందీనుండి తెనుగుఅనువాదాలు వచ్చాయి. రావలసిందే. కాని యిది యింతసేపూ ఒకవైపు రహదారి అయిపోయింది. తెనుగునుండి హిందీఅనువాదాలు చాలా తక్కువగా ఉన్నాయి. వచ్చిన కొద్ది అనువాదాలు ఇదివరకు హిందీలో పాఠకుల ప్రశంసలను అందుకొన్నాయి.

ఈ విషయంలో హిందీసాహిత్యపరిషత్తు ఒకటి నెలకొల్పి కృషి చెయ్యాలని కొందరు ఉత్సాహవంతులు ప్రయత్నించారు. కాని అందరి ఉత్సాహంలాగే ఆరంభశూరత్వంతో ఆగిపోయింది. హైదరాబాదులో జరిగిన దక్షిణభారతసాహిత్యపరిషత్తులో ప్రసంగిస్తూ, యు. పి. విద్యామంత్రి సంపూర్ణానందు ఉత్తరదేశస్థులు కనీసం ఒక్క దక్షిణభాషయినా నేర్చుకోవాలన్నారు. అంతవరకూ అక్కరలేదు; దక్షిణభాషలలో కూడా విజ్ఞానం, సాహిత్యం ఉన్నాయని ఉత్తరాదివాళ్లు తెలుసుకోవాలి. ఇందునిమిత్తం ప్రచారం అవసరం. ఆ ప్రచారం తెలుగుభాషకు మరీ అవసరం. తెలుగువారంతా మద్రాసీలనీ, మనం మాట్లాడే భాష 'మద్రాసీ' భాష అనీ ఉత్తరదేశీయుల అపనమ్మకం. ఇది ఎంత త్వరగా పోగొట్టితే అంత మంచిది. ఇందుకోసం ఆంధ్రహిందీసాహిత్యపరిషత్తు కృషి చేయవలసివుంది. ఇంతవరకు తెనుగు దేశంలో ఉన్న పరిషత్తులు ఎవరికివారే యమునాతీరే అన్నట్లు పనిచేస్తున్నారు. ఈపరిషత్తులన్నీ కలిపి అఖిలాంధ్రవిజ్ఞానపరిషత్తు వంటి ఒక సంస్థ కూడబరచుకొని చక్కగా పనిచేయవలసిన అవసరం ఎంతయినా ఉన్నది. దీనినిగూర్చి శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు రోజు హెచ్చరిక చేశారు. ఈహెచ్చరికప్రకారం కార్యరంగానికి దిగి సాధ్యమైనంతత్వరలో తెనుగువికాసానికి, విజ్ఞానాభివృద్ధికి ఒక కేంద్రసంస్థ పనిచెయ్యాలి. రాజకీయాలలో సమకూడని ఏకమత్యం సాహిత్యరంగంలో అయినా సాధిస్తేతప్ప తెనుగుజాతికి భవిష్యత్తు ఉండదేమో!

తెనుగువారు ప్రస్తుతరాయలసీమలోనూ, సర్కారుల్లోనూ, తెలంగాణాలోనూ మూడుతెన్నులుగా పోతున్నారు. వారందరినీ ఏకపరచేది భాష; సంస్కృతి; సాహిత్యం. ఈ సాహిత్యంలోని ఏకతను చూపించాలంటే కవులు, రచయితలు చేసే కృషే గాక చక్కని సాహిత్యసమీక్షకులు బయలుదేరాలి. ఇదివరలో తెనుగులో విమర్శ అంటే తిట్టిపోతలు, ఎత్తిపొడుపులు. అదిగాక చూచిన గ్రంథంలోని గుణాగుణపరిశీలన చేసి, దానియందు చదువరులకు అభిమానం కలుగజేసే విమర్శలు అరుదు.

ఈసంవత్సరం వచ్చిన విమర్శలలో 'నన్నయగారి కవితార్థయుక్తి'ని గూర్చి ధారావాహికంగా శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు ప్రచురించిన విమర్శ ముఖ్యంగా ప్రశంసనీయం. మన చిరత్నకావ్యరత్నాల దివ్యకాంతుల్ని చూపించే నిజమైన విమర్శలు ఇటువంటి వెన్నయినా రావాలి. మంచిచెడ్డలు విమర్శించే స్పష్టరచనలు కావాలి. సాహిత్యం కాకపోయినా దార్శనికశాస్త్రంలో కృషిచేసి అతిక్లిష్టమైన అంశాలను సైతం అరటిపండు వొలిచిపెట్టినట్లు అతిసులభమైన భాషలో వ్రాయగల రచయితలున్నారు. భారతిలో సైలోనుసరించి వ్రాసిన కె. వి. కృష్ణారావుగారు, పోస్టుచెయ్యని ఉత్తరాలు అని ఆంధ్రపత్రికలో వ్రాస్తూఉన్న గోపీచంద్ గారూ సులువుగా అవగాహనగాని మనస్తత్వవిషయాలుకూడా సుబోధకంగా వ్రాస్తున్నారు. వీరైనా తేటతెల్లంగా, సూటిగా చెప్పగల కొడవటిగంటి కుటుంబరావుగారు ఉన్నారు. యువకవిమర్శకులలో "సోమసుందర్" "రాంషా" "ఆరుద్ర" నేటిసాహిత్యంగూర్చి వ్యాఖ్యానాలు చేస్తున్నారు. నేటి సాహిత్యం ఇంకా ఎక్కువ మందికి అర్థంకావాలన్నా, ఎక్కువ అభిమానాన్ని సంపాదించుకోవాలన్నా ఎక్కువ విమర్శలు రావాలి.

సాహిత్యాన్ని చక్కని మార్గంలో దిద్దితీర్చడానికి విమర్శ ఎంతయినా ఉపకరిస్తుంది.

నేటి విద్యావిధానం విపులసంస్కరణలు పొందుతూఉన్న సమయంలో మంచి పాఠ్యపుస్తకాల అభావం గోచరిస్తూఉన్నది. పిల్లలకు, పెద్దలకు చిన్న పత్రికలవలన పుట్టిన అభిరుచి తీర్చడానికి తగిన పుస్తకాలు లేవు. పుస్తకాల ప్రకటన వ్యాపారంగా చూచే వ్యాపారస్థులవల్ల యీపని కాదు. దేశఉన్నతి, అభ్యుదయం లక్ష్యంగా పెట్టుకొని, మన బాలబాలికలలో చిన్నపెద్దలలో చైతన్యం కలిగించే మంచిగ్రంథాలు వ్రాసేవారు కావాలి.

గతసంవత్సరం ఎలాగ గడిచినాగాని వచ్చే సంవత్సరం అయినా ఈవిషయంలో సరియైన శ్రద్ధ కనిపిస్తుందని ఆశిద్దాం!





కమలినీకాసారంలో కువకువలాడుచున్న పక్షులు

[సిత్తన్నవాసల్ కళామందిరంలోని ఒకానొక వర్ణచిత్రానికి
శ్రీ హెచ్. వి. రామగోపాల్ తీసిన పరిశుద్ధమైన నకలు]




ఎర్రాయి, ఎంకటాముల అమ్మ పోలాం, అయ్య పుల్లాయిలు సీతారావమ్మగోరింటిపక్క రంగయ్యగోరి తోట కనిపెట్టుకునుంటారు; కాని తోటమీన కాత్తె కూత్తె గిట్టుంటే అయ్య పక్కింటి సీతారావమ్మ గోరింటో పాసిపనికి కుదిర్చ అమ్మను కాణీకి అర్ధణా కంటా పానాలు పీక్కదినడు.

ఆదినం తెల్లారి లెగిసింది మొదలు అయ్య అదోళ పద్దతి గుండాడు. ఆవజాన ముసుగేసుకుని గుడిసె గోడ కానుకు కూసుని అమ్మకల్లీ, తమకల్లీ మద్దెమద్దె కోరసూపులు సూత్తుంటం ఎర్రాయి, ఎంకటాములకు వొల్లంతా దురదగుంటాకు రుద్దినట్టుగుండది.

"ఎర్రాయ్?"

"ఏంచే ఎంకటాం?"- సాటుసాటున గుసగుస లాడుకుంటారు ఎర్రాయి, ఎంకటాములు.

"ఏందిరా, అయ్య అట్ట కూకుంటాడు కదల కండా?" అంది ఎంకటాం.

"అదేమో, యిగ్గహానికిమల్లే అటనే కూకుం డాడు-పుగాకు లేదుగావాల్ను." అన్నాడు ఎర్రాయి.

"పుగాకూ! ఎదవపుగాకు ఏంత్యా లేకబోతే?" అంది ఎంకటాం.

"అదేమ్మాటా-కుతిగా వుండ దెట్టా?" అన్నాడు ఎర్రాయి.

"కుతిగా వుంటే? డబ్బులు యాణ్ణుంచొస్తాయిరా పద్దాకా? ఒరేయ్, నువు పొగాకు తాగావంటే అయ్యతో సెబతా." అంది ఎంకటాం.

"శా-నేనా ఎదవపుగాకూ! ఓపాలి అన్యా అడిగితే లేదన్నాగా!" అన్నాడు ఎర్రాయి.

"ఏందిరా అడిగింక్కి?"

"పుగాకు"

"ఎవ్వుర్ని?"

"నన్ని"

"నిన్నా!"

"ఓ పాయుంటే యిటు బారేయరా-అనడిగాడ్జే"

"ఏంకి!"

"ఆమయిన పంపుతాడేమోనని లేదన్నా."

"నువు తాగుతావంట్రా?"

"సీ, ఎదవది! ఓపాలి ఎట్టుండదోనని సూశాలే-నన్నాసిది!"

"ఒరేయ్-అమ్మతో సెప్పనా?"

"నే తాగుతేగా-అట్ట సూసి అటనే పారేత్తినిగా"

"అమ్మ సంపుద్దిరోయ్-"

"మరి అయ్యకిచ్చుద్దే కాణీలు - కొనుక్కోమనీ?" అన్నాడు ఎర్రాయి.

"యీ అయ్య కేం స్లేపదు; పద్దాకా అమ్మను సంపుతోవుంటాడు" అంది ఎంకటాం.

"ఏమేయ్?" అనరిసి బిలిశాడు అమ్మను అయ్య.

"నిన్నే నేయ్?" అని మల్లీ అరిశాడు అయ్య.

అమ్మ యినుక్కుండది.

"నిన్ను గదంటే?" యింకాత్తె గట్టిగా అరిశాడు అయ్య.

"ఎందుకు అట్టరుసుకుంటావ్?" అంది అమ్మ.

"అయితే నువ్వు ఎల్తానంటావా ఎల్లనంటావా?" అన్నాడు అయ్య.

అప్పటికి కాత్తె ఎండెక్కింది. అయ్యఎవారం కాత్తె కాకమీనుంటంజూసి సల్లగా ఎర్రాయిసెయి గీరింది ఎంకటాం. యింకూసేపిట్లో గుడిసెకెనకమూల నారిజసెట్టుకింద యిటికకుప్పసాటుకు సేరి సప్పిడి కాకుండా కూసుండారు ఎర్రాయి, ఎంకటాములు.

అరవమాక మంది ఎంకటాం ఎర్రాయితో.

అరవనన్నాడు ఎర్రాయి ఎంకటాంతో.

గుడిశెలో తుబుక్కున వుమ్మాశాడు అయ్య.

"అయితే, నువ్వు చీతారావుమ్మగోరింటికి పని కెందుకెల్లవే?" అనన్నాడు అయ్య.

"నువ్వు లచ్చచెప్పు నే నెల్లను" అంది అమ్మ.

"అది గందుకనే చెప్పేది.ఎందుకెల్లవూ అంట?" అన్నాడు అయ్య.

"ఆరి నబ్బిల్లలన్నీ నేనే పూసుకుండానంట" అంది అమ్మ.

ఎంకటాం ఎర్రాయికల్లి సూత్తే ఎర్రాయి ఎంకటాంకల్లి సూశాడు.

"నబ్బిల్లలూ! నబ్బిల్ల లేందే" అన్నాడు అయ్య.

"నబ్బిల్ల లేందంటాడేం? ఆరు రుద్దుకునే నబ్బిల్ల లన్నీ నేనే రుద్దుకుంటున్నానంట."

"అని ఎవురన్నారూ?" అన్నాడు అయ్య.

"యింకెవు రుంటారూ-ఆ చీతారావుమ్మగోరే"

"మరెందుకు రుద్దుకున్నా?" అన్నాడు అయ్య.

"యిదేందిరొయ్యావ్, నువ్వు ఆయిన్ని ఎనకేసుకొస్తున్నట్టుందే సూత్తే- యిగసాల్లే పూరుకో యియాల్టికి."

"చరే, అట్టనే పూరుకుంటా-అయితే ,చీతారావుమ్మగోరు నిజంగా అన్నదంటా?"అన్నాడుఅయ్య.

"అన్నదంటా! ఓ అంట వేందీ- మీన మీన కొచ్చిందిగా!"

మల్లీ తుబుక్కున వుమ్మాశాడు అయ్య.

"అయితే యిప్పు డేందే నువనేదీ?" అన్నాడు అయ్య కూసేపుండీ.

"నే నెల్ల నాడికి"- యిసిరేసిన ట్టంది అమ్మ.

"తొందరపడ్డావులే" అన్నాడు అయ్య.

"ఎవురు నేనా?"

"ఆ, నువేనే. కాకబోతే పతినెలా రెండు రూపాయలు నేదంటే నీకూ?" అన్నాడు అయ్య.

"మూడుంటదీ- మూడన్నా పుగాకు సేదుగా వుంటదెట్టా?" అంది అమ్మ.

"అదిగందుకే తిక్క రేగుద్ది - నువ్వుగాంగా మా లావు సంపాయించావులే ముండమోపిడబ్బులు." అన్నాడు అయ్య పెటీమని కొట్టినట్టు.

ఎర్రాయి ఎంకటాంకల్లి సూశాడు. ఎర్రాయి రెక్కట్టుగ్ని ఒక్కగుంజు గుంజింది ఎంకటాం.

"అంత రోసం గలోడివయితే ఎల్లి సంపాయించుకురారాదూ?" అంది అమ్మ.

"అయితే నే నీడ ఎదవనై కూకుండానంటావు?"

"నే నన్లేదయ్యోవ్ అంత లావుమాట! నీకేం మారాజుకుమల్లేనే కూకుండావు." అంది అమ్మ.

"ఆ, కూకుండాలేవే. తోటమీన కాత్తె కల్పొత్తే నువామాట లంటా? మ రారంగయగోరు ఆవజాన నడుపుతుండాడు యవారం."

"మరి ను వావజాన సీలునవ్వుల్తా కూకుంటే యవారం నడపడెట్టా?" అంది అమ్మ.

"తోట కాత్తె ఎదిగి లాబాన పడ్తే ఏమన్నా యిత్తానంటుంటే యి గామనిసితో ఏంజేత్తా?"

"యింకా ఒకటే ఎదగాల్సిందే యివకాడ డొక్క పీక్కబోతావుంటే. యవారం యిట్టనంటయ్యా వుండాల్సిందీ?" అంది అమ్మ.

"ఆ ఎవార మేందో నే దెల్సుకుంటా గానీ యిప్పుడు నీ యవార మేందో ముంగల దెల్సు." అన్నాడు అయ్య.

"నా యవారం నీ యవార మేందంటా?"

"ఏం దేంటే! గొప్పోర్లో నువ్వా నే నంటె తిరగబడాల్సిందీ? అన లట్టయితే ఎట్టానంటా?" అన్నాడు అయ్య.

"సితత్వా లేందో తెలవటం లేదుగాని, అస లామడ్సి మాటిమాటి కావజాన సేతులు తిప్పాద్ది, దేని కంటా?"

"సేతులు తిప్పట మేందే" అన్నాడు అయ్య.

"మ రదేందో సబ్బులంటా సేతులు తిప్పాద్ది!"

"ఎవురూ?" అన్నాడు అయ్య.

"ఆ సీతారావుమ్మగోరే!" అంది అమ్మ.

"అదిగదే వొద్దన్నా" అన్నాడు అయ్య.

"ఏంది వొద్దన్నా" అంది అమ్మ.

"యిట్టాటియన్నీ తోసేసుకు తిరగాల్సిందే" అన్నాడు అయ్య.

"ఎల్లి నువ్వు నిలబడు ఆయిడముంగల"

"ఆ, నిలబడాల్సిందే"

"నువ్వు లచ్చ సెప్పు"

"సెప్పిన ట్టేను"

"మరి సబ్బిల్ల లంటంటే-"

"ఏహే అంటే అందిలే"

"ఆమాటఎందుగ్గాను రావాల్సొచ్చిందంటా?"

"రాగాలు తీయమాక—"

"నువ్వు తీయడంలా—"

"నేనా- పొళ్ళూడ్తయి-"

ఆవజాన కళాసి గొట్టినట్టు ఎడాపెడా అయ్యా, అమ్మలమద్దె దుమ్ము లైగి సేతలికి చెడిసి లెగిసి రాత్తా పక్క సింత సెట్టుకిందికొచ్చి కూకున్న ఎర్రాయి, ఎంకటాములకు సీతారావుమ్మగోరియింటి ముంగలకు ఓ మనగాడి తెల్లగుర్రాంబండి ఎగురుకుంటా వచ్చి నిలబట్టం అగుపిచ్చిద్ది.

"ఆర్నీ- రాంకిట్టయ్యగోరు-!" అన్నాడు ఎర్రాయి లెగుస్తా.

"ఏ రాంకిట్టయ్యగోర్రా?" అనడిగింది ఎంకటాం తనూ ఎర్రాయితో లెగుస్తా.

"ఏహే, సీతారావుమ్మగోరి అల్లుళ్ళే. తసదియ్యా—సుందరమ్మ పంట పండింది!"

"ఎందుకురా పంట పండిందీ-?" అనంటుండా యినిపిచ్చుకోకుండా ఎంకటాం రెక్క బట్టుకుని గబగబ బండికాడికి లాగాడు ఎర్రాయి.

రాంకిట్టయ్యకల్లీ, రాంకిట్టయ్య ఎక్కొచ్చిన బండీ, బండిసాయిబు ఎర్రగళ్ళలుంగీ, నల్లగడ్డాంకల్లీ కిందనించి పైదాకా ఆవజాన ఓసూపు జూసి, ఎంకటాం సెయిబట్టుకు తెల్లగుర్రం సుట్టూతా ఎర్రాయి ఓ సెక్రం తిరిగేతలికి సారగలోకొన్నించి ఎగ్గిర్దూకినట్టొచ్చి సెంబుసీలతో కాలకడా లాడిస్తా వాకిట్లోకొచ్చి నిలబడ్డది సీతారావుమ్మగోరు.

సాయిబును టంకుపెట్టె లోనకు పట్టుకురామంటా బూడుసులు టక్‌టక్ కొట్టుకుంటా కెడ్డికి మల్లే సీతారావుమ్మగోరింటోకి నడిశాడు రాంకిట్టయ్య.

"పాపం-మాయింటోనే భోంచేసి వెళ్ళేం?" అని పెద్దగా అంటున్నది సీతారావుమ్మగోరు సంబరంగా.

"సూశావంటే?" అన్నట్టు సూశాడు ఎర్రాయి, ఎంకటాంకల్లి. ఎంకటాం సీతారావుమ్మగోరికల్లి సూసింది. సీతారావుమ్మగోరు గబిక్కన సూసింది ఎర్రాయి, ఎంకటాముల కల్లి—బూరి పగిలి ఆ డేందో లెగిసినట్టు.

"ఆ ముండేదీ-నాయన్నాయన! కొంత ఒక్కసారి యిట్లా వొచ్చి పొండి, ఏమన్నా యింత తునక చేతిలో పెట్టా-దేవుడు పంపిన ట్టొచ్చారు నాయన-అరవకుండా దొడ్డోకి రండేం-" అంటా లోనకి నడిసింది సీతారావుమ్మగోరు నవ్వుతా.

ఇంకా సేపుటికి సీతారావుమ్మగోరి దొడ్డో కరేపచెట్టుకింద అంటగిన్నెలమయాన - గొబ్బెమ్మలకి మల్లే-కూకుండారు ఎర్రాయి ఎంకటాములు.

టకటకటక మట్టెలు కొట్టుకుంటా పావురాయికి మల్లే ఎగురుకుంటా మద్దెగదిలోంచి దొడ్డో కొచ్చి వాకిట-పాలి పక్కన చెయిబెట్టుకు పగలబడి వొంటిం టోకి లగెత్తికెల్లింది సుందరమ్మ.

"యిహి-"అంటా మనికట్టుతో ముక్కు ఎగ దోసుకుండాడు ఎర్రాయి.

"ఎందుకురా అట్టా ఎగబీల్సుకుంటా నవు తావ్?" అంది సుందరమ్మదాకుడుకు దిమ్మర బోయిన ఎంకటాం.

"తనదియ్య, బలేదిగదంట చుందరమ్మా-"

"గట్టిగా అరవమాకెరా సచ్చినోడా-"

"ఆ సాయిబు వెళ్ళాక్టే-పాపం ఆయనకి ఏం కావాలో కాస్త చూస్తుండరాదుటే- వెళ్ళవే చచ్చిం దానా-" అని కాస్త పెద్దగా, కాస్త సిన్నగా అంటున్నది వొంటింటో సీతారావుమ్మగోరు.

"గాకెలు జేత్తుండదేవ్-" అన్నాడు ఎర్రాయి నావన పిలుస్తా.

"యీడా పొస్త దుబ్బలేదే-" అంది ఎంకటాం.

"మరేందబ్బా సుంయ్ మనిపిత్తుండదీ-పాకోడీ లెట్టా? నాలుగన్నా పెట్టద్దో లేదో-"

"ఒరేయ్, అంతాశ వుండగూడదురా?"

"పోనీ, రెండన్నా పెట్టదంటా?"

"తోమూకుట్రా అంట్లూ-కాసిని నీళ్లు తోడి పెట్టమా అతొట్లల్లోకీ, బిందెల్లోకీ. కడవ భావిలో పడేసి చచ్చేరు- నాయన్నాయన! కాస్త యీ నాలుగు బిందెలూ కడవాకూడా తోమిపెట్టమా అల్లరిచేయ కుండా?" అంటూ సెక్రందిరిగినట్లు వొచ్చి ఎల్లిపోయింది సీతారావుమ్మగోరు.

"ఏందిరా సూత్తుండావూ-ఒరేయ్ - ఒరేయ్-" అంది ఎంకటాం మద్దెగది అతలగదేపు మెడజాపి సూత్తుండ ఎర్రాయికల్లి యింతగా సూస్తా.

"ఏహా అరవమాకే-"

"ఏందిరా-ఏందిరా-!" కాత్త ఎర్రాయికాడికి జరిగి తనూ అట్ట మెడ జాపిందో లేదో ఎంకటాం— ఎన్నెముకమీన ముల్లుగర్రతో పొడిసినట్టు టక్కీమంటా ఎంకటామును తోసుకుంటా యిరుసుకు యివతాడ పడ్డాడు ఎర్రాయి.

"అమ్మ! సత్తిన్రో రెర్రాయ్-" అంది ఎంకటాం వుక్కిరిబిక్కిరవుతా.

"అరవమాకే తల్లా-" లెగిసి ఎంకటామును గట్టిగా వాటేసుకుండాడు ఎర్రాయి.

"ఏహె, అరవక్లే యిదూ- ఏందిరా నువు గదికాడ సూత్తుండదీ?"

"ఆళ్ళే-అల్లు-"

"ఎవ్వర్రా!"

"రాంకిట్టయ్యా-చుందరమ్మా-"

"ఆఁ!-"

"చెయి లటిక్కన పట్టుకుండాడు!"

"ఎవుర్ది!-"

"చుందరమ్మదే!-"

"ఓరయ్యో-"

"అదేమయిన గుంజుకుంటుండది చుందరమ్మ!-"

"అమ్మబుల్లో!-"

"ఒరేయ్ పిల్లలూ, నీళ్లు తోడారుట్రా-అయ్యో అయ్యో! నే నేంకేతునూ పక్కీ మొహాలూ మీరూ- మా నాయనగదూ, మాఅమ్మగదూ, దబ్బున తోడి పెట్టరూ?"అంటా తలుపుకాడి కొచ్చి జూసి పిండి మరవ పడ్డట్టయి-అటనే లోనకి గిరుక్కున మల్లింది సీతారావుమ్మగోరు పాకోడీలకాడికి.

మిట్టమద్దానం పొద్దు నిటారుగ నిలబడేయాలకు గుప్పిట్లు మూసుకుని గబగబ లగెత్తుకుంటా సీతారావుమ్మగోరింటోంచి వొచ్చి తోటపెండంగోడ మొత్తకాడ నిలబడ్డారు ఎర్రాయి, ఎంకటాములు.

యిచ్చిందంటే?"

"యియలేదురా-నీ కిచ్చిందంట్రా?"

"అవ్, నా కిచ్చిందిగా!"

"పానిలేరా-ఒరేయ్, కాణీతో పుగాకు కొనుక్కుంటావంట్రా?"

"కాణీ నాదమ్మోయ్-"

నచ్చిన పెండెంగోడ కవకాణ్ణుంచి అమ్మ తలకాయ బెయిటికొచ్చి గదిక్కున ఎర్రాయి, ఎంకటాములను తోట్లో గుడిసెలోనకి మళ్ళేసు కెల్లింది.

"ఏందిరా నీకు చీతారావుమ్మగోరి చ్చింకే, సూపియ్యండీ-పాకోడీలంట్రా-" అంటా ఎర్రాయి ఎంకటాముల గుప్పిట్లు పరీచ్చ జేస్తుండది అమ్మ.

"ఆడికాడ కాణీ వుండది-యిటు బారి యరా, కాణీ-" అంటుండాడు అయ్య.

"కాణీ! ఏకీ కాణీ-"- అంటుండది అమ్మ.

"ఆడికి చీతారావుమ్మగోరు కాణీ యిచ్చింది- జాంసెట్టెక్కి- నే జూశా" అంటుండాడు అయ్య.

"జాంసెట్టెక్కావ్రా! ఎందుకెక్కావుండాడ- ఏదిరా కాణీ?" అంటుండది అమ్మ.



"నచ్చిన పెండెంగోడ కవకాణ్ణుంచి అమ్మతలకాయ బెయిటికొచ్చి..."

పడి దొల్లుకుంటా దొల్లుకుంటా గుడిసెమూల సీకట్లో ఎల్తుండది. ఎంకటాం ఎర్రాయిసెయి బరబర బరికిందో లేదో- పాకోడీ పెడికిట్లు బిగిచ్చుకుంటా వుండేల్బద్దగుం డొదిల్నట్టు బయ్యన తోటమూల మల్లెపొదల పాటు కెళ్ళి మాయమయ్యారు ఎర్రాయి, ఎంకటాములు. ■

ఉద్గ్రంథములు బయలుదేరినవి. యజ్ఞకాండకు తగిన ఋతుసమయములను, గ్రహకూటములను, వివిధదివ్యజ్యోతిస్సన్నివేశములను నిర్ణయింపవలసివచ్చినది. అందుచే జ్యోతిషము వారి గణితమున ముఖ్యస్థానము వహించినది. దాని కొనసంగికములైన క్షేత్రమితి, ఉన్నతగోళత్రికోణమితి (Advanced Spherical Trigonometry) హెచ్చుగా చర్చింపబడినవి. పురాతనభారతీయఋషులకు గణిత ప్రాధాన్యము తెలియకపోలేదనుటకు ఈ ఒక్క శ్లోకము చాలును.

"యథా శిఖా మయూరాణాం నాగానాం మణయో యథా,
తద్వ ద్వేదాంగశాస్త్రాణాం గణితం మూర్ధని స్థితమ్."

అని ఆర్యజ్యోతిషమును కొనియాడుకొనిరి. దీనితో పోల్చి చూచినచో నేటి హైందవుల గణితవిస్మృతి ఎంత విస్మయకరమో తెలియగలదు. తరువాతితరువారిగూడ ఆర్యభట బ్రహ్మగుప్త భాస్కరాదులు వ్రాసిన గ్రంథములనుబట్టి చూచిన భారతీయులకు గణితమం దెంత గాఢప్రజ్ఞ ఉండెడిదో, క్లిష్టమైన లెక్కలుగూడ నా రెట్లు సులభపద్ధతిని మనోగణితమునతో చేసెడివారో తెలియును. మొన్న మొన్న నగూడ శ్రీనివాసరామానుజం అంకసిద్ధాంత భాగమున (Theory of Numbers) అవలీలగా కనుగొన్న నూతనాంశములు ప్రపంచదృష్టులను మిరుమిట్లుగొలిపినవి. ఐతే, ఆనాడు అవాఙ్మనసగోచరమైన బ్రహ్మానుభూతిని పొందుటకు ఆధారముగ నాదోపాసనమును తీసికొని ఆశయముల కనుగుణముగ తమ సంగీతకళను పోషించుకొన్నట్లే, మనవారు అనంతమైన విశ్వసృష్టిలోని రహస్యములను అవగాహనము చేసికొనుటకు, నూతనసృష్టిని చేసే శక్తి వలనరముకొనుటకును గణితమును ఆధారముగ తీసికొని తమ ఆశయముల కనుగుణమైన జ్యోతిషభాగమునందే ఎక్కువ పరిశ్రమ చేసిరి. ఇటులే వారి శాస్త్రములన్నియు చాలవరకు పరమతత్త్వదర్శనమే పరాకాష్ఠగా ప్రవర్తించినవి. ఇందువలననే ప్రాచీనభారతీయ విజ్ఞానదృక్పథమునకును, నవీనవిజ్ఞానదృక్పథమునకును ఒక ముఖ్య భేద మేర్పడినది. అర్వాచీన విజ్ఞానవికాసమువలన దుష్ఫలితములు ఈనాటి విజ్ఞానమువలన కల్గినంతగా కలుగలేదు. ఇప్పటి అటం బాంబు హైడ్రోజ బాంబులవంటి ఘాతుకశస్త్రములు వారెరుగరు. అట్లని వారి బుద్ధిశక్తి అనన్యము లని వీలులేదు. కాని మార్గభేద ముండెను. వారి నేకవిధములైన అస్త్రములను యుద్ధములందు వాడగల్గిరి. వాని ప్రక్రియలు రహస్యముగ తపస్సాధ్యజనసాధ్యములై, సుపాత్రదేశవేద్యములై యుండెడివి. అందుచే అనాయకప్రజలకు హానికలుగు నవకాశము లేదు. అస్త్రములకు ప్రయోగముతో పాటు ఉపసంహారముకూడ నేర్చియుండెడివారు. ఆ స్థితిగతులు మరల ఈనాడు సంఘటించుట అసంభవము. కావుననే ఇప్పటికిని అదేశోధనని పోషించువారి ప్రయత్నము అంత ప్రయోజనకారి కాజాలదు. ఇటీవలికాలమున పాశ్చాత్యవైజ్ఞానికులు గణితముతో పాటు పదార్థవిజ్ఞానశాస్త్రమును అపారముగ వృద్ధిచేసినారు. వారు వినియోగించు విధానములలో ఒకప్పుడు దోషములున్నను వారి సిద్ధాంతములుమాత్రము నిర్దుష్టములే కనుక తప్పక నేర్వదగినవి. పరమార్థము తెలియుటకు గూడ వారిమార్గాంతరము నవలంబించుట దోషము కాదని ఐన్‌స్టయిన్ లాటి నవీనవైజ్ఞానికోత్తముల సిద్ధాంతములు సూచించుచున్నవి. అసలు భారతీయవిజ్ఞానవికాసము లైన వేదసంహితలలోను, వేదాంగశాస్త్రములలోను గణితవిజ్ఞానమున్నను, నవీనగణితమున కొనసాగుచున్నటువంటి నైశాల్యము, వివరణము, బోధనాపోషణము, ప్రాచీనార్యగణితమున నేడు లక్షించుట లేదనుట సాహసము కాదు. అట్టియెడ నవీనవిజ్ఞానదృక్పథము నలవరచుకొనుట అవశ్యము కాదా!

ఇక నవీనగణితముయొక్క క్రమవికాసమును స్థూలముగ తెలిపి ఆతరువాత ఈనాటి వైజ్ఞానికాగ్రేసరులలో ప్రధానుడైన ఐన్‌స్టయిన్ సిద్ధాంతములు సృష్టిరహస్యము నెరుగుటలో ఎంతవరకు తోడ్పడునో గమనింతము.

సుమారు ౨,౫౦౦ సంవత్సరముల క్రిందట గ్రీసుదేశమున జరిగిన గణితశాస్త్రవిచారము చాల అద్భుతము. పాశ్చాత్యనాగరికతకు అది యుగారంభ మనవచ్చును. ప్రజలలో సామాన్యులైన మూఢవిశ్వాసములు కొన్ని మాధుర్యమైయుండి, ఎక్కువైన వైజ్ఞానికదృష్టితో భూతత్త్వమును, సత్యతత్త్వమును పరిశీలించుచు ఊహాపథమున లెక్కలు చేసికొనుటగూడ రాజద్రోహముగ పరిగణించుచుండిరి. సంఘమున భావస్వాతంత్ర్యము, లేక క్రొత్తదనము లన్నచో ఒక తిరుగుబాటువలె వారికి తోచుచుండెను. అట్టి క్లిష్టసమయములలో విలక్షణమైన దీక్షాధైర్యముల నవలంబించి గణితశాస్త్రశోధనల చేసిన యూక్లిడ్, టాలెమి, ఆర్కిమిడీస్ మొదలగువారి జీవితచరిత్రలు చిత్రముగ నుండును. క్రమముగ గణితశాస్త్రప్రాధాన్యమును విజ్ఞులు గుర్తించిరి. సకలశాస్త్రసంప్రదాయములకు మాతృకల నేర్పరచిన అరిస్టాటిల్ మహాశయుని గురువు ప్లేటో తాను నెలకొల్పిన 'ఎకాడమి' అను తత్త్వవిజ్ఞానసంస్థకు ప్రవేశద్వారముపై ఏమని వ్రాయించెనో చూడుడు: "గణితమున ప్రజ్ఞలేని మూఢులకు ఈ ఎకాడమిలో తత్త్వబోధయు మొదలైన ఉన్నతవిద్యలకు ప్రవేశము ఈయబడదు." ఇటీవల బెర్ట్రాండ్ రసెల్, వైట్ హెడ్ మున్నగువారు గణితమందు, తత్త్వశాస్త్రమునందును సమానముగ విశేషప్రజ్ఞ గడించి ఆ రెంటికిని గల సంబంధమును చక్కగా నిరూపించినారు. అటులే గణితమునకు, పదార్థవిజ్ఞానశాస్త్రమునకు గల విశిష్టసంబంధము నెరిగి భౌతికవిశ్వరహస్యములను శోధించుచున్న ఐన్‌స్టయిన్, యుకావా మొదలగు విజ్ఞులు ఏ విజ్ఞానమును సులువుగా స్ఫుటపరచుటకైన గణితసాహాయ్యము అత్యంతావసర మనుటను అనర్ఘపూర్వకముగ చూపించినారు.

పరిమాణపరిశీలనకు ఆదర్శభూతమైన క్షేత్రమితిని నిర్మించుటలో యూక్లిడ్ ఎట్టి మహత్తరసేవ గావించెనో, అటులే మూడు వందల యేండ్లక్రిందటివారైన ఇటలీవాసి గెలిలియో, ఫ్రాన్సువాసి డెకార్టె, ఇంగ్లాండువాసి న్యూటన్ మహత్తరమైన గణితవిధానములను కనుగొని మార్గదర్శకులైరి. గెలిలియో జ్యోతిశ్శాస్త్రమునకును, డెకార్టె అక్షసహక్షేత్రమానవిధానమునకును, న్యూటన్ పదార్థచలనపరిశీలనమునకును ఖచ్చితమైన మూలసూత్రములను ప్రసాదించిరి. అప్పటినుండి గణితశాస్త్రమునను, భౌతికశాస్త్రమునను పరిశోధనలు చాల విరివిగా సాగజొచ్చినవి. ఖండఖండాంతరము లందు అనేకశోధకులు గణితమును బహుశాఖలుగ విభజించి అధ్య

పించబడెను. ఒక్కొక్క నూత్న సిద్ధాంతము గణితమున వెలువడిన తోడనే దాని నాధారముగ చేసికొని భౌతికరసాయనికాదితర శాస్త్రములందుకూడ క్రొత్తక్రొత్తవిధానములు, విషయములు, పనిముట్లు, యంత్రసౌకర్యములు కనిపెట్టబడుచుండెను. ౧౫౦ ఏండ్ల క్రితము మహాయోధుడైన నెపోలియన్ పరిపాలితకాలమున హిమావృతములైన ఆల్ప్సుపర్వతశిఖరములను దాటవలసిరాగా గణిత విజ్ఞానసాహాయ్యమున తన సైన్యములను ప్రయోగించి ముందుగా మంచును కరగించి దారి చేస్కొని దాటి విజయమందెను. రాబోవు యుగము, కాలము, శక్తివినియోగములచే కలుగు నష్టముల నతిక్రమించి పోవల సాధనము లెన్నియో కనుగొనబడెను. ఇది సామాన్యముగా గణితశాస్త్రశోధనలకే ఫలితములు కాకపోయినను పరంపరయా గణితవిజ్ఞానమునే ఆధారము చేసికొని పైకి వచ్చినవి. ఆ గణితబీజము లేనిచో అవి ఉపలబ్ధములయ్యెడివికావని నొక్కి చెప్పవచ్చును. ఉదాహరణకు—రేడియో టెలివిజన్ అను చిత్రాతిచిత్రములకు మూలసూత్రము లేమియని విచారించినచో మాక్స్వెల్ పండితుడు కనిపెట్టిన వైద్యుతసమీకరణములే (Electromagnetic Equations) అని తెలియగలదు.

ఇక అల్బర్టుఐన్‌స్టయిన్ వృత్తాంతము తెలిసికొందము. ప్రపంచములో విద్యాధికులను, సామాన్యులనుగూడ ఇతని పేరు గొప్పగా ఆకర్షించినది. కాని ఐన్‌స్టయిన్ దర్శించిన సాపేక్షతాసిద్ధాంతము (Theory of Relativity) సరిగా అవగాహనము చేసికొన్న వారు మాత్రము చాలకొద్దిమందిమాత్రమే కలరు. దురధిగమములైన ఈవిషయములను దేశభాషలలో చెప్పుట క్లేశసాధ్యమైనను ఉపయోగము మను నమ్ముకొందుము.

పదార్థతత్త్వరహస్యావబోధనకై తన జీవితమంతయు అంకిత మొనర్చి పరిశ్రమించుచున్న వైజ్ఞానికులలో ఐన్‌స్టయిన్ ప్రధానుడు. ఐహికధనధాన్యాదులకును, పదవులకును, రాజ్యాధికారములకును పాటుపడలేదు. సర్వాత్మనా ఇతడు తత్త్వజిజ్ఞాసకై తన యావచ్ఛక్తిని వినియోగించును. ఇతడు, జాతిచే యూదు. రెండవ ప్రపంచ సంగ్రామమునకు ముందు హిట్లరు జర్మనీయందలి యూదులనెల్ల పీడించి వెళ్లగొట్టెను. ఐన్‌స్టయిన్ ఘనత హిట్లరుఅధికారకాంక్ష ముందు లెక్కకురాలేదు. స్వదేశమునుండి వెడలిపోయి ఐన్‌స్టయిన్ అమెరికాను శరణము కావించుకొనినాడు. నేటికిని అచటనే అతని నివాసము.

న్యూటన్ కనుగొనిన పదార్థచలనసూత్రముల నవలంబించి వైజ్ఞానికులు ప్రయోగములు జరుపునపుడు సాధారణముగ భూతలమందలి పదార్థముల చలనమునకు యథార్థస్థితికిని, లెక్కచేసిన ఫలితమునకును సరిపోయెడిది. కాని ఖగోళపరీక్షావసరములందు కొన్ని గ్రహములు మొదలైనవాని గమనములకు, న్యూటను సూత్రముల ప్రకారము లెక్కకట్టగా వచ్చిన ఫలితమునకును, వస్తుస్థితిగతులకును చాల వ్యత్యాసము కనబడుచుండెను. ఇటులే యూక్లిడ్ క్షేత్రమితి సిద్ధాంతముల ప్రకారము సమానాంతరముగ నున్న సరళరేఖలను అటులే ఎంతదూరమైన జరుప శక్యమగునని నిర్ణయము. కాని, విశాలమైన ఆకాశపథమందు ఒకనక్షత్రమునుండి మరొక నక్షత్రమునకు మధ్య రెండు సరళరేఖలలో, లేక సరళరేఖామార్గమున ప్రసరించు కాంతికిరణములో ప్రయాణించినవని ఊహించినచో యథార్థప్రయోగములందు, మొదట అవి సమానాంతరముగా నున్నను, కొంచెము దూరము పోయినతరువాత అవి వంగి కలసి పోవుచున్నట్లు కనవచ్చుచుండెను. ఈ విచిత్రసంఘటనకు కారణము ఊహించలేక వైజ్ఞానికులు ఎన్నో తికమకలు పడుచుండిరి. కొన్ని సందర్భములలో వారు సూచించిన సర్దుబాట్లు సరిపోయినను, సర్వసాధారణముగ తృప్తికరమగు సమాధానము తెలియబడలేదు. ఐన్‌స్టయిన్ మేధాశక్తి బహుతీక్ష్ణము. యూక్లిడ్ న్యూటన్ల సిద్ధాంతములను నమ్ముకున్నంతకాలము ప్రయోజనములేదనియు, వానిలోని మూలసూత్రలోపములను నివర్తించు సిద్ధాంతమును కనుగొన్నప్పుడుగాని సత్యదర్శనము కాదనియు అతడు ఊహించెను. పదిసంవత్సరములపాటు ఆలోచించి పదిపేజీలలో ఇమిడ్చి వ్రాయదగిన సిద్ధాంతమొకటి ప్రతిపాదించినాడు. దానితో ఈసమస్యలు తీరిపోయినవి. కాని దానిని పూర్తిగా అవగాహనము చేసికొనగలవారు ఆకాలమున పదిమందికూడ లేకపోయిరట. ఈ సాపేక్షతాసిద్ధాంతము మొట్టమొదట ౧౯౦౫ వ సంవత్సరమున ప్రకటింపబడినది. ఐన్‌స్టయిన్ తరంగగతి పరిశీలన శాస్త్రములోగూడ క్వాంటమ్‌మెకానిక్స్ అను శాఖకు ఎంతో నూత్న వికాసము నిచ్చినాడు. తోడనే నూత్న క్షేత్రమితి శాఖలు రీమానియన్ జామెట్రీ మొదలగునవిగూడ ప్రచారములోనికి వచ్చినవి.

౧౯౨౯ లో ఐన్‌స్టయిన్ అంతకుముందు ప్రకటించిన సిద్ధాంతముకన్న సర్వసామాన్యలక్షణలక్షితమగు సిద్ధాంతమును మరల నుద్ఘాటించినాడు. ఇక మూడవసారి ఈ ౧౯౫౦ ఫిబ్రవరి నెలలో ప్రిన్స్టన్ యూనివర్సిటీవారి ద్వారా అతడే తన తొలుతటి రెండు సిద్ధాంతములకన్నను విశాలతరమైన నూత్నపక్కిలో సాపేక్షతా సిద్ధాంతమును మరల ప్రకటింపనయినాడు. దీనితో పదార్థతత్త్వరహస్యము సమగ్రముగ నిర్ధారింపబడునని విజ్ఞులు ఊహించుచున్నారు. ఈమూడు సిద్ధాంతభాగములందలి గణితశాస్త్రీయవిశేషములు దుర్బోధములుకనుక సామాన్యమానవునికి వానివలన తెలియదగిన అంశములనుమాత్రము కొంచెముగ వివరించెదను.

మొదటి ప్రతిపాదనప్రకారము రెండు ముఖ్యవిషయములు తేలినవి. ఒకటి—పదార్థమునకు, శక్తికిని వస్తుతః భేదములేదు-అవస్థాభేదముమాత్రమే అని. రెండు—కాలము, దేశము అనునవి ప్రత్యేక పదార్థములు కావని, ఆరెండును అవకాశమందు వ్యాపించియున్న పదార్థజాతము అను మూడవదానితోకూడి ఆమూటిలో ఒకదానిని బట్టి తక్కిన రెండును నిశ్చయింపబడుచున్నవికావున అవి సాపేక్షభావములే అని. ఈసత్యములకు సిద్ధాంతదృష్ట్యా బుజువు ఏమనగా కొన్ని గణితశాస్త్రీయసమీకరణముల సాయమున వచ్చు అపూర్వ ఫలములు. నిజమునకు కాలమానమును ఎవరైన అవకాశము, పదార్థములు అను రెంటితో సంబంధములేకుండ, దానితో ఏర్పడు కాల

తలు గ్రహించగలుగు వానికన్న విశిష్టమైన దృష్టితో సాధించుట ఊహింపనేలేముగదా! మరొక విషయముగూడ గమనించవలెను. సకలపదార్థపరిజ్ఞానము చాక్షుషప్రత్యక్షప్రమాణముపై ఆధారపడి యున్నది. అతిసూక్ష్మములైన పదార్థాణువులు అనుమానప్రమాణముచే సిద్ధించినను, వానికిగూడ పరంపరయా మూలాధారము ప్రత్యక్షమే అవక తప్పదు. చక్షురింద్రియమునకు కాంతిగ్రహణమందే శక్తి కలదు. దృశ్యమానపదార్థమునుండి ప్రసరించు కాంతికిరణములు—లేదా కాంతితరంగములు అనవచ్చును—నేత్రమును చేరుట ప్రధానము. ఇప్పుడు ఒక పదార్థము కాంతిప్రసరణవేగమునకన్న అధికతరవేగముతో పరుగిడుచుండె ననుకొనుడు. దానినిగూర్చి మనము తీసికొను కొలతలు అన్నియు తత్కాలమునందలి వస్తుస్థితి గతులతో సరిపోవలసిన పనిలేదు. కావున వస్తువు లేనపుడుగూడ దాని సాక్షాత్కృతి ప్రత్యక్షానుభూతిలోనికి రావలసివచ్చును. అట్టి యెడ కార్యకారణసంబంధమే తారుమారైపోవును. అందుచే మొదట మన మనసందించిన ఊహయే తప్పు అయియుండవలెను. కావున భౌతికవిజ్ఞానశాస్త్రమందలి పరిశీలన అంతయు కాంతిప్రసరణమునకన్న తక్కువవేగము గల భూతములనుగురించి మాత్రమే శక్యము. ఇక అట్టిభూతముల పరిమాణము, గమనము మొదలగువానిని కొలచుటలోగూడ ద్రష్టయొక్క వేగమునకు, దృశ్యముయొక్క వేగమునకు ఉండు వ్యత్యాసమునుబట్టి వస్తువురూపగతులు వాని నిలకడస్థితిలోని రూపగతులకంటె భిన్నముగా ఉండవచ్చును. కావున పొడవు, ఎత్తు, వెడల్పు అను మూడుకొలతలతో నిండిన అవకాశముమాత్రము లెక్కచూచు పాతవిధానము సమగ్రదృష్టి నీయజాలదని తేలినది. కాలము అనుదానిని నాలుగవ కొలగా స్వీకరించినచే యథార్థస్థితి కొంతవరకు గమనించ వీలగును. ఐన్‌స్టయిన్ ఈ అంశమును ప్రకటించుటతో యూక్లిడ్ క్షేత్రమితిని త్రోసివైచెడి నాలుగుకొలల క్షేత్రమితి ఉపయోగము బయలుపడినది. అందు సమానాంతరరేఖల పరిస్థితి చిత్రమైనది. దూరమున అవి కలిసికొనవచ్చును. దిగంతాకాశమందు నక్షత్రకాంతికిరణములు మన కన్ను చేరకముందు మార్గమధ్యమందున్న మహాగోళాంతరములలోని పదార్థముల గురుత్వమునుబట్టియు, ప్రయాణవేగమునుబట్టియు వంపు తిరిగి రావచ్చునని ఐన్‌స్టయిన్ ఊహించినాడు. ఈ ఊహ ౧౯౧౯ లో అతడు ప్రతిపాదించిన రెండవ సిద్ధాంతమునకు దారి తీసినది.

పదార్థముల వ్యాపనతోబాటు గురుత్వాకర్షణశక్తి, జడతాశక్తి అనునవిగూడ కాలము, అవకాశము అనువానితో ఐక్యమై యున్నట్లు తెలిసికొనినాడు ఐన్‌స్టయిన్. ఈ సత్యమునకు ఖగోళపరిశీలనలో ఒక భౌతికదృష్టాంతముగూడ లభించినది. గ్రీన్‌విచ్ ఖగోళపరిశోధనాలయమందు ఒక సంపూర్ణసూర్యగ్రహణసందర్భములో కాంతికిరణముల ఆకస్మికవక్రీభవనము ప్రత్యక్షముగ గోచరించినది. సాపేక్షతాసిద్ధాంతము, దాని కొనసాగింపైన భూతవేగకాలాది సర్వపదార్థముల ఏకీభావము అను సిద్ధాంతమును ప్రపంచమందలి విజ్ఞలోకపుమెప్పులకు పాత్రములైనవి. బెర్ట్రాండ్ రసెల్ "ఐన్‌స్టయిన్ సిద్ధాంతము ప్రపంచములో భూతభవిష్యద్వర్తమానములలో సాటిలేని వైజ్ఞానికసత్యము" అని పొగడినాడు. అతితీవ్ర విమర్శకుడని పేరెక్కిన బెర్నార్డ్‌షా ఈసిద్ధాంతమును ప్రతిపాదించినందుకు ఐన్‌స్టయినును, ప్రపంచేతిహాసమున నేటివరకు అవతరించి వెలుగునిచ్చిన ఏడుగురు విశ్వనిర్మాతలను మించిన ఎనిమిదవ విశ్వనిర్మాతనుగా లెక్కించినాడు. తొలుత పదార్థమునకు, శక్తికిని అభేదాన్వయసాయమును కల్పించినపుడు ఐన్‌స్టయినును చూచి నవ్వనివారు లేకపోలేదు. అతని కీర్తి నలుమూలల వ్యాపించకముందు ఆనాటికి పెద్దపెద్దలుగా ఉన్న వైజ్ఞానికులు అతని వాదములను విని అతనిని పిచ్చిఆసుపత్రిలో చేర్పించవలెననిరట. క్రమక్రమముగా అతని మేధాశక్తిని లోకము గ్రహింపగల్గుట అనివార్యమైనది. చివరకు ౧౯౪౫ సంవత్సరమున జపానులో హిరోషిమాపై ప్రేలి అద్భుతమైన విధ్వంసమును చేసిన అటంబాంబు మరింత గొప్పగా ఐన్‌స్టయిన్ ఊహలలోని నిజమును ఉద్ఘోషించినది. అణువుల అంతస్సులో విశ్వాతీతమైన శక్తి ఉన్నట్లు తొలుతగా గణితశాస్త్రప్రకారము సూచించినది ఐన్‌స్టయినేగదా!

ఇక ఐన్‌స్టయిన్ మహాసిద్ధాంతమును గురించి కొంత తెలిసికొనవలసియున్నది. అణువులో ఎలక్ట్రాన్, ప్రోటాన్, న్యూట్రాన్ మొదలగు సూక్ష్మతరరేణువు లున్నవని భౌతికశాస్త్రజ్ఞులు కనుగొనియున్నారు. ఇవి అణువులోపల ఒక కేంద్రముచుట్టును, సూర్యునిచుట్టు గ్రహములు పరిభ్రమించునట్లు, నిరంతరము అపరిమితవేగముతో తిరుగాడుచుండునవియు, ఇందుచే అచట విద్యుచ్ఛక్తిక్షేత్ర మేర్పడియున్నదనియు గూడ తెలిసికొన్నారు. కాని ఈ ఎలక్ట్రాన్ ప్రోటానులకు పరస్పరభేదము కొంత ఉండినను, వానికి చెందిన విద్యుచ్ఛక్తిమాత్రము సమానముగానే ఉన్నది. ఇందుకు హేతువేమి అయియుండునో, ఈ విద్యుచ్ఛక్తి ఎక్కడనుండి సంక్రమించుచున్నదో, ఇట్టి రేణువులు కొన్నిరకములే ఏల ఉండవలెనో చెప్పలేకున్నారు. ఇటులే స్థూల ప్రపంచమున భౌతికపదార్థములకు గురుత్వాకర్షణశక్తి ఎందుల కుండవలెనో చెప్పలేకున్నారు. ఈ రెండు సమస్యలకును ఒకే సమాధానము చెప్పుచున్నాడు ఐన్‌స్టయిన్.

లోకమున కాంతిరూపమునను, విద్యుచ్ఛక్తిరూపమునను, అయస్కాంతశక్తిరూపమునను సర్వత్ర సర్వకాలము ప్రసరించుచు, అణువుల అంతర్భాగమందుగూడ వ్యాపించియున్న శక్తి ఒకటి ఈ విశ్వమునకు అధిష్ఠానముఅని విద్యుదయస్కాంతశక్తిసూత్రములు (Electromagnetic Equations) ప్రతిపాదించిన మాక్స్‌వెల్ మహాశయుడు చెప్పినాడు. ఇప్పుడు ఇటు ఈ విద్యుదయస్కాంతశక్తిని, అటు భూతముల గురుత్వాకర్షణశక్తిని బీజప్రాయమైన శక్తిక్షేత్ర మొకటే ఉన్నదని ఐన్‌స్టయిన్ నిర్వచించనయినాడు. ఈతని నూతన సిద్ధాంతమునకు ఏకలశక్తిసిద్ధాంతము (Unified field theory) అని పేరిడవచ్చును. దీనిని వివరించుటకు ఐన్‌స్టయిన్ తీసికొన్న సామగ్రి నాలుగు క్రొత్త గణితశాస్త్రీయసమీకరణములు మాత్రమే అని తెలిసినచో, ఐన్‌స్టయిన్ ఎంత సూక్ష్మబుద్ధియో, గణిత మెంతటి శాస్త్రసారమో తెలియగలదు.

ఈ ఊహాలన్నియు అనవసరమైన తత్త్వమీమాంసలే అని, త్రోసిపుచ్చుట చాల అసమంజసము. బహుశః ఐన్‌స్టయిన్ కనుగొన్న సూక్ష్మగణితసూత్రముల యాథార్థ్యమునకు భౌతికప్రపంచమున దృష్టాంతము దొరకుటకు, అవి ఋజువగుటకు చాలకాలము పట్టవచ్చును. అంతమాత్రముచే వానిని అసంబద్ధము లనుటగాని, అవి కనిపెట్టిన యాతఁ డున్మాది యనుటగాని సాధ్యము కాదుగదా! మాక్స్‌వెల్ కనిపెట్టిన విద్యుత్కాంతతరంగములకు రేడియోరూపమున ఋజువు లభించునప్పటికి ౫౦ సంవత్సరములు పట్టినది. ఐన్‌స్టయిన్ సూచించిన శక్తిపదార్థైక్యసిద్ధాంతమునకు అటంబాంబు రూపమున ఋజువు లభించునప్పటికి నలుబదేండ్లు పట్టినది. ఐన్‌స్టయిన్ సూక్ష్మసిద్ధాంతము బహుశః అణుశక్తిని మరింత తృప్తికరముగను, సునాయాసముగను ప్రజాక్షేమమునకు వినియోగించు పద్ధతికి ఆ చేర్పరచు నేమో ఎవరూహింపగలరు? ఇది తలచుకొన్నప్పుడు, గణితవిజ్ఞానపరిశోధనమునకు క్షీరసాగరమథనగాథ సామ్యముగా తలపునకు వచ్చును. అట కోలాహలోద్భవానంతరమునకదా అమృతావిర్భావము. అట్లే ఇట అటంబాంబుతర్వాత ఈ కేవలసిద్ధాంతము ప్రచారమునకు, ఉపయోగమునకు వచ్చి జీవప్రపంచమందలి స్పర్ధావైషమ్యములను తొలగించగలదేమో?

---

# భారతరిపబ్లిక్

శ్రీ గుంటూరు వెంకటశాస్త్రి

౧

నవోదయం
మహోదయం
శుభోదయం
నవోదయం—
యుగయుగాల దాస్యపటలి
విరియజేయు నవోదయం
ధగధగాల కిరణదీప్తి
మెరసిపోవు నవోదయం
నరనరాల పొంగిపొరలు
యువకరక్త నవోదయం
తరతరాల భారతీశ
భావిభూతి నవోదయం.

౨

వినబడె నీ యపూర్వశుభవిన్నుతగానము భారతీయజీ
వనమృదుతంత్రులే తిరిగి పల్కినవో శ్రుతిమంజులంబుగా
గనబడె భానుకోటి నవకాంతులు ప్రాగ్దిశ భారతీయపా
వనవరరాజ్యదీధితుల వ్యాప్తియొకో యిది—
మానవోదయం.

౩

కథానవోదయం
మహామహోదయం
సఖసుభోదయం
సుధానవోదయం—
తరతరాలు సాగిపోవు
ధర్మరాజ్యనవోదయం.
నరనరాల ప్రాకిపోవు
నవ్యసూత్రమహోదయం.
జగజగాల వెలుగు నింపు
శాంతిచక్రశుభోదయం.
యుగయుగాల పంట భార
తీయదివ్యనవోదయం.

౪

ఈ నవస్వాగతోక్తుల మహీపతికే మెయిపుల్కరించి శో
భానవకాంతి చెక్కిళుల భాసిలె భాగ్యము! భారతీయక
ల్యాణనవాంకురమ్ములు సహస్రములై తలలెత్తెనన్యమా
మానవజాతి భారతసమగ్రసముజ్జ్వలరాగసంపదన్.

---

# ఉద్ధరింపు

[కథానిక]

శ్రీ కొడవటిగంటి కుటుంబరావు

సీత లేచిపోవటంతో నరిసింహంగారి కుటుంబంమీద పిడుగు పడ్డట్టయింది. ఆయనా, ఆయనభార్య కామమ్మా, కొడుకు పావకాలరావూ అనేకరోజులపాటు పడ్డ ఆవేదన చూస్తే ఎవరికన్నా కడుపు తరుక్కుపోవలసిందే. తమకు మద్రాసుమహానగరంలో ఉన్న ప్రతిష్ఠ యావత్తూ మంటగలిసినట్టూ, ఇక నలుగురిలోనూ తల ఎత్తుకు తిరిగే అవకాశం తమకు లేనట్టూ వాళ్లు విలపించారు.

నిజానికి నరిసింహంగారికి అటువంటి కీర్తి పట్టణంలో లేదు. అది ఆయనతలకాయలోమాత్రమే ఉంది. ఆయన పదిహే నేళ్ళనుంచీ పట్నంలో ఉంటున్నాడు. ఆయనకు కార్పొరేషనులో చిన్న ఉద్యోగం. ఆయన కున్న ఆ ఒక్క కొడుకూ, కూతురూ పట్నం తప్ప మరొక జన్మస్థలం ఎరగరనే చెప్పాలి. పావకాలరావు పట్నంలోనే చదివి, చదువు పూర్తిచేసి, ఏదో కంపెనీలో ఎకౌంటెంటుగా ఉండి ఇప్పుడిప్పుడే నూరురూపాయలు తెచ్చుకుంటున్నాడు.

ఈ పదిహేనేళ్ళ కాలంలోనూ నరిసింహంగారు స్వయంగా చాలామందిపరిచయం సంపాదించాడుగాని వారి కుటుంబానికి ఎక్కువ కుటుంబాలతో సాన్నిహిత్యం ఏర్పడలేదు. కామమ్మగారు అరవం బాగా మాట్లాడటం నేర్చుకున్నతరవాత చుట్టుపక్కల ఉండే అరవస్త్రీలతో కొంత స్నేహం చేసింది. ఇటు నరిసింహం పరిచయస్థులుగాని, అటు కామమ్మస్నేహితురాళ్లుగాని వీరి కుటుంబ గౌరవంతాలూకు ఒడుదుడుకులనుగురించి విమర్శించేవాళ్లు కారు. కామమ్మగారు నరిసింహంగారి భార్య కాదని అకస్మాత్తుగా తెలిసినా ముక్కుమీద వేలు వేసుకునే ఓపికా, తీరికా ఎవరికీ లేదు. నరిసింహంగారు పెద్ద ఉద్యోగంలో ఉంటే, వేలకువేలు సంపాయిస్తుంటే, ఆయనకుటుంబానికి మరింత పలుకుబడి ఉండేదేమో. కాని, ఎప్పుడన్నా పుష్కరానికొకసారి ఎవరన్నా చూడవచ్చినప్పుడు ఇంత కాఫీఅయినా సమృద్ధిగా కాచిపోసే స్థితిలో లేని నరిసింహంగారి సంసారంగురించి ఎవరు బాధపడతారు!

పోతే, నరిసింహంగారి కుటుంబంయొక్క యోగక్షేమాలను గురించి ఎప్పుడన్నా విచారించేవాళ్ళు ముగ్గురునలుగు రున్నారు. వాళ్లు తెలుగువాళ్లే. అందులో ఒకావిడ మొగుణ్ణీ, ఇద్దరు పిల్లల్నీ వొదిలేసి వచ్చి ఎవరో నాయుడుతో ఉంది, ఆ నాయుడిభార్య నని చెప్పుకుంటున్నది. ఆవిడ ఈకుటుంబానికి ఒక ఆప్తస్నేహితురాలు. ఎప్పుడన్నా ఆవిడ టాక్సీలో దిగి గంటా రెండుగంటలూ కూచుని, కామమ్మగారు ఏపని చేస్తుంటే ఆపనిలో చెయ్యి వేసుకుని, అడిగి కాఫీ పెట్టించుకుని, కాఫీపొడరు లేకపోతే ఒక పావుటాను తన డబ్బుతో తెప్పించిపెట్టి, నూరురూపాయల్లో "అద్—భుతమైన" చీరెలు ఎక్కడ దొరుకుతాయో చెప్పి తనదారిన తాను పొయ్యేది. ఆవిడ వచ్చి వెళ్లినతరవాత కామమ్మగారు చాలాసేపు ఆవిణ్ణి తలుచుకుని అసూయపడేది.

సీతతో హైస్కూల్లో చదివిన మరొక పిల్ల అక్క ఒకతె నరిసింహంగారి కుటుంబానికి స్నేహితురాలు. ఈ అమ్మాయి డాన్సు చేస్తుంది. నెలకు ఒక డాన్సుప్రదర్శనం ఇస్తూఉంటుంది. వీటిమీద ఈవిడ చాలా సంపాదించేటట్టు కనిపిస్తుంది. వాళ్లిల్లు లక్ష్మితో తులతూగుతూఉంటుంది. మనిషికూడా చాలా అందంగా ఉండటంచేత చాలామంది డబ్బున్నవాళ్ళుకూడా ఆమెను పెళ్ళాడతా మని ఒకప్పుడు వచ్చారు. కాని వాళ్ల నాన్న పడనివ్వలేదు. ఇప్పుడామెపెళ్ళిప్రస్తావన ఎవరూ చెయ్యరు. కాకపోయినా ఆమెకు తీరిక లేదు. ఎప్పుడూ పొరుగూళ్లకు పోతూఉంటుంది. ఏవూరన్నా వెళ్లి ఒక డాన్సు చేసిందంటే పదిపదిహేనురోజుల దాకా అవ్వూరివాళ్లు ఆమెను పోనివ్వరుట. ఈ అమ్మాయి మొట్టమొదటిసారి నరిసింహంగారింట అడుగుపెట్టడానికి కారణం సీతే అయినా, ఒక్క క్షణంలో కామమ్మగారు ఈమెతో ఎంత గాఢ స్నేహం చేసేసుకున్నదంటే, ఆతరవాత ఆమె కామమ్మగారి కోసమే వచ్చేది. ఈవిడకూడా కాఫీ అడిగిపుచ్చుకునేది.

దేశంలో నరిసింహంగారికీ, కామమ్మగారికీ బంధువు లున్న మాట నిజమే. కాని వాళ్లందరితోనూ నరిసింహంగారు ఏనాడో సంబంధాలు తెంచుకున్నాడు. సగం వాళ్లమీది ద్వేషంతోనే ఆయన ఉద్యోగంకోసం మద్రాసు వచ్చాడు. ఇప్పు డాయన కెవరూ ఉత్తరాలు రాయరు. ఆయన అంతకన్నా రాయడు. సీత

పెళ్లినిగురించి ఆయన చాలాకాలంనుంచీ ఆలోచిస్తున్నప్పటికీ అయినవాళ్లలో ఒక్కరికికూడా సహాయం చెయ్యమని ఆయన ఒక కార్డుముక్క గీకిన పాపాన పోలేదు.

అందుచేత సీత లేచిపోవటంవల్ల తన కున్న వంశగౌరవం ఏదో పోయిందని నరసింహంగారుగాని, ఆయనకుటుంబంగాని ఆట్టే విచారించవలసిన అవసరం లేదు. అయినా వాళ్లు విచారించారంటే దానికి కారణం, వాళ్ల అలవాట్లన్నీ పట్టణవాతావరణానికి అనుగుణంగా మారినప్పటికీ, మనఃప్రవృత్తులు—ముఖ్యంగా అవ్యక్త మనఃప్రవృత్తులు—ఇంకా పాతవాతావరణానికి అనుగుణంగానే ఉన్నాయి.

సీత లేచిపోవటానికి కారణాలు చాలా ఉన్నాయి. ఆమె స్కూలుఫైనలుదాకా చదువుకున్నది. చదువుకుంటున్నన్నాళ్లూ చదువులో నిమగ్నురాలై ఇతరవిషయాలు గమనించలేదు. కాని చదువు మానేసినప్పటినుంచీ ఆమె తన వాతావరణంమీద తిరగబడసాగింది. ఈ తిరుగుబాటంతా ఆమెహృదయంలోనే జరగటంవల్ల ఎవరూ గమనించలేదు.

పదహారుపదిహేడేళ్ల వయసు వచ్చి, కొంత చదువుండి, పుస్తకాలు చదవటంలో అపారమైన ఆసక్తి గల పిల్లకు కొన్ని కోరికలు కలగడంలో వింత లేదు. పైగా పట్టణవాతావరణం మరికొన్ని ప్రేరణలుకూడా కలిగిస్తుంది. కాని ఈ కోరికలు ఫలించే అవకాశం లేదు. సీతకు జీవితంలో ఎంత ఆనందం ఉన్నదో తెలుసును. చిన్న చిన్న బస్తీలలోనూ, పల్లెటూళ్లలోనూ ఉండేవాళ్లు ఊహించలేని సుఖాలను సీత ప్రత్యక్షంగా చూస్తూవచ్చింది. మంచి చీరెలు కట్టుకుని, అందంగా తయారై పార్కులకూ, బీచికీ, సినిమాలకూ, పాటకచ్చేరీలకూ, పార్టీలకూ, ఎగ్జిబిషనులకూ వెళ్లే పిల్లల్ని తాను ఎరుగును. ఇంట్లో కూచుని రేడియో వినవచ్చు. స్నేహితురాళ్లతోనూ, వాళ్ల అన్నలతోనూ పిక్నికులకు వెళ్లవచ్చు. పెళ్లయితే మొగుడితోనే షికార్లు వెళ్లవచ్చు. కాబోయే భర్తను ముందుగా చూసుకుని, మాట్లాడి, అతనిమీద ఇష్టం కలిగించుకోవచ్చు. ఈపనులన్నీ చేసే వాళ్లను సీత ఎరుగును. కాని ఇవి తనకు అందుబాటులో లేవు. ఎందుకు అందుబాటులో లేవో సీత తెలుసుకోవటానికి ప్రయత్నించింది. తన అన్నా, తండ్రీ చెప్పిన కారణాలలో ఆమెకు నమ్మకం కలగలేదు.

తిరగటంవల్ల మనస్సుకు కలిగే ఆనందం పాపహేతువన్నట్టూ, తిరగటంవల్లనే పట్టణంలో ఆడవాళ్లు అవినీతిపాలవుతున్నట్టూ వాళ్లు మాట్లాడారు. సీత ఈమాట నమ్మలేకపోగా ఆగ్రహంకూడా తెచ్చుకున్నది. తాను ఎరిగిన స్నేహితురాళ్లు అవినీతిపరులా? అవినీతిపరులైన ఆడవాళ్లకు తమ ఇంట్లో కాఫీ లెందుకు పోస్తున్నారు? వాళ్లను దూరంగా ఉంచరేం?

మగవాళ్లు ప్రతిదానికీ డబ్బులేకపోవటం ఒక అభ్యంతరంగా చెప్పేవాళ్లు. అరమైలు దూరంలో ఉన్న పార్కుకు రోజూ నడిచి షికారువెళ్లటానికి డబ్బెందుకూ? ఏడాదికొక మంచి సినిమా చూసేటానికి డబ్బు లేకుండా ఉందా? నెలకొక పుస్తకం కొనటానికి డబ్బు లేదా?

తన ఇంట్లో ఉన్న వాతావరణంమీద సీత తిరగబడింది. వాళ్లకి జీవించటం చాతకాదని ఆమె నిర్ణయించుకున్నది. డబ్బు ఇబ్బందులు ఉండవచ్చుకాక, తన తండ్రీ, అన్నా చూపించే సంస్కారానికి దారిద్ర్యంతో ఏమీ సంబంధం లేదని నిశ్చయించుకున్నది.

సీతతిరుగుబాటులో రెండో దశ ఒక పత్రికతో ఆరంభమయింది. తన స్నేహితురాళ్ల దగ్గర తీసుకుని పత్రికలు అధికంగా చదివేది సీత. ఒక పత్రికలో ఆమె ఒక కథ చదివింది. అది రాసినతని పేరు రామదాసు. ఆకథ చదివేటప్పుడు ఆమెకు రామదాసు తనతో మాట్లాడుతున్నట్టే, అందులో ప్రతిమాటా తనకు అర్థం కావటానికి రాసినట్టే తోచింది. సీత ఎన్నో కథలు చదివిందిగాని ఇటువంటి భావం ఆమెకు ఎన్నడూ కలగలేదు. పైగా ఆ కథలో కథానాయిక తనవంటిదిగానే తోచింది. కనీసం ఆమెసంస్కారం ఆమెపరిసరవాతావరణంకన్నా ఉన్నతంగా ఉంటుంది. ఆమెకన్నా సంస్కారంలో హీనులైనవారు ఆమెజీవితాన్ని నిర్ణయిస్తారు.

ఈ కథ చదివినతరవాత చాలారోజులు సీత ఇంకొకవిషయం గురించి ఆలోచించలేకపోయింది. ఆఖరుకు కవరు సంపాదించి రామదాసుకు పత్రికపేర లేఖ రాసింది. అందులో ఆమె ఏమీ విశేషంగా రాయలేదు. ఫలానిపత్రికలో ఫలానికథ చదివాననీ, అది తన కెంతో బాగున్నదనీ రెండుముక్కలు రాసింది. ఆమె తలలో ఎన్నో పేజీలు నింపే ఆలోచన లున్నట్టు తోచిందిగాని అవి మాటలలో ఇమడలేదు. ఈఉత్తరం పోస్టులో వేసినతరవాత ఆమె కేదో భయం పట్టుకున్నది—ఆరామదాసు తననుగురించి ఎటువంటి అపోహలు పడుతాడో, ఎవరికైనా తనను ఎరిగినవాళ్లకు చూపిస్తాడేమో, తననుగురించి చులకనగా ఎవరితోనైనా మాట్లాడుతాడేమో అని. ఉత్తరంలో తన ఎడ్రసు ఇవ్వలేదుకనక అతను సమాధానం రాస్తాడనే భయం లేదు. అది ఎవరికంటనైనా పడుతుందనే భయమూ లేదు.

ఆసంఘటన అంతటితో అయిపోవలసిందే. కాని మరొక రెండునెల్లకు ఒక స్నేహితురాలి ఇంట సీతకు ఈ రామదాసే తటస్థపడ్డాడు! అతను పాతికేళ్లలోపువాడు. ఇంజనీరింగుకాలేజీలో చదువుతున్నాడు. అధికంగా అతను సీతస్నేహితురాలి అన్నను తెలుసును.

అతనే రామదాసనీ, తను ఆనందించిన కథ రాసినవాడనీ తెలియగానే సీత తెల్లబోయింది. కాని అతను తనపేరు విని ఏమీ కాలేదు. ఆమెకేసి విచిత్రంగాకూడా చూడలేదు. తను రాసిన ఉత్తరం అతనికి చేరినట్టు లేదు. ఇంకెవరిచేతిలో పడిందో!

రామదాసుకథ సీతకు నచ్చటంలో ఆశ్చర్యం లేదు. అతని మాటల ధోరణే సీతకు నచ్చింది. జీవితంపట్ల అతనికి వస్తుతహా కొంత అసహనం ఉన్నది. దాన్ని అతను తన మాటల్లోనే తెలియజేశాడు.

"జీవితం బాగా లేదని ఎవరన్నా నసపెట్టవచ్చు. కాని దాన్ని మార్చటానికి ఎవరు ప్రయత్నిస్తున్నారు? అటువంటి ప్రయత్నం ధనికులుమాత్రమే చెయ్యగలుగుతున్నారు. అందుకనే ఈ జీవితంలో దరిద్రులకూ, పనులుచేసుకునేవారికీ స్థానం లేదు. జీవితాన్ని తమకు అనుకూలంగా మార్చుకోవటానికి ధనికులు చేసే ప్రయత్నాలను అడ్డగించేవారు లేరు. అటువంటిప్రయత్నమే బీద వాళ్లు చేస్తే వాళ్లకోసం లాఠీలూ, తుపాకులూ, జైళ్లూ సిద్ధంగా ఉన్నాయి. ఈపరిస్థితి మారదు. కొందరు పేదలు చావటానికి సిద్ధపడి సరిఅయిన కృషి చేస్తేగాని మారదు. సోషలిజ మన్నమాట విన్నా, కమ్యూనిజ మనే మాట విన్నా హాహాకార్ అని చెవులు మూసుకునే మనం జీవితాన్ని ఏవిధంగా మార్చాలోకూడా తెలీని స్థితిలో ఉన్నాం. ఇక మనం మార్చే దేమిటి?" అని అత నన్నాడు.

చాలాసేపు వాదన జరిగింది. రామదాసు మాట్లాడుతున్నంత సేపూ సీతకు తానే మాట్లాడుతున్నట్టున్నది. అతను చెప్పే విషయాలు తనకు తెలుసునని కాదు. అతన్ని ఖండించేవాళ్లకు అతనికి తెలిసినవిషయాలు తెలీవు. అతని కున్న జ్ఞానం లేదు. తన ఇంట్లో తన స్థితి ఎట్లా ఉన్నదో, ఈసమావేశంలో రామదాసుస్థితి అట్లాగే ఉన్నది. అతను ఎదిరించి పోట్లాడుతున్నాడు; తను ఎన్నడూ పోట్లాడలేదు. అంతే తేడా.

అక్కణ్ణుంచి బయలుదేరేటప్పుడు సీత ఎక్కిన బస్సులోనే రామదాసుకూడా ఎక్కాడు. టిక్కెట్టు కొనబోతూ "మీరెందాకా?" అన్నాడు. వద్దంటున్నకొద్దీ తనకూడా టిక్కెట్టు కొన్నాడు. మర్యాదకు ఏదన్నా మాట్లాడా లనుకున్నదిగాని ఏం మాట్లాడాలో సీతకు తెలియలేదు. అతను పార్కుదగ్గిర దిగిపోతూ, "కాస్సేపు పార్కులో కూర్చుందాం, రాకూడదూ?" అన్నాడు. సీత కొంచెం సంకోచించి అతనివెంట దిగింది. "ఈమనిషితో—పరాయివాడితో—పబ్లిగ్గా పార్కులో కూర్చుంటావా?" అని ప్రపంచం తనను ప్రశ్నించినట్టు ఊహించి సీత ప్రపంచంమీద మండిపడింది "ఏమిటి తప్పు? దురుద్దేశం కలదాన్నయితే అందరూ చేరేచోట పరాయిమనిషితో కూర్చుంటానా?" అని ప్రపంచానికి సమాధానం చెప్పింది.

ఇద్దరూ వెళ్లి ఖాళీగా ఉన్న పార్కుబెంచిమీద కొంచెం ఎడంఎడంగా కూర్చున్నారు.

"మీఉత్తరం అందింది. సమాధానం రాయాలంటే ఎడ్రసు తెలీలేదు" అన్నాడు రామదాసు.

సీతగుండె ఒక్కసారిగా ఆగిపోయింది.

వాళ్లిద్దరి స్నేహానికి అదే మొదలు. అది చాలా రోజులు గురుశిష్యసంబంధంగా ఉండేది. రోజూ ఆ పార్కులోనే ఇద్దరూ కలుసుకునేవాళ్లు. ఒక్కొక్కసారి అతనివెంట స్నేహితు లుండే వాళ్లు. ఎప్పుడన్నా సీతవెంటకూడా స్నేహితురాళ్లూ, ఎరిగినవాళ్లూ ఉండేవాళ్లు. రామదాసు సాధారణంగా సంఘంగురించీ, ఆర్థికశక్తు లనుగురించీ, సాంఘికపరిణామంగురించీ, సోషలిస్టువ్యవస్థనుగురించీ మాట్లాడేవాడు. ఆదిమసమాజం ఎట్లా మారుతూవచ్చిందీ చెప్పే వాడు. అతను చెప్పే విషయాలు ఎంత విడ్డూరంగా ఉన్నా నిజ మల్లే తోచేవి.

"అవునుగాని, ఇవన్నీ మీ రెక్కడ చదువుతారు? వీటిని గురించి పుస్తకా లున్నాయా? ఉంటే నా కివ్వగలరా?" అన్నది సీత.

ఆతరవాత రామదాసు ఆమెకు వజనుకొద్దీ పుస్తకాలు ఎక్కడినుంచో, ఎవరెవరివో తెచ్చి ఇవ్వసాగాడు. ఈపుస్తకాల మూలంగా సీతమానసికచైతన్యానికి మేత దొరికింది. ఇవాళ ఉన్న కులాలూ, కులకృత్యాలూ, కులాచారాలూ ఒకనాడు లేవనీ, కొంత కాలానికి పోవచ్చుననీ తెలుసుకున్నప్పుడు సీతఆశ్చర్యానికి మేర లేదు.

సీతను ప్రణయంలోకి దింపినవాడుకూడా రామదాసే. అతను సీతప్రేమను ఆశించనుకూడా లేదు. ప్రస్తుతసమాజంలో స్త్రీపురుషులు ఒకరినొకరు అర్థంచేసుకోవటంగాని, అభిమానించి ప్రేమించుకోవటంగాని ఎంత ప్రమాదకరమో చెప్పాడు.

అతను తనమీది ప్రేమతో ఎంత బాధ పడుతున్నదీ అతని నోటనే చెప్పించింది సీత.

"నీకు ఒకమనిషిమీద ప్రేమ ఉన్నట్టు బయటపెట్టడం కూడా ఈదిక్కుమాలిన కాలంలో అశ్లీలమే. పెళ్లిళ్లకు ఇన్ని హద్దులు ఏసమాజంలోనూ లేవు." అన్నాడు రామదాసు.

తనకూ, రామదాసుకూ కులభేదం ఉన్నదని సీతకు అదివరకే తెలుసు.

"వెనకటికన్న ఇప్పుడు పెళ్లిళ్లు నయం కాదా?" అన్నది సీత.

"ఏం మారిందని? కొందరు డబ్బున్నవాళ్లు సాహసించగలుగుతున్నారు. మిగిలినవాళ్లు సంస్కారవివాహాలు చేసుకోలేరు."

"మనిద్దరం పెళ్లి చేసుకుని చూద్దాం, ఏం జరుగుతుందో?"

"ఏం జరుగుతుందో ముందుగా తెలుసుకోలేమా? నేను మీ కులం కానందు కెవరూ అభ్యంతరం చెప్పరు—కనీసం వాళ్లకు ఆ అభ్యంతరంకంటే నేను ధనవంతుణ్ణి కాననే అభ్యంతరం జాస్తిగా ఉంటుంది" అన్నా డతను.

సీత రామదాసును పెళ్ళిచేసుకుందా మనుకున్నది. ఈవిషయం తన తండ్రితోనూ, అన్నతోనూ, తల్లితోనూ మాట్లాడదా మను

కున్నది. కాని మామూలువిషయాలలోనే మధ్యయుగం మనుష్యులల్లే ప్రవర్తించేవాళ్ళతో ఈపెళ్లివిషయమై వితర్కించ బుద్ధిపుట్టలేదు.

ఆమెకు మొదట్లో లేచిపోదామన్న సంకల్పం లేదు. కాని చదువు పూర్తిఅయి రామదాసు పట్నం వదిలిపోతున్నా డనేసరికి ఆమెకు ఏదో చెయ్యాలనేటి ఆవేశం కలిగింది. చాటుగా పెళ్ళిచేసుకోవటాని కామె మేజరు కాదు.

రామదాసు ఆఖరుసారి ఆమెను పార్కులో కలుసుకుని సెలవు పుచ్చుకున్నాడు.

"ఆడవాళ్లమీద నా కున్న గౌరవం ఎక్కువయేటట్టు చేశావు. అందుకని నిన్నెప్పుడూ మరిచిపోను" అన్నాడు రామదాసు.

అతను మర్నాడు మెయిలుకు వెళ్లిపోతున్నాడు. ఆరోజు సాయంకాలం సీత అర్ధరూపాయిడబ్బులు చేత పుచ్చుకుని పార్కుదగ్గిరికి మామూలుప్రకారమే వచ్చింది. సెంట్రలుస్టేషనువేపు వెళ్లే బస్సులో ఎక్కి స్టేషనుకు టిక్కెట్టు కొన్నది.

రైలు బయలుదేరటాని కింకా పదిహేనునిమిషా లున్నది. ప్లాట్‌ఫారంటిక్కెట్టు కొని మెయిలుపెట్టెలు వెతకసాగింది. రామదాసు మూడోతరగతిపెట్టెలో ఒకమూల కూర్చుని ఏదో ధ్యానం చేస్తున్నాడు. సీతను చూసి కంగారుగా బయటికి వచ్చాడు.

"నన్నుకూడా తీసుకువెళ్లండి—అభ్యంతరం లేకపోతే" అన్నది సీత.

రామదాసు సంకోచించాడు.

"మీ కభ్యంతరమైతే ఇంటికి వెళ్లిపోతాను."

"నాకుసంబంధించి ఏమీ అభ్యంతరం లేదు. నువ్వు ?"

"ఆలోచించుకునే వచ్చాను... నే నాఇంట్లో ఉండలేను. నరకం."

"టైము లేదు. టిక్కెట్టు కొనుక్కొస్తా నుండు."

రైలు సాగినతరవాత రామదాసు సీతకు తన పరిస్థితి చెప్పాడు.

"నువ్వు మాఇంటికి రావచ్చు. మాఇంట్లోకూడా మీమాదిరిగానే శాకాహారం తింటాం. కాని మావాళ్లను నువ్వు భరించలేవు. వాళ్లు కొద్దిగా చదువుకున్నవాళ్లు. నాగరికత తెలియని పేటవాళ్లు. పల్లెటూరు కూడాను."

"ఫరవాలేదు. నాకోసం మీరేమీ ఇబ్బందిపడక్కర్లేదు. మీకూ మీవాళ్లకూ మధ్య భేదాలు పెట్టాలనే ఉద్దేశం నాకెన్నడూ లేదు. మీవాళ్ల జీవితం యథార్థమైన జీవితమని నా నమ్మకం. అందుచేత భరించగలుగుతాను" అన్నది.



"నన్నుకూడా తీసుకువెళ్లండి—అభ్యంతరం లేకపోతే" అన్నది సీత.

సీతమాట ఎట్లా ఉన్నా, ఆమెను చూసి రామదాసుతల్లిదండ్రులు చాలా సంతోషించారు. ఆమె తన స్నేహితురాలని అతను వాళ్లతో చెప్పాడు. "ఆమె ఏకులం ? మన ఇంట్లో ఉంటుందా ? మనను చూసి అసహ్యించుకోదా ?" ఈవిధంగా రామదాసును ప్రశ్నించారు. వాళ్లు ఆమెకోసం కొన్ని తెచ్చిపెట్టుకోవటానికి ప్రయత్నించారుగాని రామదాసు నిరుత్సాహపరిచాడు.

సీత అన్నది నిజమయింది. రామదాసుచుట్టాలు కపటంలేనివాళ్లు; సహజమైన భావాలు గలవాళ్లు; ప్రయోజనకరమైన వ్యాపకా లున్నవాళ్లు. ఇంటిమీదా, పనిమీదా వాళ్లకున్న శ్రద్ధ అపారం.

రామదాసు పేదవాడు కాదు. పెద్ద భాగ్యవంతుడు కాకపోయినా అతనికి చాలా పలుకుబడి ఉన్నది. ఈ వ్యవసాయం చేసుకునే వాళ్లలో మర్యాదలకు లోటు లేదుకాని కపటవినయాలు లేవు. సీతకు ఇప్పుడు సరిగా గాలి పీలుస్తున్నట్టుంది.

సీత ఫలానిచోట ఉన్నదని కనిపెట్టటానికి నరసింహంగారికి వారంరోజులు పట్టింది. వెంటనే ఆయనా, పానకాలరావూ బయలుదేరి వచ్చారు. రామదాసు ఇంట్లో లేడు. అతనూ, సీతా సాయంకాలం ఫ్రూట పొలాల్లోకి వెళ్లారు.

చెరువుదగ్గిర వాగ్యుద్ధం సాగింది. మొదట్లో రామదాసు మాట్లాడాడు. తరవాత సీతకూడా మాట్లాడింది. తండ్రికొడుకులు వాదనలు వినదలచలేదు. సీతను తమవెంట పంపకపోతే పోలీసులకు రిపోర్టిస్తామన్నారు.

"మీరు నామీద గల ప్రేమ చూస్తే కడుపు నిండిపోయింది. కాని మీవెంట వస్తే నాకేం చేస్తారు! నా కిష్టంలేని మనిషి కిచ్చి పెళ్లిచేస్తారా ? లేకపోతే మీ వంశగౌరవం దక్కించుకునేటందుకు నన్ను యావజ్జీవనరకంలో ఊరేస్తారా! నేను కులం చెడ్డాననీ, లజానుదాన్నయినాననీ ఇప్పుడే అంటున్నారుగదా, చూస్తూచూస్తూ పరువుగలవాడికెట్లా ఇచ్చి చేస్తారు ?" అన్నది సీత.

"నీ తెలివితేటలు చూపి సంతోషించటానికి రాలేదు. నువు వెంటనే బయలుదేరి వస్తావా ? కేసు పెట్టమన్నావా ?" అన్నాడు పానకాలరావు.

"ఏమని కేసుపెడతారు ?" అన్నది సీత రామదాసుతో.

"నువు మైనరువు. కేసు పెట్టవచ్చు"

"ఎప్పటికి మేజరు నవుతాను ?"

"పద్ధెనిమిదేళ్లకు."

"ఇంకో ఏడాదికా !...మళ్లీ వస్తాను. చెప్పకుండా వెళ్లానని మీవాళ్లనుకుంటారేమో. తొందరగా బయలుదేరానని చెప్పండి," అని, సీత తనవాళ్లతో బయలుదేరింది.

సీతను తిరిగి తీసుకొచ్చినతరవాత ఇంట్లో అందరూ కుక్కను చూసినట్టు చూశారు. సీత అభ్యంతరం చెప్పలేదు. ఆమె రామదాసును పూర్తిగా మరిచిపోయినట్టు కనపడింది. కాలక్రమాన వాళ్లు కూడా మరిచిపోయినారు.

ఆరు నెల్లు గడిచింది. సీతకు సంబంధాలు విచారించసాగారు. తనకు పెళ్లి అక్కర్లేదన్నందుకు పానకాలరావు, "అవును, రంకు సాగితే పెళ్లెందుకు ?" అన్నాడు.



"అకస్మాత్తుగా సీత బయటికి బయలుదేరింది.
"ఎక్కడికే ?" అన్నది తల్లి."

సీత నవ్వి, "నీ నిజమైన సంస్కారం చూపించటానికి ఎంత మంచి అవకాశం తీస్తున్నాను !" అన్నది.

సంవత్సరం అయింది. ఒకనాడు అకస్మాత్తుగా సీత బయటికి బయలుదేరింది.

"ఎక్కడికే ?" అన్నది తల్లి. ఇంట్లో ఇంకెవరూ లేరు.

"వెళ్లానని చెప్పు. చెప్పకుండా వెళ్లినందుకు నాన్నగారూ, అన్నయ్యగారూ ఏమీ అనుకోవద్దను. అయినా వాళ్లు నాకు తగిన మర్యాద చూపించలేకపోయినారు. అందుచేత వాళ్లకు చెప్పనవసరం లేదు" అంటూ సీత బయటికి వచ్చింది.

తల్లి కేక వేస్తూ బయటికి వచ్చింది. కాని ఆవిడమొర ఎవరాలకిస్తారు ? రోడ్డువెంట పొయ్యే బస్సుల రొదలో ఆవిడకేక లెవరూ వినిపించుకోలేదు.

సీత పార్కు దగ్గిరికి వచ్చింది. అక్కడ ఆమెకోసం రామదాసు కనిపెట్టుకుని ఉన్నాడు.

# నన్నయయుగమునాటి తెనుగువాఙ్మయము

క్రీ. శ. 1000 - 1100

శ్రీ నిడుదవోలు వేంకటరావు

తెలుగుభాషాసాహిత్యవిశిష్టతను, సక్రమ మగు చారిత్రకపరిణామమును తెలిసికొనుటకు మనము తొలుత కన్నడభాషా సాహిత్యచరిత్రమును, సాహిత్యపథకమును గూర్చి తెలిసికొనట యావశ్యకము. దీనికి ముందుగా తెలుగుసాహిత్యపరిణామతత్త్వము నెఱుంగుట యావశ్యకము. తెలుగుసాహిత్యము రెండు విధములగు విశిష్టసంప్రదాయములు గలది: (1) దేశిసంప్రదాయము, లేక దాక్షిణాత్యసంప్రదాయము. (2) మార్గము, లేక సంస్కృత సంప్రదాయము. సాహిత్యసంప్రదాయము లిట్లు రెండువిధము లగుటకు తెలుగు దాక్షిణాత్య భాష యగుటయే కారణము. దాక్షిణాత్యభాషలగు తమిళము, తెలుగు, కన్నడము, మలయాళము, తులు—వీనిలో తెలుగుకన్నడములు రెండును నేకరీతిగనే రెండు సంప్రదాయములతో వెలసినవి. దీనికి కారణములు—(1) తెలుగు కన్నడములు మాటలాడుప్రదేశములు నైసర్గికముగ నొకే భూభాగమునకు చెందియుండుట. (2) భాషాతత్త్వము ననుసరించి యొకే భాషా కుటుంబమునకు చెందుట. (3) భాషకు స్థిరత్వము కలుగజేయు లిపి యేకరీతిగ నుండుట. (4) సాహిత్యస్వరూపమునకు శాశ్వతత్వము గలుగజేయు వ్యాకరణచ్ఛందస్సంప్రదాయము లొకటే యగుట. (5) రాజకీయముగ కొంతకాల మొక యేలుబడిలో నుండుట. (6) సాంఘికముగ, మతవిషయమున పరస్పరసంబంధము దృఢ ముగుట అనునవి యని చెప్పనొప్పును.

కన్నడవాఙ్మయము యొక్కయు, తెలుగువాఙ్మయము యొక్కయు చారిత్రకక్రమపరిణామమును గమనించిన రెండింటికిని గల పరస్పరసంబంధము, ప్రత్యేకతయు మనకు స్పష్టము కాగలదు. చారిత్రకముగ సారస్వతమున గ్రంథరచన తెలుగుకన్న ముందే కన్నడమున ప్రారంభమైనది. అత్యంతసన్నిహితత్వము చేత తెలుగువారు కన్నడమునుండి పద్ధతులను గ్రహించినను, వానిని తెలుగుభాషకు, తెనుగుజాతికి నైసర్గికములగు సంప్రదాయముల తోడను, సంస్కారముతోడను మేళగింపకేని, రీతిసాహిత్య కవితలలో తెలుగునకు దాక్షిణాత్యవాఙ్మయప్రపంచమున ప్రత్యేక శాశ్వతస్థానము గడించిరి.

తెలుగున నన్నయనాటినుండి తిక్కన వఱకు వెలసిన వాఙ్మయ శాఖలలో ప్రచురముగనున్న చంపూకావ్యములును, శతకములును, శాస్త్రీయగ్రంథములును కన్నడ వాఙ్మయము ననుసరించి వెలసినవి.

## కావ్యరచన

| కన్నడము : | తెలుగు : |
|---|---|
| 1. ఆదిపంప మహాకవి పంపభారతము లేక విక్రమార్జునవిజయము. క్రీ. శ. 941. | 1054. నన్నయభట్టు. తెలుగు మహాభారతము (ఆది, సభా, అరణ్యపర్వభాగము.) |
| 2. ఆదిపురాణము | 960. సర్వదేవుడు. గ్రంథముపూర్తిగ లభ్యము కాలేదు. లక్షణగ్రంథములలో నుదాహృతము. |
| 3. గుణవర్మ—శూద్రకము క్రీ. శ. 900 (కన్నడమున పూర్తిగా లభ్యము కాలేదు.) | 1100. శూద్రకరాజ చరిత్రము. లక్షణగ్రంథోదాహృతము. |

| | |
|---|---|
| 4. అభినవపంపడు, లేక నాగచంద్రుడు. కుము జేందు రామాయణము. 1105 | 1200. మంత్రి భాస్కరుడు రామాయణము. |
| 5. నాగవర్మ. కాదంబరి. 984 | 1100. కేతన. కాదంబరి. (గ్రంథము పూర్తిగా లభ్యముకాదు. లక్షణసంకలన గ్రంథములలో నుదాహృతము.) |

చంపూశబ్దము దండి కావ్యాదర్శమున నున్నను అది ద్రవిడ భాషాపదమని చెప్పనొప్పును. చంపూ - చంపూశబ్దమునకు కన్నడమున, తుళుభాషలోను కలయిక, మనోహరము అను నర్థములు గలవు. చంపూకావ్యము గద్యపద్యకావ్యములకలయికయే గావునను, ఇట్టి కలయికగల గ్రంథములు సంస్కృతభాషలో దండి కన్న ముందు, అనగా క్రీ. శ. 7 వ శతాబ్దికిముందు ప్రాచీనసంస్కృతమున కానరాలేదు కావునను నీశబ్దము దాక్షిణాత్యసాహిత్యమునందు గాఢమైనది. దండి దాక్షిణాత్యుడేగావున, వానికి లక్ష్యములప్పటికే కన్నడమున వెలసిన చంపూకావ్యములని చెప్పవచ్చును.

### కావ్యరచన-చంపూపద్ధతి

| | |
|---|---|
| దుర్గసింహుడు. పంచతంత్రము 1145 | 1230. పంచతంత్రము. మడికి సింగన సకలనీతిసమ్మతములో నుదాహృతము. గ్రంథము పూర్తిగా లభ్యముకాలేదు. |
| దశకుమారచరిత్ర. | కేతన దశకుమారచరిత్ర. |

### శతకములు

| | |
|---|---|
| చంద్రచూడామణిశతకము. 1079 నాగవర్మాచార్యుడు | 1160 క్రీ. శ. శ్రీగిరిమల్లికార్జునశతకము. మల్లికార్జునపండితారాధ్యుడు. |
| హరీశ్వరుడు. పంపాశతకము. 1165 | 1200. దీని ననుసరించి పాల్కురికి సోమన వృషాధిపశతకము, అన్నమయ్య సర్వేశ్వరశతకము. క్రీ. శ. 1242. |

### శాస్త్రీయగ్రంథములు-ఛందస్సు

| | |
|---|---|
| నాగవర్మఛందోంబుధి. 984. | 1100. మల్లియ రేచన. కవిజనాశ్రయము. |

### వ్యాకరణము

| | |
|---|---|
| రెండవనాగవర్మ కర్ణాట భాషాభూషణము 1145 | 1260 కేతన ఆంధ్రభాషాభూషణము. |



### కేవలశాస్త్రగ్రంథములు

| | |
|---|---|
| కీర్తివర్మ-గోవైద్యము 1100 | 1400 నాగనమంత్రి - పశువైద్యము. |
| రాజాదిత్యుడు - గణితశాస్త్రము 1190 | 1230 పావులూరి మల్లన-సారసంగ్రహగణితము. |
| రట్టకవి 1300 | 1356. దోనయామాత్యుడు-సస్యానందము. |
| అభినవచంద్రుడు - అశ్వశాస్త్రము 1400 | 1430. మనుమంచి భట్టారకుడు-అశ్వశాస్త్రము. |

## వేతనభట్టు - క్రీ. శ. 1022

రాజరాజనరేంద్రుని రాజ్యకాలమున తొలిదినములలో నీతడు శాసనరచయిత. ఈతడు రచించిన "కోరుమిల్లి" శాసనము క్రీ. శ. 1022 లో రాజనరేంద్రుడు పట్టాభిషిక్తుడైనపుడు చంద్రగ్రహణకాలమున చీదమార్య యను బ్రాహ్మణునికి కోరుమిల్లిగ్రామ మగ్రహారముగా నొసంగి దానము చేసిన విషయము తెలుపుచున్నది. ఈ గ్రామము ప్రస్తుతము తూర్పుగోదావరిజిల్లాలోని రామచంద్రపురము తాలూకాలో నున్నది.

ఈ శాసనము తెనుగువారికి పుణ్యదివసము రాజనరేంద్రుని పట్టాభిషేకదినము (19-7-1022) తెలుపుటయేగాక నన్నయకు ముందు తెనుగుకవు లుండిరని తెలుపుచున్నది. ఈ శాసనమున సంస్కృతశ్లోకములు, సంస్కృతగద్యభాగమైన వనక సంస్కృతచ్ఛందస్సునకు విలక్షణమగు నొక దేశీయచ్ఛందస్సుతో సంస్కృతభాషలో నొక ఛందోభేదము కలదు. అది యిది :

| | | |
|---|---|---|
| తస్మై సమస్తజనతావినుతగుణాయ | ... | 1 |
| వైసుత్కృతమహీదేవదేవగణాయ | ... | 2 |
| విప్రావ్యయాధికశిక్షిత్ ప్రతిచ్ఛందాయ | ... | 3 |
| విద్వజ్జనాధికృతవిశ్రుతానందాయ | ... | 4 |
| జన్మప్రభృతిగీతవేదాంతతత్త్వాయ | ... | 5 |
| సన్మనోవసతివాస్తవ్యాత్మసత్త్వాయ | ... | 6 |
| లంఘితగురుత్వపరిలాలితచరిత్రాయ | ... | 7 |
| గుంఫితమతిస్థగితశీతధృతపుత్రాయ | ... | 8 |
| సిద్ధనిజనాథకృతసేవితమనీషాయ | ... | 9 |
| శుద్ధమతిభూషితసమస్తజనతోషాయ | ... | 10 |
| సంతతారాధితనిజస్వామిపాదాయ | ... | 11 |
| చింతితమనస్సుఖదాధీతపాదాయ | ... | 12 |
| హోమధూమవినిర్గతావితకలంకాయ | ... | 13 |
| ధీమత్ప్రగీతరుచిరస్వనామాంకాయ | ... | 14 |
| సకలమునిగణనుతాపస్తంభసూత్రాయ | ... | 15 |
| శ్రిత సంగీతభారద్వాజగోత్రాయ | ... | 16 |
| సత్తతంతుకృతయూపస్తంభశోభాయ | ... | 17 |

సప్తాశ్వరూపపద్యశాత్కృతసులాభాయ ... 18
నిత్యజనతోచితసుసత్యగుణయుక్తాయ ... 19
పత్యభిలషితకార్యసంపత్తిసక్తాయ ... 20
పరమపురుషార్థసంపాదనపటిష్ఠాయ ... 21
పరమేశ్వరస్మరణపాలనపరిష్ఠాయ ... 22
సకలార్థశాస్త్రపరినిష్ఠితవినోదాయ ... 23
సుకుమారతాధికసరోజనిభపాదాయ ... 24
ధారాళకరుణాగ్రహీకృతకోరు
విల్లీనామగ్రామమిందూపరాగేణ
దత్తో మయాచంద్రతారంహోతిస్మేత
తస్యారథిస్య క్తిరేషోచ్య తేరాద్య.

ఆ వెనుక పరిహార్లులు గలవు. తరువాత 'ఆజ్ఞప్తి కటకేశో రాచయపెద్దేరితనూజకర్తా చేతనభట్టః కావ్యానాం శేఖరోఽస్య కండాచార్యః' అని శాసనరచయిత, శాసనోత్కీర్ణుని పేరు తెలుపబడినవి.

పైభాగమున 24 పాదములలో అంత్యానుప్రాస కలదు. మఱియు 2, 3, 4, 16 పాదములలో ఆదిప్రాస లేకున్నను తక్కిన వానియం దీ నియమము పాటింపబడినది (జన్మ-సన్మ-లంభిత-సంభిత...) 1, 4, 6, 7, 9, 11, 13, 20, 21, 22—వీనియందు యతినియమము, అనగా తుల్యాక్షరము వచ్చుట పాటింపబడినది. 13 పాదములో 'హోమ-అమిత' అని ప్రాసయతి కలదు. ఇది 24 పాదములు గల రగడభేదము. ఈ రగడలు సంస్కృతభాషలో లేవు. కన్నడభాషయందు, తెనుగునందు కలవు. సంస్కృతభాషలో నింతకు ముందు, క్రీ. శ. 940 ప్రాంతమున సోమదేవసూరి 'యశస్తిలక' చంపువున రచించిన 'రగడ' నీవఱకే విద్వల్లోకమున కెఱుకపఱచినాడను.*

పైరగడ మాత్రాచ్ఛందస్సులలో విజయభద్రరగడ యను పేరు గలది. ఇది 5 మాత్రలకు విఱుగును. గాన ఖండగతి గలది. దీనికి జంపెతాళము-నియతము.

తస్పైస్రస-మస్తజన-తావిశే-మసుణాయ. ఈగణములలో గురు లఘువు లన్నియు లఘువులుగా పరిగణించిన మన కిది యెట్లు 5 మాత్రలుగా విఱుగునో తెలియగలదు.

తస్పైస్రస-2+2+1; మస్తజన-2+1+1+1; తావిశే-2+1+2; మసుణాయ—1+1+2+1.

కాబట్టి పైరగడ రచించినయాతడు తెనుగుకవి యనుట స్పష్టము. భాష సంస్కృతమైనను తెనుగుకవితాలక్షణము లిం దుండుటచేత, రచయిత తెనుగుకవి యని నిశ్చయముగ జెప్పవచ్చును. చేతనభట్టు నన్నయకు ముందున్న యొక తెనుగుకవి.

ఈతని పేరు "చేతనభట్టు" అని యీ తరువాతివారు వ్రాయుచున్నారు. కాని యీశాసనప్రతిబింబములో 'చే' స్పష్టముగా కానవచ్చుచున్నది. మొట్టమొదట దీనిని ప్రకటించిన ఫ్లీటుదొరవారు లిపిని సరిగ పరిశీలింపక పోవుటచేతను, వారు వ్రాసినదానినే యితరు లనువదించుటచేతను నిట్టి విపర్యాస మేర్పడినది. రాజనరేంద్రుని కాలమునాటి యితరశాసనములనుబట్టి యీతని పేరు "చేతనభట్టు" అని తెలియుచున్నది.

## నన్నయభట్టు - క్రీ. శ. 1050.

చారిత్రకముగ నిర్వివాదముగ మనకు దెలిసిన తొలికవి నన్నయభట్టు. నన్నయకు ముందుకాలమునను, సమకాలికముగను తెలుగుకవులు నెలసినను, వారిగ్రంథములు మనకు లభ్యము కాక పోవుటచేతను, నన్నయరచిత మహాభారతభాగమే తరువాతి సాహితీ పరికమున కాధార మగుటచేతను, దేశి, మార్గకవితారీతుల దే రెండు విధము లైన యాంధ్రసాహితీప్రపంచమున, నన్నయోపజ్ఞమై, తిక్కనమహాకవిచే పునర్నిర్మాణము గావింపబడిన మార్గకవితారీతియే ప్రధానమై, పరంపరాయాతముగ నాదరణీయ మగుటచేతను, నన్నయ నే యాదికవిగను, నాంధ్రకవితావతారప్రథమతీర్థముగను, నాంధ్రకవితాసృష్టికర్తగను, వాగనుశాసనునిగను తరువాతికవులంద ఱును గీర్తించినారు. కాని యుపలబ్ధములగు సాధనసామగ్రి నను సరించి చూడగా నన్నయను గూర్చి మనకు సత్యమగు చరిత్రకన్న, నితరులచే నారోపితమైన చరిత్రయే హెచ్చుగా నిలిచిన దని చెప్ప నొప్పును. క్రీ. శ. 1656 సంవత్సరమున నప్పకవీయము రచితమైన కాలమునుండి, నన్నయచరిత్ర మలుసుపడి పెక్కు వివాదముల కాస్పదమై, ఒక ప్రత్యేకవాఙ్మయముగా బరిణమించినది.

కాని నిష్పక్షపాత మగు చారిత్రకదృష్టితో బరిశీలించిన మనకు నన్నయను గూర్చియే గాక, ప్రాచీనాంధ్ర భాషాసాహితీ సంప్రదాయములే గాక, రాజకీయ, మతసాంఘికాదివ్యవస్థల విశేషములుగూడ నెఱుకపడు ననుటకు సందియము లేదు.

1. కాలము:—నన్నయ తూర్పుచాళుక్యరాజశ్రేష్ఠుడును రాజమహేంద్రవిరుదాభిరాముడు నగు రాజరాజనరేంద్రుని కాలమున (క్రీ. శ. 1022-1061) విలసిల్లినవాడు. సంస్కృత మహాభారతము ఆదిసభాపర్వములును, అరణ్యపర్వమున కొంతభాగమును రాజరాజనరేంద్రు నాదేశానుసారముగ తెనుగున వ్రాయుటయే గాక, శాసన కర్తయై నందమపూడి, మండశాసనములను లిఖియించినాడు. ఇవి చారిత్రకముగ నిరూపితములు.

2. నన్నయభట్టు - శబ్దోత్పత్తి:— భారతములో నన్నయభట్టు 'నన్నపార్యు' (ఆది 1-9) అనియు, 'నన్నయభట్టు' (ఆది 1-25) అనియు, నాశ్వాసాంతగద్యలలో 'నన్నయ

* త్రిపురాంతకోదాహరణము, పీఠిక, పుట 31. ఇది నాచే సంపాదితమై ప్రకటిత మైనది.

భట్టు' అనియు తన్ను పేర్కొనినాడు. అతడు వ్రాసిన శాసనములలో "కావ్యానాం కర్తా నన్నయభట్టో" అనియు, "నన్నియభట్టో" అనియులిఖించినాడు. దీనినిబట్టి నన్నయభట్టు వేఱు, నన్నియభట్టు వేఱు అను నొక విమర్శకాభిప్రాయము వెలువడినది. ఇది యెంతయును ప్రామాదిక మనుటకు సందేహము లేదు.[1] వ్రాతప్రతులకన్న శిలాశాసనము లెక్కుడు ప్రామాణికములు. కావున నన్నియభట్టశబ్దము గ్రాహ్యమే. మఱియు శబ్దవ్యుత్పత్తి ననుసరించి, ప్రాచీననామసామ్యమును బట్టి నన్నియరూపమే సరియైనది. కల్లియ, జక్కియ, నన్నియ, మల్లియ, బొద్దియ, దామియ, పేరియ అను తత్సమేతరపదములలో 'ఇయాం'తరూపములు ప్రాచీనకాలములో విరివిగా వాడుకలో నుండెను. ఇవి క్రమముగా కల్లయ, జక్కయ, నన్నయ, బల్లయ, మల్లయ, బొడ్డయ, దామయ, పేరయ- అను అయాంతరూపములుగా మాఱినవి. తత్సమములగు రామ, భీమ, సోమ మొదలగునవి రామియ, భీమియ, సోమియ అనురూపములై వెనుక రామయ, భీమయ, సోమయగా మాఱినవి.[2] ప్రాచీనసంప్రదాయములననుసరించి ఇయాంతరూపములు సరియైనవి. నన్నెచోడ పదమల్లే- నన్నిచోడ అని వ్రాతలలో ప్రయుక్తమైనది. కావున నన్నయ, నన్నియలు వేఱుకారని స్పష్టమగుచున్నది.

నన్నయభట్టు అను సమాసపదములో నన్ని + అయ + భట్టు అను మూడుపదములు గలవు. ఇందు నన్ని అనునది దేశ్యము; 'అయ' అనునది 'ఆర్య' శబ్దభవము- తద్భవము. భట్టు శబ్దము అదంతమైన సంస్కృతపుల్లింగశబ్దము తత్సమము. కాబట్టి నన్నయభట్టు పేరు తెనుగు పేరనియు, తెనుగు అనగా నన్నయభట్టుకాలమున, తత్సమ తద్భవదేశ్యయుక్తమైన భాష యనియు గ్రహింప నగును.

నన్ని పదము ద్రవిడకర్ణాటభాషలలో గలదు. నన్ని-తమిళము; నన్న - కన్నడము. ఆభాషలలో దీనికి మంచితనము, శీలము, ప్రియము, సత్యము మున్నగు నర్థములు గలవు. తెనుగున నన్ని పదము ప్రత్యేకముగ నీ యర్థమున లేకున్నను, 'ననుపుకాడు' మొదలగు పదములలో నిందులో ప్రియము అనునర్థము గలిగియే యున్నది. నన్నయభట్టు సహాధ్యాయి నారాయణభట్టు నన్ని నారాయణుడని నందమపూడి శాసనమున గలదు. నన్నిగంధవారణము అను బిరుదమున నన్నగూడ నిట్టిదియే. కాని నేడు ప్రత్యేకముగ నన్నయ పేరులో నీశబ్దము కానరాకుండుటచే నిది కన్నడమునుండి తెలుగులోని కొకకాలమున వ్యాప్తిలోనికి వచ్చిన శబ్దమని చెప్పనొప్పును.

అయ:— ఇది ఆర్యశబ్ద తద్భవము- తెలుగున గల 'పలపల గిలకొచే 'ఆయ్యగా' అయ్య అయినది. అదియే 'అయ' అయినది.

భట్టు:— ఇది భట్టః అను సంస్కృతపుల్లింగరూపము. ఇది నన్నయకు లాంఛనపదమని యొక విమర్శకాభిప్రాయము.[3] కాళిదాసునకు దీపకాళిదాసు, శ్రీకంఠునికి భవభూతి, దండికి దండశబ్దోపయోగము, మాఘునికి ఘంటామాఘుడు లాంఛనపదము లైనట్లు ఇదియును కాదగును. దీనికి కారణము లేకపోలేదు. నన్నయ భట్టారక శబ్దమును పెక్కుసారులు ప్రయోగించినాడు.[4]

నారాయణభట్టుకూడ భట్టశబ్దము, లేక నన్నినారాయణుడని పేర్కొనబడినవాడు. కావున నిది లాంఛనపదముగానే యున్నట్లు తోచుచున్నది. నవీనమార్గనిర్మాత యగువానికి 'భట్టారక' బిరుదము గలదని సంప్రదాయము. తెనుగున దేశభాషాకవిత్వమున నూతన మార్గోపదేశకుడగుటచే, నన్నయకు భట్టారకబిరుద మొప్పియుండు ననుట సమంజసమే యగుచున్నది. ఇది క్రమక్రమముగా నామములకు నుపపదముగా చేర్పబడియుండును. మల్లికార్జునభట్టు- హరిభట్టు- ఫణిభట్టు- వినుమంచి భట్టు- జయంతిరామభట్టు- తాతమభట్టు.

తూర్పుచాళుక్యుల రాజ్యకాలమున శాసనకర్తలలో బీతనభట్టు, అయ్యనభట్టు, భీమనభట్టు మొదలగు భట్టోపనామాంకితు లుండుటచేత నీభట్టపదమా కాలమున నొక విశేషవిశిష్టతాసూచకమని చెప్పనొప్పును.

నన్నయకులము:—నన్నయ తన్ను గూర్చి భారతావతారికలో ప్రథమపురుషములో—

సీ. తనకులబ్రాహ్మణు ననురక్తు ననితర
జపహోమతత్పరు విపులశబ్ద
శాసను సంహితాభ్యాసు బ్రహ్మాండాది
నానాపురాణ విజ్ఞాననిరతు
పాత్రు నాపస్తంబసూత్రు, ముద్గలగోత్ర
జాతు, సద్వినుతావదాతచరితు
లోకజ్ఞు నుభయభాషాకావ్యరచనాభి
శోభితు సత్ప్రతిభాభియోగ్యు

---

1. ఆంధ్రమహాభారతరచనాకాలము. భారతి, సంపుటము 18. సంచిక 11, (1941-నవంబరు) పుట 440. "నందమపూడి శాసన కర్త వేఱు, భారతాంధ్రీకర్త వేఱు".

2. ఇయ, అయ, అన, అనునదియే తెలుగులో పురుషనామ వాచకములకు వెనుక ప్రయుక్తమగుచున్నది.

3. నన్నయభట్టారకుడు- భారతి ధాతుపుష్యము, సంపుటము 14. సంచిక. 1. 93, 94 పుటలు)

4. నన్నయ ననుసరించి శ్రీనాథుడు నీశబ్దమును పలుమాఱు వాడియున్నాడు. తాను శ్రీనాథభట్టసుకవి నని చెప్పికొన్నాడు.

| | | |
|---|---|---|
| అగ్నిభట్టారకుడు | | (ఆది. 1, 2, 3, 6 ఆశ్వాసములు సభా1) |
| బ్రహ్మ | ... | (ఆది. 7 ఆ.) |
| విష్ణు | ... | ( — 8 ఆ.) |
| ,, | ... | (అర. 3 ఆ) |
| భర్గ | ... | ( — 1 ) |
| వాయు | .... | ( ,, 28 ఆ) |
| వ్యాస | .... | (ఆది. 3, 4, 7.) |

నిత్యసత్యవచను, మత్యమలాధిపా
చార్యు సుజను నన్నపార్యు జూచి
పరమధర్మవిదుడు వరచాళుక్యాన్వయా
భరణు డిట్టు లనియె కరుణతోడ.

వైవానిలో కులబ్రాహ్మణశబ్దము పెక్కువాదముల కాస్పదమైనది. మఱియు నన్నయ నియోగియా, వైదికియా యను చర్చకు నిదియే మూలమైనది. నన్నయ కాలమున బ్రాహ్మణులలో నియోగి, వైదికవిభేద మున్నట్లు కానరాదు. నేడిరువదియవ శతాబ్దమున గల నియోగివైదికవిభేదములు, కక్షలు, పాక్షికాభిప్రాయములను పురస్కరించుకొని, 9 శతాబ్దములక్రిందట నున్న సాంఘికవ్యవస్థలను నవీనదృష్టితో విమర్శించుట యసమంజసము, అన్యాయము. ఇది సరియగు చారిత్రకపద్ధతి కాదు. మఱియు, తరువాతి కవులలో మహాప్రసిద్ధులైన తిక్కన, ఎఱ్ఱన, పోతన మొదలైన వారిలో ఎవ్వరును తాము నియోగులమని కాని, వైదికులమని కాని చెప్పుకొనలేదు. ఇట్లు చెప్పుకొనుట నవీనకాలమున నేర్పడినది. ఇంకొక విశేషముకూడ నీసందర్భమున గమనింపవలసియున్నది. ఆయాకాలములందు ప్రయుక్తములైన పదములకు నప్పటి యర్థములనే చెప్పి సమన్వయింపవలెనుగాని యా పదములకు కాలక్రమమున మార్పు చెందిన యర్థములను సమన్వయింపజేయుటవలన నిట్టి చిక్కు లేర్పడుచున్నవని మన విమర్శకులు గ్రహింపలేరు. 'కులబ్రాహ్మణుడు' అనగా కులక్రమాగతముగా నాయా రాజకుటుంబముల నాశ్రయించిన బ్రాహ్మణుడని యర్థము. ఇది డెబ్బదిరెండు నియోగములలో నొకటి. కావున నా కాలమున నిది యొక నియోగవృత్తియే. కులబ్రాహ్మణు డనగా పురోహితు డని యర్థము మారుటయు, నియోగు లనగా కేవలము లౌకికవ్యవహారములు చేయువారే యను నర్థమున నియతమగుటయు, పురోహితవృత్తి కొంచెము హీనముగను, లౌకికవృత్తి కొంచె మున్నతస్థితిగను నేడు రూఢమగుటయు నీచర్చకు కారణమైనది. తెలుగున చారిత్రక సారస్వతచర్చలలో వాదబలము కన్న వాదిబలమే ప్రస్ఫుట మగును. కాబట్టి నియోగులు నన్నయ తమ శాఖకు జెందినవాడని యుపపత్తులు జూప, వైదికులు నన్నయ తమ శాఖకు జెందినవాడే యని యుపపత్తులు చూపి తమతమ పంతములను నెగ్గించుకొనిరి. ఇట్టి పట్టుదలచే సత్యము వెల్లడికాదయ్యెను.

నన్నయ యాంధ్రబ్రాహ్మణుడు గావున కులమును గూర్చి యిట్టి వివాదములు, చిక్కులు వచ్చినవని కొందఱు విమర్శకులు నన్నయ యాంధ్రుడు గాడని, కర్ణాటకుడని వ్రాసి యూహమున నొక్క త్రుటిలో విడగొట్టిరి.

"నన్నయ పేరుకూడా అనాంధ్రమేను. నన్న అంటే అరవంలోను, కన్నడంలోను మంచి అని అర్థం. ఇది తెలుగులో లేనే లేదు. ఇతడు (నన్నయ్య) తమిళుడో, చాళుక్యుల ప్రధాననగరమైన కల్యాణపురప్రాంతాలనుంచి వచ్చిన కర్ణాటకుడో అయివుంటాడని వ్యక్తమవుతున్నది" (పల్నాటి వీరచరిత్ర, ద్వితీయభూమిక, 1940.)

## నన్నయ్య భారతభాగము - ఛందస్సు

నన్నయరచితభారతభాగమున నీక్రింద వివరించినరీతి గద్య పద్యములు గలవు—

| పర్వము | ఆశ్వాస సంఖ్య | గద్యపద్యసంఖ్య |
|---|---|---|
| 1. ఆదిపర్వము | 8 ఆశ్వాసములు | 2091 |
| 2. సభాపర్వము | 2 ,, | 618 |
| 3. అరణ్యపర్వము | 4 ఆశ్వాసములు<br>142 పద్యము | 1300 |
| | | 4009 |

వైవానిలో నాశ్వాసాంతగద్యలు 13 ను, ప్రక్షిప్తములు 12 గద్యపద్యములును, కృత్యాదిసంస్కృతశ్లోకము పోగా మిగిలినవి—

4009—26 = 3983.

| | |
|---|---|
| ఇందులో పద్యములు | 2487 |
| గద్యములు | 1496 |
| | 3983 |

పద్యములలో సాంస్కృతికములు—అక్షరచ్ఛందస్సులు—వృత్తములు.

| | |
|---|---|
| శార్దూలము | 18 |
| మత్తేభము | 61 |
| ఉత్పలము | 184 |
| చంపకము | 240 |
| మత్తకోకిల | 26 |
| తరల | 25 |
| స్రగ్ధర | 1 |
| మహాస్రగ్ధర | 2 |
| మానిని | 2 |
| కవిరాజవిరాజితము | 2 |
| మాలిని | 7 |
| పృథ్వి | 5 |
| వసంతతిలకము | 3 |
| స్వాగతము | 2 |
| తోటకము | 1 |
| పద్మకము | 1 |
| ద్రుతవిలంబితము | 1 |
| వనమయూరము | 1 |
| అంబురుహము | 1 |
| రథోద్ధతము | 1 |
| మణిభూషణము | 1 |

| | |
|---|---|
| లయగ్రాహి | 3 |
| దండకము | 1 |
| | 589 |

దేశిఛందస్సు—మాత్రాచ్ఛందస్సు—జాతులుపజాతులు.

| | |
|---|---|
| కందములు | 1219 |
| ఆటవెలదులు | 195 |
| ఉత్సాహ | 4 |
| మధ్యాక్కరలు | 39 |
| సీసములు | 251 |
| తేటగీతి | 177 |
| తరువోజ | 12 |
| మధురాక్కర | 1 |
| | 1898 |
| | 1898 |
| | 589 |
| పద్యములు | 2487 |

సూచిక : నన్నయ వ్రాసిన వృత్తములలో చంపకములు హెచ్చు. జాతులలో కందములు హెచ్చు.

## —గద్యములు

నన్నయవచనభాగములలో నొక విశేషము కలదు. 'పద్యభాగవద్వృత్తగంధి' అను వామనుని సూత్రవృత్తి ననుసరించి నన్నయ వచనము ప్రారంభించుపట్టుల పద్యమువలెనే నడిపించును.

ఆదిపర్వము—

1—88. వ. అని యడిగి వాని యనుమతంబున సోమశ్రవసు.

ఇది

క. అని యడిగి వానియనుమత
మున సోమశ్రవసు......

అని కందపద్యపాదములుగా నగును.

2—82 వ. ఇట్టి మహోత్పాతంబులు పుట్టిన సురపతి...

ఇది

క. ఇట్టి మహోత్పాతంబులు
పుట్టిన సురపతి......

అని కందపద్యపాదములుగా నగును.

4—14 వ. ఇట్లు పెక్కు మృగంబుల నెగచి చంపెడు వేడుక.

ఇది—

తే. గీ. ఇట్లు పెక్కు మృగంబుల నెగచి చంపె...

అను గీతపద్యపాదము.

5—61 వ. అని నిశ్చయించి గొంతిని మాద్రినిం జూచి మీర లిందుండి నవయక హస్తిపురంబునకుం జని.

ఇది

సీ. అని నిశ్చయించి గొంతిని మాద్రినిం జూచి
మీర లిందుండి నవయక హస్తి...

అను సీసపద్యపాదము.

సాధారణముగ వాక్యప్రారంభమున వచనములు సీసపద్యపాదములుగానే వ్రాసినాడు.

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నట్లు జనమేజయుండు.

అక్కథకుడు శౌనకాదిమహామునులకు జెప్పె నట్లు జన.
(ఆది. తృతీయాశ్వాసము)

అక్కథకుడు శౌనకాదిమహామునులకు జెప్పె నట్లు యయాతికిని
(ఆది. చతుర్థ)

ఇట్లే ప్రతియాశ్వాసాది నన్నయ దీనిని గమనింపక ద్వితీయాశ్వాసప్రారంభమున—"అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నాదియుగంబునం." అని ముద్రించిప్రకటించుటవలన—క. ఫ. గ. 'నట్లాదియుగమునం' అని పాఠభేదము చూపబడినది. పాఠభేదమే మూలమున నన్నయయొద్ద ఇది 'అక్కథకుడు శౌనకాదిమహామునులకు జెప్పిన ట్లాదియుగము...న.' అని సీసపద్యపాదముగానే యుండి నన్నయ కవితాలక్షణమునకు సరిపోవును. మఱియు నన్నయ భారత భాగముద్రాపరిష్కరణమున కిది యొక ముఖ్యసూత్రము. నేడు మనము నన్నయభారతము నన్నయ్యవాటి వ్రాతప్రతిగాక మనకు నేటి కల వడిన వ్రాతప్రతుల గదా ముద్రించుచున్నాము. అరసున్నలు ప్రాచీన కాలమున లేక పోయినను నేడు వానిని పూర్వగ్రంథములయందు నియతముగా చూపించుచున్నాము. నేడు గద్యపద్యములయందు వీనిని పాటించుచున్నాము. కాని నన్నయ భారతములో పద్యములయం దీనియమము పాటించి గద్యముల పాటింపలేదు. ఉదా :

"అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నాదియుగంబునం......కశ్యపప్రజాపతి భార్యలైన కద్రువయు వినతయు ననువారలు పుత్త్రార్థినులై యనేకవర్షసహస్రంబులు కశ్యపు నారాధించిన కశ్యపుండును బ్రసన్నుండై మీకోరిన వరంబు లిచ్చెద వేడుం డనిన"—(ఆది 2-2)

పైవచనమున 'వేడుం'లో నరసున్న యుంచి తక్కుంగల చోట్ల నిండుసున్న లుంచి ముద్రించుట సరికాదు. వేడులోవలె, 'కథకుడు, కశ్యపుడును బ్రసన్నుడై, వేడుడనిన' అని ముద్రింప దగును. మఱియును పూర్ణబిందురూపములతో నున్న వర్షసహస్రంబులు వరంబులు మొదలగునవి వర్షములు, వరములు అని ముద్రితము కావలెను.

పద్యములలో ఛందోభంగ మగును గాన నచ్చట సందేహములేనిచోట్ల పూర్ణబిందువు నుంచి ముద్రింపకతప్పదు. కాని గద్యములలో నట్టిది పరిపాటింప నక్కఱలేదుగదా! ఇంతకును మనము నన్నయనాటి లిపిరీతిని, నుచ్చారణరీతిని ముద్రించిన నిట్టి సందేహముల కేమియు లేక నే యుండును. నవీనపద్ధతులలో ముద్రితమైనప్పుడా క్రమమే యనుసరింపవలయునుగదా. నన్నయభారతము పూర్ణపరిష్కరణ నపేక్షించుచున్నదని తెలుపుట కిది వివరింపబడెనది.

## అక్షరచ్ఛందస్సు - వృత్తములు

నన్నయనాటికిని నేటికిని వృత్తముల యతిస్థానములలో భేదములు గానవచ్చుచున్నవి. వాని నీక్రింది వివరించుచున్నాడను.

1. పృథ్వీవృత్తము—ఆది: 2-166 IUI జ, IIU స, IUI జ, IIU స, IUU య, IU వ-12 యతి.

"అమిత్రమదభేది యొక్కరు డయత్నభృగాన్వయ
ధ్రీమాపలితచిత్తుడై."

ఇందు యతి 12 వ యక్షరము. సంస్కృతమున యతి 9 (వసుగ్రహయతిశ్చ పృథ్వీ).

నన్నయవెనుక శ్రీనాథుడు-పెద్దన సంస్కృతయతినియమమును పాటించిరి.

కవిజనాశ్రయ, కావ్యాలంకారచూడామణి, అనంతచ్ఛందస్సులలో 12 అక్షరము యతి. కవిచింతామణిలో 13 యతి.

నన్నయ సంస్కృతయతిని మార్చుట పృథ్వీవృత్తము 'మధ్యాక్కర' అను దేశివృత్తముతో సమానము చేయుటకని తెలియదగినది.

2. మానిని (UII భ-7భకారములు UX-1 గకారము.) 13 యతి. (ఆది. 4-20)

"ఏచితనర్చి తలిర్చిన కోపుల-నిమ్మగు తావుల తోంపములన్
పూచిన మంచి యశోకములన్"—(13 యతి.)

ఇందు యతి యొక్క చోటనే పాటింపబడినది. ఇది వృషభగతిరగడతో సరిచేయుటకు చేసినది. లాక్షణికులు కవిజనాశ్రయము నుండియు 3 యతులు చేర్కొనిరి.

"కారకముల్ క్రియ గన్గొన నేడు భ
కారము లొక్క గకారముతో
గారవమై చన నా యతి పంద్రెట
గల్గిన మానిని కామనిభా."

అనంతుడు—
"క్రొన్నెలపువ్వను గోలపాగయు
గూర్చిన కంజపకోప్పునకున్
మన్నెయొనర్చిన నాహిని యీతని
నామపదంబున వ్రాలె నవన్."

నన్నెచోడకవి కుమారసంభవమున నొక్క యతియే వాడినాడు—(7-840 ప్రథమభాగము)

"మానినిరూపచరిత్రలు దాకస-మంబగుచున్నవి చిత్రగతిన్."

తిక్కన నన్నయమతము ననుసరించి యొకయతిని, మతాంతరము ననుసరించి యతిత్రయమును పాటించినాడు.

1. జూదము నప్పుడు సర్వజనంబులు - చూచి భయంపడి యుప్పనియు.

2. కూతయు గాంతియుసర్వగ దేజము నుండకవహ్నులు గ్రూరశిఖా.

భారతమున మానినివృత్తమునకు రెండు తెఱగుల యతి యుండగా నప్పకవి యొక్కయతినే విధించుట సరికాదు. (పు. 2'8)

"రాజిలు సప్తకములగు విశ్వలి-రామను మానినియందు భర"

3. కవిరాజవిరాజితము (III న. IUI జ (6 గణములు) IU వ - 14 యతి.)

"చనిచని ముందట సాజ్యహవిర్ధృత - సౌరభధూమలతా
తతులన్" (ఆది. 4-21)

ఇచట పాదమున నొక్క యతిమాత్రమే. లాక్షణికు లందఱును పాదమునకు మూడుచోట్ల యతి (8-14-20) విధించినారు.

తిక్కన పైరెండు పద్ధతుల ననుసరించి కవిరాజవిరాజితమును వ్రాసియున్నాడు.

ఏకయతికి—

"అనయము లోలతమై విషయప్రచ - యంబను దుస్తరపంకమునన్
దనదొరకొల్పి క్రమంబున సంగము - క్రొవ్వున చెల్వను జారి..."
(స్త్రీపర్వము 1-65)

యతిత్రయమునకు—

"అనవృడు నిల్లను - నన్నరపాలన—
కాతడు మోక్షము - నర్థిజగ" (స్త్రీపర్వము, 1-51)

అప్పకవి మానినీవృత్తమున నొక్క యతి విధించి, కవిరాజవిరాజితమునకు మూడు యతులు విధించుట సరికాదు.

"కలయగ నొక్కన - కారము నాలుజ
కారములు న్వము - గాటముగా" (అప్ప. 249 పుట.)

పై రెండును వృషభగతిరగడకు సరిపోవును.

4. పద్మకము (III న, UII భ, IUI జ, IUI, జ, IUI, జ UX - 8 యతి)

"కొడుకుపలుక్క విని - కూడదు నాకదు రాత్మజుడై" (ఆది.)

తిక్కన—(మేదినీవృత్తము)

"వినుమిటు లేటికిం జనిన - వృత్తి మాది యుల్లన్."
(స్త్రీపర్వము శ్రీ. 152.)

పద్మకమునకు కావ్యాలంకారచూడామణి, అనంతచ్ఛందస్సు, అప్పకవీయము 11 అక్షరము యతి చెప్పుచున్నవి.

(నభజజాగగణయుక్తిని-నాకవివిరామక.)

తిక్కన పద్మకమునకు బదులు మేదినీవృత్తము నుపయోగించినాడు. పై రెండువృత్తములును అష్టిచ్ఛందమునుండి పుట్టినవి. యతిస్థానమొకటేగా లాక్షణికులు పేర్కొనిరి. పద్మకమునకు నన్నయభట్టుపద్యమును లాక్షణికులు, వందులో నప్పకవి చూచియు, తనకు ముందువారి ననుసరించి 11-వ యక్షరము యతి చెప్పెనని యూహింపదగును.

### జా త్యు ప జా తు లు

సీసములు:-నన్నయసీసములు 251 లో

| | |
|---|---|
| ఆటవెలదులు గలవి— | 224 |
| తేటగీతులు గలవి— | 27 |
| | 251 |

నన్నయకు బూర్వమున గల చాళుక్యగుణగవిజయాదిత్యుని శాసనమున, నాతనికి కొంచెము వెనుక సోమలదేవి దీర్ఘాసిశాసనముల సీసముల కాటవెలదియే కలదు. నన్నయయే తొలుత తేటగీతులను సీసముల కతికించెనని చెప్పవలయు. ప్రాచీనములగు కవిజనాశ్రయ కావ్యాలంకారచూడామణులలో ఆటవెలదియు, తేటగీతియు కూడ చెప్పుటయే దీనికి ప్రమాణము. క్రీ. శ. 1132 నిడుప్రోలుశాసనమున సీసమునకు గీతపద్యము కలదు.

కావున నన్నయ ననుసరించి లాక్షణికులు రెండింటిని (ఆటవెలది, తేటగీతులను) సీసమునకు విధించిరి. సీసము ప్రాచీనకాలమున నాలుగులుగానే వ్రాసెడివారు. అనగా నేటివలె 8 పాదములు లేవు. ఆటవెలది మాత్రాచ్ఛందస్సులోనిది. దేశినుండి యుత్పన్నమైనది. సీసపద్యపాదమునకు నాటవెలది 2 పాదములకు నొండు రెండు లఘువులహెచ్చుతగ్గుగా సమత్వమే కలదు, నన్నయ సంస్కృతచ్ఛందస్సునకు సంబంధించిన గీతి గీతికలను నాటవెలదికి బదులుగ నుపయోగించెను. గీతి, గీతికనుండి గీది గీదియు అను తద్భవము లేర్పడినవి. ఇవి 4 పాదములుగ వ్రాయవలె నని కవిజనాశ్రయకారుడు నిరూపించినాడు.

శ్రీదయితాధిపాన
మోదయునలినస్త్రి
మోదితమై యొత్తు
గీదియ యొప్పు గృతుల.

తొలుత నాలుపాదములే సీసపద్యమున నున్నను, ఎత్తుగీతి నాలుగుపాదములుగా వ్రాయుట నియమితమగుటచేత, గీతములు సీసములకు సీసములు చేర్చునప్పుడు హైలక్షణము ననుసరించి, చేర్చి, సీసమున నాలుగు పాదముల కెత్తి పెట్టుటచే నెత్తుగీతి యయ్యె నని యూహింపదగును.

### 1. సీ స ము ల ప్ర స్తా ర ము

1. సీ. యతి / గీ. యతి
2. సీ. యతి / గీ. ప్రాస
3. యతి / గీ. య.ప్రా
4. సీ. యతి / గీ. ప్రా.య.
5. సీ. ప్రాస / గీ. యతి
6. సీ. ప్రాస / గీ. ప్రాస
7. సీ. ప్రాస / గీ. య.ప్రా
8. ప్రాస / గీ. ప్రా.య
9. సీ. య.ప్రా / గీ. యతి
10. య.ప్రా / గీ. ప్రాస
11. సీ. య.ప్రా / గీ. య.ప్రా
12. సీ. య.ప్రా / గీ. ప్రా.య
13. సీ. ప్రా.య / గీ. యతి
14. సీ. ప్రా.య / గీ. ప్రాస
15. సీ. ప్రా.య / గీ. య.ప్రా
16. ప్రా.య / గీ. ప్రా.య

ఇందు 12, 14, 15 సంఖ్యగల సీసభేదములు లేవు. తక్కినవి_

(1) (158) ఆది 1-27 మొ. (2) 3 (ఆది 2-21 మొ), (3) 2 (ఆది 82 - అర 4-344), (4) (3) సభా 1-46, 187, (5) 8 (ఆది 1-33 మొ) (6) 33 (ఆది 1-7) (7) (1) ఆది 8-115 (8) (4) ఆది 3-3-115 మొదలు (9) 16. (ఆది 1-80 మొ) (10) 5 ఆది 2-14 (11) 1 (ఆది 1-191) (13) 21 (ఆది 3-50) (16) 2. అరణ్య 2-26, 94 మొత్తము 251.

ఇట్లే గీతములలో సర్వయతిసీసములు - యతిప్రాసనియమములు కలవు.

అరణ్య. (2-156) (4-119) ఇవి వ్రాతప్రతులలో చూడవలెను. (1-49) సభా 2-242.

సీసములు. అరణ్య. (2-230) అరణ్య (3-162) ఇవియును వ్రాతప్రతులలో చూడదగినవి.

సమున్నత - ఆది. (3-159) నిరర్థక (ఆది-8-31) నిరాగసుండై (1-184) (సభా) ఇవియును వ్రాతప్రతులలో చూడవలెను.

నిత్యసమాసవిశ్రాంతులు—

నారాయణ (ఆది 2-22) విశ్వామిత్ర (ఆది 4-35; 7-94) సాంబు (అర. 1-159) ద్వార (ఆది 6-302) స. 1-175, ఏకాంత (ఆది 8-74) (సాంగ) ఆది 4-167.

ఈ సమాసములలో వ్యంజనమునకేగాని స్వరమునకు వడి పాటించలేదు. నారాయణ అనే శబ్దము మాత్రము "పాయకపాకశాసనికి" (ఆది 1-24) లో స్వరమునకు 2వ చరణములోను, వ్యంజనమునకు మూడవచరణములోను వడి నిలిచేటట్లు ఉపయుక్తమై యున్నది. అయితే కొన్ని ప్రతులలో ఈ పద్యమే కనబడలేదు. అది కనబడ్డ ప్రతులలో పాసను అనుటకు మారుగా పావన, పాణప అనే శబ్దము కనబడుచున్నది. ఈ పద్యము నన్నయరచించినది కాదని కొందరంటూయున్నారు.

నన్నయభారతమందలి ఛందోవిషయములు :—

తెలుగున సంస్కృతవృత్తపరిణామ మెఱుంగుటకు నన్నయ భారతభాగము చాల ముఖ్యమైనది. నన్నయకు మున్నాగా కన్నడమున సంస్కృతవృత్తప్రచార మధికముగ నుండుటయు, సవర్ణయతి నిర్బంధము లేకుండుటచే, కన్నడమున వ్యాప్తియగు సంస్కృతవృత్తములను తెలుగుకవులు తెలుగుభాషకు సహజమగు యతినియమము

నేర్చుకొని గ్రహించుటలో వింతలేదు. అయిన నన్నయకు మున్నుగా పద్యమయశాసనములయందు గూడ సంస్కృతవృత్తములు లేకుండుటయు, నన్నయ వెనుక కొంతకాలమునకే, అనగా క్రీ. శ. 1130 కే సంస్కృతవృత్తములు ప్రచారములోనికి వచ్చుటయు చూడగా నన్నయ కన్నడమునుండి యీ సంస్కృతవృత్తసంప్రదాయమును గ్రహించియుండవచ్చునని తోచుచున్నది. సంస్కృతమున ప్రసిద్ధములగు (1) పృథ్వీ (2) శిఖరిణీ (3) శార్దూలవిక్రీడితము (4) పంచచామరము (5) స్రగ్ధర (6) మాలిని (7) తరళ (8) క్రౌంచపదము ఇవి కన్నడమున, తెలుగున నొకేనామములతో నున్నవి. తెలుగులో—

| | | |
|---|---|---|
| (1) అంబురుహవృత్తమునకు | కన్నడమున | నాగరంజిత |
| (2) మత్తకోకిలకు | ,, | మల్లికామాల |
| (3) మానినికి | ,, | వనమంజరి |
| (4) కవిరాజవిరాజితమునకు | ,, | హంసగతి |

అని వేఱునామము లొప్పుచున్నవి. కన్నడకవిత్వము వెనుకనే తెనుగుకవిత్వము వెలసినది గనుక, ఈ సంస్కృతవృత్తములను కన్నడమునుండి గ్రహించునపుడు, నన్నయ కొన్నింటికి సంస్కృతమున నున్న పూర్వరూపములనే వాడియుండెననియు, నతడే లక్ష్యగ్రంథమైనప్పుడు తెలుగుఛందస్సులలో నిట్టి ప్రయుక్తమయ్యెననియు మాహింపదగును. సంస్కృతమునందలి యతిస్థానములనుగూడ నన్నయ మార్పుచేయుటయు నీవిషయము ధ్రువపఱచుచున్నది. ప్రాచీనసంస్కృతకవులచే నప్రయుక్తముగాక, దాక్షిణాత్యులగు కవులచేత ప్రయుక్తమైన మత్తేభచంపకోత్పలమాలికావృత్తములను కన్నడమునుండియే తెలుగువారు గ్రహించిరనుట నిర్వివాదాంశము. ఈ సంస్కృతవృత్తములు కన్నడమున సాహిత్యవిషయమున నన్నయకు నాదర్శమైన పంపభారతమున నెట్లు ప్రయుక్తములైనవియు గమనించిన నీవిషయ మింకను స్పష్టపడగలదు.

| పంపభారతము, సంస్కృత వృత్తములు, | | నన్నయ భారతము సంస్కృత వృత్తములు. | |
|---|---|---|---|
| శార్దూల విక్రీడిత | 17 | శార్దూలవిక్రీడిత | 18 |
| మత్తేభము | 204 | మత్తేభము | 61 |
| ఉత్పలము | 140 | ఉత్పలము | 184 |
| చంపకమాల | 409 | చంపకము | 240 |
| మల్లికామాల | 8 | మత్తకోకిల | 26 |
| తరళ | 8 | తరళ | 25 |
| స్రగ్ధర | | స్రగ్ధర | 1 |
| మహాస్రగ్ధర | 7 | మహాస్రగ్ధర | 2 |
| పృథ్వీ | 7 | పృథ్వీ | 5 |
| మాలిని | 2 | మాలిని | 7 |
| ద్రుతవిలంబిత | 1 | ద్రుతవిలంబిత | 1 |
| ఇంకను హరిణప్లుత, ఖచరప్లుత, హరిణీ, శిఖరిణీ, మందాక్రాంత వృత్తములు ప్రయుక్తములు. | | కవిరాజవిరాజిత, వసంతతిలక, స్వాగత, తోటక, పద్మక, వనమయూర, అంబురుహ, రథోద్ధత, మణిభూషణ, లయగ్రాహి దండకము లిందు ప్రయుక్తములు. | |

## జాత్యుపజాతులు - మాత్రాఛ్ఛందస్సులు

| | | | |
|---|---|---|---|
| కందము | | కందము | 1219 |
| ఉత్సాహ | 1 | ఉత్సాహ | 4 |
| పిరియక్కర | 9 | మధ్యాక్కర (నొరియక్కర) (కన్నడమున) | 39 |
| అక్కర | 2 | మధురాక్కర | |
| | | నడుమనక్కర | 1 |
| రగళె | 3 | నన్నయలో రగళలు లేవు. | |

నన్నయలో ఆటవెలదులు 195, సీసములు 251, తేటగీతులు 177, తరువోజలు 12 కలవు.

పై పట్టికను చూచిన నన్నయయే కేళివృత్తములను హెచ్చుగా వాడినాడు. కాని పంపకవియు, నన్నయయు కందములను, చంపకములను అన్నింటికన్న హెచ్చుగా వాడియుండుట చూడ నన్నయ పంపభారతమునే వృత్తముల విషయమున ననుసరించెనని చెప్పనగును.

యతులు—నన్నయకాలములో 6 విధములగు యతులు మాత్రమే కలవు.

(1) స్వర (2) వర్గ (3) సంయుక్త (4) పరస (5) వికల్ప (6) మువిధక్రియతులు గలవు.

తక్కిన ప్రాది, బిందు, ప్లుత, శకంధ్వాదిగణఅఖండయతులు మున్నగునవి నన్నయలో లేవు. తరువాతిలాక్షణికులు, అప్పకవి ముఖ్యముగా నన్నయకూడ నిట్టి యతులు పాటించెనని పాఠములను మార్చియున్నాడు. నన్నయ యుపయోగించిన యతులును, ప్రాసలును నన్నయకాలమునాటి శబ్దస్వరూపమును, నుచ్చారణవిధానమును, లిపివిశేషములను ఎఱింగించును.

(1) సంయుక్తయతులు — నన్నయలో నీకాలమున నేకాక్షరములుగ పరిగణింపబడు క్ష-జ్ఞ అనువానిలో క్షకారమునకు గకారముతోడనే తప్ప యతి యుండదు, జ్ఞలో-జకారమునకే తప్ప యతి యుండదు. నేడు వీని యుచ్చారణ ననుసరించి, కవర్గచవర్గముల తోడను, జ్ఞకు కాతోడను యతి కూర్చిరి.

(2) 'లక్ష్మి' మొదలగు మూడువర్ణములలో నే హల్లుతో చివర పలుకునపుడు స్వరము భాసించునో, నన్నయ యా హల్లునకే యతి గూర్చును.

"లక్ష్మి మహనీయసౌఖ్యముల మేలుగ,
లక్ష్మియుతు డుత్తముండు జనమేజయ"

(3) సంయుక్తములలో క్రిందివర్ణమే ప్రధానముగాన యతి క్రిందివర్ణముతో గూర్చును.

(క్షితి......దేవ) (నక్షత్ర...జోత)



సహచరులు

చిత్రకారుడు : శ్రీ మొక్కపాటి కృష్ణమూర్తి



చింతన
చిత్రకారుడు : శ్రీ మొక్కపాటి కృష్ణమూర్తి

(4) కృతి, ధృతి మొదలగు ఋకారసంయుక్తములగు పదములకు ఇ, ఈ, ఎ, ఏల హల్లుతోడనేగాని, ఋకార మచ్చుగా పరిగణించి, ఇ, ఈ, ఎ, ఏలతో నన్నయ యతి కూర్పడు. 'హ'తో గూడినపుడుమాత్రమే ఇ, ఈ, ఎ, ఏలతో యతి కూర్చును.

"కృతకార్య...లకిల్బిష-కృతియుతుడై...దీపుడు."

అంతియేకాని

"కృష్ణు డింత...లేనిపనులు" అనురీతి నుండవు.

నాహృదయము...నెంతయు (నిక్కమలాక్షి)

(5) రేఫతో గూడిన, అనగా క్రారవడితో గూడిన సంయుక్తములలో పైహల్లునకే ప్రాధాన్యము. ఇందు రకారము సంయుక్తాక్షరమున క్రిందిది.

"ద్రుపదపతి పురోహితుండు-భ్రాతృ...భా-"ఇచట రేఫతో యతి లేదు.

(6) రేఫసంయుక్తాక్షరమున విజాతివర్ణ మగు నప్పుడు తెలుగుభాషాలిపిసంప్రదాయము ననుసరించి క్రిందిహల్లునకే యతి. ధర్మ, కర్మ మున్నగు శబ్దములకు వలపలిగిలక యిచ్చిన ప్రాతవ్రాతలు ధర్మ, కర్మ అని యీరీతి నుండును. కావున క్రిందిహల్లు ప్రధానముగా నుచ్చారణలో నుండును గాన నీయతి పాటింపబడినది. ఆవెనుక వ్రాతల-కర్ణాటాంధ్రలిపులు వేరైనవెనుక ధర్మ, కర్మ అని వ్రాయబడుటచే, రకారమునకు ప్రాధాన్యము గలుగుటచే రకారమునకు యతిని గూర్చిరి. నన్నయలో నీప్రాచీనసంప్రదాయము నియతముగా పాటింపబడినది. ఈ నియమముకొఱకు నన్నయ పదములకు రూపాంతరములుకూడ గల్పించినాడు. మానుగ మున్నగు స్వార్థపదముల వాడినాడు.

"మహో,ర్వీనుత పర్వయాగముడివింపుము

ర్వీనుప........వింపుము."

ఇచట ఉడిగించుధాతువునకు ఉడివించు రూపాంతరము గావించినాడు.

ఏకతరయతులలో మ, ర, ఱ, వలలో వానిలో వానికే గాని వేఱొండింటితో యతి లేదు. కావున నన్నయ ప, వ, బ, వ యతులు, ర ఱ యతులు, మ, వ యతులు నెంతమాత్రము వాడలేదు.

ము విభక్తియతులు—విభక్తి పరమగు ము తప్ప శబ్దగతమగు ముతో యతి లేదు. "భూపతీశ్వరదీన నీకులముగ. మహీప్రజ".

ఇచట 'ము' విభక్తిపరము. కులము, కులంబు అని ప్రాచీనరూపములు కావున మా యతి పరిపడినది.

'భూపతీశ్వరదీననీమునిముఖ్య' అనుచో యతి లేదు. ఇచట ము శబ్దగతము. 'బు' గా మాఱినది.

ఉపసర్గ నిత్యసమాసయతులు మున్నగువానిలో హల్లునకేగాని అచ్చునకు యతులు లేవు.

ప్ర-తీక్షించుచునుండె నంత-దితి; కామసుఖ...వే-కాంత గృహము.

నన్నయయకు లింకను వ్రాతప్రతులనుబట్టి కొన్నిచోటుల పరిశీలింపదగియున్నది. శాస్త్రీయపద్ధతిని పరిశీలన జరిగిన తప్పక నన్నయ నియమము తేటపడును.

నన్నయలో పూర్ణార్ధబిందుప్రాసము - అనగా 'మూండు' మొదలగు తెలుగుశబ్దములతో, బ్రహ్మాండ మొదలగు సంస్కృతశబ్దములతో ప్రాసవేయుట లేదు. పూర్ణబిందువులైననన్నియు సంస్కృతపదములుగాని, యర్ధబిందువులు (అరసున్నలు)గా మాఱని తెలుగుపదములుగాని యాతడు ప్రాసలు కూర్చును. కావున ఖండా, ఖండప్రాసము నన్నయలో లేదు.

వాండి, నేండు, పోండి, రాండు—ఇవి వాఁడి, నేఁడు, పోఁడి,రాఁడుగా నేడుమాఱినవి. అట్టిప్రాసలే నన్నయలో నుండును. వాఁడి-తోఁకదు మొదలగు నిర్బిందుకశబ్దప్రాస యుండదు. ఇది నన్నయ చేసిన యొకశబ్దసంస్కార మని చెప్పనొప్పును. నన్నయ సమకాలికముగనో, కొంచెము వెనుకనో ఇట్టివి వెలయుచుండుటచే నిది ప్రాచీనసంప్రదాయమని చెప్పనొప్పును.

ప్రాసయందును నన్నయ వలపలగిలకసంప్రదాయముసే పాటించినాడు. దుర్ణయమున శకుని కర్ణదుశ్శాసనుల్—ఇట్టివి. దుర్న్ణయమున శకునికర్న్ణ దుశ్శాసనులనియే ప్రాచీనలిపిలో నుండును. ఇవి సంస్కృతశబ్దములైనను తెలుగువారి యుచ్చారణసంప్రదాయమునుబట్టి, లిపినిబట్టి నన్నయ ప్రయోగించినాడు.

అయిన నిచ్చట నొక విశేషము గలదు.

కర్ణుండు...ఆ కర్ణ...పూర్ణ...వి స్తీర్ణ...వీనిని

కర్న్ణుండుగ... ఆ

కర్న్ణంత... రా

పూర్న్ణ... వి

స్తీర్న్ణ...

అని యిట్లన్నియును వట్టి రకారణనకార సంయుక్తములనే ప్రయోగించునుగాని, కేవల ముచ్చారణము ననుసరించి ఈ 'న్న'కారమునకు శబ్దసిద్ధమైన సన్నాహము, ఔన్నత్యమున్నగు ద్విత్వనకారములతో నన్నయ యతి గూర్పడు. నన్నయతరువాతి కైవకవులు కర్మ, ధర్మ మొదలగు శబ్దములు నిత్యమ్ము—తమ్ము మొదలగు తెలుగులో మార్పరాని ద్విత్వ మకారశబ్దములతో ప్రాసగూర్చిరి.

"కర్మక్షయంబుగామిని

నిర్మలమోక్షంబు...పకుప్రా

తమ్ముల......

నిర్మింతు......(శివతత్త్వసారము. 321)

"నమ్మిన భక్తుడు - బన్మయు - లోకమ్ము - ధర్మమ్ము."

(444 పద్యము)

తిక్కన, కేతన, రంగనాథుడు మొదలగు కవు లీప్రాసమును వాడిరి. దీనిని జైనకవులు, నన్నెచోడ, మల్లికార్జునపండిత, పాల్కురికి సోమనలు వాడిరిగావున నిది కర్ణాటభాషాసంప్రదాయమున 'శాంతి' ప్రాసమని యాభాషాచ్ఛందోలక్షణము ననుసరించి తెలుపబడినది. (శివతత్త్వసార, బసవపురాణటీకలు). కాని యిది కన్నడమునుండి తెలుగువారు ప్రత్యేకముగ గ్రహింపనక్కరలేదు. లిపిభేదములేని నన్నయకాలమున నిట్టి సంప్రదాయము తెలుగు కన్నడ భాషాసంప్రదాయము ప్రకారము సిద్ధించుచుండగా, నన్నయకు కొంచెము వెనుకనుండి యీప్రాస తెలుగున వెలయుచుండగా, నన్నయయే తనకాలమున వెలసియున్న యీ ప్రాసములో సంస్కృతదేశ్యశబ్ద విచక్షణ గావించి తా నుపయోగించెనని చెప్పుట సమంజసమై యున్నది. కాగా నన్నయ కావించిన శబ్దసంస్కారములలో నిది యొకటి యని చెప్పనొప్పును.

## వ్యాకరణము

పైవిషయములను పరిశీలించిన నన్నయ ఛందస్సునందు రచనాసౌందర్యమునకును కావించిన శబ్దసంస్కారము తరువాతి కవులును, లాక్షణికులును వ్యాకరణపరముగా నన్వయించి, శబ్దశాసను డనునది నన్నయకు బిరుదమనియు, నన్నయ యాంధ్రశబ్దచింతామణి యని సంస్కృతవ్యాకరణము రచియించె ననియు, నందుల కాతడు శబ్దశాసను డయ్యెననియు, భారతమున తాను శబ్దశాసను డని చెప్పుకొనుటచే, నన్నయవ్యాకరణరచనకర్తృత్వము నిజమే ననియు, యుక్తులపై యుక్తులను పన్ని, నన్నయచింతామణికర్తృత్వ మాంధ్రవ్యాకరణసౌధమునకు పునాదిగా నిలువ బెట్టినారు. శబ్దశాసనబిరుదము నన్నయకు లేదనియు, దానిని తరువాతివా రాతని కారోపించినా రనియు నీక్రింది యుపపత్తులవలన నిశ్శంకముగ జెప్పనొప్పును.

(1) నన్నయ వ్యాకరణరచనము జేసినవాడైన, అనగా 'అనుశాసనము' చేసినవాడైన శబ్దానుశాసనుడు కావలయును. ఆతని వ్యాకరణ 'మాంధ్రశబ్దానుశాసనము' కావలయును. చూడుడు కర్ణాటశబ్దానుశాసనము. నన్నయ 'శబ్దశాసనుడు' మాత్రమే, అనగా శబ్దముల స్వరూపము, నిష్పత్తి మొదలగువానిని గూర్చి శిక్షణ యొసంగు నాచార్యుడుమాత్రమే (శస్—*to instruct*). ఈశాసనునకు, ననగా నాచార్యునికి 'శాస్తి' అని రూపాంతరముకూడ ప్రాచీనకాలమున వెలయుచుండెను. ఇట్లే 'ఘటశాస్తి'. ఘటికాశాసనుడు విద్యాస్థానము దుండెడి యాచార్యుడు. శాసనుడు, అనుశాసనుడు వేఱువే ఱర్థములు గలవి. కావున శాసను డగు నన్నయ అనుశాసనుడగు నాంధ్రశబ్దచింతామణికర్త కాడు.

(2) శబ్దశాసను డనునది నన్నయ యొక్క బిరుదముగా జెప్పకొనలేదు. జపహోమతత్పరు, సంహితాభ్యాసు, నానాపురాణవిజ్ఞాననిరతు, నాపస్తంబసూత్రు, నుభయభాషాకావ్యశోభితు అని తనకు విశేషణములుగా జెప్పకొనియున్నాడు. వీని మధ్య శబ్దశాసను డనునది యొక విశేషణమే. శబ్దశాసను డనునది బిరుదమే యని యంగీకరించిన, తిక్కనకు కూడ బిరుదములేదా యను శంక గలుగకమానదు. మత్యమరాధిపాచార్య—సుజను—నన్నపార్య ఇవి యన్నియు నట్టి యొడల బిరుదములుగానే యంగీకరింపవలసివచ్చునుగదా ? కావున శబ్దశాసను డనునది నన్నయ బిరుదముగా చెప్పకొనలేదు.

(3) కవులు తమ బిరుదములను గ్రంథాంతగద్యలయందు తెల్పుకొను సంప్రదాయము కన్నడమున, తెలుగున చిరకాలము నుండి కలదు. నన్నయకు ముందు వెలసిన కన్నడకవులలోను, నన్నయకు వెనుక తెనుగున వెలసిన తెలుగుకవులలోను నీసంప్రదాయము నియతముగా పాటింపబడుచు వచ్చినది. బిరుదములు గద్యములలో తెలుపుకొను విశిష్టసంప్రదాయము కన్నడమున వెలసినట్లును, తెలుగు కవులు వారినుండి గ్రహించినట్లును నీక్రింది వివరణమునుబట్టి గ్రహింపనగును.

నన్నయ్యకు ముందు వెలసిన కన్నడరత్నత్రయమునుండి—

పంపకవి (క్రీ. శ. 941)—ఈతడు తనకు గల బిరుదములలో 'కవితాగుణార్ణవ' అను బిరుదమును తన ఆదిపురాణ, విక్రమార్జున విజయములలో గద్యయందు చెప్పకొనినాడు.

(ఆదిపురాణము) "ఇదు దేవేంద్రమునీంద్రవంద్యపరమజినేంద్రముఖచంద్రవాక్చంద్రికాప్రసరప్రసాదోదీర్ణ, సూక్తికల్లోలమాలాకీర్ణ, కవితాగుణార్ణవప్రణీతమప్పాదిపురాణదోళ్."

(విక్రమార్జున విజయము) "ఇదు విదితబుధజనవినుతజినపదాంభోజవరప్రసాదోత్పన్న, ప్రసన్నగంభీర, వచనరచనచతుర, కవితాగుణార్ణవవిరచితమప్ప విక్రమార్జున విజయదోళ్."

పొన్నకవి—(క్రీ. శ. 950) ఈతనికి 'ఉభయకవిచక్రవర్తి' అని బిరుదము.

(శాంతిపురాణములో) "ఇదు జినేంద్రచరణసరసీరుహాశిలీముఖాయమాన శ్రీమదుభయకవిచక్రవర్తినిర్వర్తితముం....పొన్నమార్య కారితముమప్పపురాణచూడామణియొళ్."

రన్నకవి—(క్రీ. శ. 993) ఈతనికి కవిచక్రవర్తి, అభినవకవిచక్రవర్తి బిరుదములు కలవు.

(గదాయుద్ధమున) "ఇదు సమస్తభువనవల్లభ శ్రీమదాహవమల్లదేవ శ్రీపాదకల్పపాదపపదాశ్రయవర్తి కవిచక్రవర్తి కవిరన్న... శ్రీసాహసభీమవిజయదోళ్."

(అజితపురాణమున) "ఇదు సకలమునీంద్రబృందబృందారక... త్రయాలంకృత శ్రీమదభినవచక్రవర్తి కవిరన్ననిర్మిత...పురాణతిలకదోళ్."

నాగవర్మ (క్రీ. శ. 990) తన ఛందోంబుధిగద్యలో తనకు గల కవిరాజ కలహంసబిరుదమును చెప్పికొన్నాడు.

పంపమహాకవి విక్రమార్జునవిజయమును, పంపభారతమును నామాంతరముగ జదివి పెక్కుపట్టుల నాసంప్రదాయముల ననుసరించిన నన్నయభట్టారకుడు తన గద్యయందు, శబ్దశాసనుడు బిరుదమే యైనచో, దానిని తప్పక పేర్కొనియే యుండును. గద్యలుకూడ ప్రథమపురుషమం దుండుటచేతనేకదా, బిరుదము లెన్ని చెప్పుకొన్నను, గద్య యెంత పెద్దదిగ నున్నను, మనము కవి కాత్మస్తుతిదోషము గలుగకుండ, చారిత్రకముగకూడ వాని నంగీకరించుటకు కారణమైనది. ప్రథమపురుషలో 'మత్యమరాధిపాచార్యుడు' బిరుదమే యైన 'శబ్దశాసన'విశేషణమును గద్యలో నట్టిది యున్నచో నాసంప్రదాయము ననుసరించి పేర్కొనియే యుండును.

తెలుగులో నన్నెచోడుడు, తిక్కన, కేతన, శ్రీనాథాదిమహాకవు లందఱును తమ బిరుదములను గద్యలలో చెప్పుకొనిరి. శ్రీనాథుడు తన కవిసార్వభౌమబిరుదము గద్యలో చెప్పినకాని సార్థకము కాదను తలంపుననే దాని నంతకుముం దెంతకాలముక్రిందటనో సంపాదించియు చివరను కాశీఖండమున గద్యలో జేర్చినాడు. అల్లసానిపెద్దన 'ఆంధ్రకవితాపితామహ'బిరుదముతో మనుచరిత్రగద్య ప్రారంభించినాడు. తెలుగున కొందఱు కవు లాబిరుదములతోనే వ్యవహరింపబడుదురు. వారైన గద్యలలో నియతముగ చెప్పుకొనక తప్పదుగదా! అభినవదండి (కేతన), రాధామాధవ (చింతలపూడి యెల్లకవి), ఆంధ్రకాళిదాసు (ఆలూరికుప్పనకవి) మొదలగువా రిట్టివారే. ఇరువదియవ శతాబ్దమున కూడ నీ ప్రాచీనసంప్రదాయము జీవించియున్న దనుటకు, ప్రాచీనసంప్రదాయానుసారముగ వ్రాయబడిన పద్యకావ్యములయం దన్నింటను కన్పట్టుచునే యున్నది. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి (కవిసార్వభౌమ)గారి భారతమున నిట్టి సంప్రదాయము కలదు. కావున శబ్దశాసనుడనునది బిరుదమే కాదని సిద్ధాంతము.

నన్నయ కీబిరుద మున్నట్లు, నన్నయను పేర్కొన్న తిక్కన కేతనలు గాని, మంచనమారనలు గాని తెలుపలేదు. ఎఱ్ఱాప్రెగ్గడకూడ చెప్పలేదు. కొరవి గోపరాజు, మడికి సింగన, పోతన మొదలగువా రెవ్వరును నన్నయ కీబిరుదము కలదని చెప్పలేదు. కవిత్రయమువారికే నన్నయ కీబిరుద మున్నదని తెలియనప్పు డిక తక్కినవారలగూర్చి తెలుపనక్కఱలేదు. పైవారిలో తిక్కన, మారన, ఎఱ్ఱాప్రెగ్గడ, గోపరాజులు నన్నయనుగూర్చి ప్రత్యేకముగా నొకపద్యమును చెప్పినారు. నలుగురైదుగురు కవులనుగూర్చి చెప్పునప్పు డొక్కొకవేళ బిరుదమును తెల్పుటకు వీలులేకపోవచ్చును గాని ప్రత్యేకపద్యమే చెప్పునప్పు డట్టి సందేహమున కవకాశమే లేదు. తిక్కన 'ఆంధ్రకవిత్వవిశారదు' డనియు, 'విద్యాదయితుడు' 'మహితాత్ముడు' అనియు నన్నయనుగూర్చి చెప్పినాడు.

మారన 'ఆంధ్రకవితాగురుడు'గా నన్నయను పేర్కొన్నాడు. ఎఱ్ఱాప్రెగ్గడ నన్నయభట్టును కుంజరముతో బోల్చి, యాతని మాతంగగమనమును విశేషముగ బ్రశంసించినాడు. గోపరాజు "నా భావుకముని నన్నయభట్టుక" అని వ్రాసినాడు. వీరందఱిలో ముఖ్యు డెఱ్ఱాప్రెగ్గడ గదా! అరణ్యపర్వశేషము నన్నయ కవితారీతిరచన శోభించునట్లు రచించి, ఆశ్వాసాంతగద్యకూడ నన్నయపేర బెట్టిన గతమత్సరుడు, విశాలహృదయుడు నగు నెఱ్ఱాప్రెగడయే యెచ్చటను నన్నయను శబ్దశాసనుడని పేర్కొనకపోవుటయేకాక, ఆంధ్రకవితాసృష్టికి తిక్కన బ్రహ్మయని పేర్కొన్నాడు. దీనినిబట్టి ఎఱ్ఱాప్రెగడకాలమువఱకు క్రీ. శ. 1350 ప్రాంతమువఱకు నిట్టి సంవాదమే లేదనుట నిస్సంశయము. క్రీ. శ. 1400 ప్రాంతమున విలసిల్లిన కొలని గణపతిదేవకవి శివయోగసారావతారికలో స్పష్టముగా 'నాంధ్రకావ్యపథము దీర్చిన నన్నయభట్టుగారిని ప్రశంసించినాడుగాని శబ్దశాసను డని ప్రశంసింపలేదు. నన్నయప్రసిద్ధి కవిత్వరచనముచే గాని వ్యాకరణరచనముచేత కాదని యిది తెలుపుచున్నది.

ఈ శబ్దశాసనపదము జక్కన, శ్రీనాథుడు తొలుత నన్నయ గూర్చి ప్రస్తావించుటలో వాడినారు. జక్కన 'శబ్దశాసనవరేణ్యులు వాగ్బ్రశస్తి కెక్కిరి' అనియు, 'శబ్దశాసను నన్నపాచార్యవర్యు' అని శ్రీనాథుడును, నన్నయ తాను స్వయముగా వ్రాసికొనిన విశేషణమునే యుపయోగించిరి. అందును శ్రీనాథుడు నన్నయభాషను (సమాసము, కారకములు) సహితముగా నట్లే యనువదించెడువాడు. మఱియు తాను ప్రత్యేకముగ నన్నయనుగూర్చి వ్రాసిన పద్యములో నన్నయభట్టోపాధ్యాయు డనిమాత్రమే పేర్కొనినాడు. అనగా శ్రీనాథుని కాలమున నిది యొక బిరుదముగా కవివ్యవహారములో లేదు. ఆతరువాతి కవులుకూడ నన్నయనుగూర్చి చెప్పునప్పుడు శబ్దశాసనపదమునే యుపయోగించిరి. 'శబ్దశాసనకావ్యసంఘటనక్రమానందితబుధవర్యు నన్నపార్యు'నని ఆంధ్రకవి రామయ్య (విష్ణుకాంచీమాహాత్మ్యము). కాగా క్రీ. శ. 1500 ప్రాంతమువఱకు నన్నయ కిది బిరుదముగా కవు లెవ్వరును పేర్కొనరైరి. కాబట్టి బిరుదమే లేనప్పు డాబిరుదము వచ్చుటకు కారణభూతమగు గ్రంథమును రచించెనని చెప్పుట యాకాశహర్మ్యమువంటిది గదా!

క్రీ. శ. 1500 లకు తరువాత శ్రీకృష్ణదేవరాయని కాలమున గల కవులు నన్నయను పేర్కొన్నారుగాని బిరుదప్రస్తావనము లేనే లేదు. ఈకాలమువాడే యని చెప్పదగిన కాకమాని గంగాధరుడు అను కవి తన బాలభారతములో "శబ్దార్థరసవిశారదు, శాబ్దికమూర్ధన్యు, శబ్దశాసనకీరుదున్, శబ్దాయమానవిస్ఫురదబ్దఘటారభటీ నన్నపార్యు దలంతున్" అని పేర్కొనినాడు. ఈత డావఱకు గల కవిస్తుతులలోని విశేషణప్రయోగము బిరుదముగా భావించి యిట్లు స్తుతియించియుండును. లేక బిరుదు అనగా మొనగాడు, సమర్థుడు అని యర్థము చేసికొనవచ్చును.

ఇది నిశ్చితము గాలేదుగాని, యిందున్న శబ్దశాసనపదమును మాత్రము మనము జ్ఞప్తియం దుంచుకొనవలెను. ఇది నన్నయనుండి పరంపరాయాతముగ వచ్చుచున్న దనియు, నదియే బిరుదవాచకముగ

తరువాతి నొక సంప్రదాయ మేర్పడెననియు గ్రహింపనగును. ఇది ముందు చెప్పబోవు విషయమునకు జాల ముఖ్యమైనది.

క్రీ. శ. 1570 ప్రాంతమున రామరాజభూషణుడు వసుచరిత్ర రచించి శ్లేషలో "మహిమన్ వాగనుశాసనుండు సృజియింపన్ కుంభినీంద్రుడు ప్రోవన్ మహామహులై సోముడు భాస్కరుండు వెలయింపన్ సొంపు వాటిల్లు నీబహుళాంధ్రోక్తిమయప్రపంచమున" ప్రశంసించినాడు. వాగనుశాసను డను పేరు శబ్దశాసనుడుగా మారుటకు నిదియే మొదలు. ఇంతకుముందు నన్నయను శబ్దశాసను డనియే పేర్కొంటి రని చూపితిని. రామరాజభూషణుని వసుచరిత్రము తరువాతి ప్రబంధరచయితల కుపజీవ్యమై ఆదర్శప్రాయ మగుటచే నిదియే ప్రమాణముగ గొని వాగనుశాసనుడని వారు పేర్కొన జొచ్చిరి. అప్పటినుండి, యనగా క్రీ. శ. 1600 ప్రాంతములనుండి వాగనుశాసనుడనునది వాడుక యయ్యెను. అది యొక బిరుదముగా నన్నయ కారోపితమయ్యెను.

వాస్తవికస్థితి యిట్లు చారిత్రకముగ నిరూపిత మగుచుండ 'ఆంధ్రశబ్దచింతామణి' యను సంస్కృతభాషామయాంధ్రవ్యాకరణము వాగనుశాసనుడైన నన్నయభట్టవిరచితమనియు, వాగనుశాసన, శబ్దశాసనపదములు పర్యాయపదములే కావున భారతము రచించిన నన్నయభట్టే దీనిని రచియించె ననియు, నాంతరంగబహిరంగప్రమాణములచే నాంధ్రచింతామణి, భారతము లేకకర్తృకము లనియు నింకను కొందఱు విద్వాంసులు వాదించుచున్నారు.

ఆంతరంగికప్రమాణము లట్లుండగా; బహిరంగప్రమాణములచేతనే తొలుత నీ వాదము నిరస్తమగుచున్నది. వాఙ్మయప్రపంచముననే క్రీ. శ. 1570 ప్రాంతములవఱకు ముం దీ వాగనుశాసనపదమే లేదని విస్పష్టముగ నిరూపితమైనది. నన్నయ వాగనుశాసను డని పేర్కొనబడకపోవుటచేతను, నింతవఱకు వ్యాప్తిలో నున్న శబ్దశాసనపద మాంధ్రశబ్దచింతామణిలో లేకపోవుటచేతను, వాగనుశాసను డని నన్నయ పేర్కొనబడినతరువాతనే యీగ్రంథము పుట్టినదని నిస్సంశయముగ జెప్పనగును. మఱియు శబ్దశాసనవాగనుశాసనపదములు పర్యాయపదములే గనుక భారతమున నట్లు చెప్పకపోయినను, నన్నయచింతామణియందు చెప్పుకొనె నని యొక యుపపత్తి చెప్పుదురు. కాని యివి రెండును బిరుదములని వా రంగీకరించినప్పుడు, బిరుదములకు పర్యాయపదములు ప్రయోగింతురని వా రంగీకరించినచో నింక, వారికి తెలుగుభాషాసంప్రదాయమే తెలియదని చెప్పవలెను. బిరుదములు రూఢ మగుటచే, నవి యే భాషాపదము లైనను నట్లే యుపయోగింపవలెనని నియమము. తుదకు శుద్ధాంధ్రకావ్యము యయాతిచరిత్రమున పెక్కు తత్సమములను నచ్చతెలుగుగా మార్చియు బిరుదులనుమాత్ర మట్లే వాడినాడు. 'బాలసరీగజాంకుశ' మున్నగునవి యుదాహృతులు. ఇది తెలుగుభాషాసంప్రదాయము ననుసరించినది. శబ్దశాసనుని వాగనుశాసను; డన్నచో, శంభుదాసును శంకరదా సనియు, శశిభూషణదా సనియు, ఉభయకవిమిత్రుని ద్విభాషాకవిమిత్రు డనియు, కవిసార్వభౌముని కవిరాజరాజేశ్వరు డనియు నన్న నెంత సమంజసమో యదియు నంత సమంజసమే. వేయేల? పితామహుడనగా బ్రహ్మయేగదా! ఆంధ్రకవితాపితామహుడను నల్లసాని పెద్దన్నను ఆంధ్రకవితాబ్రహ్మయని యేల పర్యాయపదముగా పేర్కొనలేదో? కావున నిదియును వాగనుశాసనుని పేర తరువాత నారోపితమైన రచనమే కాని శబ్దశాసనుడను నన్నయ కేమాత్రము సంబంధము లేదని ధ్రువపడుచున్నది.

నన్నయకు వెనుక నాల్గువందల యేండ్లవఱకు శబ్దశాసనప్రశంస లేకపోగా, నావెనుకనైన నది బిరుదము కాకపోగా, నావెనుక కాలమున కవిసృష్టిచే నారోపితమైన వాగనుశాసనశబ్దమును, భారతాంధ్రీకరణకర్తయైన నన్నయకే బిరుదమని తలంచి, అది యాధారముగా నాంధ్రశబ్దచింతామణి నన్నయదే యని యంగీకరించి, అందలి విషయములను, విశ్వశ్రేయఃకావ్య మిత్యాది వాక్యములను ప్రమాణీకరించి, సారస్వతవిమర్శనము గావించువారి విచక్షణ యేపాటిదో, ప్రాజ్ఞు లాలోచింతురుగాక!

వాగనుశాసనశబ్దప్రయోగముచేగాక, ఆంధ్రశబ్దచింతామణి ప్రాచీనలాక్షణికు లెవ్వరిచేతను స్పృశింపబడకపోవుటయు, బాలసరస్వతి యప్పకవికాలమువఱకును (ఇరువురును సమకాలికులే!) అనగా క్రీ. శ. 1656 వఱకు, ననగా 6 వందల యేండ్లవఱకు నీపేరె వాఙ్మయప్రపంచమున వినరాకపోవుటయు ఇది కూటసృష్టి యని నిరూపించుచున్నది. అసలు వాగనుశాసనుడే నన్నయ కానప్పుడిక నాంధ్రశబ్దచింతామణి రచన మెట్లు?

పైని వివరించిన విషయములు చారిత్రకక్రమము ననుసరించినవి. నన్నయకు శబ్దశాసనుని బిరుదము కాదనియు, నావెనుక నైదు శతాబ్దములవెనుక నాతని కారోపింపబడినది యనియు, బిరుదులకు పర్యాయపదము లుండవనియు, నందుచేత నాంధ్రశబ్దచింతామణి భారతాంధ్రీకరణకర్తయైన నన్నయ రచింపలేదనియు సిద్ధాంతము.

నన్నయ మహాభారతమున రాజరాజును గూర్చి తెలిపిన విషయములు—

1. రాజరాజబిరుదులగోత్రములు:—

రాజకులాగ్రగణ్య. (1-161)  మానవ్యసగోత్ర - (5-260)
రాజకులశేఖర (2-288) (5-261)
శ్రీమచ్చళుక్యవంశశిఖామణి (3-1)
చళుక్యాన్వయపయోధిసంపూర్ణశశి (4-1)
సత్యాశ్రయకులశేఖర (4-272)
రాజాన్వయతిలక (6-1)
చళుక్యకులతిలక (6-308)
శీతాంశువంశప్రకాశ (6-308)
రాజకులదీప (7-288).

రాజవంశరత్న (అర 1-40)
రాజకులోత్తమ (1-294)
రాజవంశవార్ధిచంద్ర (2-421)
భూపకులతిలక (అర 3-398)

2. తండ్రిపేరు—విమలాదిత్యగ్రతనూజ (4-272) విమలాదిత్యాత్మజ (1-11)

3. మతము: ఆచారము—
మృడప్రియ (1-161) మనుమార్గ (3-1) మహాదానతర్పితద్విజవర (5-1) వ్యసనవివర్జిత (5-260) దక్షుముఖారిదయాలబ్ధసుస్థిరైశ్వర్యపదా (7-1) భీమేశ్వరకృతనిత్యప్రసాద (అర 1-399)

4. శౌర్యము—పరగండభైరవ (ఆ. 3-277) (స. 2-219) (అ. 1-398).
పరగండభేరుండక (ఆ. 2-355)
వైరిపీరరసవైద్య—(స. 2-219)
వైరివీరభయంకరశౌర్య (ఆ. 8-322)
నృపపూజిత పదాంభోజ (7-288)

కులక్రమాగతముగా వచ్చినవి—
సమస్తభువనాశ్రయ. (అ. 4-273) (2-355)
పరాక్రమరాఘవ (స. 1-292)
నిరవద్య (5-261) (1-16)

## మహాభారతము

1847. ఆదిపర్వము—వచనముతో సహా, వైయాకరణము రామానుజాచార్యులవారిచేతను, పరవస్తు చిన్నయ్యసూరిచేతను ముద్రితమైనది. వచనరచయిత రామానుజాచార్యులు. 313 పుటలు—(ఫూల్స్కాపు)

1853. సంపూర్ణముగ 18 పర్వములు ముద్రితములైనవి.

శ్రీహయగ్రీవాయ నమః.

శ్రీసకలభాషావాగనుశాసనబిరుదాభిరామ శ్రీమన్నన్నయభట్టారకకవిసార్వభౌమప్రముఖసత్కవిప్రణీతంబును నిఖిలపరమపురుషార్థసాధకంబును కలికల్మషధ్వంసకంబును పంచమవేదంబును యెల్లవిద్వజ్జనంబులకు నత్యంతం బాదరణీయంబును నాంధ్రభారతమహాకావ్యంబు చెన్నపురంబునం గాంచీపురము పచ్చయప్పమొదలారిగారి విద్యాశాలయందు సంస్కృతాంధ్రభాషాద్వితీయోపాధ్యాయులును వాణీమండపంబును చెన్నపట్టనము హిందూశాలుర సంస్కృతాంధ్రద్రవిడ పాఠశాలయందు పండితాధ్యక్షులు నగు—కరాలపాటి రంగయ్యగారిచే లేఖకదోషంబులు లేకుండునట్లు పరిష్కరింపబడి, విశ్వంభర సోమసుందరపిళ్లగారిచే వా. కుమారయ్యగారి కళానిధి ముద్రాక్షరశాలయం దచ్చుకూర్పింపబడి ప్రకటింపబడియె.

శాలివాహనశకాబ్దంబుల 1775 యగు పరీధావి నామ సంవత్సర మార్గశీర్ష పూర్ణిమయందు బర్యాప్తం బయ్యె.

విశ్వవిశ్వంభరావినుతమహైశ్వర్య
 ధుర్యు డౌదార్యసంతోషితార్య
వర్యుండు శివకామవల్లీవధూటీము
 తల్లీసమాక్షేమకర్తృరుండు
నిర్వ్యాజకారుణ్యనిమ్నగాధీశని
 మజ్జన్మజ్జనమండలుండు
మహనీయతపనీయమణిమయప్రాకార
 గోపురాగారసందీపితుండు
హితవిధానుండు వృద్ధాచలేశ్వరుండు
మెచ్చి నిచ్చలు దన కోర్కు లిచ్చుచుండ
వెనగ నిరుపమసంపద నెవ్వ డట్టి
ఘనుడు ముత్తయపిళ్లయ ధనికవరుడు.

కూరిమి జేపెరి యనం
గా రహి నెల్లెడల బొగడు గాంచిన మీనా
క్షీరమణీమణియందున్
సూరిప్రియుడయిన సోమసుందరు గనియెన్.

జగదభివందనీయమతిశాలి విశ్వంభరసోమసుందరుం
డగణితమానురాగలలితాత్మకృతోదహీనవిభూషణుం డనం
తసుణసమగ్రభావధరధుర్యుడు పుణ్యజనప్రియుండు శ్రీ
రగణాయుతుండు కూలి క్రియ రాజిలువా డతడింపుమీఱగన్.

విశ్వజనీనంబువిధినమనోరథ
 సిద్ధిప్రదంబు నశేషదోష
నిర్వారణము వర్ణనీయము శబ్దాను
 శాసనతిక్కనశంభుదాస
రచితంబులైన భారతమహాకావ్యంబు
 సత్కవిప్రకరంబు సన్నుతింప
లేఖకదోషము ల్లేక తద్దయుం బరి
 ష్కృతమయి యొప్పురికింప జేసె,
ఖిలము లయ్యెడు లేవరికేతనప్ర
పోషనదీర్ఘకాదుల నుద్ధరించు
పగిది లోకైకహితకాంక్ష దగిలి యొలమి
మిగుల ముద్రాక్షరాంకితముగ నొనర్చె.

విరాటపర్వాంతమున పద్యము—

"తిక్కనసోమయాజి జగతీనుతసద్గుణరాజి సత్కవుల్
పెక్కువిధంబులం దనను పేర్కొని నుతింప మనోహరంబుగా
నెక్కుడు నేర్పు దొల్లి రచియించిన భారతమందు దద్ద తెం
పెక్కు విరాటపర్వ మిది యొల్లెడ నిచ్చలు మెచ్చు గొల్పెడున్."

ఉద్యోగపర్వాంతమున పద్యము—

"పాదలం జేయు ముదంబు పెక్కు నెల నార్జిం సాగుశబ్దార్థసం
పద శెంపారి యనేకకోవిదుల మాన్యం జాలి నానారసా
భ్యుదయోల్లాసము సేర్చి యగ్గి మహిం నీ యుద్యోగపర్వంబు నో
హాదముం గూర్చు మ గద్యపద్యముల హృద్యంబై కరం బెల్లెసన్."

| | పుటలు |
|---|---|
| ఆదిసభా... | 155 |
| అరణ్య... | 158 |
| విరాట... | 75 |
| ఉద్యోగ... | 74 |
| భీష్మ | 56 |
| ద్రోణ... | 97 |
| కర్ణ... | 60 |
| శల్య... | 47 |
| సౌప్తిక... | 22 |
| స్త్రీ... | 20 |
| శాంతి... | 138 |
| అనుశాసనిక... | 95 |
| అశ్వమేధ... | 50 |
| ఆశ్రమవాస మౌ. | 45 |
| | 1092 |

(12 పుటలు విషయానుక్రమణిక)

ముద్రణము ముగిసినపిమ్మట నన్న పద్యములు—

"శ్రీకరమఖిలార్థసిద్ధిప్రదము కవి
త్రయరచితంబు పెక్కు వినుతంబు
పంచమవేదంబు పరమేతిహాసంబు
ధర్మ్యంబు శ్రీమహాభారతంబు
లేఖకదోషాళిరహితంబుగా
రసికు లింపొంద గరాలపాటి
రంగయాహ్వయకవిపుంగవుం డొనరింప
శాలివాహశకాబ్దసమితియందు
సాగరర్షి ధరాధరచంద్రసంఖ్య
నన జెలీధావిహాయనమున వసంత
మణి-శరాసనమున నుండ మార్గశీర్ష
మాసపూర్ణిమ లోకైక భాసురముగ.

దనుపు ముదారవైభవవిధాయి విలిందుశపోమసుందరా
ఖ్యతుషీతపాగ్రగణ్యుడు మహామతిశాలి యొనర్చె విస్ఫుర
ల్లతఠబు దార్ఢ్య శౌనక గళానిధి నా గర ముల్లసిల్ల ము
ద్రాక్షరశాలయందు విశదాక్షరముద్రితమై చెలంగగన్."

## నారాయణభట్టు (క్రీ. శ. 1053)

నారాయణభట్టు నన్నయసమకాలికుడని, సహాధ్యాయుడని యీక్రింది భారతపద్యమువలన తెలియుచున్నది :

(ఆది. 1-24)

"పాయక పాకశాసనికి భారతఘోరరణంబునందు నా
రాయణునట్లు వానసవరామరవంశవిభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయధురంధరుడున్ తన కిష్టుడున్ సహా
ధ్యాయుడు నైనవా డభిమతంబుగ దోడయి నిర్వహింపగన్."

ఈపద్యము పెక్కు భారతప్రతులయందు కన్పట్టుచున్నను క్రీ. శ. 1656 సంవత్సరమున నప్పకవి తాను రచియించిన అప్పకవీయములో నిత్యసమాసవిక్రాంతులలో నారాయణశబ్దమున కుదాహరణముగా నిచ్చియున్నాడు (8-170). కాబట్టి యప్పకవికి ముందు భారతప్రతులలో నిది యుండియుండవలెను. కాని నేడు మన కప్పకవికాలము కంటె ముందు వ్రాయబడిన భారతప్రతులు లభింపవు. కాబట్టి యీవిషయమై యిదమిత్థమని చెప్పజాలము. అప్పకవి నన్నయభట్టారకభారతభాగమునుండి యుదాహరించిన పద్యములలోని పాఠములు నన్నయనాటి భాషాసంప్రదాయములకు విరుద్ధములుగ నుండుటయే గాక, అతని కవిత్వతత్త్వమును మఱుగుపఱచునవిగా యున్నవి. అప్పకవికన్న ముందున్న లాక్షణికులలో ముద్దరాజు రామన 'కవిసంజీవని'లో భారతములోనుండియే మూడువందలకు పైగా ప్రయోగములను గ్రహించియున్నాడు. అందీపద్య ముదాహరింపబడి యుండలేదు. నారాయణభట్టును తెలుగుకవు లెవ్వరును స్తుతించి యుండలేదు. అప్పకవి యీపద్యము నుదాహరించుటయేకాక, ఆంధ్రశబ్దచింతామణినికూడ నీతని సహాయముచే రచియించెనని గ్రంథావతారికలో నిట్లు చెప్పియున్నాడు :

"మును నారాయణధీరుడు
తనకు సహాయుడుగ సంస్కృతము వాగనుశా
సనుడు రచియించె దానిం
దెనిగింపగ నీకు దొడు నే నిపు డనుదున్."

అప్పకవి యిట్లు వ్రాయుటచేత, పైపద్యము నన్నయ వ్రాసియుండునా, లేక యప్పకవియే, ఆంధ్రశబ్దచింతామణికర్తృత్వము నన్నయకు స్థిరపఱచుటకు నీపద్యమును సృష్టించెనా యని యనుమానము దృఢమగుచున్నది. నేడే యాంధ్రశబ్దచింతామణిప్రతియందును గన్పట్టని నారాయణభట్టసహాయవిషయ మప్పకవి యెట్లు వ్రాయగలిగెనో దురూహ్యము. ఈపద్యమున యతివిషయముకూడ సందేహాస్పదమే. అప్పకవి యుదాహరించిన నిత్యసమాసయతులకు నన్నయభారతమున నుదాహరణములు లేవు. ఇట్టి సమస్యలన్నియును నన్నయభట్టరచితభారతభాగమునకేని సప్రమాణమును, శాస్త్రీయమును, సంప్రదాయసిద్ధమును నగు పరిష్కరణము లేకపోవుటచే బయలుదేరినవి. అప్పకవీయరచనముతరువాత నాగ్రంథమే ప్రమాణముగుట

వలన, నొక్క భారతమునందే కాక తక్కిన గ్రంథములలోని పాఠములుకూడ నప్పకవీయము ననుసరించియే తరువాతివారు వ్రాయఁ జొచ్చిరి. వానివలననే భారతమువంటి గ్రంథములలో నిన్ని మార్పులు, కూర్పులు, చేర్పులు జరిగినవి. ఈవిషయ మింకను బరిశోధింపదగినది.

ఈపద్యవిషయ మెట్లున్నను నారాయణభట్టు నన్నయ సమకాలికు డనుటకు నందమపూడిశాసనమే ప్రమాణము. ఈశాసనము రచించిన కవి నన్నయభట్టు; దాత రాజరాజనరేంద్రుడు; ప్రతిగ్రహీత నారాయణభట్టు. ఈతనికి రాజనరేంద్రుడు తన 32 వ రాజ్యవర్షమున రెంటేలుల నడిమివిషయమున (అనగా నేటి యనులాపురము తాలూకా) నందమపూడిగ్రామమును ధారాదత్తము చేసినాడు. శాసనకాలము క్రైస్తవశకాబ్దము 1053 అగును. కావున నన్నయనారాయణభట్టు లిరువు రీసంవత్సరమున వర్తించు చుండుట నిశ్చయమే. ఈశాసనము వలన నారాయణభట్టువంశాదికము, పాండిత్యప్రతిభ మున్నగు నంశము లీక్రిందివి తెలియుచున్నవి. "ఈతడు హారీతసగోత్రుడు; ఆపస్తంబసూత్రుడు; కంచన సోమయాజిపౌత్రుడు. అకొంచాంజనేయుడని ప్రసిద్ధిచెందిన అకలంకశంకర నామార్యుని కుమారుడు. తల్లి చామెకాంబ. నారాయణభట్టు సంస్కృతకర్ణాటప్రాకృత పైశాచికాంధ్రభాషలలో కవిరాజశేఖర బిరుదము బడసినవాడు. నవస్వతీకర్ణావతంస, అష్టావధానచక్రవర్తి అను బిరుదములను కూడ గడించినవాడు వన్ని నారాయణు డను పేరు గలవాడు." కాని యీతని గ్రంథము లేవియు మనకు లభించుటలేదు. కర్ణాటభాషలోను నీతని గ్రంథము లేవియు లభ్యము కాలేదు. కర్ణాటకవిచరిత్రకారులకు నీ నందమపూడిశాసనములోని విషయములే యాధారములు. కర్ణాటకవిచరిత్రమున నీతని విషయ మిట్లున్నది:

నారాయణభట్ట (సు. 1040)

పూర్వదేశద చాళుక్యరాజనాద రాజరాజన (1022-1063) ఆస్థానకవియాగిద్ద నన్నయ్యభట్టనిగె తెలుగుభారతవన్ను బరెయువల్లి సహాయకనాగిద్ద నారాయణభట్టను కన్నడదల్లి యూ కవియాగిద్దం తెయూ కవిభవవజ్రాంకుశ ఎంబ బిరుదన్ను పడెదిద్దంతెయూ ఈ శ్లోకగళింద తిళియుత్తదె.

"యస్సంస్కృతకర్ణాటప్రాకృతపైశాచికాంధ్రభాషాసు,
కవిరాజశేఖరఇతి ప్రథిత స్సుకవిత్వవిధి వేవ
కవి ర్గీర్వాణకవిరుద్ధగాన మనోహరాభి ర్నిజసూక్తిభి ర్యః
కుర్వన్నఖర్వాన్ పటుభి ర్విభక్తి కవిభవవజ్రాంకుశనామ సార్థమ్."

ఈతన కాలవు సుమారు 1040 ఆగిరబహుదు. ఇవను కన్నడదల్లి అవగ్రంథవన్ను బరదిద్దానవెందు తిళియదు. (1 భాగము 74 పుట)

నారాయణభట్టుకూతురు కుపమ యనునామె ద్రాక్షారామ భీమేశ్వరునకు నఖండదీపమునకై లోహపురుషయ నొసగి క్రీ. శ. 1055 లో నొక శాసనము వేయించినది. అందులో 'త్రైలోక్యమల్ల దేవర ప్రధాని నారాయణభట్టుకూతురు కుపమ' అని యున్నది. శాసనవిషయములు తొలుత ప్రకటించిన లక్ష్మణరావుగారు క్రీ. శ. 1044-1068 వరకు కల్యాణకటకము నేలిన ప్రథమసోమేశ్వరుడే త్రైలోక్యమల్ల, ఆహవమల్ల బిరుదాంకితుడు గావునను నీనారాయణభట్టుకాలమును, భారతరచనయందు నన్నయకు తోడ్పడిన నారాయణభట్టుకాలమును నొకటియే కావున నిద్దఱు నొక్కరే యని వ్రాసియున్నారు[1]. దీనిని శ్రీ దాక్టరు వేటూరి వేంకటరమణయ్యగారు బలపఱచియున్నారు. కాని యీవిషయము ఆంధ్రకవితరంగిణిలో ప్రాస్తిక ఖండింపబడిన[2] వైపద్యమే భారతములో సందిగ్ధముగ నున్నప్పు డది యాధారము చేసికొనుట యెంతొ కష్టమును ప్రమాదమే యగును.

నందంపూడిశాసనము (క్రీ. శ. 1053)

శ్రీధామ్నః పురుషోత్తమస్య మహతో
నారాయణస్య ప్రభో
ర్నాభీపంకరుహాద్బభూవ జగత
స్స్రష్టా స్వయంభూ స్తతః।
జజ్ఞే మానససూను రత్రి రితి య
స్తస్మా న్మునే రత్రిత
స్సోమో వంశకర స్సుధాంశు రుదిత
శ్శ్రీకంఠచూడామణిః.

... ... ... ...

స సర్వలోకాశ్రయవిష్ణువర్ధనమహారాజాధిరాజో రాజపరమేశ్వరః, పరమభట్టారకః, పరమమాహేశ్వరః, పరమబ్రహ్మణ్యః, శ్రీరాజరాజదేవః, రెంటేలుల నడిమి విషయ నివాసినో రాష్ట్రకూటప్రముఖాన్ కుటుంబినః సమాహూయ మంత్రిపురోహితసేనాపతియువరాజదౌవారికప్రధానసమక్షం ఇత్థ మాజ్ఞాపయతి యథా.

హారీతగోత్రే హరిమూర్తి రాపస్తంబద్విజశ్రేష్ఠవిధు ర్వ్యనీతః
సదా పురోడాశపవిత్రవక్త్రో విద్యావధూత్కంచన సోమయాజీ.
తస్య శ్రీమాన్ హిమకరకరప్రస్ఫురత్కీర్తిరాశే
రాసీ త్సూనుః సకలవిదుషాం వంచితః కంచెవార్యః
యం మన్యంతే యమ మురిగణాః కామదేవం కవీంద్రాః
క్రీడారామం పరమసుహృదో జీవితం బంధువర్గాః।
తస్యాత్మజో మహాత్మా సమజని కొంచాంజనేయ ఇతి విదితః
ప్రజ్ఞాజితవాచస్పతి రకలంకో శంకనామార్యః
తస్యచ సుధర్మపత్న్యాశ్చ గుణశాలిన్యాశ్చ చామెకాంబాయాః
అభవ దనుష్ఠితజగదుపకారకో నారాయణ స్తనయః

1. పట్టాభిషేక సంచిక, 114-115 పుటలు.
2. ఆంధ్రకవితరంగిణి, పుట 137.

యః సంస్కృతకర్ణాటప్రాకృతపైశాచికాంధ్రభాషాసు,
కవిరాజశేఖర ఇతి ప్రథితః సుకవిత్వనిధ నేన.

కవివృషభాలవదుర్విదగ్ధాన్
మనోహారాభి ర్నిజసూక్తిభి ర్యః
భుర్వన్ననర్గా న్నటుభి ర్విభర్తి
కవిభవజ్రాంకుశనామ పార్థమ్.

తస్మై సకలజగదభినుతశాలినే సరస్వతీకర్ణావతంసాయామష్ట దశావధారణచక్రవర్తినే నన్నినారాయణాయ భవద్భిరప్యే నందమ పూడినామాగ్రామాగ్రహారీకృత్య సోమగ్రహణనిమిత్తే ధారాపూర్వక మస్మాభి స్సర్వకరపరిహారేణ దత్త ఇతి విదితమస్తు వః........ బహుభి ర్వసుధా దత్తా బహుభి శ్చానుపాలితా, యస్యయస్య యదా భూమి స్తస్యతస్య తదా ఫలమ్ ఇతి అజ్ఞప్తి రస్య కటకాధిరాజః, కావ్యానాం కర్తా నన్నియభట్టో, లేఖకో గండాచార్యః, ద్వాత్రింశత్తమే విజయరాజ్యసంవత్సరే వర్ధమానే కృత మిదం శాసనం.

## సోమలదేవిశాసనము - భీమనప్రెగడ (క్రీ. శ. 1065)

రాజరాజనరేంద్రుని సవతిసోదరుడగు విజయాదిత్యుని కూతురు సోమలదేవి దాక్షారామమున నొక శాసనము వేయించెను. ఆశాసనమున నొక సంస్కృతశ్లోకమును, నొక సీసపద్యమును, నొకయాటవెలదియును గలవు1. ఈశాసనమును తొలుత ప్రకటించిన లక్ష్మణరావుగారు సోమలదేవి రాజరాజనరేంద్రుని కూతురని భావించిరి. కాని శాసనమున స్పష్టముగా "నిజభుజప్రధాని వెజయితదేవనికూంతు" అని యుండుటచేత నీమె విజయాదిత్యుని కూతురగుట స్పష్టము.

ఈశాసనము భీమనప్రెగడ రచియించెనని యీక్రిందివిషయములచే నూహించుచున్నాడను. భీమనప్రెగ్గడ విజయాదిత్యుని యమాత్యుడు. ఈతడు రాజమహేంద్రవరములోని మార్కండేయస్వామికి దీపదానమును చేసిన2 శాసనములో—

"శాకాబ్దే యుగనందరంధ్రగణితే చైత్రంగతే భాస్కరే
శ్రీమార్కండమహేశ్వరాయ వసతే గోదావరీప్రాన్తకే
ప్రాదా ద్దీప మఖండవర్తి మనిశం విప్రప్రదీపా స్స్వయమ్
భీమశ్రీమదమాత్యకృత్యనిపుణో మాతాపితృశ్రేయసే"

అని కలదు. ఈశాసనము 994. క్రైస్తవశకము 1072 మఱియు నందు 'సర్వలోకాశ్రయవిష్ణువర్ధనమహారాజుల ప్రవర్ధమాన విజయరాజ్యసంవత్సర ౧౧ శ్రాహివిష్ణుసంక్రాంతి' అని పేర్కొనబడిన కాలము. రాజనరేంద్రుని యనంతరము విజయాదిత్యుని కాలము తెలుపుచున్నది. కావున నీకాలమున నున్న భీమనప్రెగ్గడ విజయాదిత్యుని కూతురు సోమలదేవి వ్రాయించిన శాసనమునకు కర్త యగుటలో నాశ్చర్యము లేదు. భీమనప్రెగ్గడ నన్నయభట్టు కుమారుడై యుండునని 'కవితరంగిణి' కృతికర్త యుపపాదించియున్నారు3. అట్లయినచో భీమనప్రెగ్గడ కూడ కవియని యూహింపనగును. శాసనకాలము ముని-7, వసు 8; నిధి-9. 987 + 78=1065 క్రీ. శ.

### శాసనము

స్రగ్ధర ॥ శాకే సంవత్సరేష్వష్టనివసునిధిగే రాజమార్తాండభూభృత్
పుత్రీ(సారంగ)నేత్రీ కనకవిరచితం కల్పభూజాతపుష్పం
ప్రాదా ద్భీమేశ్వరాయ వ్యదిశ దశ సదా దీప్యదాచంద్ర [తారం
దీపం కాష్ఠంచ పాత్రం విభవవృతభుజా కరిదేవీతనూజా.

సీ. శ్రీవిష్ణువర్ధనభూవిభుదయభూమి
దేవిబోల్ రేవలదేవి కనిన
సోమలదేవి గుణారామ జగదేక
సుందరి మత్తేభమందగమన
తొల్లి భీమేశ్వరవల్లభునకు నిత
మణిబంధ మిచ్చె సన్మణియుతముగ
మరువిచ్చె గంగనాంబరువడి విని వారిం
బురుడింపునట్లు యా సరసిజాస్య.

ఆ. వె. కనకరుచిరరచితకల్పావనీరుహ
కుసుమ మిచ్చెం దనకు వసము పెరుగ
వెండి మండితోనఖండితద్యుతిదీప
మమర నిచ్చె విమలకమలనేత్రి.

ఆ. వె. సకలవసుమతీశ మకుటలసద్ర(త్న)
కిరణరుచిరరాజచరణుడైన
నిజభుజప్రధాని(వె)జయితదేవని
కూంతు పరిదెం బోల్పం గాంచె లెందు.

ఛందస్సు—

పై శాసనమున సీసపద్యమునందంతయు ప్రాసయతి పాటింపబడినది. ఇది నన్నయభట్టారకుని సీసనియమములలో నొకటి. ఈ విషయ మొకటియే, శాసనములలోని పద్యరచనకును, కావ్యరచనకు గల పరస్పరసంబంధము సూచించును. మఱియు శాసనకవులు కావ్యకర్తలవలె సారస్వతమున నున్నతస్థానమున కర్హులని మనము గ్రహింపనగును.

పైసీసములో 'సోమలదేవి గుణారామ జగదేక' అనుచోట ప్రాసయతి లేదు. యతికూడ తప్పినది. కావున నిది సరియగు పాఠము కాకపోవచ్చును. శాసనము శిథిలమగుటయు, అక్షరములు

---

1. రాజరాజనరేంద్రపట్టాభిషేక సంచిక. రాజరాజుకూతురు సోమలదేవి శాసనము. పుటలు 25-29.

2. *Epigraphical report*, 1933. *Page* 55-56.

3. ఆంధ్రకవితరంగిణి - చాగంటి శేషయ్యగారు. 6 పుట

చిన్నవిదుగుటయో కారణములుగా సరియగు పాఠము లభించి యుండకపోవచ్చును. శాసనమునందంతట నియతముగా ప్రాసయతి పాటించుటచే రచయిత యిందును పాటించియేయుండును. లేఖకుడు పొరపాటుగా చెక్కియుండును. కావున పోమలదేవి యను పదము 'శ్యామలదేవి' యని యుండెననియు, నప్పుడా పాదమున ప్రాసయతి లేదనియు, సామాన్యయతియే యున్నదనియు గ్రహింపవలెను. ఎత్తుగీతిలో 'కనకరచితరుచిరకల్పవనీరుహ' అని యతియే కలదు. 'తూంగు సరియబోల్ప కాంతి లెందు' అనుచో పూర్ణార్ధబిందుప్రాసము. 'కాంతి' శబ్దము సంస్కృతము.. ఇం దర్ధబిందువు లేదు. ఇట్టి ప్రాసములు ప్రాచీనకవులలో శివకవుల కృతులయందు గలవు.

వ్యాకరణము—

1. సారంగనేత్రి (1-2) కమలనేత్రి (2-8)— ఈ రూపము లపాణినీయములని బాలవ్యాకరణము నిషేధించినది. ప్రాచీనకాలమున 'ఇ'కారాంతరూపములే తెలుగున విలసిల్లినవి. శాసనములలోనే గాక కావ్యములలో నివి ప్రయుక్తము.

2. ప్రథమమీద సాంస్కృతికమైనను తెలుగైనను గసడదవాదేశము నిత్యము. మందగమన నొల్లి—సరసిజాస్య గనకరచిత— అనను చెరుగు.

3. ద్రుతముమీద గజడబాదేశము నిత్యమే. విని వారిం బురుడించు—ఇర్పం దనకు—బోల్పం గాంతి.

4. ప్రథమావిభక్తి మహద్వాచకముల కుత్వము రాదు. తెజయితి కేవని.

5. ప్రధానుడు అనుటకు 'ప్రధాని'. 'మండెగ'కు 'మండె' అను పదము లిందు ప్రయుక్తములు.

బణపతి దీర్ఘాసిశాసనము

(క్రీ. శ. 1075-1081)

కళింగదేశమున క్రీ. శ. 1069-76 వఱకును పాలించిన గంగ వంశీయుడగు దేవేంద్రవర్మ రాజరాజునకు దండనాయకుడై మండలికుడైన వనపతి మనకు కొలుత దీర్ఘాసిశాసనమూలమున తెలుకపడిన వాడు. ఈశాసనమున తెనుగు సీసపద్యమాలిక యుండుటచే నీశాసనము వాఙ్మయప్రసిద్ధిని బడసినది. మఱియు, కళింగగంగరాజులకు, చోళ చళుక్యరాజులకు సంబంధించిన చారిత్రకవిషయములు తెలియుచుండుటచేత నీశాసనము చారిత్రకముగకూడ ముఖ్యమైనది.

ఈశాసనము పూర్వపు గంజామమండలమున, నేనగా నేటి యుత్తరవిశాఖపట్టణమండలమున నరసన్నపేటతాలూకాయందలి దీర్ఘాసి యను గ్రామమున దుర్గమెట్ట యను చిన్నకొండపైని యొక రాతిపలకపై చెక్కబడినది. ఈశాసనమున నిరువదిమూడు పంక్తులు గలవు. ఇందులో 16 పంక్తులు సంస్కృతము, తక్కిన 7 పంక్తులు తెలుగు. సంస్కృతమున 8 శ్లోకములు, తెలుగున 8 పాదములు, చివర నొక ఆటవెలదియు గల సీసమును గలవు. లిపి తెలుగు.

సంస్కృతభాగమున బణపతిగూర్చి యిట్లున్నది:

వనపతి గంగవంశీయుడగు రాజరాజునకు మాండలికుడు. ఈతడు బ్రాహ్మణుడు. ఆత్రేయగోత్రుడు. గోకర్ణునకు పుత్రుడు. ఈ బనపతి క్రీ. శ. 999 లో, నేనగా క్రీ. శ. 1075 సంవత్సరమున దీర్ఘాసిలో దుర్గాదేవిఖాలయమునకు నాట్యశాల కట్టించెను. ఈతడు గంగవంశీయులకు కులక్రమాగతముగా ప్రతీహారుల వంశమున (ద్వారపాలకుల వంశమున జన్మించినను, దండనాయకుడై మండలికుడై ప్రఖ్యాతి చెందినవాడు. ఈతడు చోళరాజును, ఉత్కళరాజును, వేంగిరాజును జయించెను. దద్దార్ణవుని జయించెను—చలమర్తిగండ బిరుదము నందెను. నాట్యమండపము కట్టించుటయేగాక దీపదానము చేసెను.

తెలుగుభాగమున నీతడు పైదేశములనే గాక కిమిడి, కోసల గిరిసింగిదేశములను జయించెను. ఈతనికి ఖండవబిజయుడు గండ గోపాలు డని బిరుదములు గలవు. ఈతని భార్య పద్మావతి. ఆమె అఖండదీపము నెలకొల్పినది. ఈమెశాసనము గోదావరీమండలమున దాక్షారామమున గలదు.

తెనుగుభాగము

"శ్రీశకు వేందులు భూపతిపై నైల
　　నందాబ్జభవసంఖ్య నొంది వేంగి
దేశంబు కిమిడియు గోసలగిరిసింగి
　　దేశంబు మఱి యొడ్డదేశ మనగ
జనిన భూపాలుర నని నోర్చి చలమర్తి
　　గండడై నెగడిన మండలికుడు
భూసురవంశుండు వాసవనిభభోగి
　　బణపతి సౌజన్యగుణయుతుండు
దీర్ఘాసి భగవతి దేవిదేవాలయ
　　మున ముందటం గడు ఘనతరముగ
మండప మెత్తించె ఖండవబిజయుండు
　　గండగోపాలుం డఖండదీప్తి
దీవియపెట్టె నద్దేవికి నవ్వేళ
　　దన మనోవల్లభ వనజనేత్రి
దీవియపెట్టె పద్మావతియు జోతి
　　యవశశల్ గలయంతకును ముదమున
గగనభూమి చంద్రభూరక రోదక శిఖి
మారుతాత్మమూర్తి మహిమమహిత
యిష్టపూర్తఫలము లెల్ల కాలంబును
మెచ్చుతోడ దమకు నిచ్చుచుండ."

HADRIAN'S WALL




# ఆంగ్లదేశంలోని హేడ్రియన్ కుడ్యము

★

శ్రీ టి. యన్. రామచంద్రన్

ఆర్ష శాస్త్రము (*Archaeology*) చాలా సజీవమైన శాస్త్రము. దీనివల్ల ఒక దేశపు సముజ్జ్వల పురాతనచరిత్ర అవగాహన చేసుకోడానికి వీలవుతుంది. భారత దేశపు ఆర్ష శాస్త్రముకూడా ఇలాంటిదే. ఆంగ్ల దేశంలో ఇది మరింత ఆకర్షకంగా ఉంటుంది. ఈమధ్యన నాకు ఇంగ్లండులోని పురాతన చారిత్రక స్థలాలను సందర్శించే అవకాశం కలిగింది. రోమక—బౌద్ధక భాఖండాలను దర్శించడం బౌద్ధయుగకళాపరిశీలకులకు చాలా ఇష్టం. ఇంగ్లండులో రోమనులకాలంలో నిర్మింపబడిన పురాతనశిథిలాలను దర్శించినవారికి రోమనుల కళాసంప్రదాయాలు, వారు రాజ్యపు పొలిమేరలను సంరక్షించుకునే విధానాలూ బాగా తెలుస్తాయి. ఆంగ్ల దేశంలో నేను కొన్ని రోమనుల శిథిలాలను సందర్శించాను. వాటిలో ఈక్రిందివి ముఖ్యంగా పేర్కొనదగినవి.

1. సిల్ చెస్టర్ గోడ.
2. రెగ్నమ్.
3. వెరులామియమ్.
4. యూరికోనియమ్.
5. 'రాటే' రోమనునగరము.
6. కేర్లియన్ లోని రోమనులకోట.
7. కార్వెంట్.
8. కనోవియమ్ (రోమనుల కోట)
9. హేడ్రియన్ కుడ్యము

వీటిలో హేడ్రియన్ కుడ్యాన్ని నేటికాలపు ఆంగ్లేయులంతా సందర్శిస్తూ వుంటారు.

దీని నిర్మాణచాతురికూడా చాలా ప్రశంసనీయమైనది. అందుచేత పురావస్తుప్రేమికుల కిది చాలా ఆకర్షకంగా ఉంటుంది. ఇది రోమనులు సరిహద్దులను సంరక్షించేపద్ధతిని స్ఫురింపచేస్తూ ఎంతో దర్శనీయంగా ఉంటుంది. నేనీ కుడ్యాన్ని దర్శించిన విషయం ఇక్కడ వివరిస్తున్నాను. ఇది మన పాఠకులకు రుచింపగలదని భావిస్తున్నాను.

1949 జూలైలో పురావస్తుపరిశోధకులు కొందరు కలిసి ఈ హేడ్రియన్ గోడ దర్శించాలని నిశ్చయించుకొని అక్కడికి ఒక యాత్ర ఏర్పాటుచేశారు. ఇది నూరేళ్లకొకసారి ఏర్పాటుచేసే గొప్పయాత్ర. ఇంతకుపూర్వం ఇలాంటివి ఆరు జరిగాయని తెలుస్తున్నది. ఇప్పటియాత్రలో చాలావరకు పురాతత్త్వాభిమానులంతా పాల్గొన్నారు. ఈఆర్షశాస్త్రాభిమానులు చాలామంది ఈ గోడపొడవునా నడిచారు. ఈయాత్ర జరిగిన తరవాత న్యూకాసిల్ వద్ద రోమనుల సరిహద్దుల రక్షణను గురించిన సమావేశం ఒకటి జరిగింది. ఈసమావేశం 1949 జూలై 11-14 తేదీల్లో ఏర్పాటుచేశారు.

ఈ పురాతనవస్తుదర్శనయాత్రవల్ల కలిగిన ప్రయోజనమేమని ప్రశ్నించవచ్చును. ఇది తెలియాలంటే రోమనుల ఆంగ్ల-దేశవిజయచరిత్ర, వారి సరిహద్దుల రక్షణచరిత్ర చదవాలి. రాతియుగంతరవాత మనకు బాగా తెలిసిన ప్రాచీనశిథిలం—బహుశః—ఈగోడ ఒక్కటే అనుకుంటాను. దీని స్వభావము, చరిత్ర ఇక్కడ సంగ్రహంగా వివరిస్తాను. రోమక చక్రవర్తి జూలియస్ సీజరు క్రీస్తుపూర్వం 55 వ సంవత్సరంలో ఆంగ్లదేశం జయించాడు. అయినా క్రీస్తుతరవాత 43 వ సంవత్సరంలోనే క్లాడియసుచక్రవర్తి ఈ భాగం ఆక్రమించి పరిపాలన ప్రారంభించాడు. ఆక్రమణంతరవాత చక్రవర్తి ఇక్కడ అనేక నిర్మాణాలు నిర్మింపజేశాడు. కాని ఇంగ్లండుఉత్తరభాగంలో ఈ ఆక్రమణవల్ల అట్టే మార్పులు రాలేదు. ఆ తరవాత ఇంగ్లండులో క్రీస్తు పిమ్మట 77-85 సంవత్సరాల మధ్యలో పరిపాలన జరిపిన జూలియస్ ఎగ్రికోలా ఉత్తరాంగ్లదేశాన్నీ, దక్షిణస్కాట్లండుదేశాన్నీ జయించి, ఆయాప్రాంతాలలో అనేకమైన బాటలు, కోటలు, భవనాలు కట్టించాడు. అయితే స్కాట్లండు విజయం అంత సులభంగా జరగలేదు. అందుచేత అది అసంపూర్ణంగానే ఉండిపోయింది. ఆ తరవాత, క్రీస్తు అనంతరం 122 లో ఇంగ్లండుదేశం సందర్శించిన హేడ్రియన్ చక్రవర్తి ఒక స్థిరమైన సరిహద్దులగోడ నిర్మించాలని సంకల్పించాడు. దీనిని ఇతడు ఇంగ్లండుకు అడ్డంగా టైన్, సాల్వేలకు మధ్యభాగంలో నిర్మించాలని ఆశించాడు. దీనికే హేడ్రియన్ కుడ్యము అనే పేరు వచ్చింది. దీని నిర్మాణం పూర్తిచేసినవాడు క్రీస్తు అనంతరము 122 మొదలుకొని 126 వరకు ఇంగ్లండును పరిపాలించిన ప్లేటోరియస్ నెపోస్.

ఆంటోనియస్పైయస్ (క్రీస్తు అనంతరము 138-161) పరిపాలనలో రోమనులు స్కాట్లండులోనికి చొచ్చుకొనివచ్చి ఆత్మరక్షణార్థం మళ్లీ ఇంకొక గోడ కట్టుకున్నారు. దీనిని ఫోర్తుకు-క్లైడ్కు మధ్యన నిర్మించారు. కమోడస్ పరిపాలనలోను, క్రీస్తు అనంతరము 192 లో జరిగిన అతని హత్యానంతరము రోమనుల రాజ్యంలో అనేకకల్లోలాలు బయలుదేరాయి. ఉత్తరపుసరిహద్దులకు రక్షణలు తిన్నగా ఉండకపోవడంవల్ల యార్కు, చెస్టరులవరకు రోమనులు నిర్మించిన అనేకమైన కట్టడాలు నాశనమైపోయాయి. అప్పుడు ఈ గోడ కూడా కొంత నాశనమైపోయింది. హేడ్రియన్ గోడ పొడుగునాకూడా ఈధ్వంసచిహ్నాలు కనిపిస్తాయి. క్రీస్తు తరువాత 197 వ సంవత్సరంలో సెప్టిమియస్ సెవిరస్ ఆల్బినస్ను ఓడించివేశాడు. ఉత్తరపు దిక్కునుంచి వచ్చే శత్రువులను ఇతడు కొంతవరకు ధనంతో సంతృప్తిపరిచాడు. సెవిరస్ మళ్లీ ఈ గోడ బాగుచేయించి, స్కాట్లండుదేశీయులతో అనేకయుద్ధాలు చేశాడు. ఎంతో కష్టంమీద హేడ్రియన్ కుడ్యాన్ని తన రాజ్యపు పొలిమేరగా నిలబెట్టుకోగలిగాడు. ఇతడు చేయించిన గోడ బాగుచేత క్రీస్తు అనంతరం 235 దాకా సాగింది. దీనివల్ల, సెవిరస్సే ఈ గోడ నిర్మించాడనే పేరు పడిపోయింది. అప్పటినించీ క్రీస్తు అనంతరము 383 దాకా ఈ గోడ ఒక పెద్దరక్షణగా ఉండింది. 383 తరువాత ఈ కుడ్యానికి సైన్యప్రాధాన్యం పోయింది. ఆతరువాత ఈ సరిహద్దులలోని కొండజాతులే ఈ ప్రాంతాన్ని సంరక్షించేవారు.

అందుచేత ఈ గోడ 250 ఏళ్లవరకూ ఒక ప్రధానమైన సైనికరక్షణగా నిలిచిన దనడంలో సందేహం ఏమీ లేదు.

ఈ గోడపొడుగునా నడుస్తూంటే ఇది కేవలం గోడమాత్రంగానే గాక రక్షణశ్రేణిగా ఉన్నదని కూడా తెలుస్తుంది. ఇది తూర్పున వాల్‌సెండ్ మొదలు కొని బౌనెస్‌దాకా వ్యాపించింది. వాల్‌సెండ్ న్యూకాసిల్‌కు తూర్పున 3 మైళ్ల దూరంలో ఉన్నది. మొత్తం ఈ గోడపొడవు 73 న్నరమైళ్లు. ఈ గోడ పొడుగునా అక్కడక్కడ చిన్న చిన్న కోటల వంటి కట్టడా లున్నాయి. ఈ కట్టడాలు 20 అడుగుల ఎత్తువరకూ ఉంటాయి. ఈ గోడ మందము 9 అడుగుల 6 అంగుళాలు. ఈ గోడకు ఎదురుగా V ఆకారంగల అగడ్త ఒకటి ఉన్నది. ఈ గోడ చాలావరకు సున్నపు రాతితో నిర్మించారు. కొన్నిచోట్ల ఇంకా వివిధము లైన వస్తువులు ఈ కుడ్యనిర్మాణానికి ఉపయోగించారు.

ఈ గోడపొడుగునా మూడువిధాలైన కట్టడాలు కనిపిస్తూంటాయి. మొదటిరకపు కట్టడాలు కోటలు. వీటికి మధ్య 3 మొదలు 7 మైళ్లదాకా ఎడం ఉంటుంది. ఈ కోటలు గోడనుంచికూడా ముందుకు చొచ్చుకు వచ్చాయి. వీటిని వెయ్యిమందివరకు అశ్వికులుగాని, పదాతులుగాని సంరక్షిస్తూండేవారు. తరవాత ప్రతి 1618 గజాలకు ఒకనల్లని చిన్నరక్షణగృహం కూడా ఉంటుంది. వీటిలో 40 మందిదాకా మనుష్యులుంటారు. ఈ చిన్నకోటలకు ఉత్తరపువైపున ద్వారా లున్నాయి. దీనినిబట్టి ఈ గోడ రక్షణశ్రేణిగానేగాక ఆక్రమణాలకు కూడా ఉపయోగపడునని ఊహింపవచ్చును. ఈ గోడకు అక్కడక్కడ బురుజులుకూడా ఉన్నాయి. చిన్నచిన్న కోటలకు మధ్యన 540 గజాలదూరంలో ఈ బురుజులు కనిపిస్తాయి. ఈ బురుజులలో నిలబడి శత్రువుల రాక గమనించి త్వరితంగా వార్తలు పంపించే వారు. వీటి కన్నిటికీ వెనకాల ఒకబాట ఉన్నది. దీని కిప్పుడు సైన్యమార్గమని పేరు. ఈ రాతిగోడకు దక్షిణంగా 60 గజాలదూరంలో మట్టితో నిర్మించిన కట్టడం కనిపిస్తుంది. దీనిని 'వల్లమ్'అంటారు.

ఇది 120 అడుగుల వెడల్పున్నది. దీని మధ్యన 10 అడుగుల లోతున్న అగడ్త ఉన్నది. ఈ కట్టడం సైన్యాధికారంలో లేని పౌరుల సరిహద్దు. కాని ఈ కట్టడాన్ని సైన్యాలు సంరక్షిస్తూ ఉండేవి. ఈ 'వల్లమ్'కు దక్షిణంగా స్టాన్‌గేటు ఉన్నది. ఇక్కడ దీనికి, ఈగోడ కోటలకు సంబంధం కలిపే బాటలు కూడా ఉన్నాయి.

ఈ గోడ సముద్రమట్టంతో ప్రారంభించి కొన్ని చోట్ల 1230 అడుగుల ఎత్తువరకూ కూడా లేస్తుంది. ఈ గోడకట్టినమార్గం మనము నేటివరకు కూడా గుర్తు పట్టవచ్చును. అరణ్యప్రాంతాలలో ఇది అచ్చంగా 16 వ శతాబ్దిలో విలియమ్ కామ్‌డెన్ వర్ణించిన విధంగానే కనబడుతుంది. ఇప్పు డీ గోడ రోమనులకాలంలో ఉన్నట్లు కనబడదు. కొన్నిచోట్ల ఇవి కేవలం అర్ష దృక్పథం కలవారికి మాత్రమే గోచరిస్తుంది. వాల్‌సెండ్‌లో దీని చిహ్నా లింకా కనిపిస్తాయి. ఈ గోడ కోటలకు తూర్పుగా ఉన్న భాగాన్నిప్పుడు నౌకానిర్మాత లుపయోగిస్తున్నారు. ఇదే ఇప్పటి న్యూకాసిల్. న్యూకాసిల్‌కు పడమటిదిక్కున ఈ 'వల్లమ్' ఇప్పటికీ కనిపిస్తుంది. ఇక్కడినించి ఈ గోడ కానుకొన్న రోడ్డు గోడను విడిచి 12 మైళ్లవరకు అరణ్యప్రదేశంలోకి చొచ్చుకుపోతుంది. ఈప్రాంతంలో ఈ గోడ చాలా గొప్పగా ఉంటుంది.

కాని ఇక్కడకూడా ఈ గోడకు పూర్వ కాలంలో ఉన్నంత ఎత్తు లేదు. ఇక్కడ దీని ఎత్తు 6 అడుగులు మాత్రమే. కాని ఇక్కడ చిన్నకోటలు, బురుజులు స్పష్టంగా కనిపిస్తాయి. ఇక్కడనే 'బార్కో-వికమ్'కోటకూడా ఉన్నది. ఇది ప్రస్తుతం పురావస్తు శాఖవారి పర్యవేక్షణలో ఉన్నది. ఆతరవాత ఈ గోడ బాగా జనం నివసించే ప్రదేశాలలో—కంబర్ లాండ్‌లో—ఉన్నది. ఇక్కడకూడా ఇది అర్ష శాఖ వారి పర్యవేక్షణలోనే ఉన్నది.

బ్రిటిషు పబ్లిక్ వర్క్సు శాఖ ఈ రోమనుల ఉద్యానాన్ని సంరక్షిస్తున్నది. 'వల్లమ్' కూడా వీని అధికారం క్రిందనే ఉన్నది. వీటి రక్షణప్రణాళిక 1938 లో ప్రారంభమై 1943 వ సంవత్సరానికి బాగా స్థిరపడింది. ఈగోడ, దీనికి సంబంధించిన కట్టడాలు పురాతనశిథిలాల క్రింద పరిగణింపబడుతున్నాయి. ఇంకా దీనికి సంబంధించిన కొన్ని ప్రత్యేకప్రదేశాలుకూడా అర్ష శాఖాధికారంలోనే ఉన్నాయి. కోర్ బ్రిడ్జికి దగ్గరగా ఉన్న పురాతనరోమకనగరం "కోర్‌స్టపిటమ్"ను కూడా ఈ శాఖవారే సంరక్షిస్తున్నారు. ఈ నగరాన్నుంచి ఈకుడ్యరక్షణకోసం పదార్థాలు సరఫరా చేస్తూండేవారట. అల్లాగే ఈకుడ్య రక్షణకు ఉపయోగించే విండోలాండకోటను కూడా పురాతన శాఖవారే పర్యవేక్షణచేస్తున్నారు.

తప్పుపనివాళ్లవల్ల ఈ గోడకు ఈ మధ్యన బాగా నష్టంకలిగిందని గుర్తించారు. ఇండియాలో కూడా ఇలాంటి ప్రమాదం సంభవిస్తూనేఉంటుంది. రెండవప్రపంచయుద్ధసమయంలో ఈగోడ చాలావరకు తవ్వివేశారు. ఈ గోడలో ఉన్న రాయివంటి రాయి దొరకకపోవడంవల్ల ఇది తప్పనిసరిగా జరిగినదని తెలుస్తున్నది. కాని ఆ తరవాత ప్రభుత్వం కలగజేసుకోవడంవల్ల ఈ ప్రమాదం తప్పిపోయింది. రాళ్లు తవ్వకుండా అడ్డుపెట్టి కార్మికులకు పనిచేసుకోనివ్వకుండా అడ్డుపడవలసివచ్చిందని అర్ష శాఖ ఒకప్పుడు సమాధానం చెప్పినదట.

ఇల్లాగే విజయవాడదగ్గర గుహాదేవాలయాల సమీపంలోకూడా రాళ్లు తవ్వనివ్వడంలేదనే ప్రశ్నకు మన అర్ష శాఖ సమాధానం చెప్పవలసిఉన్నది. నిజంగా ఈ రాళ్ల తవ్వడంవల్ల విజయవాడ దేవాలయాలకు చాలా గట్టిదెబ్బ తగిలింది.

మేము ఈ యాత్రకు వెళ్లినప్పుడు ఇక్కడి ప్రాచీనరోమకశిథిలాలను చూచి ఎంతో ఆనందించాము. ఇది రోమనుల రక్షణప్రణాళికకు చాలా గొప్ప తార్కాణము.

మనకు కూడా ఎన్నో పురాతనశిథిలాలున్నాయి. మనలో కూడా కళాభిమానులు ఎంతో మంది ఉన్నారు. మన ప్రాచీనకట్టడాలను, శిథిలాలను మనం కూడా ఈవిధంగానే సంరక్షిస్తూవుండాలి..

# గ్రామజీవితము - నాడు, నేడు

★

శ్రీ కల్లూరి చంద్రమౌళి

ప్రాచీనకాలమునుండియు భరతవర్షము గ్రామముల మయము. క్రూరమైన పెక్కు దాడులకు గురియైనను, పరుల ఆక్రమణములకు పాల్పడినను నేటికిని మన మాతృభూమి గ్రామములతోడనే విలసిల్లుచున్నది. నూటికి 80 మంది ప్రజలు గ్రామములందే నివసించుచున్నారు. వీరిలో పెక్కురకు వ్యవసాయమే ప్రధానవృత్తి. నిత్యజీవితావసరములగు ఆహారపదార్థములను, తక్కినపంటలను ప్రతిగ్రామము పండించుకొనుచుండెడిది. ప్రతిగ్రామమును తనచుట్టు విశాలమగు భూములను గలిగి పంటలతో కళకళలాడుచుండెడిది. మధ్యగృహములు నిర్మించుకొని, ప్రజలు కుటుంబజీవితములను హాయిగ గడపుచుండెడివారు. సాగుభూములు, పచ్చికబయళ్లు, పెద్దపెద్ద చెరువులు ప్రతిగ్రామమునకును ఉండెడివి. పశుపోషణము—శాకములు—ఫలములు విరివిగ నుండెడివి. వివిధవృత్తులవారు తమతమ కృషియందు లీనమై కుటీరపరిశ్రమలను అభివృద్ధిపొందించి గ్రామసంపదకు సకలవిధముల దోహదము చేసెడివారు. చేనేతవారు, కుమ్మరులు, వడ్రంగులు, మేదరులు మున్నగువారెల్లరు నిత్యజీవితావసర వస్తువుల నుత్పత్తిగావించి సదా అందించుచుండెడివారు. ఆహారపదార్థములు గ్రామవాసులకందరకు విరివిగ నందించబడెడివి. ప్రజలు తృప్తులై, నిత్యజీవితావసరములను తమ గ్రామములందే పడయుచు, సుఖజీవితమును గావించుచుండెడివారు.

### నాడు

గ్రామమున పౌరోహితుడు, ఉపాధ్యాయుడు విధిగ నుండెడివారు. పౌరోహితుడు గ్రామసర్వశుభకార్యములను మంగళకరముగ నిర్వహించుచుండెడివాడు. ఉపాధ్యాయుడు గ్రామప్రజలతో కలసిమెలసి, వారి బిడ్డల కుచితవిద్యను బోధించుచుండెడివాడు. బాలబాలికలకు గ్రామపరిసరపరిస్థితులను, ప్రకృతిసౌందర్యరహస్యములను చక్కగ బోధించి, వారిని వికాసవంతులుగ గావించుచుండెడివాడు. దీనికి తోడు పిచ్చిగుంటలవారు, జంగాలు మున్నగువారు ప్రాచీన వీరగాథలను, దేశౌన్నత్యచారిత్రకసత్యములను గేయములలో రసవత్తరముగ గీర్తించుచు చరిత్రను, వీరత్వమును, సభ్యతను, సంస్కృతిని చక్కగ బోధించుచు ప్రచారమును గావించుచుండెడివారు. ఇట్లు గ్రామములు ఆర్థికసంపత్తితో, విజ్ఞానవికాసములో విలసిల్లెడివి. బాలబాలికలు సదా దేశీయగీతములను, జానపదగీతములను గానమొనర్చుచు, ఆటలనాడుచు హాయిగ జీవితముల నభివృద్ధికి దెచ్చుకొనెడివారు. ఇట్లు గ్రామము పాడిపంటలతో, వివిధవృత్తులతో, విజ్ఞానవికాసముతో, ఆటపాటలతో కళాకౌశలజీవితవికాసమును బడసి, చైతన్యవంతమై యుండెడిది. ఆంగ్లేయులీదేశమును దడుగిడిన ప్రథమదశలో గూడ గ్రామములు తమ సౌష్ఠవమును గోల్పోవక నేయుండెను. ప్రాజ్ఞులు గ్రామములందే యుండి గ్రామ-కట్టుబాట్లను, వికాసమును విస్తరిల్లజేసిరి.

గ్రామపరిశుభ్రత, ఆరోగ్యము, కళావికాసము ప్రతిపౌరునియందును జీర్ణించి ప్రకాశించియుండెడివి. ఇట్లు గ్రామసంపదను, పరిశుభ్రతను, ఆరోగ్యమును, కళలను, సంస్కృతిని సర్వదా కాపాడి రక్షించుచుండిరి.

ప్రతివృత్తివారును తమ వ్యక్తిత్వమును వికసింప జేసికొనుచు గ్రామసమష్టికళ్యాణమునకు సహకరించెడివారు. వృత్తులలో భిన్నపోకడలు గన్పించినను, అందరును ఐక్యతను ప్రదర్శించెడివారు. ఆనాడు గ్రామములు ఆధ్యాత్మికచింతనములందు లీనమై, మతవికాసము గావించి గ్రామములను సఖ్యతకు మరల్చిరి.

ఆనాటి గ్రామవ్యవహారములందు ప్రజలచే నిర్ణయింపబడిన పెద్దలు పాల్గొని, సర్వమును చక్కదిద్దుచుండెడివారు. నిష్పాక్షికముగ, సముదాయదృష్టితో సర్వవ్యవహారములను పరిష్కరించెడివారు. గ్రామమున పంచాయితీవిధానము ప్రబలి ఫలించెను. కొన్ని కొన్ని ప్రత్యేకవిషయములను నిర్వహించుటకు ప్రత్యేకసంఘములను పంచాయతీ నియమించి, వారిచే ఆయా కార్యములను చక్కబెట్టించెడిది. ఆస్తిపాస్తుల తగాదాలు, కొట్లాటలు, నేరములు మున్నగు వ్యవహారములను సామరస్యముగ పరిష్కరించెడిది. గ్రామప్రజలు ప్రతివత్సరము సమావేశమై తమ పంచాయితీలను కేవలము స్పర్ధలను ప్రబలించు నేటి ఎన్నికల విధానములవలెగాక—పరస్పరసమ్మతులతో పెద్దలను నిర్ణయించుకొని, గ్రామమును చక్కదిద్ద సదా సహకరించుచుండెడివారు.

ఇట్లు గ్రామనిర్మాణము-పంచాయతీ సంస్థ కేవలము ఆర్థికవిషయములందే కాక మంచినీటివసతులు, గ్రామపరిశుభ్రత మున్నగు పరిపాలకవిషయములందేకాక-విభేదములను పరిష్కరించుటయందేకాక—గ్రామమునకు సంబంధించిన సర్వవిషయములందును కృషిని గావించి, అద్దానికి పరిపూర్ణత్వమును జేకూర్చుచుండెడిది. గ్రామములో వీథినాటకములు, కథాకాలక్షేపములు, ఆటలు-పాటలు, కళలు మున్నగు సర్వవిషయములందును అభివృద్ధిదెచ్చి సంస్కృతిని వికసింపజేసెడిది.

ఇట్టి గ్రామముల సమూహామే భారతవర్షము. ప్రజలు క్రమశిక్షకు పాత్రులై తమ గ్రామములనే కాక దేశమునుగూడ ప్రేమించి అద్దానికి వలయు సర్వత్యాగములను గావింప సంసిద్ధులుగ నుండెడివారు. 'సరళజీవితము—ఉన్నతాదర్శము' అనునదే వారి జీవితముల కాయువుపట్టు; కేంద్రీకరణశక్తి. వారే దేశమునకు ఆధ్యాత్మికవికాసము నొసగి శాంతిభిక్షను బెట్టిరి.

## నేడు

కాని, నేటి గ్రామములు పరపరిపాలనాఫలితముగ ఆర్థికసౌష్ఠవమును, నైతికపటుతను గోల్పోయినవి. బ్రిటిషువారి కేంద్రీకరణవిధానము, నిరంకుశపాలనము మన వృత్తులను నశింపజేసినది. మన సర్వవిద్యలను వెనుకకునెట్టి తమ విద్యావిధానమును మనపై రుద్దినది. తత్ఫలితముగ నాంగ్లవిద్యావలంబకులు—స్వార్థమును పురస్కరించుకొని, గ్రామముల వీడి పట్టణముల కెగబ్రాకిరి. కొలదిమంది భోగములకై పెక్కురను బలిగావించిరి. గ్రామపంచాయతీలను నామమాత్ర మొనర్చి, తమ కోర్టులను, పరిపాలకులను ప్రత్యేకముగ నియమించి, ప్రజల నటకేగువిధమున పాలనావిధానములను నిర్ణయించిరి. గ్రామరక్షణమును పోలీసుల కప్పగించిరి. యంత్రయుగము ప్రబలి రైళ్లు, మోటారులు పెచ్చుపెరిగినకొలది గ్రామములకు పరదేశవస్తువులను విరివిగ బంపి, గ్రామవృత్తులను నశింపజేసిరి. తత్ఫలితముగ నీరెల్లరును వ్యవసాయమున కెగబడి, స్పర్ధలను, పోటీలను ప్రబలించుకొనసాగిరి. అందుపై స్వార్థము తలెత్తి, యీర్ష్యాద్వేషములను విస్తరిల్లజేసెను. గ్రామపు క్రమశిక్షణము నశించి, నిర్మాణము నిర్మూలమై, కళాకాంతు లంతరించి, గ్రామములు శవాకారము లాయెను. గ్రామపుపంటలు పట్టణములకు, పరదేశములకు విరివిగ బంపబడెను. గ్రామావసరములను సరకుగొనక, నిర్దాక్షిణ్యముగ పరులకొఱకు వానిని బంపసాగిరి. గ్రామములనుండి పట్టణములకు, తాత్కాలికభోగములనుబడయుటకై, పలువురు ఎగబ్రాకిరి.

ఇట్లు గ్రామములందు జీవితమే దుర్భరమాయెను. గ్రామముల స్వయంకృషి, స్వావలంబన



నూర్పిడి

చిత్రకారుడు : శ్రీ చాగంటి వీరభద్రయ్య



నీడపట్టు

చిత్రకారుడు : శ్రీ బాగంటి వీరభద్రయ్య

ములు నశించెను. తమ వ్యవహారములను తాము చక్కదిద్దుకొను నవకాశము నన్నగిల్లినదే తడవుగ ప్రజలు పరులపై నాధారపడు దుస్థితికి వచ్చిరి. గ్రామములు చైతన్యమును గోల్పోయి, నిర్జీవములై సదా కష్టములకు, బాధలకు ఆలవాలము లాయెను.

### మన కర్తవ్యము

నేడు మనకు స్వరాజ్యము లభించినది. అది ప్రజారాజ్య మనుచుంటిమి. అట్టిచో నూటికి 80 మంది గల గ్రామములను వెంటనే పునరుద్ధరించుట మన ప్రథమకర్తవ్యము; సామాన్యధర్మము. ఈ పునరుద్ధరణమునకు, దేశపాలనమునకు గ్రామము పునాది గావలెను. పంచాయతీరాజ్యమును సుదృఢమైన పునా లపై స్థాపించి సాగించిననాడే దేశము మరల బలపడి, ప్రాచీనగౌరవమును, ప్రతిష్ఠను బడయగలదు. ములలో—అందలి ప్రజలయందు సహకార లను ప్రబలింపవలెను. వ్యవసాయమును సర్వ ధముల సక్రమముగ సాగింపవలెను. వృత్తులను, గృహపరిశ్రమలను పునరుద్ధరించి, ఆర్థికస్వాస్థ్యమును, కళాప్రాభవమును ప్రబలింపవలెను.

ఈ గ్రామపునరుద్ధరణమునకు సుశిక్షితులు, త్యాగశీలురు, వివేకవంతులు, సేవాపరులును అగు యువకు లెందరో కావలసియున్నారు. వారి త్యాగకృషిపైననే—పట్టుదలపూరిత పరిశ్రమముపైననే మన గ్రామభావిభాగ్యోన్నతి ఆధారపడియున్నది. స్వరాజ్యవిజయమును ఫలవంతమొనర్చి దానిని భారతీయులకెల్లరకు సమముగ నందించు భారము వీరిపైననే యున్నది. భారతభావివికాసమునకు చక్కని దారులు వీరే. కావున ప్రతిప్రాంతమునను యువకులు సుశిక్షితసంఘములను స్థాపించి, అందు ప్రాచీన నవీన విజ్ఞానసారమును బడసి, భావిభారతిఅభివృద్ధికి సదా కృషిని గావించు సాధన సంపత్తిని చేకూర్చుకొనవలెను. ప్రజలు—ప్రభుత్వములు పరస్పరము కలసిమెలసి నిరంతరకృషిని గావించిననే తప్ప ఇష్టానిని సత్వరముగ సాధింపజాలము. దీనిని సాధించనిదే మన ప్రజలకు సుఖముగాని, శాంతిగాని లభింపదు.

మాతృదేశమును భక్తితో పూజించి, ఆమెకు సర్వవిధముల సేవ నొనర్తుముగాక! ఆమెను కీర్తించుచు ఆరాధింతముగాక!!



# 'విరోధి' – సింహావలోకనం

'విరోధి' తన పేరు సార్థకంచేసుకొని మరీ వెళ్లింది. గతసంవత్సరములో దేశములమధ్యనే కాక, దేశములందలి జాతులమధ్యనే కాక జాతులలోని వ్యక్తులమధ్యను పెరిగి, పెద్దవైన స్పర్థలు, వైమనస్యములు 'వికృతి'లో వికృతరూపమును తాల్చి మహోవిలయమునకు దారి తీస్తున్నవి. పదేళ్లక్రితం ప్రారంభమైన ప్రపంచసంగ్రామము పరిసమాప్తము కాలేదని నిన్న మొన్నటివరకు గ్రీసులో అంతర్యుద్ధము, పాలస్తీనాలో యూదు-అరబ్ జాతుల సైనికసంఘర్షణ, చైనాలో కుమింటాంగ్ - కమ్యూనిస్టుయుద్ధము, ఇండోనేషియా, ఇండో-చైనాల్లో సామ్రాజ్యవాదుల సాయుధచర్యలు, మలయా బర్మాలలో అరాచకపరిస్థితులు హెచ్చరించుచువచ్చినవి. కాశ్మీరులో పాకిస్తాన్ దురాక్రమణ, తూర్పుపాకిస్తాన్‌లో హిందువులపై అధికసంఖ్యాకవర్గము జరుపుచున్న కిరాతకచర్యలు, టిబెట్‌పై కమ్యూనిస్టుచైనా దురాక్రమణయత్నం—ఇవి తృతీయసంగ్రామానికి నాందీప్రస్తావనవలె ఉన్నవి.

ప్రపంచము యుద్ధభయమునుండేకాక, యుద్ధమునుండియే ఇంకనూ విముక్తంకాలేదని ఈ పన్నెండు మాసముల విషాదసంఘటనలూ ఘోషిస్తున్నవి. యుద్ధము పరిసమాప్తము కానంతవరకూ మరొక సంగ్రామము రానున్నదన్న భయానికి తావు లేదు; అనుమానానికి ఆస్కారం లేదు. సంఘర్షణ నిత్యమైనది. సహజ, స్వాభావిక పరిణామాన్ని పొంది, లక్ష్యమునుసిద్ధించువరకూ సంఘర్షణశక్తులు విశ్రమింపనున్నట్లు కన్పించదు. కనుకనే గతించిన అయిదారుసంవత్సరాలుగా ప్రపంచప్రజానీకం పరితపిస్తున్న ప్రపంచశాంతి 'వికృతి'లో కూడ అలభ్యమే అను భావము ప్రబలమై, ప్రపంచవ్యాప్తమై ప్రమాదకరమైన నిస్పృహ, నిరాశలను సృష్టిస్తున్నది.

'విరోధి' శుభాశుభాలను, మంచిచెడ్డలను సమపాళంలో మేళవించిన కారణంగా, ప్రజలు త్రాణ లేకపోయినా నిలిచి ముందుకు చూడగలుగుచున్నారు. ప్రపంచశాంతిని సాధించుటకు, సాధించి సంరక్షించుటకు స్థాపితమైన ఐక్యరాజ్యసమితి స్వధర్మనిర్వహణకవసరమైన ధైర్యస్థైర్యాలను, శక్తిసామర్థ్యాలను ఇంకను సంపాదించుకొనవలసియున్నది. స్థాపకుల స్వార్థపరత్వంవల్లా, సభ్యుల అసభ్యప్రవర్తనవల్లా సమితి అట్టి శక్తిని పొందగలిగేలోపునే నానాజాతిసమితిమార్గానువర్తియై అంతరించిపోగల ప్రమాదము నానాటికీ అధికమగుచున్నది.

శాంతికాముకుల పరిశోధనాలయమగుటకు బదులు స్వీయప్రాబల్యవిస్తరణకు కుట్రలు పన్ను సామ్రాజ్యశక్తుల విహారరంగమై వర్ధిల్లుచున్నది ఐక్యరాజ్యసమితి. అగ్రరాజ్యపంచకములో అయిదవ రాజ్యము అంతర్యుద్ధములో తన్నుకొని దేనికీ కొరగానిదైనది. ఒక స్థితిలో ప్రాక్పశ్చిమసంఘర్షణలకు చైనా రంగభూమి అవుతుందా అన్న భయంకూడా కలిగింది. 1939 లో అఖిలప్రపంచాన్ని ఆవహించిన సంగ్రామజ్వాలలకు మూలమైన స్పెయిన్‌వలెనే చైనా తృతీయప్రపంచసంగ్రామానికి హేతువవుతుందా అన్న అనుమానం యావత్తుప్రపంచాన్నీ కలవరపెట్టింది.

అదృష్టవశాత్తు, అమెరికా అస్థిర, చంచలవిధానఫలితముగా ఆ ప్రమాదము సద్య తొలగిపోయినది. ప్రథమప్రపంచసంగ్రామజ్వాలలనుండి అవతరించింది సోవియట్‌రష్యా. ఆ దేశమునందు ప్రజ్వరిల్లిన బోల్షివిక్ విప్లవాన్ని అణచివేసి ప్రజాస్వామ్యము, స్వాతంత్ర్యము పేరట కమ్యూనిస్టుప్రభుత్వాన్ని కూలద్రోయడానికి బ్రిటన్, ఫ్రాన్సు, అమెరికాలు విశ్వప్రయత్నం చేసినవి. యుద్ధం ముగిసిన తరువాత మూడేళ్లు రష్యాలో సైనికజోక్యము కల్గించుకొని [illegible] భంగము పొందినవి. అదే చరిత్ర చైనాలో పునరావృ[illegible] కుమింటాంగ్ పక్షమునకు కోట్లకొలది డాలరుల సహాయ[illegible] తన సైనికప్రతినిధులను పంపి అమెరికా- కమ్యూనిజంనా[illegible] కట్ట ప్రయత్నించింది. సామ, దాన, భేద, దండోపాయములను ప్రయోగించినది. ఇందువలన ఎన్నడో ముగిసిపోవలసిన చైనాయుద్ధము ఇప్పటికి ఇంకనూ సాగుతూఉన్నది. చాంగ్‌కైషేక్ ప్రభుత్వము చైనాభూభాగాన్నంతా వదలిపోయి ఫార్మోజానుండి మావో-సే-టుంగును ప్రతిఘటించుచున్నది. ఈ ప్రతిఘటనను కొనసాగించేందుకు తిరిగి అమెరికా కుమింటాంగ్ పక్షానికి సహాయము చేయ నిశ్చయించినది. పర్యవసానము మరొక విధముగా నుండబోదు. చైనాలో కమ్యూనిస్టుప్రభుత్వము స్థిరపడిపోయినది. రష్యా, రష్యాఆశ్రితరాజ్యములే కాక భారతదేశము, బ్రిటన్, ఇతర కామన్వెల్తురాజ్యములూ కమ్యూనిస్టు చైనాప్రభుత్వమును గుర్తించినవి. పరమాణుబాంబు తరువాత ప్రపంచచరిత్రపై అంతటి ప్రాబల్యం వహింపగల సంఘటన కమ్యూనిస్టుచైనా అవతరణ.

ఈ పరివర్తనఫలితములను తక్షణము అనుభవింపవలసిన దేశములు ఆసియాఖండములోనివే. బర్మా, ఇండో-చైనా, మలయా, టిబెట్ దేశములకు అప్పుడే అనుభవమునకు వచ్చినవి. కమ్యూనిస్టుచైనా టిబెట్‌సరిహద్దుగ్రామాలను ఆక్రమించినది. అవకాశము చూచుకొని యావత్తుటిబెట్టును ఆక్రమించగలదు. ఆ చర్య భారతదేశసరిహద్దులలో విషాదఫలితాలకు దారితీయగలదు. తద్వారా 'వికృతి' కూడ తన పేరు సార్థకముచేసుకోగలదు.

ఇండో-చైనా చైనామార్గమునే అనుసరించునని ఫ్రెంచి ప్రభుత్వసామ్రాజ్యవిధానమే హెచ్చరించుచున్నది. ఇప్పటికీ మూడేళ్లుగా ఇండో-చైనాలో వియట్మిన్ ఫ్రెంచిసామ్రాజ్యాన్ని తుదముట్టించడానికి బ్రహ్మాండమైన స్వాతంత్ర్యసమరాన్ని సాగిస్తున్నది. ఫ్రాన్సువర్తమానచరిత్రనుండి గుణపాఠము నేర్చుకొనక నిరాకరించి 19వ శతాబ్దపు సామ్రాజ్యవిధానమునే అనుసరిస్తూఉన్నది. బర్మా, సింహళ, భారతదేశములలో బ్రిటన్, ఇండోనేషియాలో హాలెండ్ అవలంబించిన కాలానుగుణమైన నీతివిధానాన్ని అనుసరింపక ఫ్రాన్సు ఇండో-చైనాలోని జాతీయశక్తులను విభజించి తన పరిపాలనము సుస్థిరము చేసుకొనదలచుచున్నది. ఈ సంకల్పము సిద్ధించుట కల్ల. అమెరికా ఆయుధసహాయముతో రెండేళ్లు తన సైనికబలాన్నంతట్నీ కేంద్రీకరించి హాలెండ్ ఇండోనేషియాలో సాధింపలేకపోయిన దాన్ని ఫ్రాన్సు ఇండో-చైనాలో సాధింపగలుగుట అసంభవము; అసాధ్యము.

ఇండోనేషియాలో డచ్‌వారు అనుసరించిన ప్రతీపవిధాన ఫలితంగా, అచటి జాతీయశక్తులు బలహీనమై విధ్వంసకశక్తులు [illegible]ంభించినవి. చైనాచరిత్ర పునరావృత్తము కాగల సూచనలు [illegible]ంచినవి. కమ్యూనిస్టులు క్రమంగా తమ శక్తులను సంఘటిత[illegible]ని బ్రహ్మాండమైన విప్లవానికి సన్నద్ధులగుచున్నారు. [illegible] ఈ ప్రమాదాన్ని గ్రహించింది. ఆసియాలో ఏ రూప[illegible]నా సామ్రాజ్యవాదము నిలదొక్కుకోగలిగిన మరొక ప్ర[illegible]యం అనివార్యమని భారతదేశం గ్రహించింది. వెంటనే ఇండోనేషియాలో జాతీయోద్యమాన్ని బలపరచి, సామ్రాజ్యవాదాన్ని ప్రతిఘటించడానికి ఆగ్నేయాశియా దేశాలను సంఘటితపరచెను. అతిపూర్వమే డచ్‌విమానాలు భారతభూభాగంపై ప్రయాణం చేయడానికి వీల్లేదని ఆంక్ష విధించింది. పాకిస్తాన్, సింహళప్రభుత్వాలు అదేవిధానాన్ని అనుసరించి భారతదేశప్రయత్నాలు ఫలప్రదం కావడానికి సహాయపడినవి. న్యూఢిల్లీలో జరిగిన ఇండోనేషియామహాసభఫలితంగా గానీ, అమెరికామార్షల్ పథకంక్రింద హాలెండుకు చేస్తున్న సహాయాన్ని ఆఖరుదశలోఅయినా ఆపిచేస్తానని బెదిరించడంవల్లగాని డచ్‌ప్రభుత్వానికి స్వస్వరూపజ్ఞానం కలిగి ఇండోనేషియాకు డిసెంబరులో స్వాతంత్ర్యాన్ని ప్రసాదించింది. స్వతంత్ర, ఐక్యఇండోనేషియాఅవతరణ భారతదేశానికి గర్వకారణం కావడంలో విపరీతం ఏమీ లేదు. రెండేళ్లక్రితం భారతదేశమే ఇండోనేషియాసమస్యను ఐక్యరాజ్యసమితికి నివేదించింది. తత్ఫలితంగా సమితి ఒక మధ్యవర్తిసంఘాన్ని నియమించింది. ఏ సంఘమైనా విషయాన్ని గ్రహించి, న్యాయమార్గాన్ని అనుసరించి, ధర్మప్రతిష్ఠాపనకు పూనుకుంటే, సాధింపలేనిది ఏమీ ఉండదని ఈ సంఘం నిరూపించింది. హేగ్ రౌండ్‌టేబిల్ సభ ఫలప్రదమై డచ్, ఇండోనేషియాలకు అధికారప్రదానంగురించి ఒడంబడిక కుదరడానికి ఈ సామరస్యసంఘం ఎంతోగానో తోడ్పడింది. కాశ్మీరుకమిషన్ కూడా ఈపంథాను అనుసరించినుంటే భారత పాకిస్తాన్ వివాదాలు ఎన్నడో పరిష్కారమై ఉండేవేమో అనే ఆశ కలగడం సహజం.

స్వతంత్రఇండోనేషియా అవతరించినఅనంతరం ఐక్య ఇండోనేషియాఅధ్యక్షుడు డాక్టర్ సొకర్నో ముందు భారతదేశం వచ్చి స్వయంగా మన ప్రధానమంత్రి పండిట్ నెహ్రూకు కృతజ్ఞతను వెల్లడించారు. మన రిపబ్లిక్ అవతరణఉత్సవాల్లో పాల్గొని భారత-ఇండోనేషియా మైత్రిని దృఢతరం చేశారు. కావడానికి ఇండోనేషియాముస్లింరాజ్యమే. అయినా భారతదేశంతో సన్నిహితసంబంధాలను ఏర్పాటుచేసుకోవడానికి ప్రతిబంధకాలు ఏమీ లేకపోయినవి. అట్లే ఆఫ్ఘనిస్థాన్, పర్షియాలు భారతదేశముతో మైత్రిఒడంబడికలను కుదుర్చుకొనుటకు ఎట్టి అవరోధాలూ లేకపోయినవి. ఒక్క పాకిస్తాన్‌మాత్రమే భారతప్రధానమంత్రి ప్రతిపాదించిన "యుద్ధనిషేధప్రకటన"ను ఆమోదింపలేకపోయినది.

ఆసియాయందేగాక ప్రపంచరాజ్యములలో భారతదేశ స్థానము, స్థాయి స్థిరపడిపోయినవి. మన ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ ప్రపంచరాజ్యాంగతంత్రజ్ఞుల విశ్వాసమునకు పాత్రుడైనాడు. ప్రపంచప్రజల ఆదరాభిమానాలకు అర్హుడైనాడు. కనుకనే ఇండో—చైనాలో పండిట్ నెహ్రూమధ్యవర్తిత్వం నెరపాలని ఫ్రెంచిపోషితులే ప్రతిపాదించుట జరిగినది. వియట్నామ్ నాయకుడు డాక్టర్ హోచిమిన్ మన ప్రధానమంత్రిపై కొండంత ఆశ పెట్టుకొన్నాడు. ఇండోనేషియాసమస్యను పరిష్కరించడానికి పూనుకున్నట్లే పండిట్ నెహ్రూ ఇండో-చైనాసమస్యను పరిష్కరించడానికీ పూనుకొని అందరికీ సంతృప్తికరముగ నుండినట్లు పరిష్కరించగలిగితే ఆగ్నేయాసియాఅంతా ఏకఖండంగా ముందుకు సాగడానికి వీలవుతుంది.

కాని ఫ్రాన్సు ఒకమాత్రానికి సమాధానానికి సమ్మతిస్తుందని తోచదు. భారతదేశంలోని నాలుగు పట్నాల విషయంలోనే దాదాపు రెండేళ్ళుగా నాటకమాడుతూన్న పారిస్ ప్రభుత్వం ఇండో-చైనాపై తన అధికారాన్ని అంతసులభంగా వదులుకుంటుందా? కాలవాహిని నెదురీదగల శక్తి ఎంత మహాసామ్రాజ్యానికైనా లేదని గతచరిత్రేకాక, వర్తమానచరిత్రకూడా ఘోషిస్తున్నది. భూత, వర్తమానాలతో సంబంధము ఉండని భవిష్యత్తు ఉండజాలదని ఫ్రాన్సు గ్రహించడానికి బావ్-దాయ్ చాంగ్ కై షేక్ స్థితిని పొందవలసి రావచ్చును. అదే అనివార్యమైన పక్షంలో బర్మా, భారతదేశాలు ఒక నవ్యమార్గాన్ని అనుసరింపవలసి రావచ్చును. ఇండో-చైనాలో ఆ మార్పును నివారించాలనే భారతదేశము బర్మాలో శాంతిని స్థాపించుటకు స్వయంగా సహాయం చేయడమేకాక ఇతరకామన్వెల్తు రాజ్యాలను ఇందుకు ప్రోత్సహించినది. పండిట్ నెహ్రూ న్యూఢిల్లీలో పసిఫిక్ ప్రాంతములోని కామన్వెల్తురాజ్యాల ప్రతినిధులను సమావేశపరచి బర్మాకు చేయ

కలసిన సహాయంవివరాలను చర్చించారు. ఈ సంవత్సరారంభంలో కొలంబోలో జరిగిన కామన్వెల్తుదేశాంగమంత్రుల సమావేశం ఇందుకు సంబంధించి ఒక పథకాన్ని తయారుచేసింది. ఆప్రకారం బర్మాకు కామన్వెల్తుసహాయం జరుగుతూఉంది. థాకిన్ నూ ప్రభుత్వం ఈ సహాయంతో నిలదొక్కుకొని దేశంలో శాంతిని నెలకొల్పగలిగిన, అచట కమ్యూనిజంవ్యాప్తిని అరికట్టగలిగిన ఆసియా స్వరూపమే మార్పుచెందవచ్చు.

కాని ఈ మార్పుకు మలయాలో బ్రిటిష్ప్రభుత్వం ఇప్పటికీ అనుసరిస్తున్న విధానం అధిగమించడానికి సాధ్యంగాని అవరోధంగా తయారైంది. బ్రిటన్ దూరప్రాచ్యంలోని తన సైనికబలాన్నంతా ఇక్కడ కేంద్రీకరించినా దౌర్జన్యవాదులను హతమార్చలేకపోయినది. విధ్వంసకచర్యలు, హత్యలు రోజురోజుకూ ఎక్కువైపోతున్నవి. ఈ సమస్య కొలంబోసమావేశములో చర్చకు వచ్చినపుడు బ్రిటన్ తన ప్రస్తుతవిధానాన్ని మార్చుకోవలసిఉంటుందని మన ప్రధానమంత్రి హెచ్చరించాడు. బ్రిటన్ ఈ హెచ్చరికను గమనించినట్లు కన్పించదు. తన సైనికచర్యలను తీవ్రతరంచేయడానికి హాంగ్ కాంగ్ లో ఉన్న సైనికదళాలను మలయాకు రప్పించడానికి ప్రయత్నిస్తున్నది.

బ్రిటన్, ఫ్రాన్సులు మలయా, ఇండో-చైనాలలో పూర్వపు విధానాన్నే అనుసరిస్తూ, అమెరికా, చైనాకొరియాల్లో నిరర్థకమైన విధానాన్నే అనుసరిస్తూఉన్నంతకాలం కమ్యూనిజంవ్యాప్తిని ఆసియాలో అరికట్టడానికి ఎవరు ఎన్ని ప్రయత్నాలు చేసినా ప్రయోజనం ఉండదు. అమెరికా, రష్యాల స్పర్థలకారణంగా కొరియా దక్షిణ, ఉత్తరదేశాలుగా విభాగమైపోయినది. అమెరికా ఉత్తరకొరియానుండి దక్షిణకొరియాను రక్షించడానికి కోట్లాది డాలర్లను దుబారాచేస్తున్నది. ఫలితం అంతర్యుద్ధమే అవుతుంది. కమ్యూనిజంను ఎదుర్కొనడానికి ఇది మార్గం కాదని చైనా ఋజువుచేసినా అమెరికా గ్రహించలేకపోవడం శోచనీయం.

ప్రపంచశాంతికి ఆసియా కీలకము. ఈ సత్యాన్ని పాశ్చాత్య రాజ్యాలు ఇదివరలో గ్రహించకపోయినా, రెండేళ్ల క్రితం పండిట్ నెహ్రూ పారిస్లో జరిగిన ఐక్యరాజ్యసమితిసర్వసభ్యసమావేశంలో ఆసియాను అలక్ష్యంచేయడం ప్రమాదకరమని హెచ్చరించినతరవాత గ్రహించకతప్పలేదు. కాబట్టే ట్రూమన్ భారత ప్రధానమంత్రిని అమెరికా ఆహ్వానించడం, వెనుకబడిఉన్న దేశాల సముద్ధరణకు చతుస్సూత్రప్రణాళికను ప్రతిపాదించడం జరిగింది.

ప్రపంచసమస్యలన్నింటిలోకీ అత్యంతప్రధానమైనది ఆసియాఆర్థికసమస్య. ఇంతవరకూ ఆసియారాజ్యాలు వలసదేశాలుగా ఉండి సామ్రాజ్యదేశాల పరిశ్రమలకు అవసరమైన ముడిపదార్థాలను పండిస్తూవచ్చినవి. యుద్ధంలో ఆ సామ్రాజ్యాల రక్షణకు ఆసియా ప్రజలు ఆహుతి యగుచూవచ్చిరి. ద్వితీయసంగ్రామంఫలితంగా ఈ పరిస్థితి పూర్తిగా మారిపోయింది. ఆసియారాజ్యాలు దీర్ఘనిద్రనుండి మేల్కొన్నవి. నవ్యచైతన్యంతో పూర్వప్రాభవాన్ని పునరార్జించుకోడానికి దీక్షాబద్ధమై ముందడుగు వేస్తున్నవి. ఇతరరాజ్యాలు ఈ మార్పును గ్రహించి ఆసియాదేశాలయెడల గౌరవ, ఆదర, అభిమానాలతో ప్రవర్తించి, వాటి అభివృద్ధికి తోడ్పడితే తప్ప ప్రపంచశాంతి దుస్సాధ్యం. లేకపోతే ప్రపంచయుద్ధం తథ్యం.

పాలస్తీనాలో ప్రజ్వరిల్లిన అరబ్ - యూదుసంఘర్షణతే మూడవయుద్ధానికి దారితీస్తుందని అందరూ భయపడ్డారు. కాని అమెరికా యూదుల పక్షాన చేరి పాలస్తీనావిభజనకు పనిచేయడంవల్ల, బ్రిటన్ అంత పట్టుదలతో అరబ్పక్షాన పనిచేయలేకపోవడంవల్ల, తుదకు అరబ్ రాజ్యాల్లోనే స్వార్థం పెరగడంవల్లా పాలస్తీనాలో యూదురాజ్యం స్థిరపడిపోయింది. మధ్యప్రాచ్యంలోనూ, సమీపప్రాచ్యంలోనూ అరబ్ జాతీయతను, సోవియట్ కమ్యూనిజమునూ ప్రతిఘటించడానికి అన్ని హంగులూ కలిగి, సామర్థ్యం గల ఇస్రాయిల్ రాజ్యం ఒకటి అవతరించింది. అమెరికా సాగిస్తున్న సోవియట్ ప్రతికూలోద్యమంలో ఇది అత్యంతప్రధానమైన సంఘటన.

ట్రూమన్ తిరిగి అమెరికాఅధ్యక్షుడుగా ఎన్నికైనవెంట[illegible] 'ఒక్క అమెరికాలోనే గాక, ప్రపంచంలో ఏ ప్రాంత[illegible] అయినాసరే కమ్యూనిజమును అరికట్టడమే' తన ప్రభుత్వ[illegible] ప్రకటించాడు. ఆ లక్ష్యసిద్ధికొరకే యూరప్లో మార్షల్ [illegible] ఉత్సాహంతో కొనసాగిస్తున్నాడు. అమెరికాఅధ్యక్ష[illegible] రిస్తున్న ఈ విధానం ప్రపంచాన్ని ఖచ్చితంగా రెండు [illegible] విభజించింది. బ్రిటన్ అమెరికాలు పశ్చిమయూరపును ఒక కూటంగా ఏర్పాటుచేసి, అందులో చేరిన రాజ్యాలకు సైనికసహాయం చేయడంతో రష్యా తూర్పుయూరపు దేశాలన్నింటినీ వేరొక కూటంగా ఏర్పాటుచేసింది. అమెరికా అట్లాంటిక్ ఒడంబడికను కుదుర్చుకొని సాధించిన ఫలితాలకంటే రష్యా తూర్పుయూరపుఆర్థికసమాఖ్యస్థాపనవల్ల ఎక్కువ ప్రయోజనాలను సాధింపగలిగింది. అమెరికాప్రమేయంవల్ల ఏ దేశంలోనూ ప్రజాస్వామికశక్తులు బలపడలేదు; కాని రష్యాప్రమేయంవల్ల అనేకదేశాల్లో ప్రజాస్వామిక ప్రభుత్వాలు పతనమై కమ్యూనిస్టుప్రభుత్వాలు ఏర్పడ్డవి. ప్రథమప్రపంచసంగ్రామఫలితంగా ఏర్పడి ఆదర్శప్రజాస్వామికరాజ్యంగా అభివృద్ధిపొందిన చెకోస్లవేకియా సంపూర్ణమైన కమ్యూనిస్టురాజ్యంగా ఏర్పడింది. అదేవిధంగా హంగరీ, రుమేనియా, బల్గేరియాలు, పోలెండ్ కమ్యూనిస్టురాజ్యాలైనవి. కమ్యూనిస్టురాజ్యమైన యుగోస్లావియా మాస్కోఆదేశాలను శిరసావహించని కారణంగా తూర్పుయూరపు కమ్యూనిస్టుసమాఖ్యనుండి బహిష్కృతమైంది. మాస్కో, బెల్గ్రేడ్ స్పర్థలపై అమెరికా కొండంత ఆశ పెట్టుకున్నది. మార్షల్ టిటోతో జనరలిస్సిమో స్టాలిన్ను జయించగలమని అనుకున్నది. అందుచేతనే భద్రతామండలికి జరిగిన ఎన్నికల్లో చెకోస్లవేకియాను బలపరచడానికి బదులు యుగోస్లావియాను బలపరిచి



భారతప్రధాని పండిట్ జవహార్‌లాల్ నెహ్రూ

క్రెమ్లిన్‌కు మరింత దూరమైంది. బల్గేరియా ప్రధాని ప్రఖ్యాత కమ్యూనిస్టు నాయకుడు అయిన జార్జి డిమిట్రాఫ్ ‘మరణించడం’ వల్ల యుగస్లావియా కొంత దెబ్బ తిన్నది. డిమిట్రాఫ్ స్లావ్ రాజ్యాలను సమైక్యం చేసి ఒక సమాఖ్యను స్థాపించాలనుకున్నాడు. అంత బ్రహ్మాండమైన కమ్యూనిస్టుప్రజల జాతీయాభిమానం చాలా శక్తివంతమైనదని అంగీకరించాడు. అది ప్రమాదకరమని రష్యా గ్రహించింది. తన ప్రజల్లో జాతీయతత్వాన్ని ప్రోత్సహించి జర్మనీపై యుద్ధాన్ని గెల్చింది. ఆ విధానం ఇతరులకు అనుసరణీయం కాదని క్రెమ్లిన్ అభిప్రాయం. అక్కడే యుగస్లావియాకూ, రష్యాకూ పొరపు ఏర్పడింది. డిమిట్రాఫ్ జీవించిఉంటే స్లావ్ సమాఖ్యస్థాపన జరిగిఉండేది. యుగస్లావియా, చెకొస్లవేకియా, బల్గేరియాలు ఏకమై ఉండేవి. కాబట్టే డిమిట్రాఫ్ విశ్రాంతికోసం మాస్కో వెళ్లి అక్కడ మరణించడం అనేక అనుమానాలకు అవకాశం ఇస్తున్నది. స్టాలిన్ జీవించిఉన్నంతవరకూ ఇలాంటి ప్రయత్నాలు ఏవీ ఫలించవు. రష్యాలోనే కొందరు నాయకులు అమెరికాతో సరాసరి వ్యవహరించాలని అభిప్రాయపడుతున్నారనీ, స్టాలిన్ ఒక మురాబందీగా ఉన్నాడనీ, యాదవకులంలో ముసలం పుట్టడానికి ఇంకెంతో కాలం పట్టదనీ అమెరికాఅధ్యక్షుడు ప్రకటించాడు. ఈ విధంగా ప్రకటించి ఒక సంవత్సరమైంది. ఇంతవరకూ ఏమీ జరగలేదు. ఇకముందు జరుగబోదు.

రష్యా ఇతరదేశాల్లో అరాచకాన్ని ప్రోత్సహించి ఆదేశాల యుద్ధనిర్వహణాశక్తిని విచ్ఛిన్నం చేస్తున్నది. ఆ దేశాల రహస్యాలన్నింటినీ గ్రహించింది. తన దేశంలోనూ, తన ఆశ్రితదేశాల్లోనూ తటపటాయిస్తూఉన్నవారందర్నీ నామరూపాలు లేకుండా చేసింది. కాబట్టే రష్యా ‘ఏటంబాంబు’ను కనుక్కున్నదని ట్రూమన్ ప్రకటించినప్పుడుకాని, ‘హైడ్రోజన్ బాంబు’కు సంబంధించిన కార్యక్రమాన్ని కొనసాగించవలసిందని తన ఉద్యోగులకు ఉత్తరువులు పంపినప్పుడుగానీ ఎవ్వరూ ఆశ్చర్యపడలేదు. ప్రపంచం అంతా ఇంత అంధకారబంధురంగా ఉన్నా అక్కడక్కడ కాస్త ఆశా కిరణాల మిణుకు కన్పించకపోలేదు. శాంతికి ట్రూమన్‌తో కలిసి మరొక ప్రయత్నంచేయడానికి తనకు అభ్యంతరం లేదని స్టాలిన్ స్పష్టంచేశాడు. అమెరికావిదేశాంగకార్యదర్శి శాంతిసాధనకు జరిగే అన్ని ప్రయత్నాల్లోనూ అందరితో అమెరికా సహకరిస్తుందని ప్రకటించాడు. అందుకు రష్యా చేయవలసినపనులను వివరించాడు. గతసంగ్రామకాలంలో ‘అంతర్జాతీయ కమ్యూనిస్టు సంఘాన్ని’ రద్దుచేసి స్టాలిన్ ప్రజాస్వామికరాజ్యాల్లో ఏర్పడిన అపోహలను, అనుమానాలను తొలగించినట్లే ఇప్పుడూ ‘కామిన్ఫారమ్’ను రద్దుచేస్తే ప్రాక్-పశ్చిమాల సామరస్యసాధన సులభమౌతుంది. స్టాలిన్ తిరిగి అట్టి రాజనీతిజ్ఞతను ప్రదర్శిస్తాడేమో చూడవలసిఉన్నది.

ప్రపంచచరిత్రగతిని మార్చగల మరికొన్ని ముఖ్యసంఘటనలు బ్రిటన్‌లో అట్లీ తిరిగి ప్రధానమంత్రి కావడం, ఈజిప్టులో నహాస్ పాషా ప్రధాని కావడం, అమెరికాలో డెమోక్రాటిక్ పక్షం తిరిగి అధికారానికి రావడం, ఐక్యరాజ్యసమితి, సమితిఉపసంఘముల సమావేశాలను సోవియట్‌రష్యా బహిష్కరించడం, దక్షిణాఫ్రికాలో స్మట్స్‌ప్రభుత్వంపోయి మలాన్ ప్రభుత్వం ఏర్పడడం మొదలైనవి.

బ్రిటన్‌లో కార్మికప్రభుత్వం, అమెరికాలో డెమోక్రాటిక్ ప్రభుత్వం ఏర్పడ్డంవల్ల తృతీయసంగ్రామం నివార్యం కాకపోయినా దూరస్థమైంది. బ్రిటన్‌లో అట్లీప్రభుత్వం ఎంతకాలం ఉంటుంది అన్న ప్రశ్న ఉత్పన్నంకావడం దురదృష్టం. మొన్న ఫిబ్రవరిలో జరిగిన ఎన్నికల్లో కార్మికపక్షం పూర్తిగా దెబ్బతిని పోయింది. ఆస్ట్రేలియా, న్యూజిలాండులలోవలె పదభ్రష్టము కాలేదన్న సంతృప్తేగాని కేవలము ఆరువోట్ల మెజారిటీతో ఎంతకాలం దేశాన్ని పరిపాలించగలదన్నది సందేహాస్పదమే. కనుకనే క్రొత్త బడ్జెట్‌ను ప్రతిపాదించినతరువాత కార్మికపక్షం తిరిగి ఎన్నికలకు పోవచ్చును.

బ్రిటన్‌లో కన్సర్వేటివ్ పక్షమూ, అమెరికాలో రిపబ్లికన్ పక్షమూ అధికారానికి రావడం సంభవిస్తే యుద్ధం తప్పదు. పశ్చిమయూరపు పూర్తిగా కమ్యూనిస్టుఖండమైనా కావచ్చు, లేక బ్రిటన్, అమెరికాల్లోవలె కన్సర్వేటివ్ ధనికవర్గాలు అధికారానికైనా రావచ్చు. మొదటిదే ఎక్కువ సంభవంగా కన్పిస్తున్నది. అప్పుడు అమెరికా హైడ్రోజన్ బాంబును ఉపయోగించినాగాని ప్రజాస్వామికాన్ని సంరక్షించలేదు. దేనికైనా ముందు సమితిలో రష్యా వైఖరివల్ల ఏర్పడ్డ ప్రతిష్టంభనాన్ని తొలగించాలి. అది కమ్యూనిస్టు చైనాపట్ల అమెరికావిధానం మారితేనే సాధ్యం. ఆతరువాతనే శాంతిసంప్రతింపులు ప్రారంభించడం మంచిది.

ప్రపంచరాజకీయాలు ఇంత కలుషితంగా కల్లోలంగా ఉన్నా భారతదేశం స్వాతంత్ర్యమార్గాన ముందుకు సాగిపోగల్గింది. గత నవంబరు 26 న రాజ్యాంగపరిషత్తు ఆమోదించిన నవభారత రాజ్యాంగం జనవరి 26 న అమలుజరిగి స్వతంత్ర, సర్వాధికార సమన్వితభారతరిపబ్లిక్ అవతరించింది. గాంధీమహాత్ముని ప్రియశిష్యుడు, కర్షకభారతానికి ప్రతినిధి, ‘ముకుటం లేని మహారాజు’ అయిన డాక్టర్ రాజేంద్రప్రసాద్ ప్రప్రథమఅధ్యక్షుడుగా ఎన్నికైనాడు. నవభారతం మున్ముందు ఏ విధానాన్ని అనుసరిస్తుందో ఈ ఎన్నికే సూచించుచున్నది. భారతదేశవిదేశాంగవిధానము విఫలమైనదని ఎందరో విమర్శించిరి. తాటస్థ్యము ఒక విధానము కాజాలదనిరి. ప్రపంచము రెండువర్గములుగా విభాగమై సంఘర్షణకు తలపడుతున్నపుడు భారతదేశం తటస్థంగా ఉండడం అసాధ్యమని పలువురు అభిప్రాయపడుచున్నారు.

అటు అమెరికా, బ్రిటన్‌లతోగాని అటు రష్యాతోగాని చేరక స్వతంత్రముగ ప్రపంచశాంతికి కృషిచేయడమే భారత ప్రభుత్వవిధానము. అది గాంధీసిద్ధాంతాలకు అనుగుణంగా లేదని చెప్పలేము.

ఆసియాలో భారతప్రభుత్వవిధానం ఎలాంటి సత్ఫలితాలను సాధించిందో చూచాం. అలాగే మన ప్రధానమంత్రి అమెరికా పర్యటనకూడా ప్రాక్పశ్చిమసామరస్యానికి ఎంతగానో దోహదం చేసింది. అయిదువారాలు అమెరికా, కెనడాలలో పర్యటించి ఆసియాశాంతిసందేశాన్ని సర్వప్రపంచప్రజలకు అందజేసి పాశ్చాత్యరాజకీయవేత్తల దృష్టి, దృక్పథాలలోని లోపాలను పండిట్ నెహ్రూ బహిర్గతం చేయగలిగాడు. శాంతిసాధనకు ఏ మార్గములు అనుసరణీయములో చెప్పారు. పండిట్ నెహ్రూ పర్యటనఫలితాలు వెంటనే అనుభవానికి వచ్చి ఉండకపోవచ్చును. కాని అయిదువారాలపాటు అమెరికాలో వారు చేసిన గాంధీసిద్ధాంతాల ప్రబోధప్రచారాలు నిరర్థకం కాజాలవు. పండిత నెహ్రూ విధానఫలితంగానే భారతదేశానికి ఆసియాలో అగ్రస్థానము, ప్రపంచఅగ్రరాజ్యాలతో సమస్థాయి లభించినవి. తత్ఫలితంగానే ఈ సంవత్సరం భారతదేశానికి భద్రతామండలిసభ్యత్వం లభించింది.

ఇక దేశంలో పరిష్కారం కావాల్సిన ఆర్థిక సాంఘిక సమస్యలు అనేకంగా ఉన్నవి. సర్దార్ వల్లభాయిపటేల్ రాజనీతిజ్ఞతాఫలితంగా దేశం అంతటా బ్రిటిష్‌సామ్రాజ్యవాదులకు మంచెలుగా ఉపయోగపడ్డ దాదాపు ఆరుకందల సంస్థానాలూ రాజకీయంగానూ, ఆర్థికంగానూ భారతదేశాంతర్భాగాలైనవి. భారతఐక్యత స్థిరపడిపోయినది. జనవరి 26 న హైదరాబాదునవాబు తన సంస్థానానికి భారతరాజ్యాంగాన్ని అనువర్తింపచేసుకుంటూ ఫర్మానా జారీచేయడంతో ఒకప్పుడు భారతదేశభద్రతకే ప్రమాదకరంగా తయారైన ఒక బృహత్సమస్య సులభంగా పరిష్కారమైపోయింది. మిలిటరీ గవర్నరు ప్రభుత్వం పోయి పౌరపరిపాలకుని ప్రభుత్వం ఏర్పడింది. నవాబు రాజప్రముఖ్ అయినాడు. యం. కె. వెల్లోడి ప్రధానమంత్రి అయినాడు. వీలైనంత త్వరలో సంస్థానరాజ్యాంగపరిషత్తుకు ఎన్నికలు జరగ్గలవనీ, ఆ పరిషత్తే శాసనసభగా మారి ప్రజాప్రభుత్వానికి సోపానం వేస్తుందనీ రిపబ్లిక్ ప్రభుత్వసంస్థానశాఖామాత్యుడు ప్రకటించిఉన్నాడు. స్వామి రామానందతీర్థ, బూర్గుల రామకృష్ణరావుగార్లు వైదొలగి దిగంబరరావుబిందూగార్ని సంస్థాన కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఎన్నుకోవడంవల్ల ప్రజాప్రభుత్వస్థాపన కొంతవరకు సులభమైంది. అయితే పరిపాలనయంత్రంలో ఎన్నో సంస్కరణలు జరుగవలసిఉన్నవి. పరిపాలన ఎంత లోపభూయిష్ఠంగా ఉంటో తెలంగాణాలో ఇప్పటికింకా ఉధృతంగానే ఉన్న కమ్యూనిస్టు చర్యలు, లాయక్ అలీ పరారీ వెల్లడిస్తున్నవి. సంస్థానంలోని ఆర్థిక, సాంఘికసమస్యల పరిష్కారానికి ఇప్పటికంటె ఎక్కువ గట్టిగా కృషి జరగాలి.

హైదరాబాద్‌సమస్యకూ, కాశ్మీర్‌సమస్యకూ పోలిక లేకపోయినా ఆ రెండుసమస్యలూ ఇంచుమించు ఒకదానిపై మరొకటి ఆధారపడిఉంది. హైదరాబాద్‌విషయంలో భారతప్రభుత్వం స్థిరతరమైన విధానం అనుసరించలేకపోవడానికి ఈ రెండుసమస్యలకూ ఉన్న సంబంధమే కారణం. కాశ్మీరుసమస్య పరిష్కారమైపోతే హైదరాబాద్‌ను వివిధభాషాప్రాంతాలుగా విభజించి సంశ్లిష్ట రాష్ట్రాలతో చేర్చివేయడం జరిగితీరుతుంది. అయితే కాశ్మీర్ సమస్య ఎప్పటికైనా పరిష్కారంఅవుతుందా అన్నది సందేహాస్పదమైంది. ఈ స్థితికి భద్రతామండలి, మండలిచే ఏర్పాటైన కాశ్మీర్ కమిషన్ పూర్తిబాధ్యత వహించాలి. కాశ్మీర్‌పై పాకిస్థాన్ దురాక్రమణ జరిపినట్లు రూఢిఅయింది. అవిధంగా భారతదేశం మొదట ఫిర్యాదుచేసిన అంశాలన్నీ బుజువైనవి. భద్రతామండలి ఈ విషయం స్పష్టమైనతరువాత తగిన చర్య తీసుకోక పాకిస్థాన్‌ను వీపు తట్టుతూవచ్చింది. కాశ్మీర్‌కమిషన్ పాకిస్థాన్‌పక్షపాతి కావడం జరిగింది. దాంతో పాకిస్థాన్ భారతదేశంతో సమాధానపడ నిరాకరించింది. 'విరోధి' ప్రవేశించబోయేముందు అదృష్టవశాత్తూ భారత పాకిస్థాన్‌ప్రభుత్వాలు యుద్ధవిరమణకు ఒడంబడి డిసెంబరు 31 (1949) అర్ధరాత్రినుండీ సైనికచర్యలను విరమించారు. అతరువాత ఇంతవరకూ ఏమీ జరగలేదు. ఏవిషయంమీదా సమాధానం కుదరలేదు. విరోధి నిర్గమిస్తున్న సమయంలో [illegible] కాశ్మీర్‌కమిషన్ స్థానే విస్తృతాధికారాలతో ఒక [illegible]స్తూ భద్రతామండలి చేసిన తీర్మానాన్ని ఇండియా [illegible]గరించినవి.

ఇదిమాత్రం కాశ్మీర్‌సమస్యప[illegible]యోగపడుతుందా అంటే ఉపయోగపడకపోవచ్చు[illegible] ఇవ్వాల్సి ఉంటుంది. పాకిస్థాన్ కాశ్మీర్‌లో తన [illegible]ద్ధిచేసుకున్నది. వేసవి రావడంతోటే భారీఎత్తున సైని[illegible] ప్రారంభించడానికి అన్ని ఏర్పాట్లూ చేసుకున్నది. భారతదేశాన్ని ఆ దాడిని ఎదుర్కొలేని స్థితిలో ఉంచేందుకు మతకలహాలను ప్రోత్సహింపదలచింది. అందుకే తూర్పుబెంగాల్‌లో భారీఎత్తున హిందువులపై కిరాతకచర్యలు జరపడం మొదలెట్టింది. పశ్చిమబెంగాల్‌లో అల్లరులు ప్రారంభం కావడంవల్ల పాకిస్థాన్ తన పథకం పారింది అని భ్రమపడి ఉండవచ్చు. కాని భారతప్రభుత్వం సరియైనవిధానాన్ని అనుసరించడంవల్ల ఆ అల్లరులు దేశవ్యాప్తం కాకుండా పశ్చిమబెంగాల్‌కే పరిమితం కావడమేకాక, అక్కడా వెంటనే అణగిపోయినవి.

భారత-పాకిస్థాన్ సంబంధాలు ఈ సంవత్సరంలో ఏమీ తృప్తికరంగా లేవు. బ్రిటన్‌తోపాటు భారతదేశం తనూ రూపాయి మారకపువిలువను తగ్గించుకున్నది. పాకిస్థాన్ అప్రకారం చేయలేదు. అందువల్ల భారతదేశం పాకిస్థాన్‌నుండి దిగుమతి చేసుకోవలసిన జనపనార, ప్రత్తికి ఎక్కువడబ్బు చెల్లించాల్సివచ్చింది. తను పాకిస్థాన్‌కు ఎగుమతిచేసే సరుకు తక్కువ తీసుకోవలసివచ్చింది. భారతదేశం ఇందుకు సమ్మతించకపోవడంవల్ల భారతపాకిస్థాన్‌మధ్య వ్యాపారం పూర్తిగా నిల్చిపోయింది. ఈ విషయంలో పాకిస్థాన్‌ప్రవర్తన చాలా నీచంగా ఉందని చెప్పకతప్పదు.

భారతదేశం వాగ్దత్తయిలను నిలిపివేయగా, దక్షిణాఫ్రికానుండి, పూర్వపు ఆంక్షలను రద్దుచేసి వాగ్దానాన్ని నెరవేర్చుకోవడానికి ప్రయత్నించింది. అలాగే తాను జనం ఎదుట తిరస్కరించినా ఆస్సాంనుండి వస్తున్న జనమును బహిష్కరించింది. భారతదేశాన్ని ఏదో విధంగా కవ్వించడమే పనిగాపెట్టుకున్నది పాకిస్తాన్. కాని పండిట్ నెహ్రూ ప్రధాన మంత్రిగా ఉన్నంతకాలం పాకిస్తాన్ సంకల్పం సిద్ధించదు.

దేశంలో కమ్యూనిస్టుప్రమాదం హెచ్చుగానే ఉంది. భారత-పాకిస్తాన్ సంబంధాలు విషమించేపక్షంలో దేశంలో అరాచకాన్ని ప్రోత్సహించి అధికారయంత్రాన్ని స్వాధీనంచేసుకోవాలని కమ్యూనిస్టుల సంకల్పం. సర్దార్ పటేల్ హోంశాఖామంత్రిగా ఉన్నంతకాలం వీరి సంకల్పంకూడా సిద్ధించదు. భారతదేశం ఈ మాత్రంగానైనా నిలబడి ఉండగలిగిందంటే మన అగ్రనాయకుల సామర్థ్యం, రాజనీతిజ్ఞత, పరిపాలనాదక్షతే కారణం. వారి తరువాత భారతదేశం ఏమౌతుంది అంటే చెప్పలేము, గాంధీజీతరువాత నెహ్రూ, పటేల్, రాజేంద్రప్రసాద్ ప్రభృతులు లభ్యమైనట్లు భారతీయులు తి[...]గలిగారు.

[...]ంకుడు సాగిపోతున్నది. హిందూ ధర్మశా[...]వరకూ హిందూసంఘంలో ఉంటున్న తర, ఉ[...]పోతివి. మన రాజ్యాంగం అందరినీ సమంగా[...]యోజనులందరికీ వోటుహక్కు లభించింది. 19[...]న్నికల్లో భారతప్రజానీకం కోరుతున్న స్వరూపను నిర్మిం[...]కాశం లభిస్తుంది. అస్పృశ్యత కూడా విరుద్ధమైంది. 'మెలం[...]లాన్ని ప్రభుత్వాల సంకుచితవిధానంవల్ల ఇప్పటికీ వర్ధిల్లుతున్న నాత్మ రాజ్యాంగం అట్టి విచక్షణను నిరాకరణం చేస్తున్నది.

మనలను అవరతము, అనుక్షణమూ కలవరపెడుతున్న సమస్య ఆర్థికసమస్య. ఆ సమస్యను పరిష్కరింపగలిగితే మన రాజకీయ స్వాతంత్ర్యం స్థిరపడిపోతుంది.

దేశసంపదను వృద్ధిచేయడం అందరి పరమావధి. వ్యవసాయిక, పారిశ్రామికోత్పత్తిని అధికంచేయడంద్వారానే ఇది సాధ్యం. రైతులు ఎక్కువధాన్యం పండించాలి. కూలీలు చీటికిమాటికి సమ్మెలుచేయడం మాని ఉత్పత్తిని అధికంచేయడానికి కృషిచేయాలి. రిపబ్లిక్ ప్రభుత్వం కార్మికులకు అనేకసౌకర్యాలను కల్పిస్తున్నది. అంతర్జాతీయ కార్మికసంఘం ఆదేశాలను ఎప్పటికప్పుడు అమలుచేస్తూ ఉంది. రైతులు, కూలీలు రాజకీయాలకంటే వస్తూత్పత్తికి ఎక్కువ ప్రాధాన్యమిచ్చి పనిచేయాలి. అప్పుడే ధరలు తగ్గడం, ప్రజలజీవన ప్రమాణం వృద్ధికావడం జరుగుతుంది.

1951 నాటికి ఆహారంవిషయంలో దేశం స్వయంసమృద్ధం కావాలని కేంద్రప్రభుత్వం నిర్ణయించింది. ఆప్రకారం సస్యాభివృద్ధికార్యక్రమాలను కొనసాగిస్తూఉంది. అది సఫలంఅవుతవా, కావా అనే అనుమానాలతో కాలయాపన చేయక అవి సఫలం కావాలనే దీక్షతో పనిచేయాలి.

ఆర్థికంగా భారతదేశస్థితి అంత ఆందోళనకరంగా లేదు. 1950-51 సంవత్సరంలో బడ్జెటులో ఖర్చులకు పైగా మిగులుంటుందని ఆదాయవ్యయఅంచనాలవల్ల స్పష్టమౌతున్నది. పారిశ్రామికులకూ పన్నులతగ్గింపుద్వారా ఎక్కువ సౌకర్యాలను కల్పించి అధికోత్పత్తికి రిపబ్లిక్ ప్రభుత్వం దోహదంచేసింది. వీటన్నింటి ఫలితాలు 'వికృతి'లో అనుభవానికి రావాలని కోరుతుంటాం. రాగలవని ఆశిద్దాం.

మనరాష్ట్రస్థితి అంత ఉత్సాహకరంగా లేదు. ఆహారసమస్య ఉరితాడులాగా పైన వ్రేలాడుతూనే ఉంది. కమ్యూనిస్టువిధ్వంసక చర్యలు సమసిపోలేదు. రాష్ట్రకాంగ్రెస్ వ్యవహారాలు కుదుటబడలేదు. స్పర్థలు పెరిగిపోతున్నవి.

ఈ పరిస్థితుల్లో 'వికృతి' ప్రవేశిస్తున్నది. తృతీయసంగ్రామాన్ని 'వికృతి' కోరుతుందో, లేక ప్రపంచకల్యాణానికి సోపానం వేస్తుందో చూడాలి. భారతదేశానికి సంబంధించినంతవరకూ కాందిశీక పునరావాససమస్య పాకిస్తాన్‌తో సంబంధాలే ప్రమాదభరితంగా ఉన్నవి. యుద్ధాన్ని నిషేధిస్తూ ఉభయులం జాయింటుప్రకటన చేద్దామని భారతప్రధానమంత్రి ప్రతిపాదిస్తే పాకిస్తాన్ ప్రధానమంత్రి తిరస్కరించాడు. అలాగే సంక్షోభితప్రాంతాల్లో కలిసి పర్యటిద్దామంటే అది ప్రయోజనంలేదని లియాఖత్ అలీఖాన్ నిరాకరించాడు. ఈవిధంగా కలిసిమెలిసి పనిచేయడానికి భారతదేశం చేసిన ప్రతిప్రయత్నాన్నీ పాకిస్తాన్ త్రోసిరాజంటున్నది.

రెండురాజ్యాలూ కామన్వెల్తులో ఉన్నవి. ఇంతవరకూ దక్షిణాఫ్రికా-భారతదేశాలమధ్య (కామన్వెల్తురాజ్యాల్లో) స్పర్థలు ఏర్పడి వ్యాపారాంక్షలప్రయోగంవరకూ వెళ్లింది. ఇప్పుడా సమస్యాపరిష్కారానికి ప్రయత్నాలు ప్రారంభమైనవి. దక్షిణఆఫ్రికాలోని భారతీయులసమస్య పరిష్కారం అయితే గాంధీజీకి అది రెండవ విజయం అవుతుంది. అలాగే భారత-పాకిస్తాన్ సంబంధాలూ చక్కబడితే భారతదేశం అభ్యుదయమార్గాన ముందుకు సాగిపోగలదు.

వర్తమానం ఎలా ఉన్నా స్వతంత్రభారతరిపబ్లిక్‌కు ఉజ్వలమైన భవిష్యత్తు ఉంది. దాన్ని సాధించేందుకు సమైక్యకృషి కావాలి. 'కృషితో నాస్తిదుర్భిక్షం'.

కృషి, మరింత కృషి అనే మనలక్ష్యం కావాలి. తద్వారానే మన ఈ రాజకీయస్వాతంత్ర్యాన్ని పదిలపర్చుకొని ఆర్థికప్రజాస్వామ్యాన్ని సృష్టించుకొని గాంధీదేశంగా యావత్ప్రపంచానికి మార్గదర్శిగా గల్గినట్లు భారతదేశానికి రూపురేఖలు దిద్దగలం.

---

Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press,
No. 7, Thambu Chetty [...], Madras. Editor: S. Sambhu Prasad.